అమరజీవి
చక్రపాణిగారికి
మా శ్రద్ధాంజలి

యువ పబ్లికేషన్స్
డాల్టన్ ప్రెస్
సత్యం ప్రాసెస్
రాధికా ఏజన్సీస్

# భక్త్యాంజలి

'యువ' పాఠకలోకానికీ, పాలకవర్గానికీ సెప్టెంబరు 24 మహాదుర్దినం. యువ సంస్థాపకులూ, సంపాదకులూ అయిన చక్రపాణిగారు ఆ రోజున పరమపదించారు.

చక్రపాణిగారు బహుభాషా కోవిదులూ, సుప్రసిద్ధ రచయితా, చలన చిత్ర నిర్మాతా, పర్యవేక్షకులూ, సర్వతోముఖ ప్రజ్ఞావంతులే కాకుండా ప్రధానంగా ఆయన కృషి పుస్తకప్రచురణ, పత్రికా నిర్వహణలలో సువ్యక్త మవుతుందని చెప్పవచ్చు. తెలుగు పాఠకులకు శరత్‌బాబును పరిచయం చేయడం ఒక ఎత్తు; తాను అనువదించిన సాహిత్యాన్ని చక్కని, అందమైన గ్లేజుకాగితంలో పాఠకులకు చక్కగా అందించడం మరో ఎత్తు. ఈ రెండు ఘనకార్యాలను చక్రపాణిగారు చేశారు. 1945 ప్రాంతాల్లో యువ బుక్ డిపోను, మద్రాసులోనూ; బెజవాడలోనూ పెట్టి, నలభై యాభై పుస్తకాల దాకా ప్రచురించి, మంచి సాహిత్యాన్ని అందజేశారు. దేవదాసు, పరిణీత, బడదీదీ, నిష్కృతి, సుభద, పల్లీయులు మొదలైన శరత్‌బాబు అనువాదాలు; చలం, కుటుంబరావు, ధనికొండ, సౌరిస్ మొదలైనవారి పుస్తకాలు అప్పుడే వెలువడి, పాఠకులమన్ననల్ని పొందాయి ఆ రోజుల్లోనే 'దేవదాసు' వంటి నవలలు ఆరేసి ముద్రణలు పొందాయి. పుస్తకాల గెటప్ సైజు, ఉపయోగించే పేపరు, ప్రింటింగ్ విషయంలో చక్రపాణిగారు ప్రత్యేకమైన శ్రద్ధాసక్తుల్ని తీసుకొని, ఉన్నత ప్రమాణాల్ని నెలకొల్పారు. ఆ అభిరుచి, ప్రమాణాలు తర్వాత ఆయన శ్రీ బి. నాగిరెడ్డిగారి సాహచర్యంతో వెలువరించిన ఆంధ్రజ్యోతి, సంచారి, కినిమా, చందమామ పత్రికల లోనూ, 'యువ' లోనూ కనబడతాయి.

శ్రీ బి నాగిరెడ్డిగారితో స్నేహపరిచయాలు వృద్ధి అయిన దగ్గర్నుంచీ చక్రపాణిగారి జీవితం మరో మలుపు తిరిగిందని చెప్పవచ్చు. ఆలోచన చక్రపాణిగారిదిగా, ఆచరణ నాగిరెడ్డిగారిదిగా—ఎన్నో సంస్థలు అవిర్భ

చక్రపాణి దానికి ఒక మకుటం— "మూకం కరోతి నా చాలం"—అన్నది సూచించాడు. ఆ మకుటంతోనే "యువ" రెండోసారి వెలువడింది. కాని నా చేతి మీదుగా "యువ" వర్ధిల్లనేలేదు. ఆ పేరు చిరస్థాయిచేసిన ఘనత చక్రపాణికే దక్కింది.

నా మిత్రులు బి.ఎన్. రామారావు గారూ, పి. పుల్లయ్యగారూ బెజవాడలో ఆఫీసుపెట్టి, చక్రపాణిని తాము తీయబోయే చిత్రానికి రచయితగా పెట్టుకోగోరారు. చక్రపాణికి ఆ ఇద్దరితోనూ వ్యక్తిగతమైన పరిచయంలేదు. అందుచేత 1939 లో చక్రపాణి వెంట నేను కూడా తెనాలినుంచి బెజవాడవెళ్ళి ఆయనను పుల్లయ్యగారి ఆఫీసులో దిగబెట్టాను. తరవాత వారు కొల్హాపూరులో "ధర్మపత్ని" సినిమా తీశారు.

చక్రపాణి గ్రహణశక్తి అసాధారణమైనది. ఆయనను ఏ కొత్తరంగంలో ప్రవేశపెట్టినా దాని అంతు కనుక్కొని, ఆ రంగంలో ఏళ్ళతరబడి కిందా మీదా అవుతున్న వారికన్న హెచ్చు జ్ఞానం సంపాదించగల సూక్ష్మబుద్ధి చక్రపాణిది. "ధర్మపత్ని" పూర్తి అయేలోపల ఆయనకు చిత్రనిర్మాణం గురించి ఆమూలాగ్రం తెలిసిఉండాలి. అయితే ఆయనకు మరొక సినిమా "చాన్స్" వాహినీ వారి "స్వర్గసీమ"లోనే వచ్చింది.

ఈ మధ్య కాలంలో నేను పత్రికా రంగంలో ప్రవేశించాను. నేనూ, రుక్మిణీనాథశాస్త్రీ ఆంధ్ర వారపత్రిక చూస్తూ ఉండేవాళ్ళం. ఆ కాలంలో చక్రపాణి హాస్యరచనలు కొన్ని వెలువడ్డాయి. అందులో ఒకటి "చక్రపాణీ ఫిలిమ్స్ వారి గజేంద్ర మోక్షం" తీయబోతున్నట్టు ప్రకటన. అందులో — "కావలెను : పొడగల ఏనుగూ, పట్టగల మొసలీ కావలెను. షరా: మోత్ ఆర్గన్ వాయించే సర్కస్ ఏనుగులు అవసరం లేదు."

దీని తరవాత, "చక్రపాణీ ఫిలిమ్స్ వారి గజేంద్రమోక్షం విడుదల. ప్రముఖుల అభిప్రాయాలు." ఆ రోజులలో సారథీవారి "మాలపిల్ల" మీద చెలరేగిన దుమారం మీద ఈ రచన సెటైర్.

ఆంధ్ర వారపత్రికలో నేను కొన్ని శ్రీశ్రీ సర్రియలిస్టు రచనలు వేశాను. చక్రపాణి అదే ధోరణిలో ఒక సర్రియలిస్టు కవిత పంపాడు. అది చాలా మందికి తగిలే రచన. కాని ఎవరి మటుకు వారు అంతా తమమీదనే అనుకొన్నారు. అయితే అందులో తమమీద ఉన్న "నింద" ఏమిటో ఎవరికీ అంతుబట్టలేదు! నిజానికి అందులో ఎవరిమీదా నిందలేదు. ఏమీ అనకుండానే ఇతరులను "గిల్టీ"గా ఫీలయేటట్టు చెయ్యటం గొప్ప విద్య కదా!

యుద్ధకాలంలో చక్రపాణి ప్రచురించిన సొంత కథలు వ్యంగ్య హాస్య

పూరితమైనవి. అవి "పాతమంగలి", "శోకచక్ర" అనే సంపుటాలుగా యువప్రచురణలలో వెలువడ్డాయి.

"స్వర్గసీమ" విడుదల అయిన తరువాత చక్రపాణి పూర్తిగా సినిమా మనిషి అయినట్టు భావించవచ్చు. పాత సంపర్కాలు కొన్ని పోయి, కొత్త సంపర్కాలూ, కొత్త వాతావరణమూ ఆయనకు ఏర్పాటయాయి. అది ఒక రకం పునర్జన్మ. బొత్తిగా స్తబ్ధజీవితం గడిపేవాళ్ళను మినహాయిస్తే చురుకుగా కార్యకలాపాలలో మునిగితేలే ఏ బుద్ధిజీవి అయినా అనేక జన్మలు ఎత్తక తప్పదు. అయితే చక్రపాణికి గతం చివరిదాకా సజీవంగానే ఉంటూ వచ్చింది. దశలు మారి, హోదా పెరిగి ధనం సంపాదించినవాళ్ళు తమ గతాన్ని మరిచిపోవటం సహజం. కాని చక్రపాణిలో ఎన్ని మార్పులు వచ్చినా, గతం ఆయనకు సజీవంగానే ఉండింది. ఏ అవకాశం దొరికినా ఆయన గత స్మృతులు ఆసక్తితో నెమరు వేసుకునేవాడు. వర్తమాన సమస్యలపట్ల ఆయన దృక్పథంలో ఎన్ని మార్పులు ఏర్పడినా తన పూర్వానుభవాలపట్ల ఆయన వైఖరి ఏమీ మారినట్టు కనబడేదికాదు. మనిషి మారటమనేది ఆయన దృష్టిలో దాటరాని నియమం. ఆయనకు తన పాత ఫొటోలు చూడబుద్ధి అయేదికాదు.

చక్రపాణిలో అరుదు తెచ్చుకున్న సంస్కృతి నాకెన్నడూ కనబడలేదు. ఆయన సంస్కృతి పూర్తిగా ఆయనదే. చిత్రనిర్మాణంలో కూడా ఆయనది ఒక ప్రత్యేక సంస్కృతి. తన చిత్రాలను పత్రికలు పొగడాలన్న దుగ్ధ ఆయనకు ఎన్నడూలేదు, కాని తన చిత్రం ఆర్థిక విజయం సాధించలేకపోతే అది ఆయన ప్రాణానికి అపజయమే. ఆయనకు తెలిసినంతవరకు చిత్రం విజయవంతం కావటానికి ఆర్థిక కొలబద్దతప్ప మరొకటి లేదు. అయినా ఆ విజయంకోసం ఆయన తన శక్తిమీద ఆధారపడినట్టుగా ఇతర ఫార్ములాలమీద ఆధారపడలేదు. ఫార్ములాలను ఆశ్రయించటం ప్రతిభాశూన్యులు చేసే పని.

"షావుకారు" చిత్రం ఎన్ని ప్రశంసలు సంపాదించినా ఆయన దృష్టిలో విఫలమైన చిత్రం. నిజానికి అందులో సాహిత్యపు విలువలూ, అభ్యుదయ దృష్టీ ఉన్నాయి. అటు తరవాత అలాంటి దృక్పథంతో చక్రపాణి ఏ చిత్రమూ తీయలేదు. కాని ఆయన స్వయంకృషిమీద మాత్రమే ఆధారపడి తీసిన చిత్రాలన్నిటిలోనూ ఆయన మేధస్సూ, హాస్యమూ, కథనచాతుర్యమూ ఉన్నాయి. అనారోగ్యంవల్ల ఆయన స్వయంకృషితో ఎక్కువ చిత్రాలు తీయలేదు. "పెళ్ళిచేసిచూడు" "మిస్సమ్మ," "గుండమ్మ కథ" చిత్రాలు పూర్తిగా ఆయన సృష్టే అని చెప్పాలి.

ఆయన జీవిత కృషిలో అత్యుత్తమ స్థానం అలంకరించదగినది పత్రికా నిర్వహణ. యువపత్రిక మాసపత్రికలలో ఒకప్పుడు భారతి సాధించినంత ఖ్యాతి సంపాదించింది. యువలో తమ కథ అచ్చయితే కొండ ఎక్కినట్టు భావించే రచయితలు ఉండటం నాకు తెలుసు. యువకు పూర్వం ఆంధ్రజ్యోతి మాస పత్రికకూడా, గొప్ప ఆర్థిక విజయం సాధించలేకపోయినా, ఒక పాఠకవర్గం అభిమానాన్ని అపారంగా చూరగొన్నది. ఆ పత్రికను నిలిపినప్పుడు ఎంతోమంది నా దగ్గిరనే సంతాపం వెలిబుచ్చారు; చక్రపాణి ముందు ఎంతమంది వెలి బుచ్చారో నాకుతెలియదు వారి దృష్టిలో ఆనాటి ఆంధ్రజ్యోతి అత్యుత్తమసాహిత్య పత్రిక।

చక్రపాణి పేరు దేశమంతటా మాత్రమేకాక, దేశాంతరాలకు కూడా పాకేటట్టు చేసినది చందమామ. నాకు చక్రపాణితో పరిచయం కలగకపూర్వమే ఆయనవద్ద హిందీ, బెంగాలీ పిల్లల పత్రికలుఉండేవి. అలాంటి పత్రిక తెలుగులో ఎవరైనా పెట్టితే ఎంతో బాగుంటుందని ఆయనకు ఎంతో కోరి కగా ఉండేది. దానికి చందమామ అని పేరు పెట్టాలనికూడా ఆయన ఏనాడో అనుకున్నట్టు కనబడుతుంది. అయితే పిల్లలపత్రిక పెట్టటానికి కావలసిన హంగులు చక్రపాణికి అందుబాటులో ఉండేవి కావు; అలాంటి హంగులుగల వాళ్లకు ఆ ఆలోచన ఏకోశానాలేదు.

నాగిరెడ్డి - చక్రపాణి జంట సమైక్య కృషి ప్రారంభమైనాక చందమామకు సరిఅయిన దోహదం జరిగింది. చంద మామ ఆరంభంనుంచీ నేను సన్నిహి తంగానే ఉన్నాను—అందులో జీతానికి పనిచేయకపోయినా, కొద్దికాలంపాటు చందమామమీద చక్రపాణి ప్రభావం అంతగా లేకుండానే జరిగింది. కాని త్వరలోనే అది పూర్తిగా చక్రపాణి నిర్వహణలోకి వచ్చి, ఆయన నిశిత పర్యవేక్షణ కింద మహా వృక్షమై శాఖోపశాఖలుగా విస్తరించింది. దాని విస్తరణ ఇంకా సాగుతూనే ఉన్నది.

చక్రపాణితో కలిసి పనిచేసినవారూ, సన్నిహితులూ ఎందరైనా ఉన్నారు గాని, ఆయనచేత ప్రభావితులైనవారు చాలా అరుదు. ఒక్క ఉదాహరణ చెప్ప మంటే చెప్పే స్థితిలో లేను. ఆయన మానసికంగా ఏకాంతజీవి. "షావుకారు" చిత్రంలో షావుకారు పాత్రలో ఒంటరి లక్షణం చక్రపాణిదే.

*కొడవటిగంటి కుటుంబరావు*

# చక్రపాణి ఒక మహా వ్యవస్థ

వాహినీ స్టూడియోలో ఇంక 'చక్కన్న'
కనబడడు.

'యువ' లో, 'చందమామ' లో 'చక్రపాణి' గొంతు వినబడదు.

వంగ సాహిత్యంలోని రంగూ రుచీ తెలుగులోకి అనువదించాడు.

'పాతమంగలి' గా తెలుగు గడ్డలోని 'తెలుగుతనం', లోకజ్ఞత, మెత్తని హాస్యంతో మనకు అందించాడు.

'చందమామ' తో ప్రతి భారతీయుని లోని శైశవతకు ఆప్తుడయాడు.

'యువ' లో వయసుతో నిమిత్తంలేని తెలుగు యువతకు వేదిక కల్పించాడు.

'విజయ' సంస్థ నిర్మించిన చిత్రాలలో, 'షావుకారు' మొదలు, 'శ్రీ రాజేశ్వరీ విలాస్ కాఫీక్లబ్' వరకు, పాత్రలకు, సన్నివేశాలకు, హృద్యమైన హాస్యంతో సజీవత రంగరించి, తన ప్రత్యేక ముద్రవేశాడు

చిత్రం. మంచి యౌవనదశలో క్షయ. ఒక ఊపిరితిత్తి లేదు. నడి వయసులో భార్యా వియోగం అరవయ్యో పడిలో చేతికందిన పెద్ద కొడుకు అకాలమరణం. ఈ దుర్గతలు, బాధలు, అన్నీ తనలోనే దాచుకుని, లోకానికి తన చల్లని ప్రశాంతమైన చిరునవ్వునే ప్రసాదించాడు; ఆరోగ్యకరమైన హాస్యాన్నీ జీవిత దృక్పథాన్నీ అందించాడు.

అందుకే ఆయన వ్యక్తిగా అంతరించినా, ఒక మహావ్యవస్థగా మనకు మిగిలిపోయాడు.

ఒక మహాకవి అన్నట్టు :

"తన కంఠమున దాచి హాలాహలం
తల నుండి కురిపించి గంగాజలం
మనిషి శివుడవడమే గాంధీమతం."

శివుడై అమరుడైన చక్రపాణికి నా శ్రద్ధాంజలి.

పాలగుమ్మి పద్మరాజు

# చక్రపాణిగారు

చక్రపాణిగారు నాకు ఒక గొప్ప
 నైరూప్య ఇంద్రకార్ముక వర్ణచిత్రం.
లేదా ఇంకా పూర్తి కావలసి ఉన్న
ఆదర్శాత్మక చిత్రం.

అందుచేతనే చక్రపాణిగారు యిక మనకు లేరు అంటే వొప్పుకోను. నాకు మట్టుకు ఆయన ఎప్పుడూ ఉంటూనే ఉంటారు.

ఏ అన్వయార్థంగా చక్రపాణి అని పేరు పెట్టుకున్నారోగాని, నాకు 'చక్ర' శబ్దం—సుదర్శన చక్రం. చక్రపాణిగారు ఆ సుదర్శన చక్రపాణి! ఈ భావన నాకు దూరం కాకుండా ఉండాలనే కాబోలు—ఆయన భౌతికమూర్తిత్వాన్ని చూడబుద్ధి కాలేదు.

మహామహులు యిప్పటికే చక్రపాణి గారిలోని విశేషాల్నీ, గొప్పదనాన్నీ వెల్లడించే ఉన్నారు గనక నేను చెప్ప మిగిలిందేమీ లేదు. అసాధారణ కారణ జన్ముల గురించి సామాన్యంగా చెప్పుకు పోవడం నిస్సారంగా ఉంటుంది కూడ.

క్రియాసిద్ధస్సత్త్వేభవతి అని నమ్మిన చక్రపాణిగారు ఆటువంటి సత్త్వంగల వారిని ఎలా చూడాలో అలా చూస్తారు, ఎలా ఉపయోగించుకోవాలో అలా చేస్తారు, ఉపాయశాలి. ఆ ఉపాయాల్లో అణుమాత్రం కూడా అపాయానికి చోటు ఉండకూడదు, ఉండదు! సింహాన్నీ ఏనుగనూ, పులినీ, ఆవునూ ఒక పళ్లెంలో నీరు తాగించి చూడగల మంత్రసిద్ధి యేదో ఆయనకు ఉంది.

లౌక్యంతో ఆదర్శాన్ని ముడిపెట్టి డంలో చక్రపాణిగారు మేధావులే గాకుండా అతి భావస్తులని అనిపించేది. అందువల్లనే ఎన్నోసార్లు నాకు — యీయనగారు సినిమాలో పడకుండా ఉంటే ఇంకా ఎన్నెన్ని సుస్థిరమైన జాబిల్లి శిఖరాల్ని నిలబెట్టి ఉండేవారో గదా! మహోత్కృష్టమైన ఇంకెన్నెన్నో మేళ్లు సమకూడి ఉండేవి గదా! అని అనిపించేది. అనుక్షణం మారే కాలం కంటే ఒకడుగు ముందుకు పరుగెత్తి పాలు త్రాగే ప్రవాహం సినిమా! కాల ప్రవాహంలో కొట్టుకుపోకుండా అచంచల ఆత్మవిశ్వాసంతో సుస్థిరంగా నిలబడగల శాశ్వతమార్గం చక్రపాణిగారిది. అది 'చక్రపాణి మార్గం' —ఆ మార్గం వెలుగుతూన్నంతవరకూ చక్రపాణిగారు జీవిస్తూన్న మహోన్నత రజతాద్రి శిఖ

రాగ్రం! ఆ మార్గంలో యువ కూడా ఒక మైలురాయి. 'చక్రపాణి మార్గం' గురించి యిప్పుడేమీ చెప్పడానికి వీలు కాదు, కాలమే రూఢీపర్చాలి.

జాతక కథల్లోని బోధిసత్వుని అంశ ఆయనది. అలా అని ఏది చెప్పినా బోధించినట్టులుండదు. పెద్ద విషయాన్ని చిన్న మామూలు గ్రామీణపు పలుకు లోనే అతి సూక్ష్మంగా చెప్పడం మాత్రమే, గ్రహించడం యువతలివాళ్ళ వంతు, అంతే! ఆయన బాటకు యెదు రాడినప్పుడు దరహాసం చూపేవారు. అది ఔననో కాదనో తేల్చుకోడానికి వీలుకాకపోయినా, తర్వాత్తర్వాత నీకే తెలుస్తుందిలే అన్నట్లుండేది. ఆయన వాత్సల్యం మాతృవాత్సల్యం; అభి మానం ఆత్మసదృశం.

చక్రపాణిగారు కదళీపాకంలో ఉన్న ఒక మహా కావ్యం. ఎన్నో తెలుసుకో వలసిన ఉద్గ్రంథం. కొన్ని తెరలు తొలగి నాకు బోధపడ్డాయి.

చక్రపాణిగారి నుంచి నాకు దొరికిన —నాకే కాదు, అందరికీ శిరోధార్యమైన రత్నం—కథైనా, కళైనా చిత్రరువైనా పామరుల్ని బాగుచేసేందుకే గాని ప్రకర్షకుకాదు, గనక వాళ్ళు కోరుకునే రుచితోనే అందివ్వాలి!—అనే అమూల్య మైన రత్నం. ప్రకర్షకు, ఆడంబరానికి - నేల విడిచిన సాముకి చక్రపాణిగారు ఎప్పుడూ విముఖులే. నాకు అన్నింటి కంటే ఎక్కువ ఆకర్షించేదీ అదే.

ఎవరు ఏది చేయాలో, చేస్తారో అది వారికి తెలిసినట్లుగా అందరికీ తెలీదు. తయారైనవాటిని, వాటిని ఉపయోగంలో పెట్టడంలో ఆయన ఘనులు. అదే ఆయనలోని సంరక్షించే స్థితికారక మూర్తితత్వం.

అందుకే చక్రపాణిగారు నాకు ఎప్పుడూ సుదర్శన చక్రపాణి.

వ. పా.

# అమరజీవి

సన్నగా, పొడుగ్గా మెరిసే కళ్లతో, చిరునవ్వులు చిందులాడే పెదవులతో దర్శనమిచ్చే యీ వ్యక్తి ఎవరా అనే కుతూహలం చూడగానే కలుగుతుంది. ఆయన శ్రీ చక్రపాణి అని తెలిశాక, బాహ్య రూపాన ఇలా ఉన్న వ్యక్తిలో ఎంత విజ్ఞానం ఇమిడివుందో అనే ఆశ్చర్యం కలగక మానదు.

ముఖ్యంగా మూడు విషయాలు ఆయన విజయాలకు కారణాలు.

మొదటిది: స్పష్టమైన ఆలోచన. అందులో మళ్ళీ మార్పులంటూ ఉండవు అంటే తరిచి తరిచి ఆ ఆలోచనను స్థిరంచేసుకోవడం జరుగుతుంది. ఇంత వరకూ సిద్ధాంతమన్న మాట.

రెండవది: ప్రయోగం. ప్రయోగంలోని సులభసాధ్యమైన పద్ధతులు అనుసరించటం ద్వారా కౌశలం పెంపొందుతుంది. తనే గాక, ఇతరులుకూడా తేలిగ్గా అనుసరించగల పద్ధతుల్లో దాన్ని అమర్చటం శ్రీ చక్రపాణి ప్రత్యేకత.

మూడవది: పై రెండు దశలూ దాటాక, పట్టుదలతో సాధించటం.

ఆయన సాధించిన వాటిల్లో యీ మూడు దశలనూ స్పష్టంగా చూడగలం.

'మొదటినుంచీ, నా కన్న పెద్దవాళ్లతోనూ, బాగా చదువుకున్న వాళ్లతోనూ స్నేహం చేశాను. వారినుంచి అనేక నూతన విషయాలు నేర్చుకున్నాను,' అనేవారాయన.

పాలనుంచి నీటిని విడదీయగల 'హంస' తత్వమున్న వ్యక్తి శ్రీ చక్రపాణి. ఆయనతో పరిచయమున్న వారూ, కాస్సేపు మాట్లాడిన వారూ, ఎంతో కొంత నేర్చుకోకుండా పోలేరు.

తన అనుభవాలను నిత్యజీవితంలో ఉపయోగించగలగటం ఆయన సామర్థ్యాన్ని చూపుతుంది. ఒట్టి అనుభవాలు, నిరుపయోగాలు. బెర్నార్డ్ షా అన్నట్లు: 'It is only the experience that counts, the stones of London are wiser than its wisest men.'

ఆ అనుభవాలను ప్రయోగించినప్పుడేకదా, ఫలితాలు కనిపిస్తవి!

చదువంటే ఏమిటో చెప్పారాయన: "కాలేజీలో ఎంత చదివినా, జీవితం అనే చదువు వేరుగా చదవవలసిందే! 'నిప్పులో వేలు పెడితే కాలుతుంది!' అదీ చదువు; నిత్యజీవితంలో ఉపయోగపడేదే చదువు ప్రతిరోజూ నేర్చుకునేందుకు ఎంతైనా ఉంది!"

తన కష్టాలు ఏనాడూ, ఎవరితోనూ చెప్పుకోరాయన. ఎంత కష్టదశలో ఉన్నా, చివరకు పెద్ద కుమారుడు చనిపోయినా, అసలేమీ జరగనట్లే కులాసా

ధోరణిలో మాట్లాడే మనోస్థైర్యం ఉన్న వాయనకు. అగ్నిపర్వతానికీ, శ్రీ చక్రపాణికీ చాలా పోలిక వుంది. కుక్షిలో పొగలు సెగలు ఉన్నా అగ్నిపర్వతం పైభాగం ప్రశాంతంగానే కనిపిస్తూ ఉంటుంది; అలాగే చక్రపాణిగారు దుఃఖమంతా కడుపులోనే దాచుకొని, పైకి మాత్రం నవ్వుతూ కనిపించే వ్యక్తి, తన ఆనందాన్ని మాత్రమే పరిచయస్తులకు సైతం పంచిఇచ్చిన మహా మనిషి ఆయన.

చాలా తెలివిగల వ్యక్తులని పేరుబడిన వారు 'యువ' సంపాదకత్వాన్ని చేబట్టారు; కాని సర్క్యులేషన్ పెరగలేదు. ఇది కాదని శ్రీ చక్రపాణి స్వయంగా సారథ్యాన్ని వహించారు. ఊహించలేనంత పైపైకి వెళ్ళింది పత్రిక సర్క్యులేషన్.

ఆ రహస్యాన్ని ఎంత స్పష్టంగా ఆయన వివరించారో చూడు : 'చాలా తెలివిగా రాసిన రచనలు అర్థంచేసుకోగల స్థితిలో పాఠకులు లేరు. అర్థంకానిది వ్యర్థమనే సిద్ధాంతం అందరికీ తెలిసిందే కనుక, ఆ పద్ధతి పరాజయానికి దారి తీసింది. నేను సర్వసామాన్యుణ్ణి నా లెవెల్‌లో ఉన్న రచనలు, నేను ఆనందించగలవి. నాలాటి పాఠకులకూ కూడా నచ్చితీరుతవి.' ఈ సిద్ధాంతం ఎంతటి ఘనవిజయాన్ని సాధించిందో ఆయన నిర్మాణసారథ్యాన్ని వహించిన చిత్రాలలోనేమి, 'చందమామ', 'యువ' పత్రికల్లోనేమీ చూడవచ్చు.

ఆయన ఏవగించుకునేది తనను గూర్చిన పొగడ్త. 'మీరు చేసింది బాగుంది' అంతవరకూ చెపితే నవ్వి ఊరుకునేవారు. ఇంకా పొగిడ్తే 'వేరే విషయానికి వద్దాం' అనేవారు.

అదేవిధంగా అనవసరంగా ఎదుటి వ్యక్తిని పొగిడే తత్వము కాదు ఆయనది

ఆయనకు ఏ వ్యక్తిమీద ఎలాటి అభిప్రాయమున్నదో సమయ సందర్భాంలో కాని తెలియజేయరాయన.

ఈనాడు శ్రీ చక్రపాణి మరిలేరు. ఐతే ఆయన వేసిన బాటలూ, చేసిన సిద్ధాంతాలూ, అనుసరించిన పద్ధతులూ తెలిసినవారికి జీవితం నల్లేరుమీది బండి నడక.

శ్రీ చక్రపాణి వ్యక్తికాదు; సంస్థ ; ఆ సంస్థ చిరస్థాయి. అందుకని శ్రీ చక్రపాణిని 'అమరజీవి' అనక తప్పదు.

*ధనికొండ హనుమంతరావు*

# నాకు తెలిసిన శ్రీ చక్రపాణిగారు

చందమామ సంపాదకవర్గంలో ఒకడుగా, నాకు శ్రీ చక్రపాణిగారితో ఇరవైనాలుగేళ్ళ పరిచయం వుంది. ఈ కాలంలో పత్రికకు సంబంధించిన అనేక విషయాలు ఆయనతో మాట్లాడటం జరుగుతూండేది. ఆయనతో దేన్ని గురించయినా మాట్లాడటం తప్ప, చర్చించటం అంటూ సాధ్యంకాదని నా అనుభవం. ఆయన ఏదో ఒక దృఢనిశ్చయానికి వచ్చిన తరవాతనే, తన అభిప్రాయం యిదీ అంటూ చెప్పి,పని యిలా జరగాలి అన్న ఆదేశం యిస్తూండేవారు.

స్వయంకృషితో, కేవలం చదువోడ్చి సంఘంలో ఉన్నతస్థానాలను ఆక్రమించినవారు చాలామంది వుంటారు. చక్రపాణిగారు ఆ కోవకు చెందిన వ్యక్తి కాదు. ఆయనలో సునిశితమైన మేధాశక్తి, కార్యదీక్ష, సూక్ష్మగ్రాహ్యతా కొట్టవచ్చినట్టు కనబడుతూండేవి. ఈనాడు అమలులో పెట్టదలచిన ఒక ముఖ్య నిర్ణయం యొక్క ప్రభావం, భవిష్యత్తులో ఎలాంటి ఫలితాల నిస్తుందో కూడా సూచనప్రాయంగా అర్థంచేసుకున్నట్టు కనిపించేవారు.

ఆయనతో నా పరిచయం లేక సాన్నిహిత్యం చందమామ పత్రికకు మాత్రమే పరిమితమైనది. ఆయన సంచాలకత్వంలో, ముఖ్యంగా గత ఇరవై సంవత్సరాల కాలంలో కథల ఎన్నికలో చాలా పెద్ద మార్పే వచ్చింది. ఆయన పాఠకుల అభిరుచుల్లో వస్తున్న మార్పును బాగా అంచనా కట్టకలిగేవారు. అందువల్లనే పదిహేను సంవత్సరాల క్రితం మంచి కథలని చందమామలో ప్రకటించిన ధోరణిలోవచ్చే కథలను, యీనాడు మనకు పనికిరావని తోసిపుచ్చుతూండేవారు.

వ్యక్తిగా శ్రీ చక్రపాణిగారు సహృదయులు. అయినా ఆయన తనతో పరిచయంకలిగిన వాళ్ళలో భక్తి లేక గౌరవభావంకన్న, కాస్త బెదురూ భయాల్లాంటి భావాలు నాటుకునేలా ప్రవర్తించేవారు. మొదటి పరిచయంతోనే ఆయన ఎదుటివారి నీతి నిజాయితీలకన్న, వాళ్ళ శక్తిసామర్థ్యాలను యిట్టే అంచనా వేయగలిగేవారని నా నమ్మకం. ఆయనక్కావలసింది తాను సూచనప్రాయంగా చెప్పిన దాన్ని విజయవంతంగా అమలుపరచగలవాళ్ళు. ఆయన ఆధ్వర్యం వహించిన చందమామ, యువ సంస్థల్లో అలాంటి వారినే ఆయన ఎన్నికచేశారు. ఆ కారణంగానే ఆ రెండు సంస్థలూ దిన దిన ప్రవర్థమానమవుతూ, యీనాటికీ సాటిలేని పత్రికలుగా, ప్రచురణ సంస్థలుగా నిలదొక్కుకొని వున్నవి.

శ్రీ చక్రపాణిగారికున్న వ్యాపకాలూ, బాధ్యతలూ అనేకం అవి చాలామంది ఎరిగినదే. ఇన్ని వ్యాపకాలమధ్యా ఆయన చందమామ విషయంలో అతి ప్రత్యేకమైన శ్రద్ధ చూపేవాడు. ఏదైనా కథను ఆయన ఆమోదంకోసం తీసుకుపోతే,

తన గదిలో సినిమాకథ గురించి చర్చ జరుగుతున్నా లేక సెట్టుమీద షూటింగు పని ప్రారంభం కాబోతున్నా—ముందు ఆ పనులు ఆపి, అప్పటికప్పుడు చంద మామ కథ చదివి, తన అభిప్రాయం చెప్పి పంపుతూండేవారు. ఈ విధంగా ఆయన చందమామ పత్రికాభివృద్ధికై చేసిన శ్రమా, తీసుకున్న శ్రద్ధా, యింతింతని వర్ణించసాధ్యం కానిది.

శ్రీ చక్రపాణిగారు బహుముఖ ప్రజ్ఞా శాలి అన్న సంగతి అందరూ గుర్తించి నదే. ఆయన రచయితగా, సంపాద కుడుగా, సినీ నిర్మాతగా బాలా గొప్ప విజయాలే సాధించారు. ఎవరో అన్నట్టు మన విద్యాలయాలు రత్నాలను, రాళ్ళుగా మార్చటంలో ప్రముఖ పాత్రనే వహిస్తూం డాలి. చక్రపాణిగారికి వాటి ఛాయలకు పోవలసిన అవసరం కలగకపోవటం అదృష్టమే అయివుంటుంది. ఆయన స్వయంకృషితో హిందీ, బెంగాలీ భాష లను అభ్యసించి, పాండిత్యం సంపాయిం చటమేగాక, ప్రముఖ బెంగాలీ రచయి తల రచనల నెన్నిటినో సమర్థవంతంగా తెలుగులోకి అనువదించి, తెలుగు పాఠ కులకేకాక, కానున్న రచయితలకుకూడా ఎంతో మేలు కూర్చారు.

తెలుగులో యిన్ని శరత్ రచనలు చదివి, తెలుగు సామాజిక పరిస్థితుల్ని, వ్యక్తుల ప్రవర్తనా సరళినీ, ఎరువు తెచ్చు కున్న శరత్ దృక్పథంలోంచి చూసి గొప్ప రచయిత లైనవారు; యీనాడు తెలుగు సాహిత్యంలో ఎందరో వున్నారు. ఈ దురదృష్ట పరిణామానికి, మంచి సాహిత్యాన్ని అందించిన చక్రపాణిగారి బాధ్యత ఏమీలేదు—

చందమామతోపాటు యువ పత్రిక విషయంలోకూడా చక్రపాణిగారు గొప్ప విజయాన్నే సాధించారు. ఏ పత్రిక ఏ తరహా పాఠకులు చదువుతారో, వాళ్ళు ఎలాంటి రచనలంటే యిష్టపడతారో ఆయనకు బాగాతెలుసు. ఆ అవగాహన తోనే ఆయన యువలో సంక్షిప్త నవలలు ప్రారంభించారు. అప్పటికే ఎన్నో ముద్రణలై, బహుళ ప్రచారంలో వున్న ఆ నవలల్ని, తిరిగి యువలో ప్రచురిం చటం, పత్రిక సర్క్యులేషన్‌ను దెబ్బ తీస్తుందేమో అన్నప్పుడు, చక్రపాణిగారు మనం నవల మొత్తాన్ని కాక, దాని సంక్షిప్త రూపం ప్రచురిస్తామనీ, అది తప్పక పాఠకుల్ని ఆకర్షిస్తుందనీ అన్నారు. ఆయన అంచనా రుజువై; యువ లోగడకన్న మరింత ఎక్కువగా పాఠకులను ఆకర్షించింది.

ఈవిధంగా చక్రపాణిగారు చేపట్టిన అన్ని రంగాల్లోనూ అమోఘమైన విజ యాలు సాధించారు. ఆ విధంగా ఆయన ధన్యజీవి. ఆయన హఠాన్మరణం ఆయన బంధు మిత్రులకూ, సన్నిహితులకూ పిడుగుపాటు లాంటిది. ఆయన తాను పెంచి పెద్దచేసిన చందమామ ద్వారా, అమరమైన తెలుగు సాహిత్యంలో, అమ రులుగా నిలిచిపోతారు.

*దాసరి సుబ్రహ్మణ్యం*

# పెద్దాయన

'జాతస్య మరణం ధ్రువమ్'అని అంద రికీ తెల్సినప్పటికీ కూడా సామాన్యుల మధ్య ఒక అసామాన్యమైన వ్యక్తి భౌతికంగా మరణిస్తే ఎంతో దుఃఖిస్తాం; ఆ వ్యక్తిని శాశ్వతంగా కోల్పోయిన బాధతో విలపిస్తాం. చక్రపాణిగారి మరణం మనకు అటువంటి దుఃఖోద్వే గాన్నీ, మనస్తాపాన్నీ, తీరని వ్యథనూ కలిగిస్తుంది.

నేను కథలు వ్రాయడం మొదలు పెట్టిన దగ్గర్నుంచే (1948) చక్రపాణి గారితో పరోక్షంగా పరిచయం ఉన్నప్ప టికీ, గత మూడేళ్ళుగా ఆయనతో ప్రత్యక్ష పరిచయం గలిగి, అతి సన్ని హితంగా ఉంటూ ఉండడం జరిగింది.

చక్రపాణిగారు బహుముఖ ప్రజ్ఞా పాటవంగల అసాధారణ వ్యక్తి. తెలుగు వారికి శరత్‌బాబును తొలిగా పరిచయం చేసిన ఖ్యాతి ఆయనదే. అంతేకాకుండా పాత మంగలి, 'అహం బ్రహ్మాస్మి,' కొమ్మ మొదలైన కథలు వ్రాసి, 'పని లేని మంగలి' శీర్షిక క్రింద ఎన్నో వ్యంగ్య రచనలు చేసి మన సాహిత్యంలోఉన్నత స్థానాన్ని అలంకరించారు. ప్రతికా రంగానికి చక్రపాణిగారు చేసిన కృషి అద్వితీయము. పెద్దలకు 'ఆంధ్రజ్యోతి' పిల్లలకు 'చందమామ', యువతీ యువ కులకు 'యువ' ప్రారంభించి, వివిధ వయస్సులలో ఉన్నవారి అభిలాషలకు, అభిరుచులకు, అనుభూతులకు మేర, సమకాలీన సాహిత్యపు విలువల్ని పోషిస్తూ, పాఠకులసంఖ్యను పెంచుతూ, విజయవంతంగా నిర్వహించారు.

చక్రపాణిగారి ప్రతిభకుమరోమచ్చు తునక—సినిమారంగము. ధర్మపత్ని, స్వర్గసీమ, షావుకారు, పెళ్ళిచేసిచూడు, మిస్సమ్మ, గుండమ్మకథ, మొదలైన చిత్రాలలో ఆయన సర్వతోముఖ ప్రజ్ఞ ప్రస్ఫుటంగా గోచరిస్తుంది. వినోదాన్నీ, విజ్ఞానాన్నీ కాంక్షించే ప్రేక్షకులకోసమే చలన చిత్రాల్ని రూపొందించిన సంగతి సువ్యక్తమవుతుంది.

చక్రపాణిగారి ప్రతిభ సాహిత్య, సినిమా పత్రికా రంగాల్లోనే కాకుండా వ్యాపారక్షేత్రంలో కూడా బాగా వ్యాప్తి నొందింది. ఇది అందరికీ తెలిసిన విష యంకాదు. ఆయన సలహాలనూ,సహాయ సానుభూతులనూ పొందిన మిత్రులు, సంస్థలూ వ్యాపారాభివృద్ధిని ఇను మిక్కి లిగా పొందడం జరిగింది. సినిమాలు, పత్రికలు, ముద్రణాలయాలవిషయంలో ఆయన వ్యాపార దక్షత, సామర్థ్యాలు, నైపుణ్యాలు ప్రత్యేకంగా కొనియాడ దగినవి.

చక్రపాణిగారు ధార్మిక సంపన్నులు, దయార్ద్రహృదయులు. సామాన్య రైతు కుటుంబంలో నుంచి వచ్చినవారు కాబట్టి కింద తరగతి ప్రజల కష్టసుఖాల్ని బాగా అవగాహన చేసుకొన్నవారు. ఎవరు ఏ సహాయాన్ని అర్థించినా— శక్తివంచన లేకుండా ఉత్సాహంగా, పరమావధిగా సహాయాన్ని అందించే వారు. తన క్రింద పనిచేసే ఉద్యోగుల పట్ల సాదరమైన అభిమానాన్నీ, సాను భూతినీ ప్రకటించి, వారి అభివృద్ధికి పాటుబడేవారు.

చక్రపాణిగారు కళాశాలలోనూ, విశ్వ విద్యాలయాల్లోనూ చదువుకోకపోయినా, ఇంగ్లీషు, బెంగాలీ, హిందీ సంస్కృత భాషల్లో స్వయం కృషితో ప్రావీణ్యాన్ని సంపాదించారు. ఆయా భాషల సాహిత్యాన్ని బాగా చదివి, జీర్ణించు కొన్నారు. గంటలకొద్దీ తోటి సాహితీ మిత్రులతో చర్చలు జరుపుతూ వుండే వారు. మానవుడు తన జీవితంలో సుఖ సంతోషాలను పెంపొందించు కోవటానికి ఎప్పుడూ ప్రయత్నించి కృషిచేయాలి,- అనేది ఆయన సిద్ధాంతం. జీవితంలో ఆశావాదానికే ఆయన ఎక్కువ ప్రాముఖ్యమిచ్చేవారు. చుట్టూ ఎంత చీకటి అలముకొని వున్నప్పటికీ ఆశా వాదాన్ని ఆలంబనంగా చేసుకొని, ఆ చీక టిని పారద్రోలుతూ మనిషి ముందుకు వెళ్ళవచ్చుననేది ఆయన వేదాంతం.

'యువ' సంపాదకత్వంలో చక్ర పాణిగారి వేదాంతం ప్రత్యేకంగా ప్రతి బింబిస్తుంది. నవల్లో, కథల్లో కామెడీ లంటేనే ఆయనకు ఎక్కువ మక్కువ. జీవితంపట్ల ఆశనూ, ఆసక్తినీ రేకెత్తిస్తూ పాఠకుల్ని "ఎడ్యుకేట్" చేసే రచన లకే ఆయన "యువ" లో ప్రాధాన్య మిచ్చేవారు. ప్రతిరచనా అతి సామాన్య మైన పాఠకునికి కూడా సులభంగా అర్థం కావాలి అనేవారు.

సున్నితమైన హాస్యమంటే ఆయన కెంతో ఇష్టం. ఆయనతో పదినిమిషాలు మాట్లాడితే పదిసార్లు నవ్విస్తారు. ఎంతో నిర్మొహమాటంగా, నిర్మలంగా, సూటిగా మాట్లాడతారు. ఆయనకుగల జ్ఞాపక శక్తి అమోఘము. నలభై, యాభై యేళ్ళ నాటి విషయాలు కూడా సినిమాల్లోని దృశ్యాల్లా వివరించి చెబుతారు. ఆయన గ్రహణశక్తి కూడా అసాధారణమైంది. ఒకసారి చదివి గ్రహించిన విషయాన్ని నలుగురికీ కాలక్షేపంగా చెబుతూ వుంటారు. ఆయనతో కూర్చుంటే నిమి షాలు, గంటలు ఇట్టే గడిచిపోతాయి.

అయితానగర్ వాస్తవ్యులకు ఆయన ఆలూరి వెంకట సుబ్బారావు, బయట ప్రపంచానికి చక్రపాణి. సన్నిహితులైన వారికి చక్కన్న. నాతోటివారికి "పెద్దా యన" ఆయన మరణం తెలుగుసాహిత్య రంగానికీ, తెలుగు చిత్రసీమకు తీరని లోటు. నా తోటివారికి వైయక్తికమైన, నిర్భరమైన నష్టము.

*తాళ్లూరు నాగేశ్వరరావు*

## డిశంబరు నెల

# భావపరిచయ పోటీ

### బహుమానం రూ. 10-00



ఈ కార్టూనుకు హాస్యయుత వ్యాఖ్య (Caption) కావాలి.

## అక్టోబరు నెల

### *బహుమతి పొందిన వ్యాఖ్య*



*తనదు వక్రబుద్ధి తానెరుంగడు కాని, కుక్కతోక వంపు చక్కజేయ*
*వెదురుబద్దగట్టి వేమార్లు యత్నించు, మానవుండు వింతమానవుండు.*

—నెమ్మాని వేంకట రమణ తిరుపతి.

సి. ఆనందారామం



రిజిస్టర్ తెరిచి కూచుని "నీ పేరు" అన్నాడు మూర్తి, కొత్తగా పునరావాస కేంద్రంలో చేరడానికి వచ్చిన యువకుణ్ణి చూస్తూ.

"యోగి !"

గతుక్కుమని తలెత్తి చూసాడు మూర్తి.

"అది నీకు పెద్దలు పెట్టిన పేరా? నీకు నువ్వు పెట్టుకున్న పేరా?"

"పెద్దలుపెట్టిన పేరుతో ఇప్పుడు నిమిత్తం లేదు. ఆ పేరుతో నేను గడపవలసిన జీవితం నాకు దూరమయిపోయింది. నా వృత్తినిబట్టి నేను యోగని..."

"ఏమన్నావ్? వృత్తినిబట్టా ?"

"అవును సార్ ? ప్రతివాళ్ళు ఏదో ఒక వృత్తి చేసుకోవాలిగా ! ఈ వృత్తిలో నాకు మంచి ప్రావీణ్యం ఉంది."

ఆ యువకుణ్ణి పరిశీలించి చూసాడు మూర్తి—గెడ్డం కొద్దిగా మాసిఉన్నా, సన్యాసుల్లాగ గెడ్డాలూ, మీసాలూ లేవు—కట్టుకున్న బట్టలు నలిగిఉన్నా ఖరీదైనవి – ఖరీదైన బట్టలుతప్ప కట్టుకోవాలన్నా మామూలు బట్టలులేని వ్యక్తిలా ఉన్నాడు—సాధారణంగా సన్యాసుల్లా కనిపించేవాళ్ళ లక్షణాలేవీ అతనిలో లేవు – చూపులు తీక్షణంగా ఉన్నాయి - చిరునవ్వులో పట్టుదల ఉంది. ఆ చిరునవ్వులో అపారమైన తెలివి కూడా కనిపిస్తుంది, పరిశీలనగా చూసేవారికి – మామూలుగా మాత్రం ఆ చిరునవ్వు అందంగా కనిపిస్తుంది.

"నువ్వు చదువుకున్నావా ?"

"నేను చదవవలసిన దానితో పోలిస్తే, చదివినది చాలా తక్కువ !"

"ఏదైనా ఉద్యోగం చేస్తున్నావా ?"

"చెప్పానుగా, నా వృత్తి సంగతి ?"

"ఆ వృత్తితోనే బ్రతుకుతున్నావా ?"

ఆ యువకుడు నవ్వాడు – మూర్తిని ఎద్దేవచేస్తున్నట్టుగా ఉంది, ఆ నవ్వు...

"నీకు ఎవరు లేరా ?"

"అందరూ నా వాళ్ళే !"

మూర్తి కనుబొమలు చిట్లించి "ప్రస్తుతం నువ్వు 'యోగి వృత్తి'లో లేవు – కుష్ఠురోగుల పునరావాస కేంద్రంలో అనాధగా చేరటానికి వచ్చావు – అడిగిన దానికి సమాధానం చెప్పు."

" 'నా' అని ప్రత్యేకించి చెప్పుకోదగ్గ వాళ్ళెవరూ నాకు లేరు "

నర్స్ సుభద్ర మూర్తిగదిలోకి రాబోయి లోపల ఎవరో ఉండటం చూసి ఆగిపోయింది.

"కమిన్ సుభద్రా ! ఏం కావాలి ?"

"సర్ ! సాంబయ్య, వెంకటేశం పోట్లాడుకుంటున్నారు. సర్దలేకపోతున్నాను –మీ రొక్కసారి రావాలి !"

నుదుటికి పట్టిన చెమట రుమాలుతో తుడుచుకుంటూ లోపలకు వచ్చి అంది సుభద్ర.

"ఏ విషయం ?"

"మామూలే ! స్నానందగ్గర

"వస్తున్నా పద !"

మూర్తి లేచి వెళ్తోంటే, వెనకాలే యోగికూడా వెళ్ళాడు.

సాంబయ్య, వెంకటేశం అత్యద్భుతమైన భాషలో కొత్త కొత్త ప్రయోగాలు చేసుకుంటూ ఒకరినొకరు తిట్టుకొంటున్నారు.

"ఏమి టాగోల ? ఆపండి !" అని మూర్తి గర్జించగానే ఇద్దరి నోళ్లూ ఒక్కసారిగా మూతపడ్డాయి.

"ఏం జరిగింది ?" అని మూర్తి ప్రశ్నించగానే సాంబయ్య, వెంకటేశం ఇద్దరూ ఒక్కసారిగా గోలగా మొదలుపెట్టారు.

మూర్తి 'హుష్' అని ఇద్దర్నీ గదమాయించి "ఇద్దరూ ఒక్కసారిగా అరవకండి – ఒకళ్ళ తరువాత ఒకళ్ళు చెప్పండి–" అన్నాడు. ఆ తరువాత మళ్ళీ ఇద్దరూ పోట్లాడుకోకుండా "సాంబయ్యా ! నువ్వు చెప్పు–" అన్నాడు.

"ఏంటండీ, సాంబయ్య గొప్పతనం..." అంటూ మూర్తిమీదకే పోట్లాటకు వచ్చాడు వెంకటేశం.

"వెంకటేశం ! సాంబయ్య గొప్పతనం వాడి రోగంలో ఉంది. నీ రోగం అంత ఎక్కువగా ఉందా చెప్పు ?" అని వేళాకోళంగా అన్నాడు మూర్తి – వెంకటేశం గుర్రుగా చూసి తగ్గాడు.

సాంబయ్య ఏడుపు గొంతుపెట్టి "అవును బాబూ ! నా గొప్పతనమంతా నా రోగంలోనే ఉండాలి–అందుకే ఈ యెంకటేసం గాడిట్టా కాల్చుక తింటున్నాడు – నెల తిరిగేసరికి కణుకుల్లా పాతిక రూపాయ లుచ్చుకుంటాడు – నాకు స్నానం చేయించటానికి ఏడ్చుకుంటాడు – ఒళ్ళు రుద్దనే రుద్దడు–" అన్నాడు.

వెంకటేశం కోపంగా "సూడండి బాబూ ! ఒళ్ళు రుద్ది స్నానం చేయిస్తున్నదికాక, ఆడి చేతికింద కూలోడిని సతాయిస్తున్నట్లు సతాయిస్తున్నాడు – అందరికీ స్నానం చేయించినట్లే ఈడికీ చేయించాను. 'ఇంకా రుద్దు – ఇంకా రుద్దు' అంటాడు–ఈడికేం గుంట్రాయిలా కూచుని ఎంతసేపైనా రుద్దించుకుంటాడు–నా ప్రాణాలు పోతన్నాయి" అన్నాడు.

"ఏందిరా ! పుణ్యానికి పోస్తన్నావా ? డబ్బులు మింగటం లేదూ ?"

"ఆ ! మింగుతున్నా, నీ తాతగాడి సొమ్ము..."

మళ్ళీ ఇద్దరూ కయ్యానికి సిద్ధమవుతోంటే 'హుష్' అన్నాడు మూర్తి – అక్కడితో నోరు మూసుకున్నారు.

"ఒక హోమ్‌లో ఉంటున్నందుకు మీరంతా అన్నదమ్ముల్లా ఉండాలి కాని—ఇలా పోట్లాడుకోవచ్చునా ! ఎన్నిసార్లు చెప్పాలి ? ఇంకొకసారి ఇలా పోట్లాడుకుంటే ఇద్దరికీ ఫైన్ వేస్తాను." మూర్తి మాటలకు ఇద్దరూ బెదిరారు. అప్పటి కాగొడవ అణిగింది.

తిరిగి ఆఫీస్‌రూంలోకి వచ్చి కూచున్న మూర్తిని చూసి "లోకమంటే ఇంతే సార్ ! ఎక్కడి కక్కడ ఎవరిమటుకువారే తమ ఆధిక్యత నిరూపించుకోవాలని చూస్తారు అవకాశ మున్నంతవరకూ అందినంత సుఖాన్ని జుర్రుకోవాలని చూస్తారు" అన్నాడు యోగి.

మూర్తి సానుభూతితో, "పాపం ! వాళ్ళు రోగంతో బాధపడుతున్నారు - బయటి ప్రపంచంతో సంబంధంలేదు - ఈ పేచీలూ, పోట్లాటలే వాళ్ళకు వినోదాలు !" అన్నాడు.

"రోగంలేని దెవరికి సార్ ! అందరికీ తలా ఒక రోగమూ ఉంది. అయితే చాలామందికి తమకు రోగం ఉందని కూడా తెలియదు - బయటి ప్రపంచంతో సంబంధంలేని వాళ్ళు ఇక్కడున్న రోగులు ! అక్కడ బయట ప్రపంచంలో ఉన్న రోగులకి 'లోపలి ప్రపంచం' ఒకటుందనే ఆలోచన కూడా రాదు - అందుకే వాళ్లూ పేచీలూ, కొట్లాటలూ, అన్నీ వినోదానికే కొని తెచ్చుకుంటారు-అంతకుమించిన ఆనందానుభూతిని అందుకోలేక..."

మూర్తి యోగిని విస్తూపోయి చూసాడు — ఎంత తెలివిగా మాట్లాడుతున్నాడు !

"మీ సంచీ చూపించండి — మీ సామాన్లు చెక్ చెయ్యాలి," అన్నాడు మూర్తి.

"నా సంచీలో సామాన్లు లేవు సార్ - ఈ సమస్త విశ్వాన్నీ జయించగల రహస్యముంది."

"అదేమిటో చూపించండి !"

"రహస్యమని చెప్పాక చూపించమంటా రేమిటండీ !"

యోగి గడుసుతనానికి మూర్తి నవ్వుకున్నాడు మూర్తికీ చమత్కారంగా మాట్లాడటం చేతనవును.

"ఆధ్యాత్మిక రహస్యాలన్నీ అందరికీ తెలియవలసిన రహస్యాలే కదండీ ! ప్రతి వ్రతానికీ మొదట అది అత్యంత రహస్యమనే ఉంటుంది. 'గుహ్యాద్గుహ్యతమం' అని తప్ప ఏ స్తోత్రాలూ ప్రారంభం కావు-అంచేత 'అత్యంత రహస్యం' అని ఊరిస్తూనే చూపించెయ్యండి."

యోగి తన సంచీని మూర్తి కందించాడు - మూర్తి ఆ సంచిలోంచి ఒక పట్టుపంచె, పంచపాత్ర, ఉద్ధరిణి పైకి తీసాడు.

మూర్తి విస్తుపోతూ "ఇదా, సమస్త విశ్వాన్నీ జయించగల రహస్యం ?" అన్నాడు.

"సార్ ! ఉపయోగించుకునే విధానం తెలిస్తే లేని వస్తువుకు విలువ కట్టలేము."

"సరే ! నువ్విక్కడ ఏపని చెయ్యగలవు ?"

"అందరికీ ధర్మోపదేశం చెయ్యగలను."

"యోగీశ్వరా! ఇక్కడ మీ ధర్మోపదేశాలు ఎవరికీ అక్కర్లేదు - అందరూ వళ్ళువంచి పనిచెయ్యవలసిందే ?"

"అలా అయితే మీరే చెప్పండి. ఏ పని చెయ్యమంటారో?"

"ఏ పని అయినా చెయ్యగలవా ?"

"భగవత్కృప ఉంటే సాధించలేని దేముంది ?"

"మందులు తీసుకున్న రోగులు చాలావరకు ఇంప్రూవ్ అవుతున్నారు - ఈ దశలో వాళ్ళు ఒక క్రమపద్ధతిలో వ్యాయామం చెయ్యాలి - చాలారోజులు స్వాధీనం తప్పిఉన్న అవయవాలను స్వాధీనంలోకి తెచ్చుకోవటం ఎంతో కష్టం—ఈ ప్రయత్నంలో మనం రోగులకు సహాయం చెయ్యాలి— ఇద్దరు నర్సులున్నారు - కానీ ఇంతమంది రోగులకు సహాయంచెయ్యటం వాళ్ళకు కష్టమవుతోంది — కేవలం క్రమపద్ధతిలో వ్యాయామం చేయించటమే కనుక, దీనికి శాస్త్రీయపరిజ్ఞానం అక్కర్లేదు — ఎవరైనా సహాయం చెయ్యవచ్చును. మీరు యోగినంటున్నారు గనుక మీ యోగబలంతో వ్యాయామం చేయించగలరేమో ప్రయత్నించండి - మీరూ, నర్సులు చెప్పిన పద్ధతిలో వ్యాయామం చెయ్యండి- ఇదొకటి—మీరు చదువుకున్నవారు కనుక మీకు మరొక పనికూడా అప్పజెపుతున్నాను - ఇక్కడ ఇటీవలే స్కూల్ కూడా ప్రారంభించాం — ప్రస్తుతం రాజారావు చదువు చెపుతున్నాడు - మీరు కూడా అతనికి సహాయం చెయ్యండి - ఈ రెండు బాధ్యతలూ మీకు అప్పజెబుతున్నాను."

"శిరసావహిస్తాను."

"గుడ్. ముందు ట్రీట్‌మెంట్ సెక్షన్‌కి వెళ్ళి మందు తీసుకోండి — ఆ తరువాత..."

"సార్ ! స్నానం, సంధ్యావందనం కాకుండా, నేను మందు కూడా తీసుకోను."

మూర్తి ఒక్క క్షణం ఆశ్చర్యంగా చూసి, "మీ యిష్టం! వ్యక్తిగతమయిన విశ్వాసాల విషయంలో నేను కల్పించుకోను — మీ కాటేజ్ నంబర్ 24-వెళ్ళండి" అన్నాడు.

యోగి వెళ్ళిపోయిన తర్వాత సుభద్రను పిలిపించి, "సుభద్రా ! ఇవాళ వచ్చిన యోగిని వ్యాయామాలు చేయించటంలో, మీకు సహాయంగా ఉండమన్నాను-అందుకు సమర్థుడులాగే తోచింది."

"ఛీ ! అతడా ? నాకు సహాయంగా ఉంటాడా ?" భరింపరాని అసహ్యంతో అంది సుభద్ర - సుభద్ర ముఖంలో ఆ అసహ్యాన్ని చూసి ఆశ్చర్యపోయాడు మూర్తి - సుభద్ర డ్యూటీలో చేరిననాటినుంచీ చూస్తున్నాడు. శాంతికీ, సహనానికీ మారుపేరులా ఉంటుంది. డ్యూటీ విషయంలో సుభద్ర శ్రద్ధాసక్తులు చెప్పుకక్కర్లేదు — నైట్ డ్యూటీలో ఉన్నప్పుడు రోగులలో కొందరికి రియాక్షన్లు వచ్చి తెల్లవార్లూ మేలుకోవలసివచ్చినా, మరునాడు ఉదయమే లేచి యధావిధిగా అందరిదగ్గరకు వెళ్ళి ఒక్కొక్కరి ఆరోగ్యమూ పరిశీలించి దగ్గిరుండి మందులు తినిపించి, మరీ ఇంటికి వెళ్తుంది. అలాంటి సుభద్రలో ఈ అసహ్యం అర్థం కాలేదు మూర్తికి.

"సుభద్రా ! నువ్వు రోగుల్ని అసహ్యించుకుంటున్నావా ?"

"కాదు మూర్తిగారూ ! రోగిని నేను ఏనాడూ అసహ్యించుకోను - కానీ, ఈ కపట యోగుల్నిమాత్రం అసహ్యించుకోకుండా ఉండలేను - ఏ మందులకూ లొంగని భయంకరమైన అంటుజాడ్యాన్ని సమాజంలో వ్యాపింపచేసే నీచులు వీళ్ళు - మీకు చెప్పే అధికారం నాకు లేదు కానీ, అతణ్ణి మన హోమ్‌లో చేర్చుకోకపోవటమే మంచిది."

"అవకాశం ఉన్నంతవరకూ ఆశ్రయం కోరి వచ్చిన ఎవరినైనా ఎలా పొమ్మనగలను ? పాపం, అతని కాళ్ళకూ, చేతులకూ రోగం బాగా వ్యాపించింది — చూసావా ? ఇక్కడ మన హోంలో అతడు చెయ్యగల చెడుపేముందీ ? మన రోగులందరూ భజన ప్రారంభించి చెడిపోతారంటావా ?"

గట్టిగా నవ్వాడు మూర్తి — సుభద్ర నవ్వలేదు - ఆవిడ ముఖం చూస్తే లోకంలో అసహ్యమంతా అక్కడే ఉన్నట్లుగా ఉంది.




"సుభద్రా ! ఇక్కడ మనమంతా ఎవరి డ్యూటీ వాళ్ళం చెయ్యాలి ? డ్యూటీ ఫస్ట్ ! మన నమ్మకాలూ, ఇష్టాలూ, ద్వేషాలూ అన్నీ మన వ్యక్తిగత జీవితంలో - డ్యూటీలో లేదు."

సుభద్ర తలవంచుకుని తనను తను నిగ్రహించుకొంటూ "ఆల్‌రైట్ సర్!" అంది.

## 2

భోజనాల దగ్గర పెద్ద గలాటా ప్రారంభమయింది - అదేమిటో చూద్దామని వెళ్ళాడు మూర్తి - అంతా గోలగోలగా మాట్లాడుతున్నారు - మూర్తిని చూడగానే రాజారావు ముందుకొచ్చి, "సార్ ! ఏమిటీ అన్యాయం ! ఈ దుంపకూర మేము ఎలా తింటాం ?" అన్నాడు.

రాజారావు బి.యస్ సి. పాసయ్యాడు - డిగ్రీవచ్చేవరకూ భవిష్యత్తుపైన ఎన్నో ఆశలు పెంచుకున్నాడు - కానీ డిగ్రీవచ్చాక లోకమేమిటో నెమ్మదిగా అర్థం కాసాగింది - ఎక్కడ చూసినా ఉద్యోగాలకోసం ప్రకటనలు - అర్హత లుంటే చాలు, ఉద్యోగం వచ్చేసినట్లే అని ఊరించే ప్రకటనలు - అష్టకష్టాలూ పడి, అప్పులుచేసి ఇంటర్వ్యూలకు వెళితే, అప్పుడు తెలుస్తుంది ఇంటర్వ్యూల తంతు మొత్తం ఒక ప్రహసనం అని - అంతకుముందే ఉద్యోగం ఎవరికివ్వాలో ఆ అభ్యర్థి నిర్ణయమయిపోయి ఉంటాడు. మిగిలిన వాళ్ళను లాంఛన

ప్రాయంగా అడ్డదిడ్డపు ప్రశ్నలన్నీ వేస్తారు. కేవలం ఇంటర్వ్యూలకు అటెండ్ అవటానికి దగ్గర దగ్గర వెయ్యిరూపాయలు ఖర్చుచేసి విసిగిపోయిన రాజారావు తన చదువుతో ఏ మాత్రం సంబంధంలేని సేల్స్‌మన్‌గా ఉద్యోగంలో చేరాడు– తను పనిచేసే షాపులో తన కళ్ళముందు జరుగుతోన్న అన్యాయాలు చూసి చూసి మనుష్యుల మంచితనంలో – మానవత్వంలో నమ్మకం నశించిపోయింది రాజారావుకి – ఈ పరిస్థితుల్లో అతణ్ణి కుష్ఠువ్యాధి వరించింది – ఏ నెల జీతం ఆ నెల ఇంటి ఖర్చులకే సరిపోని మధ్యతరగతి కుటుంబాల్లో ఎవరూ చిన్న చిన్న అనారోగ్యాలు పట్టించుకోరు – తమకు తోచిన మందులు మింగుతూ శ్రుతిమించి రాగానపడేవరకూ డాక్టర్‌ని కలుసుకోరు – అలాగే రాజారావు కూడా మొదట్లో అశ్రద్ధ చేసాడు – తీరా వ్యాధి ముదిరిన తర్వాత రాజారావుకంటె ముందుగా షాపు యజమాని గుర్తించాడు ఆ వ్యాధిని–వెంటనే ఆ ఉద్యోగంలోంచి కూడా తీసేసాడు.

"నాకు వేరే ఆధారం లేదు – ఈ ఉద్యోగం కూడా లేకపోతే, నా కుటుంబం వీధిన పడుతుంది – ఈ రోజుల్లో మందులకు లొంగని వ్యాధులు లేవు – డాక్టర్‌ని కన్సల్ట్‌చేసి మందుల్లు తీసుకుని వ్యాధి నయంచేసుకుంటాను– శక్తివంచన లేకుండా – కాదు – శక్తికి మించి పనిచేస్తాను" అని ఎంతో ప్రాధేయపడ్డాడు.

షాపు యజమాని రాజారావును ఒక పురుగును చూసినట్లు చీదరగా చూస్తూ భయంగా, దూరంగా నిలబడి "నువ్వు ఈ షాపులో పనిచేస్తే మేము షాపు మూసేసి దివాళా తియ్యవలసిందే ! నువ్విక్కడ పనిచేస్తోంటే, మన షాప్‌లో కొనటానికి ఎవరొస్తారయ్యా ! నిన్ను చూసి ఆమడదూరం పారిపోరూ ?" అని 'అహోహోహో !' అని నవ్వాడు – మిగిలిన వాళ్ళు కూడా నవ్వారు – అసహాయస్థితిలో ఉన్న తనను అమానుషంగా అపహాస్యాల పాలుచేస్తోన్న ఆ దుర్మార్గులను చూసి మనసు రగిలిపోయింది రాజారావుకి – కాని, ఏం చెయ్యగలడు ? దారి, తెన్ను తోచక పునరావాస కేంద్రానికి వచ్చిపడ్డాడు.

పోలీస్ ఆఫీసర్‌గా రిటైరయిన మూర్తి వ్యక్తుల మనస్తత్వాలు చక్కగా అర్థం చేసుకోగలడు – ఆ కారణంగానే హోమ్‌ను సమర్థంగా నిర్వహించగలగటమేకాక, అక్కడి రోగులకు ఆత్మీయుడు కూడా కాగలిగాడు.

రాజారావు అంత దురుసుగా మాట్లాడుతోన్నా ఉద్రేకపడకుండా. "ఏం జరిగింది రాజారావ్ ?" అన్నాడు.

"చూడండి, ఈ తిండి ! ఎలా తింటాం మేము ?" తీవ్రంగా అడిగాడు రాజారావు.

మూర్తికి పరిస్థితి అర్థమయింది. హోమ్‌లో వారానికి సరిపడ కూరలు ఒకే సారి లారీలో తెప్పిస్తాడు. అలాకాక ఏ రోజు కూరలు ఆరోజు తెప్పించా లంటే చాలా డబ్బు అవుతుంది. అంత ఫండ్స్ లేవు. వారానికి ఒకసారి తెప్పిస్తు న్నప్పుడు అన్ని కూరగాయలు తెప్పించడానికి వీలవదు. మొదటి రెండు మూడు రోజులకు సరిపడ కూరగాయలూ. ఆ తరువాత రోజులకి దుంప కూరలూ తెప్పిస్తున్నాడు మూర్తి. దుంపకూరలు వండినప్పుడల్లా హోమ్‌లో జనం తినడానికి గొడవచేస్తోనే ఉంటారు. సమాజంలో అన్యాయాల తాకిడికి బాగా నలిగిపోయిన రాజారావుకి ప్రతిచోటా అన్యాయమే కనిపిస్తోంది. ఆ కారణంగానే హోమ్‌లో ఉన్న అందరి తరఫునా మూర్తిని ఎదుర్కోవటానికి సిద్ధపడ్డాడు.

మూర్తి చిరునవ్వుతో, "ఈ తిండికేం ? దుంపకూర అనా? ఏమయ్యా! మన ఇళ్ళలో మాత్రం రోజు కాయగూరలే వండుకుంటామా ? అప్పుడప్పుడు దుంప కూరలు చేసుకోమూ ? ఇదీ మన ఇల్లులాగే అనుకోవాలి ! మంచి చెడ్డలు అర్థం చేసుకుని సర్దుకుపోవాలి ?" అన్నాడు.

"ఆ! చెపుతారు కబుర్లు ! మీ ఇంట్లో దర్జాగా పంచభక్ష్యపరమాన్నాలు ఆరగించి మమ్మల్ని ఏదో ఒక గడ్డి తినమంటారు. ఒక్కరోజు ఈ తిండి మీరు తింటే అర్థమవుతుంది !"

"ఓ! అలాగే తింటాను. ఇవాళ నువ్వు నాతో భోజనం చెయ్యి. ఇంకో గంటలో ఇంటినుంచి కేరియర్ వస్తుంది. ఆ ఉన్నదేదో ఇద్దరం పంచు కుందాం, రా ?"

అనుకోని ఈ పరిణామానికి రాజారావు విస్తుపోయాడు. ఈ ఆహ్వానానికి కారణం ఊహించుకోలేకపోయాడు.

"ఈ అభాగ్యులందరి తరఫునా నేను వాదిస్తున్నానని నాకు మాత్రం మంచి భోజనం పెట్టి నోరు మూయించాలని చూస్తున్నారా ? నేను అలాంటి స్వార్థ పరుణ్ని కాదు."

"నువ్వెలాంటి వాడివో నాకు తెలుసు. అందుకే పిలుస్తున్నాను. నా భోజనం ఇవాళ నువ్వు రుచిచూడు. ఆ తరువాత నువ్వు కావాలంటే అందరికీ అదే పెడదాము."

ఈ మాటలకు రాజారావుతో పాటు అందరూ ఆశ్చర్యపోయారు.

మూర్తి ఆహ్వానాన్ని కాదనలేకా, మూర్తితో పాటు భోజనానికి కూర్చున్న రాజారావు ఆ కేరియర్‌లో ఆహార పదార్థాలు చూసి తెల్లబోయాడు. అందులో కేవలం జొన్న రొట్టెలూ, పప్పుకురా మాత్రం ఉన్నాయి. మూర్తి అప్పటి కప్పుడు కావాలని అలా తెప్పించాడని అనుకోవటానికి కూడా వీల్లేదు. తమ వివాదం జరిగిన అరగంటలోపుగానే వచ్చింది కేరియర్.

"సార్ !..." అని ఇంకేమీ మాట్లాడలేక పోయాడు రాజారావు. మూర్తి గట్టిగా నవ్వి, "ఏం? నా పంచభక్ష్య పరమాన్నాలు నీకూ నచ్చలేదా ? జొన్న రొట్టెల విలువ నీకు తెలియదోయ్! పోలీస్ డిపార్టుమెంట్‌లో ఎండకూ వానకూ తట్టుకున్న నాతోటివాళ్ళ నడుగు చెపుతారు. కాంప్స్‌కి వెళ్ళినప్పుడు గుడారాలు వేసుకుని కిరసనాయిలు స్టౌలమీద వండుకుని తినేవాళ్ళం. నేను బాగా వంట చెయ్యగలను తెలుసా ? ఈ జొన్న రొట్టెలు బాగా ఆకలిని అపుతాయి. అందుకే వీటికి అలవాటు పడ్డాను. ఇప్పుడు ఈ రెండు రొట్టెలు తించే, రాత్రి పదింటి వరకూ కూడా ఆకలి వెయ్యదు. రా ! తిను !" అన్నాడు.

రాజారావు మనసు చిత్రంగా కదిలిపోయింది. మూర్తి నిరాడంబరత, నిస్స్వార్థ జీవితం ప్రత్యక్షంగా చూస్తున్న కొద్దీ, అతని మీద కోపం ఉంచు కోవాలన్నా సాధ్యం కావటంలేదు. తనకు తెలిసినంత వరకూ ఈ అధికారు లంతా పందికొక్కుల్లా అన్యాయపు ఆర్జన మెక్కేవారే ! అనాథుల నోటి ముందరి కూడు లాక్కుని అమ్ముకుని సొమ్ముచేసుకోవటానికి, పసిబిడ్డల నోరు ఎండగట్టి వాళ్ళపాలు అమ్ముకోవటానికి, రోగిష్టివాళ్ళ రోగాలు బాగు చేసే మందులు అమ్మేసుకుని, మందుల పేరిట రంగు నీళ్ళు ఇయ్యటానికి, వాళ్ళకే విధమయిన సంకోచమూ కలగదు. వాళ్ళ జేబులూ, వాళ్ళ పొట్టలూ నిండితే చాలు ! మరేవిధమయిన న్యాయాన్యాయాలూ వాళ్ళకక్కర్లేదు. మూర్తి కూడా అలాంటి వాడేననుకున్నాడు. కానీ, కాదేమో ? ఆఫీసర్లందరూ దుర్మా ర్గులు కాకపోవచ్చునేమో ! నీతికి, నిజాయితీకి కట్టుబడి కేవలం కర్తవ్య నిర్వహణమే ధ్యేయంగా జీవించే మూర్తిలాంటి అధికారులు కొందరు ఉంటా రేమో ? అందరూ అలాంటివాళ్ళే అయితే, తనలాంటి అభాగ్యులు కన్నీళ్ళు కురిపించవలసిన అవసరమే ఉండదు కదా !

రాజారావు చెల్లెలు లలిత విజిటింగ్ టైంలో రాజారావును చూడటానికి వచ్చింది, అన్నకోసం పళ్ళు తీసుకుని...

రాజారావు కోపంగా "నిన్ను ఎవరు రమ్మనారు ఇక్కడికి ?" అన్నాడు,

లలితకి పద్దెనిమిదేళ్ళుకూడా వుండవు. సన్నంగా పొడుగ్గా నాజూగ్గా వుంటుంది. మొహం కొద్దిగా పాలిపోయినట్లు కనిపిస్తున్నా ఏదో అమాయక త్వంతో కూడిన కళ కనిపిస్తూంది ఆ ముఖంలో-చిన్నప్పటినుండి లలితను ఎంతో ముద్దుగా, గారాబంగా చూసేవాడు రాజారావు. అన్నదగ్గరి నుండి లాలనే కాని అదలింపు ఎరుగని లలిత బిక్కచచ్చిపోయి బెదురుగా చూసింది.

"ఏం అన్నయ్యా ! నేను తెచ్చిన పళ్ళు నీకు పనికిరావా ?" అంది బేలగా.

ఆ మాటలు విచిత్రంగా వినిపించాయి రాజారావుకి. అంతకంటే ఆ బేలతనం గుండెలను పిండేస్తూంది. చెల్లెలి ముఖం చూడలేక తన ఆవేదనను అణచుకోలేక

"ఫో ! అవతలికి !" అన్నాడు ముఖం తిప్పేసుకుంటూ. లలిత తను తెచ్చిన పళ్ళు అక్కడ పెట్టేసి అన్నను మరోసారి పలకరించే సాహసంలేక, అక్కడ వుండలేక అక్కడనుంచి వెళ్ళలేక పైటకొంగుతో కళ్ళను తుడుచుకుంటూ వెళ్ళి పోయింది. రెండు మోకాళ్ళమధ్య తలపెట్టుకుని కూర్చున్నాడు రాజారావు. అటూ తిరుగుతూ అది గమనించిన మూర్తి మనసు జాలితో కరిగిపోయింది. రాజారావు దగ్గరగావచ్చి భుజంమీద చెయ్యివేసి "రాజారావు !" అన్నాడు. రాజారావు తల ఎత్తాడు. అతనికళ్ళు ఎర్రగా వున్నాయి.

"బి స్పోర్టివ్ మైబాయ్ !" అన్నాడు మూర్తి.

"సార్ ! నేను బి.యస్‌సి. పాసయి ఇంటికి రాగానే చెల్లి తన కోరికలు ఎన్ని నాకు చెప్పిందని ? అన్నీ తీరుస్తానని ఆశపెట్టాను. తీర్చగలననే అను కున్నాను. కానీ సార్ ! కుటుంబాన్ని ఆదుకుని చెల్లెలికి పెళ్ళిచెయ్యవలిసిన నేను ఆ పసిపిల్ల కష్టపడి ఆర్జిస్తుంటే కూచుని తిననా ? నాకు కనిపిస్తున్నవి ఆ పళ్లు కావు సార్ ! అమ్మనీ చెల్లెలివి రక్తం బొట్లు ఎన్నడూ చెల్లెని పల్లెత్తుమాట అన లేదు. ఈనాడు ఇలా కసిరాను. నాకోసం పనికట్టుకుని పళ్ళుతెచ్చిన చెల్లెల్ని కసిరాను. ఎందుకో తెలుసా సార్! ఇలాగయినా అది పళ్ళుతేవటం మానేసి కడుపునిండా అన్నం తింటుందనే ఆశతో......"

రాజారావు అప్పటికప్పుడు చుట్టుపక్కలవాళ్ళని పిలిచి ఆ పళ్ళు పంచి పెట్టాడు—మూర్తి ఆశ్చర్యంగా "పాపం? మీ చెల్లెలు ఎంతో ఆప్యాయంగా నీకోసం తెస్తే నువ్వు అందరికీ పంచుతావేమిటి?" అన్నాడు - "సార్! ఇది మంచిపనే అయితే, దీనికి ఫలితంగా నా చెల్లెలికి మంచిసంబంధందొరికి పెళ్ళి కావాలని— సార్! ఒకనాటికయినా నేను మళ్ళీ ఉద్యోగంచేసి డబ్బు సంపాదించి నా చెల్లెలికి పెళ్ళి చెయ్యగలనా?"

మూర్తి మనసు కరిగిపోయింది.

"తప్పకుండా ! తప్పకుండా ! మీరంతా మళ్ళీ యథాప్రకారం జీవించ గలరు !"

దిగులుగా నవ్వాడు రాజారావు—ఆ నవ్వు చూడలేకపోయాడు మూర్తి—ఏనాటికయినా తనమాట నిలబెట్టుకోగలడా ? ఈ విధివంచితుల జీవితాలకు ఆశాజ్యోతి చూపించగలడా ?

## 3

నర్స్ సుభద్ర అంటే రోగులకందరికీ దేవత—ఎప్పుడూ ఎవ్వరిమీదా చికాకు పడదు. ముఖంమీద చిరునవ్వు చెక్కుచెదరనీయదు- ఏవేళప్పుడు ఎవరు బాధతో మూలుగుతున్నా వెంటనేవచ్చి ఆదుకుంటుంది-తనకు చేతనైనంత వరకూ బాధోపశమనానికి మందులిస్తుంది. మరీ, శ్రుతిమించి అవస్థపడుతోంటే మూర్తితోచెప్పి డాక్టర్‌ని పిలిపిస్తుంది-అక్కడ మరొక నర్స్ శకుంతలకూడా పనిచేస్తున్నా, సుభద్ర అంటేనే అందరికీ ప్రాణం.

ఒక్కొక్క కాటేజికి వచ్చి ఒక్కొక్క రోగిచేతా దగ్గరుండి మందులు మింగిస్తోంది సుభద్ర-పునరావాస కేంద్రానికి వచ్చిన రోగులలో చాలామంది భిక్షుకులే! చదువుసంస్కారాల వాసనకూడా తేనివారు - తమ మంచి ఏమిటో తమకే తెలియనివాళ్ళు-తాత్కాలికమైన సుఖాలకోసం మొత్తం జీవిత సౌభాగ్యాన్నంతా తమకు తెలియకుండానే బలిపెట్టుకొనేవాళ్లు — ఆ అభాగ్యులు తమకు హోమ్‌లో ఇచ్చిన మందులనుకూడా బయట అమ్ముకుని తప్పతాగి వస్తారు—ఆ రకంగా తమ రోగం మరింత కుళ్ళబెట్టుకుంటారు—తమకు తామే ఎంతహాని చేసుకుంటున్నారో, ఆ స్పృహ వాళ్ళకసలు ఉండదు-వాళ్ళకు నచ్చజెప్పడానికి ప్రయత్నించీ ప్రయోజనం ఉండదు. అంచేత మూర్తి రోగులందరకూ దగ్గిర ఉండి మందులు తినిపించే ఏర్పాటు చేసాడు.

సుభద్రను చూడగానే రోగులందరూ ఒక్కొక్కరు తమ కథలు చెప్పుకోటం ప్రారంభిస్తారు.

"నర్సమ్మా ! ఒకప్పుడు నేను ఎంత అందంగా బల్లలూ, కుర్చీలూ అన్నీ తయారుచేసేవాడిని ? పెద్ద పెద్ద కంపెనీలకు సప్లై చేసేవాడిని- ఎంత బాగా సంపాదించేవాడిని? ఈ మాయదారి రోగంవచ్చి మూలపడేసిందమ్మా! ఇప్పుడీ చేతులతో ఒక్కపనీ చెయ్యలేను-ఇట్లా దిక్కుమాలిన బ్రతుకు బ్రతకాల్సిందేనా. ఏనాటికైనా నాకాళ్ళమీద నేను నిలబడగలనా?"

కళ్ళనీళ్ళు తుడుచుకుంటూ అడిగాడు కార్పెంటర్ రంగయ్య-రంగయ్య ఈ కథ చెప్పటం అది మొదటిసారికాదు. చెప్పిందే చెప్పినా ఎప్పటికప్పుడే ఎంతో శ్రద్ధగా వింటుంది సుభద్ర-వాళ్ళ ప్రశ్నలకు తను సమాధానం చెప్పలేదు. ఆ సమాధానం చెప్పగలిగేవాడు ఎక్కడున్నాడో, అసలు ఉన్నాడో లేడో కూడా తెలియదు-తాను చెయ్యగలిగినదల్లా సానుభూతి చూపటమే. అందుకే కథలైనా మళ్ళీ మళ్ళీ వింటుంది. కనీసం తమ కన్నీటిగాథలు మరొకరికి వినిపించటంవలన వాళ్ళ మనసు తేలికపడితే, ఆ రకంగానైనా కొంత ఉపకారం చేసినట్లే! రకరకాల కన్నీటిగాథలు! ఈ అనారోగ్యం కారణంగా పరాధీనపు బ్రతుకు గడపవలసి వచ్చిందని కొందరు కుమిలిపోతోంటే, సుఖంగా బిచ్చ మెత్తుకోనియ్యకుండా తెచ్చి ఇక్కడ పడేసారని అల్లరిచేసేవాళ్ళు కొందరు-అందరినీ అన్నివిధాలా సర్ది వ్యాయామశాలకు వచ్చేసరికి అక్కడ యోగి సిద్ధంగా ఉన్నాడు-సుభద్రను చూడగానే యోగి ఉత్సాహంగా "సుభద్రా!" అని సంబోధించి ఏదో చెప్పబోయాడు-కళ్ళలోంచి నిప్పులు కురిపిస్తూ చూసింది సుభద్ర. గభాలున తలదించుకున్నాడు యోగి—

"మిస్టర్ యోగీ! మీ యోగివృత్తిమీద నాకు ఈ ఈషణ్మాత్రమూ గౌరవం లేదు—పైగా అంతులేని అసహ్యం-మూర్తిగారి మాటమీద గౌరవంతో నావృత్తి ధర్మాన్నిబట్టి ఇక్కడ మీతోకలిసి పనిచేస్తున్నాను—నన్ను 'సుభద్రా!' అని పిలిచే అధికారం ఒక్క మూర్తిగారికే ఉంది-ఇక్కడ మీరు అందరిలాగే ఒక రోగిమాత్రమే! కనీసం నా దృష్టిలో!-అంతేకాని యోగి పుంగవులుకారు!" సుభద్ర అంతటికోపాన్ని తట్టుకుని యోగి చిరునవ్వు నవ్వాడు—అతని చిరునవ్వులో ఏదో అద్భుతమైన ఆకర్షణ ఉంది-కళ్ళలోను ఇతమిత్తమనరాని మెరుపుఉంది—తనను చూసి అతడు నవ్వుతుంటే కోపంగా ముఖం పక్కకు తిప్పుకుంది—

"అయామ్ సారీ, నర్స్! సరే! వ్యాయామం ఎలా చేయించాలోచూపించండి! తరువాత నేను దగ్గరుండి చేయిస్తాను-" యోగి ఏంమాట్లాడినా సహించలేనట్లు కంపరంగా చూసింది సుభద్ర.

"అసలు మీరిక్కడికి ఎందుకు వచ్చారు? యోగిపుంగవులు కదా! మీ యోగబలంతో మీ రోగాన్ని నయంచేసుకోలేకపోయారా? లేదా మీ 'ఆధ్యాత్మిక సంపద'తో ఏదైనా ప్రైవేట్ నర్సింగ్‌హోమ్‌లో దర్జాగా వైద్యంచేయించుకోలేకపోయారా?"

"నర్స్! మీ సానుభూతి కోరేవారుమాత్రమే తమ కన్నీటి

గాథలు మీకు వినిపిస్తారు-నాకు మీ సానుభూతి అక్కర్లేదు. నా కష్టసుఖాలు మీరు తెలుసుకోవలసిన అవసరంలేదు-మన డ్యూటీచేద్దాం రండి?"

సుభద్ర అతనివైపు చీదరింపుగాచూసి, ఒక్కొక్క రోగిచేత క్రమపద్ధతిలో వ్యాయామం చేయించసాగింది - మొదట ఒక్కొక్క రోగికి అతని దేహ పరిస్థితినిబట్టి ఒక్కొక్క విధమయిన వ్యాయామం డాక్టరే నిర్దేశిస్తాడు-ఆ తరువాత సుభద్ర అతని సూచనలప్రకారం ఆ వ్యాయామం అభ్యాసం చేయిస్తుంది. రోగులచేత-చచ్చుబడిపోయి, బండబారిపోయిన తమ అవయవాలు కదిలించలేక, సుభద్ర సూచించిన పద్ధతిలో తేలిగ్గా వ్యాయామం చెయ్యలేక ఆర్తనాదాలు చెయ్యసాగారు, రోగులు – సుభద్ర కదిలిపోయి అనునయంగా "మొదట బాధగానే ఉంటుంది – కానీ, మీరు ఎలాగో ప్రయత్నించి, వ్యాయామం చెయ్యటం ప్రారంభిస్తే క్రమంగా అవయవాలు స్వాధీనంలోకి వస్తాయి" అని నచ్చజెప్పబోయింది-కానీ, ఆ అభాగ్యుల కదేమీ అర్థంకావటంలేదు - శారీరక బాధమాత్రమే వాళ్ళకు అర్థమవుతోంది.

"నేనొక ప్రార్థన చదువుతాను - అది వింటూ, నాతో పాటు అంటూ, వ్యాయామంచేస్తే త్వరలో మీ అవయవాలు మీ స్వాధీనంలోకి వస్తాయి" అన్నాడు యోగి అందరినీ చూస్తూ...అదిరిపడింది సుభద్ర.

"వీల్లేదు - ఇవి రోగుల ఆశ్రయ స్థావరాలు కాని, సోంబేరుల ఆశ్రమాలు కావు. ఇక్కడ ప్రార్థనలు, భజనలు అంటూ గొడవలు బయలుదేరతియ్యటానికి నేను ఒప్పుకోను !"

కానీ సుభద్ర మాటలు "ప్రార్థన చదవండి ! ప్రార్థన చదవండి !" అని ఒక్కపెట్టున రోగులుచేసిన గోలలో అణిగిపోయాయి.

యోగి సుభద్రవంక చూసి నవ్వి "ఒక్క క్షణం ఓపిక పట్టండి – నా ప్రార్థనవల్ల మేలు జరగకపోతే, నా ప్రార్థన నేనే ఆపేస్తాను" అన్నాడు.

"మహాప్రభూ !

విశ్వమంతా నిండిన నీ తేజస్సులోనుండి
నాకు తేజస్సును ప్రసాదించు –
విశ్వమంతటినీ నడిపించే నీ శక్తినుండి
నాకు శక్తిని ప్రసాదించు.
విశ్వానికంతా ఆధారమైన నీ దివ్యజ్ఞానం,
నాకు ఆధారంగా నిలుపు."

యోగి ప్రార్థనా వాక్యాలు అంటోంటే, అతనితో గొంతు కలిపి తామూ అంటూ వ్యాయామం చెయ్యసాగారు రోగులు - సుభద్ర చూపించిన దానినిబట్టి వ్యాయామ పద్ధతులు తెలుసుకుని, తాను ప్రార్థనా వాక్యాలు పలుకుతూ, రోగులతో పలికిస్తూ వ్యాయామం చేయించసాగాడు యోగి — చిత్రంగా వెనుకటి కంటె చక్కగా వ్యాయామం చెయ్యగలుగుతున్నారు రోగులు — అంతేకాదు - కష్టపడి ప్రార్థనా వాక్యాలు సక్రమంగా పలకాలనే ఆరాటంలో ఆర్తనాదాలు మరిచిపోతున్నారు. అప్పుడప్పుడు సన్నని మూలుగు రాబోయినా, అంతలో అణిగిపోతోంది. నివ్వెరపోయింది సుభద్ర - ఆ వ్యాయామశాలనుంచి బయటకు రాగానే "అంతా కపటం ! వంచన !" అంది చీదరించుకొంటూ...

"నేను చదివిన ప్రార్థన మీరూ విన్నారు - అందులో ఒకరిని వంచించేది ఏముందీ ?" అంది.

"వంచన లేదూ ?మీ ప్రార్థనవల్ల వాళ్ళకు తేలిగ్గా వ్యాయామం చెయ్యగలిగే శక్తి వస్తుందా, నిజంగా ?"

"నిజమో, అబద్ధమో, మీరే చెప్పండి ! కళ్ళారా చూసారుగా !"

నవ్వుతున్నాడు యోగి - ఆ నవ్వు చూసినకొద్దీ, వంట్లోంచి పొగలూ, సెగలూ వస్తున్నాయి సుభద్రకి. "ఛీ!" అని అతని దగ్గరనుండి పిల్లలదగ్గరకు వచ్చేసింది.

ఉదయం ఫలహారం కాగానే, రోగులందరూ వాళ్ళ వాళ్ళ శక్తిసామర్థ్యాలను బట్టి, కొవ్వొత్తులు తయారుచెయ్యటం, పేపర్ ప్లేట్లు తయారుచెయ్యటం, బుట్టలు అల్లటం, మగ్గం నెయ్యటం మొదలైన పనుల్లోకి వెళ్ళిపోతారు - ఎవరు చేసిన పనినిబట్టి వాళ్ళకు జీతం నిర్ణయిస్తాడు మూర్తి - చిన్నపిల్లలు రోగుల దగ్గర ఉండటానికి వీల్లేదు - ఎందుకంటే, చిన్నపిల్లలకు త్వరలో వ్యాధి సంక్రమించే ప్రమాదం ఉంది. కానీ, మరీ పాలుత్రాగే పసిపిల్లలను తల్లుల దగ్గర నుండి విడదియ్యటానికి వీల్లేదు. అంచేత మూడేళ్ళవరకూ తల్లుల దగ్గరే ఉంచి ఆ తరువాత ఏ అనాథాశ్రమానికో పంపేస్తారు — తమ పిల్లలందరినీ మేదర ఉయ్యాలలోవేసి పనులలోకి వచ్చేస్తారు తల్లులు - రాజమ్మ ఆ పిల్లలకు ఆయాగా అక్కడ ఉండి వాళ్ళను కనిపెట్టి చూస్తూ ఉంటుంది - రాజమ్మకు ఆ పనంటే చాలా విసుగు — కాళ్ళు చాలావరకు పాడయి కుంటుతూ తప్ప నడవటానికి వీలులేకపోయినా, చేతులు సవ్యంగానే ఉండటంవల్ల రాజమ్మను ఆ పనిలో పెట్టాడు మూర్తి - ఏ పిల్ల ఏడ్చినా, విసుక్కుంటూ, సణుక్కుంటూ

ఎత్తుకుంటుంది- పక్కబట్టలు మార్చవలసి వచ్చినా, పాలు పట్టవలసి వచ్చినా, ఆ పసివాళ్ళను తిట్టకుండా ఏ పనీ చెయ్యదు - కానీ సుభద్రను చూస్తేమాత్రం రాజమ్మకు హడల్ ! సుభద్ర అక్కడి పిల్లలందరినీ ఆదరంగా చూస్తుంది - ఎత్తుకుని ఆడిస్తుంది - మూడేళ్ళు నిండిన పిల్లలకు చాక్లెట్లు పెడుతుంది నర్స్‌గా పనిచేస్తూ తానే చీదరించుకునే రోగుల శిశువులను అంత ఆదరంగా చూసే సుభద్రను చూస్తే ఆశ్చర్యం రాజమ్మకు. 'పాపం, పెళ్ళీ పెటాకులూ లేదు గదూ ! అందుకే, ఏ బిడ్డను చూసినా అట్టా ఎత్తుకుంటుంది' అనుకుంటుంది తనకున్న పరిజ్ఞానంతో...

సుభద్రతోపాటు తానూ పిల్లల దగ్గరకు రాబోయాడు యోగి.

"మిస్టర్ యోగీ ! మూర్తిగారు మీ కిక్కడ డ్యూటీ వెయ్యలేదు - మీరు పిల్లలదగ్గరకు రావాలనుకొంటే, నేను వెళ్ళిపోయాక రండి !" ఉరిమింది సుభద్ర. తల దించుకుని వెళ్ళిపోయాడు యోగి.

ఆ రోజే ప్రార్థనలంటూ యోగి గొడవచేస్తున్నాడని మూర్తికి కంప్లెయింట్ చేసింది సుభద్ర. మూర్తి యోగిని పిలిపించాడు.

"నువ్వు వ్యాయామాలు చేయించమంటే ప్రార్థనలు చేయిస్తున్నావా ?" అన్నాడు కోపంగా.

"సార్ ! నేను ప్రార్థనలతోపాటు వ్యాయామం చేయించాను - వాళ్ళు చక్కగా చేసారు - కావాలంటే సుభద్రగారిని అడగండి !"

"ఏం సుభద్రా !" అన్నాడు మూర్తి.

సుభద్ర అబద్ధాలు ఆడలేదు.

"వ్యాయామంచేసిన మాట నిజమే, కాని ఈ ప్రార్థనలూ, పూజలూ మన పునరావాస కేంద్రంలో దేనికి ? అసలే అమాయకులైన ఈ మూర్ఖులను మరింత మూర్ఖులుగా మార్చటానికా ?"

"అవును ! ఈ ప్రార్థనలవల్ల ప్రయోజనమేమిటి

"సార్ ! జీవితంలో కష్టంకాని, సుఖంకాని అనుభవించేది మనసు - క్లోరోఫాం ఇచ్చి తెలివి తప్పిస్తే శరీరాన్ని ఎంత కోసినా ఏమీ బాధ తెలియదు- ప్రార్థన కూడా ఇంచుమించు అలాంటిదే ! మొదటి దానికంటె ఎంతో మేలైనది ! జడప్రాయమై ఏమీ తెలుసుకోలేని స్థితి అది - చైతన్యంతోనే స్థైర్యాన్ని పుంజుకునే దశ ఇది ! మన మనసును తీవ్రంగా మరోదానిపై లగ్నంచేస్తే తాత్కాలికంగా శరీరానికి కలిగే బాధ తెలియదని సైకాలజీ తెలిసిన




మీకు చెప్పాలా సార్ ? ప్రార్థనవల్ల ఇంతే జరుగుతోంది ? మనసు ప్రార్థనలో లగ్నంకావటంవల్ల శారీరక బాధనుండి మళ్ళింపబడటమేకాక, ప్రార్థనలో ఆశాభావం కూడా ఉండటంచేత, కొత్తబలాన్ని కూడా పుంజుకోగలుగుతోంది. ఇందులో ఎవరికి ఏ విధమయిన అన్యాయం జరుగుతోంది సార్ !"

మూర్తి మాట్లాడలేకపోయాడు — "ఆల్‌రైట్ !" అన్నాడు చివరికి- యోగి నవ్వి వెళ్ళిపోయాడు.

"ఇతని నవ్వులో ఏదో ఆకర్షణ ఉంది కదూ !" అన్నాడు మూర్తి.

'ఈ దేశంలో 'యో...గి' అనే పేరు వింటే చాలు ! అందరికీ మతులు పోతాయి - చివరకు మూర్తిగార్కి కూడా ... ' అని మనసులోనే విసుక్కుంది సుభద్ర.

## 4

"నాగులు మళ్ళీ 'తప్పించుకు' పారిపోయాడు." పునరావాస కేంద్రానికి రాగానే మూర్తికి వినిపించిన ఫిర్యాదు అది.

ఈ నాగులు సమస్య ఎలా పరిష్కరించాలో మూర్తికి అర్థంకావటం లేదు- నాగులు ఒకప్పుడు పేరుమోసిన గూండా ! పెద్ద పెద్ద వ్యాపారస్థుల క్రింద, రాజకీయ నాయకుల క్రింద పనిచేసి డబ్బూ అనుభవమూ కూడా బాగానే గడించాడు — ఎంత డబ్బు సంపాదించినా, అప్పటికప్పుడు త్రాగి ఖుషీచెయ్యటానికే తగలబెట్టేవాడు — అందుచేత ఏమీ మిగుల్చుకోలేదు - రోగం ప్రారంభ దశలో ఉన్నప్పుడు తనకసలు అలాంటిరోగం ఉన్నదనే గుర్తించలేదు — తీరా

శ్రుతిమించి రాగాన పడ్డాక అందరూ అసహ్యించుకుని తరిమేసారు - అతను ప్రాణాలకు కూడా తెగించి ఎవరికి పనులు చేసిపెట్టాడో, ఆ 'పెద్దలంతా' అతని ముఖం చూడటానికి కూడా చిరాకుపడ్డారు - మరొక 'మంచి మనిషి'ని కుదుర్చుకున్నారు తమ పనులకి ! తన విలువ ఏమిటో అప్పుడు తెలిసి వచ్చింది నాగులుకి. ఆ 'పెద్దల' మీద కసితో మనసు రగులుకుపోయింది. కానీ ఆ మొండిచేతులతో తను ఏం చెయ్యగలడు వాళ్ళని ! విధిలేక పునరావాస కేంద్రానికి చేరుకున్నా, అతనిలో వెనుకటి గుండాయిజం చావలేదు - బయటి నుంచి దొంగతనంగా సారా తెచ్చి హోమ్‌లో వాళ్ళకి అమ్ముతాడు - హోమ్‌లో ఎవరిదగ్గరన్నా డబ్బుందని పసికడితే డబాయించి లాక్కుపోతాడు - లేదా దొంగతనం చేస్తాడు. ఎలాగో హోమ్‌లోంచి తప్పించుకు పారిపోయి, తప్పత్రాగి ఊరంతా ఇష్టంవచ్చినట్లు తిరిగి మళ్ళీ ఎప్పటికో హోమ్‌కే వస్తాడు.

ఈసారి నాగులు హోమ్‌లో అయిదారుగురు దాచుకున్న డబ్బులు దొంగతనంచేసి మరీ పారిపోయాడని తెలిసింది. రూల్స్ ప్రకారం ఎవరూ తమ దగ్గర డబ్బు దాచుకోకూడదు—కానీ, హోమ్‌లో రోగులు తమ దగ్గర డబ్బంతా మూర్తికి ఇవ్వటానికి ఇష్టపడరు. బాగా చదువుకున్నవాళ్ళకే తమ దగ్గరున్న డబ్బు మరొకరికి అప్పగించాలంటే ప్రాణం ఒప్పదు — అలాంటిది చాలాభాగం బిచ్చగాళ్లూ, కూలీలూ అయిన ఆ రోగులకి తమ దగ్గర ఉన్న డబ్బు మూర్తి చేతులలో పెట్టాలంటే ప్రాణంపోయినట్లే ఉంటుంది - చివరకు ఆ డబ్బు నాగులులాంటి వాళ్లెవరో ఎత్తుకుపోతారు. దొంగతనంగా నాగులు తెచ్చిన నాటు సారా కొనుక్కు తాగేవాళ్ళు తమ గుట్టు బయటపడుతుందని నాగులు డబాయించి డబ్బులు లాక్కున్నా, నోరు మూసుకుంటారు.

ఎక్కడెక్కడ అన్యాయం నీతిని ఎదుర్కోలేక రహస్యపు ముసుగుల్లో చీకటి నృత్యాలు చెయ్యాలనుకుంటుందో, అక్కడక్కడ తప్పకుండా గూండాయిజం తలయెత్తి తీరుతుంది - గూండాయిజాన్ని పెంచి పోషించేది ధర్మాన్ని వెన్నుపోటు పొడిచే సంకుచిత స్వార్థపిశాచమే ! మొత్తంమీద పునరావాస కేంద్రంలో సహితం తన కొక 'ఇమేజ్' తయారు చేసుకోగలిగాడు నాగులు! అందరి మనసుల్లోనూ అతనంటే ఒక విధమయిన భయంకలిగేలా చేసుకున్నాడు - అతడు చేస్తున్న నీచపు పనులు ఎవరైనా చూసినా, మళ్ళీ మూర్తికి చెప్పే సాహసం కలగకుండా అదురు కలిగించాడు.

నాగులు విషయం తీవ్రంగా ఆలోచించి ఒక నిశ్చయానికి వచ్చాడు మూర్తి- ఎప్పటిలా నాగులు తప్పతాగి తూలుకుంటూ పదకొండుగంటలకి వచ్చాడు.

"నమస్తే అయ్యగారూ ! ఈ ఒక్కసారికి క్షమించండి ! ఇంకొక్కసారి ఇలా చెయ్యను— చెయ్యనంటే చెయ్యను" అంటున్నాడు, ఏమాత్రం పశ్చాత్తాపం లేని విషపు నవ్వునవ్వుతూ.

పొంగివస్తున్న కోపాన్ని బలవంతాన నిగ్రహించుకున్నాడు మూర్తి.

"రహీం ! ఈ రోజు నాగులుకి రేషన్ ఇయ్యకు !" అన్నాడు స్టోర్ కీపర్ తో.

"ఏంటి ? రేషన్ ఇయ్యకపోతే నాకు తిండి ఎట్లా ?" అరుస్తున్నట్లుగా అన్నాడు నాగులు.

"చీపురుకట్ట పట్టుకుని మొత్తం హోమ్ అంతా శుభ్రంచెయ్యి — అదే నీకు పనిష్మెంట్—అప్పుడిస్తాను నీకు రేషన్," అన్నాడు మూర్తి.

"తూ తెరి ! ఈళ్ళందరి ముందూ నేను ఒంగొని ఊడువాలా ?" అని ఎగిరి పడ్డాడు నాగులు. మూర్తి ఏ సమాధానమూ చెప్పలేదు, 'ఇంక మాట్లాడ వలసిన అవసరం లేదు' అన్నట్లు.

"బాబుగారూ ! వీడు నన్ను తన్ని రేషన్ లాక్కుపోయినా లాక్కు పోతాడు" అన్నాడు రహీం భయపడుతూ.

మూర్తి లోలోపల చిరాకుపడ్డాడు — సాధారణ జనం లేనిపోనివి ఊహించు కుని భయపడతారు. అదే గూండాలకు ఎక్కడలేని బలాన్నీ ఇస్తోంది — ఒక కుర్చీ తెప్పించి స్టోర్ ముందు వేయించుకుని అక్కడే కూచున్నాడు.

నాగులు గుర్రుమంటూ చూస్తూ నిలబడ్డాడు — కాలం కదిలిపోతోంది. నాగులుకి కడుపులో పేగులు కరకరలాడుతున్నాయి. మూర్తి సింహంలా అలాగే కూచున్నాడు.

పోలీస్ ఆఫీసర్ గా తన వెనుకటి అనుభవం గుర్తుకొచ్చింది మూర్తికి — ఆ రోజుల్లో రాజకీయాల్లో కొంత పలుకుబడిగల వ్యక్తి ఒక పల్లెటూరికి సర్పంచ్ గా ఉండేవాడు — అతడు మొత్తం పల్లెటూరికి మకుటంలేని మహారాజులా వెలిగి పోతూ సర్వాధికారాలూ చెలాయించేవాడు — ఒక వితంతువు ఆస్తి, తన ఆస్తిలో కలుపుకోవాలని చూసాడు సర్పంచ్ — ఆవిడ ఎదురు తిరిగింది — సర్పంచ్ తన అధికారంతో ఊళ్ళో ఏ ఒక్కరూ ఆవిడకు సహకరించకుండా చేసి తిప్పలుపెట్టాలని చూసాడు — పాపం, ఆ అనాధ తిన్నగా మూర్తి

దగ్గరకువచ్చి పరిస్థితి మొరపెట్టుకుంది. మూర్తి విషయం అర్థంచేసుకున్నాడు. ఆ సర్పంచ్ మీద ఏ విధమయిన ఏక్షనూ తీసుకోవటానికి వీల్లేదు. ఎందుకంటే, మొదటిది అతడు రాజకీయరంగంలో పలుకుబడి ఉన్నవాడు—రెండోది, ఇలాటి విషయాలన్నీ రుజువులకు రావు. అంచేత ఆలోచించి ఎవ్వరినీ ఒక్కమాట అనకుండా తను వెళ్ళి ఆ ఊళ్లో ఉండి సమస్యలన్నీ పరిష్కరించి వచ్చాడు—పోలీస్ ఆఫీసర్ స్వయంగా వచ్చి దగ్గర నిలబడితే ఎంత సర్పంచ్ అయితే మాత్రం ఏం చెయ్యగలడు ?

జనసమూహం ఎక్కడకూడితే అక్కడే సమస్యలు — అన్ని సమస్యలూ ఒక్కలాంటివే ! స్టోర్ దగ్గరనుంచి కదలకుండా కూర్చున్నాడు మూర్తి — పన్నెండు — ఒంటిగంట — రెండు...పాషాణ ప్రతిమలా నిలవగలిగిన మూర్తి ఆత్మశక్తి ముందు అన్నివిధాలా దుర్బలుడయిన నాగులు నిలువలేకపోయాడు — చచ్చినట్లు చీపురుతీసుకుని ఊడవటం మొదలుపెట్టాడు — సింహంలా తమ ముందు తిరుగుతూ, ఒక్క మాటతో, ఒక్క చూపుతో తమను గడగడ వణికించే నాగులు తమ ముందు వంగుని చీపురుతో ఊడుస్తోంటే నిర్ఘాంతపోయి సంబరంగా చూడసాగారు అందరూ...

గూండాకి జనుల దృష్టిలో ఒక ఇమేజ్ ఉంటుంది - గూండా శక్తిసామర్థ్యాలకు కంటె తాము కల్పించుకున్న ఆ ఇమేజ్‌కే ఎక్కువగా భయపడతారు జనం ఒక్కసారి ఆ ఇమేజ్ చెదిరిపోతే, 'గూండా తమలాటి మామూలు మనిషే ! అతణ్ణి లొంగదీసుకోవటం తేలికే !' అని జనానికి స్పష్టపడితే, ఆ తరువాత ఇక ఆ గూండాకి భయపడరు—పోలీస్ ఆఫీసర్‌గా లెక్క లేనంత మంది గూండాలతో వ్యవహరించి, అనుభవంమీద మూర్తి గ్రహించిన విషయం ఇది ! అందుకే కావాలని నాగులుకి అలాంటి పనిష్మెంట్ ఇచ్చాడు — వంగి ఊడుస్తున్న తనను నవ్వుకుంటూ చూస్తున్న చుట్టుపక్కలవాళ్ళను చూస్తోంటే, ఒకొక్కక్కళ్ళనీ ఖూనీ చేసెయ్యాలనుకున్నంత కసి కలిగింది నాగులులో — కానీ, ఏం చెయ్యగలడు ? సింహంలాగ మూర్తి పక్కనే ఉన్నాడు — పైగా కడుపులో ఆకలి ! నాగులులాంటి వాళ్ళు ప్రాథమిక పాశవిక ప్రవృత్తుల నేవిధంగానూ జయించలేరు — కనీసం అణచుకోలేరు. రెండు దాటాక నాగులు ఊడవటం పూర్తిచేసాక, అప్పుడు, ఇప్పించాడు నాగులుకి రేషన్ మూర్తి — అది తీసుకుని పోతూ "వీడిని నరికి పాతెయ్యకపోతే నా పేరు నాగులు కాదు" అని శపథం చేసాడు నాగులు ఆ పరిస్థితిలో నాగులు శపథం విన్న

ఎవ్వరూ అతని మాటలకు భయపడలేదు. అందుకే నవ్వుకుంటూ వచ్చి మూర్తికి చెప్పేసారు — నాగులుమీద ఎవరైనా మూర్తికి నేరం చెప్పటం అదే మొదటిసారి !

"ముందు వాడి మనసుకి పట్టినవీ, శరీరానికి పట్టినవీ, అన్నిరకాల రోగాలూ నయంకావటమే నాకు కావలసింది — ఆ తరువాత వాడు నన్ను చంపి పాతేసినా నాకు బాధ లేదు" నవ్వుతూ అన్నాడు మూర్తి.

## 5

నర్స్ శకుంతల డ్యూటీలోకి రాగానే తన డ్యూటీ ముగించుకుని ఇంటికి బయలుదేరింది సుభద్ర.

"సుభద్రా ! ఒక్క నిముషం ఉండు ! ఈ విషయం విన్నావా ?" అంటూ బయలుదేరబోతున్న సుభద్రను ఆపుచేసింది శకుంతల.

"ఏ విషయం ?"

"మన హోంలోకి కొత్తగా వచ్చిన యోగి అద్భుతంగా జ్యోతిష్యం చెపుతాడట ! అందరూ చూపించుకుంటున్నారు !"

సుభద్ర ముఖం తీక్షణంగా అయింది.

"ఇక్కడ కూడా ఈ గారడీ మొదలయిందన్నమాట ?" అంది నిరసనగా.

"ఛ ! గారడీ కాదు — నేను చెయ్యి చూపించుకున్నాను — ఎంత బాగా చెప్పాడనుకున్నావ్ ?"

"ఏం చెప్పాడు ?"

"ఇక్కడ నేను ఎక్కువకాలం ఉండనట ! తొందరలోనే పెళ్ళిచేసుకుంటానుట ! గొప్ప సంబంధం అని చెప్పటానికి వీలులేదట కాని, నాకు తగిన సంబంధమేనట !"

"బాగానే చెప్పాడు." వెటకారంగా అంది సుభద్ర — ఆ స్వరంలో వెటకారాన్ని శకుంతల అర్థంచేసుకోలేదు.

"అదే అంటున్నాను - పోనీ, నువ్వూ చూపించుకోరాదూ ?"

"ఛీ !"

సుభద్ర చీదరింపుకు నివ్వెరపోయింది శకుంతల — "ఇష్టంలేకపోతే, ఇష్టం లేదని చెప్పవచ్చు — ఇంత చీదరించుకోవటం దేనికి ?" ముఖం ముడుచుకుంది.

సుభద్ర ఇంటికి పోబోతూ ఒక్కసారి కాటేజెస్వైపు చూసింది — జనం గుంపులు గుంపులుగా యోగిని చుట్టుముట్టి ఉన్నారు యోగి తన ఆకర్షణీయ

మైన చిరునవ్వుతో అందరి చేతులూ చూస్తూ జ్యోతిష్యాలు చెపుతున్నాడు. ఎవరిమటుకు వారే తమ చేతులు చూపించుకోవాలని ఆరాటపడుతున్నారు. ఆ దృశ్యం చూసి భరించలేకపోయింది. కోపంతో మండిపడుతూ మూర్తిదగ్గరకు వచ్చింది.

"సార్ ! మీ రా యోగిని చదువుకున్నవాడనే భ్రమతో రోగులందరికీ చదువు చెప్పమన్నారు. కానీ, ఏం చెపుతున్నాడో చూసారా ?"

"ఏం చెపుతున్నాడు ?"

"మూర్ఖత్వంనుండి బయటపడేసే విజ్ఞానాన్ని బోధించటానికి బదులు మరింత మూర్ఖత్వంలో పడేసే మూఢనమ్మకాలు నేర్పుతున్నాడు – ఒక్కొక్కళ్ళకీ చేతులు చూసి జ్యోతిష్యాలు చెపుతున్నాడు – ఈ వెఱ్ఱిబాగులవాళ్ళు తమ జీవితమంతా తమ చేతుల్లో ఉందనీ, అది ఆ యోగి చదవగలుగుతున్నాడని నమ్మేస్తూ ఆ యోగికి దాసానుదాసు లవుతున్నారు – కొంచెం రోజుల్లో అతను ఏం చెయ్యమంటే అది చేస్తారు – మీరు ఇలాంటివి ఎంకరేజ్ చెయ్యకూడదు."

మూర్తి ఆశ్చర్యంగా ఆదేమిటో చూద్దామని లేచాడు – అతని వెనకాలే సుభద్ర కూడా బయలుదేరింది. వీళ్ళిద్దరూ బయటకి వచ్చేసరికి, అక్కడి దృశ్యం మారిపోయింది.

మంగమ్మ తన కూతుర్ని కౌగిలించుకుని వెక్కి వెక్కి ఏడుస్తోంది.

"సాల్లే ! యేడుపు ! దాన్నిటుతే ! ఆశ్రమంలో దింపొస్తా !"

ఏడుపు ఆపుకోవటంవల్ల బొంగురుపోయిన గొంతుకతో అంటూ మంగమ్మ చేతులలోంచి కూతుర్ని లాక్కోవటానికి ప్రయత్నిస్తున్నాడు ఆవిడ భర్త.

పునరావాస కేంద్రంలో చిన్నపిల్లలను ఉండనియ్యరు – పాలుత్రాగేవయసు దాటిపోగానే, అనాథాశ్రమంలో చేర్పిస్తారు – ఆ పిల్లల్ని అప్పుడప్పుడు తీసుకొచ్చి తలిదండ్రులకి చూపించి మళ్ళీ అనాథాశ్రమంలో దింపేస్తూ ఉంటారు. తల్లీబిడ్డల ఈ వియోగం ఎప్పటికప్పుడే హృదయవిదారకంగా ఉంటుంది – ఆ దృశ్యం సుభద్ర అసలు భరించలేదు – ఆ తల్లితోపాటు తనూ ఏడ్చేస్తూ ఉంటుంది.

"నీ ముఖమన్నా చూడకపోతే, ఈ పాడుబ్రతుకు ఇంకెట్టా బ్రతికేదే ! కన్నబిడ్డకు కడుపునిండా ఇంత తిండిపెట్టలేని ఈ బ్రతుకు బ్రతికేం చెయ్యాలే! నా కొక్కసారి చావన్నా రాదేమే ! అక్కడ నీకు ఆకలేస్తే, జబ్బుచేస్తే, భయంవేస్తే 'అమ్మా' అని ఎవరిని పిలుస్తావే ? పిలుస్తే ఎవరొస్తారే ? తల్లీ




తండ్రి ఉండీ దిక్కులేని దానివయిపోయావు కదే ! ఇక్కడ నేను రెక్కలు విరుచుకుని ఎవరికోసం సంపాదించాలే !"

కుమిలి కుమిలి ఏడుస్తోంది మంగమ్మ — గభాలున రెండు చేతులలో ముఖం కప్పుకుంది సుభద్ర.

అక్కడే ఉన్న యోగి మంగమ్మ కూతురిముఖం చూస్తూ "ఈ పిల్లది భలే జాతకం !" అన్నాడు — మంగమ్మ ఏడుపు మరిచిపోయి తలెత్తి చూసింది — సుభద్ర కూడా చేతులలోంచి ముఖం బయటకు తీసింది — యోగి ఆ పాప దగ్గరగా వచ్చి ఆ పాప చెయ్యి తన చేతులలోకి తీసుకున్నాడు.

"అబ్బా ! ఏం విద్యారేఖ ! ఈ పాపకు చదువు బాగా వస్తుంది !"

మంగమ్మ సంబరంగా చూసింది.

"బాగా చదువుకుంటుంది — మంచి ఉద్యోగం చేస్తుంది - గొప్పవాళ్ళలాగ మేడ ఇళ్ళలో తిరుగుతుంది."

మంగమ్మ తన దుఃఖం మరిచిపోయింది.

"అయితే మధ్యలో చిన్న ఆటంకం కనిపిస్తోంది."

మంగమ్మ ఊపిరి బిగబట్టింది.

"ఒక్కచోట ఏదో ఇబ్బంది - ఒకవేళ డబ్బు ఇబ్బందివల్ల చదువు ఆగిపోతుందేమో ! అది దాటితే, ఇక రాజా జాతకమే !"

"అలా జరగనివ్వను - రేపటినుంచీ ఇంకో పది ప్లాస్టిక్ బుట్టలు అల్లుతాను. డబ్బులేక నా కూతురి చదువు ఆగిపోనివ్వను—దానిది రాజా జాతకం !

"అవునవును ! మరి ముందు పాపను పంపించెయ్యి - కొంపదీసి రోగం అంటుకుంటే మొదటికే మోసం ! పాప ఏ జబ్బులూ లేకుండా, బాగా చదువుకుని పైకి వస్తుంది – అప్పటికి మీ రోగమూ నయమయిపోతుంది– తనకోసం ఇంత కష్టపడ్డ అమ్మనూ, నాన్ననూ పాప పువ్వుల్లో పెట్టి చూసుకుంటుంది..."

మంగమ్మ కళ్ళు తుడుచుకుని ఆశగా చూస్తూ కూతుర్ని మొగుడి కందించింది. అతడు వంగి యోగికి నమస్కారంచేసి కూతుర్ని అనాధాశ్రమంలో దింపటానికి వెళ్ళిపోయాడు.

మూర్తి ఒక్కసారి సుభద్రవంక చూసి ఏం మాట్లాడకుండా తన రూంకి వెళ్ళిపోయాడు. సుభద్రకు మూర్తి భావం అర్థమయింది. గుండెలు పగిలేలా ఏడుస్తోన్న మంగమ్మ కళ్ళలో క్షణికంగా నయినా మెరిసిన ఆశాకిరణాలు సుభద్రకు సంతృప్తి కలిగించకపోలేదు.

కానీ సుభద్ర హృదయంలో ఏదో గొంతు 'వంచన ! ఇదంతా దారుణమైన వంచన !' అని హాహాకారాలు చేస్తోంది.

యోగి చూపులు సుభద్ర చూపులతో కలుసుకున్నాయి. సుభద్ర దగ్గరగా వచ్చాడు యోగి.

"మీ కళ్ళలో ఇంకా కన్నీళ్ళున్నాయి - తుడుచుకోండి !" అన్నాడు.

సుభద్ర మండిపడుతూ "నా కన్నీళ్ళు తుడవాలని వచ్చారా ? సిగ్గు లేదూ ? మీరు లోకంలో అందరినీ వంచించగలరు – కానీ, నన్ను కాదు" అంది

"ఏయ్ నర్సమ్మా ! యోగినే అంటున్నావా ?"

"యోగినంటే కళ్ళుపోతాయి !"

"యోగి నేమన్నా అన్నావంటే జాగ్రత్త !"

"యెదవలోకం ! బొత్తిగా పాపం, పుణ్యం లేకుండా ఉంది."

నాలుగువైపులనుండీ, మాటలు బల్లేల్లా వచ్చిపడుతున్నాయి సుభద్ర మీద - నోరు విప్పి మాట్లాడే అవకాశం కూడా కలగలేదు సుభద్రకి - చరచర అక్కడినుండి వచ్చేసింది - శకుంతల ఎదురయింది చేతిలో ఒక పళ్ళబుట్ట యోగికి కానుకగా పట్టుకుని - సుభద్రను చూడగానే కోపంగా ముఖం తిప్పుకుంది.

సరికొత్త పాత కథ' అనుకుంటూ విషాదంగా మూగిలింది సుభద్ర మనసు.

## 6

విశ్వమానవ కల్యాణసంఘం ఉపాధ్యక్షుడు జగన్నాథం వచ్చాడు, పెద్ద బట్టల మూటతో, ఒక ఫొటోగ్రాఫర్‌తో.

"రండి ! రండి !" అని ఆదరంగా ఆహ్వానించాడు మూర్తి.

"అహ్హహ్హహ్హ" అని అకారణంగా నవ్వి తను తెప్పించిన బట్టలమూట చూపిస్తూ "చూసారా ? ఈ బట్టలు ! ఇక్కడి అభాగ్యులకు పంచిపెట్టాలని తీసుకొచ్చాను - మా సంఘం పేరు విశ్వమానవ కల్యాణసంఘం - మానవ కల్యాణంకోసం మేము అహోరాత్రాలు ఎంత శ్రమైనా పడతాం. 'పరోపకారార్థమిదం శరీరం' అన్నారు—ఇంకొకళ్ళకు మేలు చెయ్యలేని బ్రతుకు ఎందుకండీ ! ఏమంటారు ?" అన్నాడు జగన్నాథం.

మూర్తికి జగన్నాథాన్ని చూస్తే తమాషాగా ఉంటుంది. చదువుకున్నవాడిలా మాట్లాడాలని చూస్తాడు కానీ చాలా తెలివితక్కువగా మాట్లాడుతూ ఉంటాడు. అమాయకంగా కనిపిస్తాడు. కేవలం, ఆర్భాటంకోసం, ప్రచారంకోసం, వి. మా. క. సంఘం ఇలాంటి దానాలన్నీ చేస్తుందని మూర్తికి తెలుసు — ఏమయితేనేం ? ఈ రోగులకు బట్టలు దక్కుతున్నాయి అదే చాలనుకుంటాడు మూర్తి.

"ఈ అభాగ్యులు, ఈ దీనులు, ఈ నికృష్టులు ..." పరమ గంభీరంగా మొదలుపెట్టి మాట్లాడబోయి, అంతకంటె పదజాలం దొరక్క ఆగిపోయి, గర్వంగా నవ్వి. "వాళ్ళందరినీ పిలవండి — అందరికీ బట్టలు పంచుదాం !" అన్నాడు.

హోమ్‌లో వాళ్ళంతా బిలబిలలాడుతూ వచ్చారు - అందరినీ ఒక క్యూలో నిలబెట్టారు — ఫొటోగ్రాఫర్ సిద్ధంగా ఉన్నాడు - "ఏయ్ ఫొటోగ్రాఫర్ ! జాగ్రత్తగా తియ్యి — ఆ రోగులు సరిగ్గా పడకపోయినా ఫరవాలేదు - నేను బట్టలిస్తున్నట్లు మాత్రం చక్కగా పడాలి ! అర్థమయిందా ?" అని ఫొటోగ్రాఫర్ని హెచ్చరించి బట్టలు పంచటం మొదలుపెట్టాడు జగన్నాథం — తను అంత స్పష్టంగా ఫొటోగ్రాఫర్ని హెచ్చరిస్తోంటే, అక్కడున్న వాళ్ళంతా ఏమనుకుంటారోననే ఆలోచనే రాలేదు జగన్నాథానికి ! అతని దృష్టిలో ఆ రోగులు మనుష్యులే కారు ! ముష్టి వెధవలు ! మూర్తి కూడా తనలాంటి వాడే.

ననుకుంటాడు జగన్నాధం - మొదట్లో "మూర్తిగారూ ! మీరూ రండి ! నాతో కలిసి ఒక ఫొటో తీయించుకోండి — అది కూడా పేపర్లో వచ్చేలా చూస్తాను" అనేవాడు ఉదారంగా — మూర్తి నవ్వి "వద్దులెండి ! మీలాంటి సంఘసేవకుల ఫొటోలు పేపర్లో రావాలి కాని, నా ఫొటో ఎందుకు ?" అ సరికి మూర్తి అమాయకత్వానికి లోలోపల జాలిపడి మరొకసారి పిలవకుండా ఊరుకున్నాడు. జగన్నాధానికి కుడిభుజంలా ఉండి అన్నిపనులూ నిర్వహించే శంకరయ్య ఒక్కొక్క ముతకధోవతీ తీసి చేతి కందిస్తుంటే, అవి రోగులకు చకచక దానాలు చేస్తున్నాడు జగన్నాధం, ఫొటోలు తీయించుకుంటూ — శంకరయ్య బండమనిషి - శారీరక బలం ఉపయోగించి ఎంత పనైనా చెయ్యగలడు - కానీ, తెలివిగా ఏదీ ఆలోచించలేడు - వి. మా. క. సెక్రటరీ శ్రీధర్ చాలా తెలివయినవాడు, చురుకైనవాడు - అలాంటి శ్రీధర్ ఏరి కోరి ఇలాటి తెలివి తక్కువ వాళ్ళను ఎందుకు వేసుకున్నాడా అని లోలోపల ఆశ్చర్యపోతాడు మూర్తి.

బట్టలు పంచటం పూర్తిచేసి "అందరూ అయిపోయారా ? ఇంకా ఉన్నారా? అన్నాడు జగన్నాధం.

"యోగి రాలేదు" అన్నాడు మూర్తి.

"ఆయనకి వీళ్ళిచ్చే బట్టలు అక్కర్లేదటండి !" అన్నాడు ఒకడు.

తనిచ్చే బట్టలు అక్కర్లేదన్న ఆ యోగిమీద చాలాకోపం వచ్చింది జగన్నాధానికి

"యోగి ! ఇక్కడ యోగి కూడా ఉన్నాడా ? రోగి యోగి ఎలా అవుతాడండీ ! వాడిని పిలవండి ఇలా" అన్నాడు అహంకారంగా

తమ యోగిని అలా అంటున్నందుకు అక్కడి జనంలో చాలామందికి విపరీతమైన కోపం వచ్చింది.

"జాగ్రత్తగా మాట్లాడండి ! 'మా యోగి ఎవరనుకుంటున్నారు ? ఆయన దగ్గర గొప్ప మహత్తు ఉంది. ఆయనను ఏమైనా అన్నారంటే కళ్ళు పోతాయి" అన్నాయి పది కంఠాలు ఒక్కసారిగా— పది గొంతులలోంచి ఒక్కసారిగా వినిపించిన మాటలు జగన్నాధం బలహీనమైన మనసును గడగడ లాడించాయి. అంతటి అహంకారమూ జావకారిపోగా ఎందుకైనా మంచిదని టపటప లెంపలేసేసుకుని, ఎదుట కనపడని ఎవరినో ఉద్దేశించి నమస్కారాలు పెట్టేసి "అవునవును - యోగులు సర్వసంగ పరిత్యాగులు - వాళ్ళకేమీ అక్కర్లేదు.

మా అరవింద యోగీంద్రులవారూ అంతే ! వర్తమాన భూత భవిష్య ద్విష యాలన్నీ చెప్పగలరు – ఎలాంటి రోగాలనయినా నయం చెయ్యగలరు – అంతటి మహానుభావులు ! ఏమీ అక్కర్లేదు – భక్తులు ఎన్ని కానుక లిచ్చినా అన్నీ విశ్వమానవ కల్యాణ సంఘానికే అర్పించేస్తారు" అన్నాడు భక్తిపార వశ్యాలతో ఊగిపోతూ.

క్షణాలలో రంగులు మార్చేసే జగన్నాథంలాంటి వ్యక్తుల్ని తన సర్వీస్‌లో చాలామందిని చూసాడు మూర్తి. ఎటొచ్చీ మరీ ఇంతటి తెలివి తక్కువతనం మాత్రం కొంత వింతగా కనిపిస్తుంది. ఎలా అయితేనేం, పంపకాలు పూర్తయి అట్టహాసంగా కదలిపోయాడు, జగన్నాథం.

పోలీసులు మీనాను వెంటబెట్టుకుని తీసుకొచ్చారు, పునరావాస కేంద్రంలో చేర్చటానికి – వ్యభిచార నిర్మూలన చట్టంక్రింద మీనాను అరెస్ట్ చేసారు. మీనాకు కుష్ఠురోగం ప్రారంభమయిందని గ్రహించి కస్టడీలో ఉంచుకోలేక పునరావాస కేంద్రానికి తీసుకొచ్చారు – మీనా వేశ్యావృత్తిలో ఉన్న మనిషి అని తెలియగానే హోమ్‌లో పెద్ద సంచలనం ప్రారంభమయింది. అక్కడున్న అందరి కళ్ళూ మీనాను నఖశిఖ పర్యంతం 'జ్యూలో' వింత జంతువును పరీక్షించినట్లు శల్యపరీక్ష చేసాయి. మీనా తలదించుకుని నేలను చూస్తూ దీనంగా నిలబడింది. ఫార్మాలిటీస్ అన్నీ పూర్తి కానిచ్చి మీనాను హోమ్‌లో చేర్చుకున్నాడు మూర్తి. పోలీసులు వెళ్ళిపోయారు. 'మీనా'ను తమ పునరావాస కేంద్రంలో చేర్చుకోవటంవల్ల కొత్త సమస్యలు ఎదురవుతాయని మూర్తి ఊహించకపోలేదు. కానీ, ఆ అభాగ్యురాలిని నిరాశ్రయంగా వెళ్ళకొట్టటానికి అతనికి మనసొప్పలేదు. మీనాకు ఏదైనా పని అప్పగించాలని "నువ్వేం పని చెయ్యగలవు ?" అని అడిగాడు, అందరినీ అడిగినట్లే' మీనా బెదురుగా చూస్తూ "తమ దయ ! ఏ పని చెప్పినా చెయ్యగలను !" అంది. అదేదో హాస్యమయి నట్లు కొన్ని వందల గొంతులు ఒక్కసారిగా విరగబడి నవ్వాయి. మీనా కంగారుగా చుట్టూ చూసి బెదురుగా మూర్తిని చూసి "నా కాళ్ళూ, చేతులూ ఇంకా నా స్వాధీనంలోనే ఉన్నాయి. అందుకే, ఏ పనైనా చెయ్యగలను" అంది.

తన చుట్టూ తాండవిస్తోన్న ఆ అనాగరకతను, అమానుషత్వాన్ని ఎలా రూపుమాపాలో మూర్తికి అర్థంకాలేదు. గదమాయించి నోరు మూయించ గలడు. కానీ, మనసు లెలా మార్చగలడు ! అర్థం పర్థంలేని, ఆచరణలో పెట్ట

లేని శ్రీరంగ నీతులతో కుళ్ళిపోతున్న మనసులవి ! బహిరంగంగా బయటపడ నంతవరకూ నీతిసూత్రముక్తావళిని ప్రవచిస్తూ పెద్దమనుష్యుల పోజు పెట్టడానికి అందరూ సంసిద్ధులే ! విధివంచితులైన నిస్సహాయులను చూసి వికటాట్ట హాసాలు చేయటంలో ఎంత అల్పత్వాన్ని ప్రదర్శిస్తున్నారో వాళ్ళకు తట్టనే తట్టదు: సంఘం ముందు తమ ఆధిక్యత నిరూపించుకోవటానికి లభించిన ఈ బలిపశువులను వాళ్ళు అంత తేలిగ్గా వదిలిపెట్టరు. "నువ్వు చదువుకున్నావా?" నవ్వులు లక్ష్యపెట్టకుండా గంభీరంగా అడిగాడు.

"చదవటం, వ్రాయటం వచ్చును. ఏడోక్లాసుదాకా చదివాను."

"సరే ! కొవ్వొత్తులు తయారుచేసే సెక్షన్‌లో పనిచెయ్యి" అన్నాడు మూర్తి మీనా తల ఆడించింది.

హోమ్‌లో ఆడవాళ్ళెవరూ, మీనా తమతోపాటు ఉండటానికి ఒప్పుకోలేదు.

"మేం బిక్షగాళ్ళమే ! అయినా, మాన మర్యాదలతో బ్రతుకుతున్నాం ! అ చెడిపోయినది మా మధ్య ఉండటానికి వీల్లేదు !" అని తిరగబడ్డారు. విస్తు పోయాడు మూర్తి. భయంకరమైన రోగంతో బాధపడుతూ సంఘంచేత వెలి వేయబడ్డ వీళ్ళుకూడా మరొకరిని వెలివేయటానికి సిద్ధపడుతున్నారు !

అందరినీ అదుపులోపెట్టి దగ్గరుండి, మీనాను ఒక కాటేజ్‌లో చేర్పించి, రేషన్ ఇప్పించి తనగదిలోకి వచ్చాడు మూర్తి- అంతక్రితంరోజు తప్పించుకు పారిపోయిన నలుగురు బిచ్చగాళ్ళను పోలీసులు మళ్ళీ తీసుకొచ్చారు.

"దర్జాగా రోజుకి ముప్పై నలభై రూపాయలు సంపాదించుకునేవాళ్ళం- మమ్మల్ని లాక్కొచ్చి ఈ బందిఖానాలో పారేసి చావదన్ని చాకిరీ చేయించి పొట్టమాడ్చి చంపుతున్నారు—మా ఖర్మాన్న మమ్మల్ని బ్రతకనీయండి—" అని బాహాటంగా పోట్లాడుతున్నారు వాళ్ళు !

దారిద్ర్యం పాపంకాదు! కానీ, చెయ్యిచాచి మరొకరిని అడుక్కోవటం ఎంతో హీనం! శక్తివంచనలేకుండా తమకాళ్ళమీద తాము నిలబడాలని ప్రయత్నించ టానికి మారుగా, సోంబేరులై ఆత్మాభిమానం అనేమాటకి అర్థాన్ని మరిచి అడుక్కుతింటూ బ్రతకాలని చూస్తున్నారు మళ్ళీ! మూర్ఖత్వంతో తమజీవితాన్ని తాము సర్వనాశనం చేసుకోవటానికి సిద్ధపడుతున్నారు! ఈ జడప్రాయులలో చైతన్యాన్ని కలిగించే మార్గమేది?

మంచిమాటలకు లొంగే సంస్కారంతేని అభాగ్యులు వాళ్ళు-ముందు క్రమ శిక్షణలో దించాలి! తరువాత జాగృతి! అందుకే మనసుతో పొంగే కరుణ




అణచుకుని "ఇక్కడినుంచి తప్పించుకుని ఎవరు పారిపొమ్మన్నారు, మిమ్మల్ని? ఏం తమాషాగా ఉందా? మరొక్కసారి చేసారంటే చూడండి, ఇలా! ఏంచేస్తానో" అని గర్జించాడు మూర్తి—ఆత్మస్థైర్యం ఏకోశానాలేనివాళ్లు అన్నిటికీ భయపడుతూనే ఉంటారు—మూర్తి గర్జనకు హడలిపోయి నోరుమూసుకున్నారు. తరువాత సింహంలా దగ్గరుండి, ఎదురుతిరుగుతున్నవాళ్ళను అదుపులో పెడుతూ అందరినీ పనిలో ప్రవేశపెట్టాడు మూర్తి—మనిషికి సోమరితనాన్ని మించిన శత్రువులేదు.

నాగులు మళ్ళీ తప్పించుకు పారిపోయాడు.

యథాప్రకారం మరునాడు పదిగంటలకు వచ్చాడు, నాగులు. రహస్యంగా నాటుసారా తెచ్చి అమ్ముతున్నాడని విన్న మూర్తి, నాగుల్ని అటకాయించి, "ఏదీ నీ సంచీ చూపించు," అన్నాడు. నాగులు సంచీ చూపించకుండా "ఇవన్నీ మీబోటి పెద్దవాళ్ళు చూడవలసినవికావండి!" అన్నాడు—నాగులులో పొగరు చాలావరకు తగ్గింది. కానీ, చింతచచ్చినా పులుపు చావటంలేదు.

"వాగుడు కట్టిపెట్టి, ముందు ఆ సంచీ చూపించు." ఆజ్ఞాపించాడు మూర్తి.

మూర్తి అనుమానించినట్లుగానే ఆ సంచీలో రెండు నాటుసారా సీసాలున్నాయి. అంతేకాదు—ఒక కాగితంపొట్లంకూడా ఉంది. "ఏమిటిది?" అంటూ విప్పాడు మూర్తి—దానిలో ఉన్నవి "నిరోధ్!"లు! నాగులు ఏమాత్రం సిగ్గుపడకుండా వెకిలిగా నవ్వుతూ "మీనా ఇక్కడొచ్చి చేరిందికదండీ? నాకూ

మిగిలినవాళ్ళకి ఎందుకైనా పనికొస్తాయని..." అన్నాడు-అందరూ విరగబడి నవ్వటం మొదలుపెట్టారు, ఆడా మొగా భేదంలేకుండా? అందరిమధ్యా శిలలా నిలబడింది మీనా, నేలనేచూస్తూ... "ఈ నేలలోపలైనా నాకు చోటుంటుందా?" అని ఆలోచిస్తున్నట్లు... "ఇది ఆధునికయుగమేనా? మానవుడు ఆటవికదశ నుండి బయటపడ్డాడా?" అని లోలోపల మధనపడ్డాడు, మూర్తి తనచుట్టూ ఉన్న సమాజాన్ని చూసి.

## 7

సంక్రాంతి పండుగ వచ్చింది - శాసించి క్రమశిక్షణలో దించటమేకాదు-తనకు సాధ్యమయినంతగా హోమ్‌లో అందరికీ ఆనందాన్ని కలిగించాలని తాపత్రయపడతాడు మూర్తి-అందుకే సంక్రాంతి పండుగనాడు శాకాహారులకూ మాంసాహారులకూ, ఎవరికి కావలసిన ప్రత్యేకమైన పిండివంటలు వాళ్ళు చేసుకోవటానికి పర్మిషన్ ఇచ్చాడు.

జగన్నాధం వచ్చాడు, శంకరయ్యతోసహా, మిఠాయిబుట్టలనూ, ఫోటోగ్రాఫర్‌నీ వెంటబెట్టుకుని...

యధాప్రకారం "ఈ నిర్భాగ్యులకు, ఈ దౌర్భాగ్యులకు, ఈ నికృష్టులకు..." అంటూ ప్రారంభించి "పాపం, మిఠాయి పంచాలని వచ్చాను!" అంటూ ముగించాడు - మూర్తి పర్మిషన్ తీసుకుని అందరూ వచ్చి క్యూలో నిలబడితే, శంకరయ్య అందిస్తుండగా ఒక్కొక్కరికీ మిఠాయిలు పంచటం మొదలుపెట్టాడు—మిఠాయి అందుకుంటూ శంకరయ్యను చూసిన మీనా ఉలిక్కిపడింది—వెంటనే వెళ్ళిపోకుండా ఆగి శంకరయ్యను పరకాయించి చూసింది. శంకరయ్యకూడా మీనాను చూసి "ఓసి, నువ్వా! ఇక్కడ చేరావా? నీలాంటోళ్ళగతి ఇంతేలే!" అన్నాడు, నవ్వి—మీనా తలవంచుకుని గబగబ అక్కడి నుంచి వచ్చేసింది...కొన్ని కళ్ళు కుతూహలంతో అదేమిటో తెలుసుకోవాలని చూసాయి కాని మిఠాయి అందుకునే హడావుడిలో ఈ కుతూహలం అణిగిపోయింది-అయితే మూర్తి పోలీసుదృష్టినిమాత్రం ఈ సంఘటన తప్పించుకోలేకపోయింది. జగన్నాధం వెళ్ళిపోయాక మీనాను పిలిపించి "నీకు శంకరయ్య ఇదివరకే తెలుసునా?" అని ప్రశ్నించాడు.

"వీళ్ళు ఎవరు?" అని ఎదురుప్రశ్నించింది మీనా.

"విశ్వమానవ కల్యాణ సంఘం ఉపాధ్యక్షుడు జగన్నాధం—అక్కడి నౌకరు శంకరయ్య-దీనులకూ, అనాధలకూ ఎంతో సేవచేస్తుంది ఈ సంఘం!"

పకాలున నవ్వింది మీనా—మీనా అలా నవ్వటం ఎప్పుడూ చూడలేదు మూర్తి-

"ఎందుకు నవ్వుతున్నావ్?"

"శంకరయ్యలాటి వాళ్ళుండే సంఘం దీనులకూ, అనాథలకూ సేవచేస్తుందని మీరంటే నవ్వువచ్చింది."

"శంకరయ్య నీకెలా తెలుసు?"

"ఇదివరకు-నేను లక్ష్మీదేవి బంగళాలో ఉండేరోజుల్లో నాకెందరో తెలుసు-వాళ్ళలో ఇతనొకడు! పేరు శంకరయ్య అని మాత్రం నాకిదివరకు తెలియదు? చూడండి! "నీలాంటివాళ్ళగతి ఇంతే!" అని అతడు అనగలుగుతున్నాడు, గొప్పగా? కానీ, అతనిలాంటి వాళ్ళగతి ఏమిటో చెప్పగలిగేవాళ్ళు లేరు!" మూర్తి సమాధానం చెప్పలేకపోయాడు. పోలీస్ ఆఫీసర్‌గా అతను ఎన్నెన్నో ప్రశ్నలకు సమాధానాలు పరిష్కరించుకుంటూ వస్తున్నాడు-కానీ, ఇప్పటికీ అతడు సమాధానం చెప్పలేని ప్రశ్నలెన్నో మిగిలిపోతూనే ఉన్నాయి.

రాజారావు అక్కడివాళ్ళకు చదువుచెప్పటంమాత్రమే కాదు. ఏరోజుకారోజు ఎవరెవరు ఏయేవస్తువులు తయారుచేసారో, ఎన్ని తయారుచేసారో, రిజిస్టర్‌లో యెంటర్ చేస్తూ ఉంటాడు-తను తయారుచేసిన కొవ్వువత్తులు తీసుకునివచ్చింది మీనా—

"అక్కడపెట్టు!" అన్నాడు చీదరగా రాజారావు-ఆ చీదరింపు భరించలేక పోయింది మీనా.

"నిన్న మీరు చదువుచెపుతూ; దురదృష్టవశాన ఈ రోగం వచ్చినంత మాత్రాన సంఘంఅంతా మనను అసహ్యించుకొంటూ వెలివేసినట్లు చూస్తోందనీ, అది అన్యాయమనీ, ఈ అన్యాయాన్ని ఎదుర్కోవాలనీ, అన్నారు, కదూ?"

"అవును, అయితే?"

"ఏంలేదు! లోకంలో అంతటాఉన్నదే, నోటితో వల్లించటానికే ఆదర్శాలు! ఆచరణలో చూపించటానికికాదు?"

"దురదృష్టవశాన రోగంవస్తే నీచులుకారు-కానీ, వొళ్ళు కొవ్వెక్కి కండకావరంతో తిరిగే నీబోటివాళ్ళు మాత్రం తప్ప కుండా నీచులే!"

"వొళ్లు కొవ్వెక్కి..." ఉద్రేకంతో శరీరమంతా వణికిపోతూఉండగా, క్రిందిపెదవి పళ్ళమధ్య కొరుక్కుంటూ వెళ్ళిపోయింది మీనా.

యోగి వచ్చాక పాఠశాల కార్యక్రమం చాలా బాగుపడింది-అతడు కథలు చెప్తున్నట్లుగా చెపుతున్నాడు చదువు-వినేవాళ్ళకు ఆసక్తికలిగేలాగ చెపుతున్నాడు. యోగి ప్రార్థనల్లో, జ్యోతిష్యంలో, ఏమాత్రం నమ్మకంలేదు రాజారావుకి-కానీ అతని వ్యక్తిత్వం అర్థంచేసుకుంటున్నకొద్దీ అతనంటే గౌరవం కలుగుతోంది-రాజారావు చదువుకున్నవాడు-అంచేత యోగి పట్టుదలగా అందరికీ చదువు చెప్తున్నతీరు అతణ్ణి ముగ్ధుణ్ణి చేస్తోంది.

రాజారావు ఎంత కసురుకున్నా, రాజారావు చెల్లెలు అతనిని చూడటానికి రావటం మానటంలేదు-ఆ రోజూ అలాగే వచ్చింది, ఎప్పటిలాగే ఏవో పిండి వంటలు పట్టుకుని-ఆ రోజు చెల్లెల్ని చూడగానే రాజారావు కొక ఊహ తోచింది.

"లలితా? నీకు మా యోగిని చూపిస్తాను- వస్తావా?" అన్నాడు.

అన్న తనతో అంత ఆదరంగా మాట్లాడుతున్నందుకు పొంగిపోయింది లలిత.

"అలాగే అన్నయ్యా!"

రాజారావు లలితను వెంటబెట్టుకుని యోగిదగ్గరకు వచ్చాడు.

"యోగిగారూ! మా చెల్లెలిచెయ్యిచూసి దీనికి ఎప్పుడు పెళ్లవుతుందో, ఎలాంటి సంబంధం వస్తుందో, చెప్పండి!" అన్నాడు-ఆ మాటలు వినగానే లలిత ముఖం నల్లబడిపోయింది. "ఛీ!" అంటూ చెయ్యి వెనక్కు లాగేసుకుంది-యోగి ఆశ్చర్యంగా "మీరూ జ్యోతిష్యం నమ్ముతున్నారన్నమాట!" అన్నాడు రాజారావుతో.

"ఇంతవరకూ అలాంటివి నమ్మలేదు. కానీ, మా చెల్లెలివిషయంలో నా మనసులో రగిలిపోతున్న అశాంతిని తాత్కాలికంగానైనా శాంతింపచేసుకోవటానికి దేనినైనా నమ్మాలనిపిస్తోంది."

అన్న మాటలు వింటూ సిగ్గుతో తల బాగా క్రిందకు దించుకుంది లలిత... "నీ చెయ్యి ఇలా ఇయ్యమ్మా!" అని లలిత చేతిని అందుకున్నాడు యోగి-యోగి చేతిలో తన చెల్లెలి చెయ్యి రాసి ఆకులా వణికిపోతూ ఉండటం గమనించి "పిచ్చిపిల్ల" అనుకున్నాడు రాజారావు.

"లక్షణమైన చెయ్యి-బంగారంలాంటి మనసు-తనవారికోసం ఎంతటి త్యాగానికైనా సిద్ధపడగలదు..."

"లలితా!" సంభ్రమంగా పిలిచింది మీనా!

"మీనా! నువ్వు ఇక్కడున్నావా? అయ్యో! చివరికి ఈ దశకు చేరుకున్నావా?" తనను తను మరచి ఆప్యాయంగా అంది లలిత.

"నాసంగతి సరే! నువ్వేమిటి? భగవంతుడా! నువ్వు కూడా..."

"అహహ? కాదు! కాదు! మా అన్నకోసం వచ్చాను- ఈయనే మా అన్న రాజారావు..."

అన్నవైపు తిరిగింది లలిత—అప్పటి రాజారావు ముఖం చూసాక ఒక్కసారిగా ఈ లోకంలోకి వచ్చింది.

"అప్పటికి లలిత చెయ్యి ఇంకా యోగిచేతిలోనే ఉంది. నెమ్మదిగా తన చెయ్యి లాక్కుని చేతులలో ముఖంకప్పుకుని పారిపోయింది.

రాజారావు మనసులో తుపాను చెలరేగింది. మీనా నుద్దేశించి తను ఏమన్నాడు?

"ఒళ్ళు కొవ్వెక్కి..."

తన చెల్లెల్ని ఉద్దేశించి యోగి ఏమన్నాడు?

"బంగారంలాంటి మనసు-తనవారికోసం..."

హోరు? హోరు! ఒకటే హోరు, మస్తిష్కంలో!

బ్రహ్మాండాలు బద్దలుచేసే హోరు!

## 8

ఆ రాత్రి నాగులికి రియాక్షన్ వచ్చింది. బాధతో మెలికలు తిరిగిపోతూ భయంకరంగా మూలుగుతున్నాడు. నైట్‌డ్యూటీలో ఉన్న సుభద్ర వెంటనే మూర్తికి ఫోన్‌చేసింది. నిద్రపోతున్నవాడు లేచి అప్పటికప్పుడు బయలుదేరి వచ్చాడు మూర్తి—నాగులు పరిస్థితిచూసి తనే స్వయంగా కారులో డాక్టర్‌దగ్గరకు బయలుదేరాడు-అర్ధరాత్రి బయలుదేరి రాలేక "రేపు చూద్దాంలెండి—టేబ్లెట్స్ వ్రాసిస్తాను. అవి తెప్పించి ఇప్పించండి," అన్నాడు బద్ధకంగా డాక్టర్.

"నో, డాక్టర్! మీరు వెంటనే బయలుదేరిరావాలి! పరిస్థితి విషమించకపోతే, నేనుమాత్రం ఇంతరాత్రివేళ మీ దగ్గరకు వస్తానా?" అన్నాడు మూర్తి.

ఏ సమస్యనయినాసరే, వెంటనే ఎదుర్కొని పరిష్కరించాలన్నది పోలీస్ ఆఫీసర్‌గా మూర్తి చేసుకున్న నిశ్చయం - ఆలస్యం జరిగినకొద్దీ పరిస్థితులు తారుమారు అయిపోయే అవకాశం ఉంది-రెండు నిముషాల ఆలస్యంలో పరిస్థితి చెయ్యిదాటిపోయి సర్వనాశనం సంభవించిన సంఘటనలుకూడా ఉన్నాయి.

పోలీస్ ఆఫీసర్‌గా ఉన్నంతవరకూ ఎవరు తనకు రిపోర్ట్ చేసినా, తక్షణమే ఆ ప్రదేశానికి బయలుదేరివెళ్ళేవాడు మూర్తి-"తరువాత..." "నెమ్మదిగా..." అనే మాటలు అతని నిఘంటువులో లేనేలేవు.

ఇప్పుడు అడ్మినిస్ట్రేటివ్ ఆఫీసర్‌గా ఉన్నాకకూడా ఏదయినా, సమస్య రాగానే వెంటనే పరిష్కరించటమే అతనికి అలవాటు.

డాక్టర్‌కి మూర్తి అంటే చాలా గౌరవం-స్వయంగా మూర్తి కారులో తన కోసం వచ్చాక, రానన లేక, వెంటనే బయలుదేరాడు డాక్టర్...నాగులు పరిస్థితి చూసి తను రావటం చాలామంచిదయిందనుకున్నాడు డాక్టర్-ఈ రియాక్షన్ రోగులకు ఎందుకొస్తుందో, ఎప్పుడొస్తుందో, ఎవరూ చెప్పలేరు-ఒక్కొక్కసారి ఈ రియాక్షన్ కారణంగా ప్రాణాలే పోవచ్చును. పావుగంట వ్యవధానంతో వరసగా నాలుగు ఇంజక్షన్లు చేసాక స్థిమితపడ్డాడు నాగులు-తరువాత నాగులుకి ఏ యే మందులివ్వాలో సుభద్రకి చెప్పి వెళ్ళిపోయాడు డాక్టర్-

డాక్టర్‌ని ఇంటిదగ్గర దింపి ఆ తరువాత తన ఇంటికి వెళ్ళాడు మూర్తి. బాగా కోలుకున్నాక మూర్తిదగ్గరకువచ్చి రెండుచేతులూ జోడించి నమస్కారం పెట్టాడు నాగులు.

"ఏమిటిసంగతి?" అన్నాడు నవ్వుతూ మూర్తి

"అయ్యగారూ! నేను మిమ్మల్ని ఎప్పుడూ ఎదిరిస్తూనే ఉన్నాను. అప్పుడప్పుడు చంపుతాననికూడా బెదిరించాను-అవకాశం దొరికితే చంపేవాడినే కూడా? కానీ, ఈనాడు మీరు చల్లని మనసుతో నా ప్రాణం కాపాడారు."

కృతజ్ఞతతో కళ్ళలో నీళ్ళు తిరిగిపోతున్నాయి నాగులుకి-వాడి బ్రతుకు మొత్తంలో ఇది అపూర్వమైన అనుభవం- "పెద్ద పెద్ద" వాళ్ళదగ్గర ప్రాణాలకు తెగించి పెద్దమొత్తాలు బహుమానంగా తీసుకుని తాగి తందనాలాడటం వాడికి తెలుసును-పని తీరిపోగానే తనను పురుగును విదిలించినట్లు విదిలించే సంకుచిత స్వార్థపూరిత అహంకారాలు తెలుసును-కానీ నిర్వ్యాజంగా ఇలా ఆదరంతో అండగా నిలిచే ఔన్నత్యం తెలియదు.

నాగులులో పరివర్తన మూర్తికి అర్థమవుతోంది. నేరస్తులుకూడా అందరిలాంటి మనుష్యులే. ఏకారణంవల్లనో కొన్ని నేరాలుచేసి నేరస్థులుగా నిలిచిపోతారు సంఘందృష్టిలో' వాళ్లుచేసిన నేరానికి తప్పకుండా శిక్షించవలసిందే? అక్కడ దయా దాక్షిణ్యాలు చూపించకూడదు- కానీ ఆతరువాత "నేరస్తులు" అనే ముద్రవేసి హీనదృష్టితో చూడకుండా ఆదరంతో ఒక మంచిమార్గాన్ని

చూపగలిగితే వాళ్ళలో తప్పకుండా పరివర్తన కలుగుతుంది. తన చేతులలోనే శిక్షపొందిన అనేకమంది నేరస్తులను శిక్షాకాలం పూర్తిఅయిన తరువాత తనే అనేక రకాలుగా ఆదుకున్నాడు-వాళ్ళలో ఎందరో జీవితంలో సవ్యంగా స్థిరపడి ఇప్పటికీ తనపట్లు ఎంతో గౌరవాన్ని చూపిస్తారు' 'పోరా! పిచ్చివాడా! నా పని నేను చేసాను–నీ పని నువ్వు చెయ్యకుండా సోంబేరిలా నిలబడి ఏదేదో వాగుతున్నావు" నవ్వుతూ అన్నాడు మూర్తి.

మిగిలిన అందరికీ పనులు అప్పగించినట్లు నాగులుకికూడా రకరకాల పనులు అప్పగించాడు మూర్తి–కానీ, నాగులు ఏనాడూ ఏపనీ సవ్యంగా చేసేవాడుకాదు-మూర్తి చిరాకులూ, చివాట్లూ లక్ష్యపెట్టేవాడు కాదు–నాగులు తలదించుకుని ఇప్పుడు చెప్పండి. ఏపని చెప్పినా చేస్తాను-" అన్నాడు.

మూర్తి కొన్ని క్షణాలు ఆలోచించాడు

"అన్నివిధాలా నీకు తగిన పనే అప్పజెప్పుతున్నాను – ఈరోజునుంచీ, నువ్వు ఇక్కడ చౌకీదార్‌గా ఉండు–ఎవ్వరూ తప్పించుకు పారిపోకుండా జాగ్రత్తగా కాపలాకాయి!" అన్నాడు.

నాగులు తెల్లబోయి చూసాడు. ఎప్పుడూ తప్పించుకు పారిపోయే తననే, ఎవరినీ తప్పించుకు పారిపోకుండా కాపలాగా ఉంచుతున్నాడు. తనమీద మూర్తి ఉంచిన విశ్వాసానికి కృతజ్ఞతతో నిండిపోయింది నాగులు మనసు–క్షణాలలో అతడు మానసికంగా ఎంతో ఎదిగిపోయాడు. సహృదయంతో "చూడండి అయ్యగారూ? ఇవాళ్ళనుంచి ఒక్కపురుగును బయటకు పోనియ్యను అన్నాడు.

నాగుల్ని చౌకీదార్‌గా ఉంచి నందుకు హోమ్‌లో కొందరు నవ్వారు-కొందరు చిరాకుపడ్డారు–కానీ, ఫలితాలు చూసాక మాత్రం అందరూ ఆశ్చర్యపడ్డారు–ఒక్క బిచ్చగాడినికూడా బయటకు దాటిపోనియ్యకుండా పారిపోవటానికి ప్రయత్నించిన వాళ్ళందరినీ లాక్కొచ్చి మూర్తిముందు పడేసేవాడు నాగులు-దీనితో పారిపోయే ప్రయత్నాలుకూడా చాలావరకు తగ్గాయి.

ఫస్టురాగానే వాళ్ళవాళ్ళ పనినిబట్టి అందరికీ డబ్బులు పంచాడు మూర్తి–కొందరు బాగా సంపాదించుకోగలిగారు- తమ సంపాదన మూర్తిదగ్గరే దాచుకున్నారు. మరికొందరు ఏమీ సంపాదించుకోలేక ఏడుపుముఖాలతో నిలబడిపోయారు-వాళ్ళనుచూసి రాజారావు ఉద్రేకంగా "మూర్తిగారూ! ఇక్కడకూడా ఇలాంటి అన్యాయాలేనా?" అన్నాడు

"అన్యాయాలు "ఏం జరుగుతున్నాయి?"

"కొందరు బాగా సంపాదించుకుని డబ్బుదాచుకొంటూంటే మరికొందరు పైసాకూడా లేకుండా అవస్థపడుతున్నారు – అలావీల్లేదు—అందరికీ సమంగా పంచాలి!"

"అదా, నీ న్యాయం? వొళ్లువంచి ఒకధ్యేయంతో కష్టపడి పనిచేసినవాళ్ళకీ, సోంబేరులై పనిని తప్పించుకు తిరగాలనిచూసినవాళ్ళకీ. సమంగా డబ్బు పంచ మంటావా? అహోరాత్రులు కృషిచేసి తమమేధను మరింత వికసింపచేసుకుని ప్రగతిమార్గానికి సోపానాలను నిర్మించేవాళ్ళనూ, దద్దమ్మలై ఆలోచన అనేదే లేనివాళ్ళనూ, ఒక్కలా చూడాలంటావా? అలా అయితే ఏ ఒక్కరైనా కష్టపడటానికి ప్రయత్నిస్తారా? అందరూ సోంబేరుల్లాకూచోవాలనే అనుకుంటారు. తమ మేధకు పదునుబెట్టి మానవాళికంతకూ ప్రయోజనకరమయిన కొత్తకొత్త విషయాలు కనిపెట్టటానికి ఎవ్వరూ ప్రయత్నంచెయ్యరు—ఎందుకొచ్చిన ఆలోచన అనుకుని దద్దమ్మల్లా తయారవుతారు? ఇదా, నువ్వుకోరే సమానత్వం? సమాజాన్ని ఈ స్థితికా నువ్వు తేవాలనుకున్నావు? రాజారావు! అర్థం పర్థం లేకుండా స్లోగను అరవటమే నేర్చుకున్నారు కాని, లోతుపాతులు ఆలోచించటం మానుకున్నారయ్యా, మీరంతా? నీ మాటలు కొద్దిగా సవరించుకో! అందరికీ సమంగా డబ్బుపంచాలని అనకు–డబ్బు సంపాదించుకునే అవకాశాలు అందరికీ సమంగా కల్పించాలని అను – నేనిక్కడచేస్తున్నది అదే, ఇది అన్యాయ మంటావా?"

రాజారావు మాట్లాడలేకపోయాడు—నిజమే! పేపర్ ప్లేట్లు తయారుచెయ్యటంలో కూడా కొందరు మౌలికమైన ప్రజ్ఞచూపిస్తూ అందంగా తయారుచెయ్యగలుగు తున్నారు–ఎంతగా నేర్పించినా మరికొందరు సామాన్యంగాకూడా చెయ్యలేక పోతున్నారు–వాళ్లూ, వీళ్లూ ఒంటేననటం, ఉభయులకూ సమానంగా డబ్బు పంచాలనటం న్యాయమేనా? ఏ పరిస్థితుల్లోనయినా ప్రజ్ఞావంతులు తమ ప్రతి భతో మిగిలినవారిని మించి రాణించకమానరు అలాంటి మేధాశక్తిలేనివాళ్ళు, మేధావంతులనుకూడా తమస్థాయిలోకే లాగాలనుకోవటం, ప్రగతిమార్గంకాదు. ప్రగతి ప్రతిబంధకం—అది అసంభవంకూడా! ఏ ప్రతికూలపరిస్థితుల్లోనూ అణగారిపోయేది కాదు ప్రతిభ–

నరసయ్య పదిపదిహేనురోజులుగా మంచ-లో పడి మూలుగుతున్నాడు– మొదటినుండే సరిఅయిన జాగ్రత్త లేకపోవటంవల్లా. విరీతతమయిన

త్రాగుడువల్లా అతని ఆరోగ్యంబాగా పాడయిపోయింది—అతని మూత్రపిండాలు పాడయిపోయాయనీ, ఎవరైనా మూత్రపిండం దానంచేస్తే కాని బ్రతకడనీ అన్నాడు డాక్టర్–ఒక అనాధకుష్ఠు బిచ్చగాడికోసం మూత్రపిండం దానంచేసే ఉదారులెవరుంటారు? హోరు హోరున ఏడుస్తున్నాడు నరసయ్య.

నరసయ్యకు నాఅనేవాళ్లు లేరు—మొదటినుంచీ శ్రద్ధచూపించకపోటంవల్ల రోగం బాగా ముదిరిపోయింది. చేతివేళ్ళన్నీ నశించిపోయాయి—పాదాలుకూడా పాడైపోయాయి-స్నానంకూడా ఒకరు చేయించవలసినదశలో ఉన్నాడు—రక్తంలో ఇంకా "నెగిటివ్" కనిపించలేదు. అయినా ప్రాణభీతితో గుండెలు పగిలేలా ఏడుస్తున్నాడు ఎందుకూ బ్రతికి ఏంసాధించాలని ? విచిత్రంగా చూసాడు యోగి-అన్నివిధాలా వ్యర్థుడైన ఆ నిర్భాగ్యుడి ఆక్రందనం యోగిలో మరొక క్రొత్త ఆలోచనమార్గాన్ని తెరిచింది.

"మూత్రపిండాన్ని నేను ఇస్తాను" అంటూ ముందుకు వచ్చాడు.

అందరూ ఆశ్చర్యపోయారు – "నరసయ్యకోసం మీరు మూత్రపిండాన్ని ఇస్తారా?" ఆశ్చర్యం అణచుకోలేక అనేసింది సుభద్ర.

"'నరసయ్యకోసం' అయితే ఇంత ఆశ్చర్యం దేనికి? బ్రతకాలని ఆ జీవి ఎందుకంతగా ఆరాటపడుతోందో? బ్రతకటంవలన ఏ ప్రయోజనం సాధించబడుతుందో,- ఎవరుచెప్పగలరు?" నవ్వుతూనే అన్నాడు యోగి.

డాక్టర్ యోగిని పరీక్షించి "మీరూ బలహీనంగానే ఉన్నారు. మీరు ఇటీవల కొన్నాళ్ళు సరిగ్గా ఆహారం తీసుకున్నట్లుగా లేదు-" అన్నాడు-దిగ్గున తలెత్తి చూసింది సుభద్ర- యోగి చిరునవ్వు నవ్వి ఊరుకున్నాడు. సమాధానం చెప్పలేదు.

"మీ మూత్రపిండం తీసుకోవటానికి నాకు సాహసం చాలటంలేదు. మీరే ప్రమాదంలోపడితే..."

"మరేం ఫరవాలేదు. నా ఆయుర్దాయం ఇంకా చాలా ఉంది-ఆపరేషన్‌కి నేను రెడీ!"

సుభద్ర పెదవులు వణికాయి. ఏమీ మాట్లాడలేకపోయింది— తన మనసులో యోగిని ఎంతో మెచ్చుకున్నాడు మూర్తి.

## 9

మైకాన్ని వదిలించుకుంటూ కళ్ళు తెరిచాడు యోగి. చిమ్మచీకటి ! దూరంగా ఒక కొవ్వొత్తి వెలుగుతోంది. "దాహం !" అన్నాడు. ఎవరో మంచినీళ్లు అందిం

చారు. అవి త్రాగి కొంత తేరుకుని చుట్టూ చూశాడు. తనపక్కకు కొద్దిపాటి దూరంలో ఒక కొయ్యకుర్చీలో కూర్చుని వుంది సుభద్ర.

సుభద్రను ఆశ్చర్యంగా చూస్తూ "టైమెంత అయింది?" అని అడిగాడు యోగి. సుభద్ర తన వాచీ చూసుకొని" పదకొండు దాటింది" అంది.

"మీరింకా ఇక్కడే వున్నారా?"

"నేను నైట్ డ్యూటీలో వున్నాను."

"ఎవరి డ్యూటీ వాళ్ళు సక్రమంగా చెయ్యడాన్ని మించిన ఆదర్శమూ, అంతకుమించిన ఉత్తమ సిద్ధాంతమూ లేదంటారు, మూర్తిగారు!"

"అవును నాకు తెలుసు! ఆయన అడుగుజాడలలో నడవాలనే నా ప్రయత్నంకూడా!"

"మరి, నా దగ్గరే కూచోవటం దేనికి?"

నిర్లిప్తంగా, నిర్లక్ష్యంగా నవ్వింది సుభద్ర.

"నా డ్యూటీ నేను చెయ్యటానికే ఇక్కడ కూచున్నాను.ఇప్పటి మీ పరిస్థితిని బట్టి మిమ్మల్ని మరొకరు కనిపెట్టి చూడాలి!"

"థాంక్స్! ఇప్పుడు నేను బాగానే వున్నాను. మీరింక వెళ్ళండి. మీతో కొన్ని వేలమంది రోగులకు అవసరం ఉంటుంది."

ఈ ధోరణికి కోపం తెచ్చుకుంది సుభద్ర.

"ఎవరిదగ్గర ఎప్పుడుండాలో,ఎవరిదగ్గరకు ఎప్పుడు వెళ్ళాలో నాకు తెలుసు! మీరు చెప్పక్కర్లేదు."

యోగి నవ్వాడు. ఆ నవ్వులో అహంకారంలేదు. అవహేళనలేదు. ఎంతో ఆర్ద్రంగావుంది.గుండె లోతులనుంచి అనురాగాన్ని తోడిఅందిస్తున్నట్లుగా ఉంది.

"మీరు ఇక్కడ వుంటే, మిగిలిన రోగులెవరూ ఎంత ఆపదలో ఉన్నా మిమ్మల్ని అందుకోలేరు. నా సంగతి అలాకాదు. మీరు ఎక్కడున్నా, ఏ పరిస్థితిలో వున్నా నేను అవసరమనుకున్నప్పుడు నా పిలుపు మీకు వినిపిస్తుంది."

ఆ మాటలు వింటూంటే కోపం నిలుపుకోవటం అసాధ్యమయిపోతోంది సుభద్రకు–కనుబొమలు ముడిచేవుంచినా చెమ్మగిల్లకుండా కనుపాపలను అడ్డుకోలేక పోతోంది.

"సరే! నేను వెళుతున్నాను. మీ పక్కదగ్గర ద్రాక్షపళ్ళు పెట్టాను. దాహం వేసినప్పుడు తినండి"అని ద్రాక్షపళ్ళు పెట్టిన చిన్న తట్ట యోగికి చూపించింది.

"మీ హోమ్‌లో రోగులకు ద్రాక్షపళ్ళుకూడా ఇస్తారన్నమాట!"




"హోమ్‌లో ఇవ్వరు, నేను తెచ్చి ఇస్తున్నాను."

"ఛ, మీరుకూడా రూల్స్‌కు వ్యతిరేకంగా ప్రవర్తిస్తున్నారా?"

కోపంగా చూసింది సుభద్ర.

"రూల్స్‌కు వ్యతిరేకంగా నేను ప్రవర్తించటంలేదు అయినవాళ్ళు ఆత్మీయులూ, రోగులకు ఏదైనా తెచ్చిపెట్టుకోవచ్చు. అందుకు మూర్తిగారు అనుమతి ఇచ్చారు."

"అయినవాళ్ళు......ఆత్మీయులూ......మీకు నే నెవరిని ?"

సుభద్ర మాట్లాడలేదు.

"సుభద్రా !"

సుభద్ర దిగ్గున తలెత్తి చూసింది.

"ఇలా పిలిచినందుకు కోపం వచ్చిందా ?"

సుభద్ర మాట్లాడలేదు.

"మీరు నాకు పళ్ళుతీసుకొచ్చి ఆదరం ప్రకటించారు. అది ఆసరాగా మీతో ఒకమాట మాట్లాడాలనుకొంటున్నాను."

అప్పటికీ సుభద్ర సమాధానం చెప్పలేదు.

"మీ మనసును ద్వేషంతో నింపుకోకండి !"

ఆ మాటలు వినగానే సుభద్ర కళ్ళలోంచి నిప్పులు కురిసాయి.

"ఛీ !" అని ఒక ఛీత్కారం చేసింది.

యోగి ప్రశాంతంగా నవ్వుతూ "మీ మనసు నేను అర్థంచేసుకోగలను. మనను అవమానించినవాళ్ళనూ, హింసించినవాళ్ళనూ, మన నాశనానికి కారకు లయినవాళ్ళనూ ద్వేషించకుండా వుండటం మన తరంకాదు. కానీ ఈ ద్వేషం వల్ల మనం సాధించే దేమిటి ? మీరే ఆత్మపరిశీలన చేసుకోండి! మీ ద్వేషాన్ని దహిస్తున్నది దేనిని? మీ మనసునే! ఒక్క క్షణం మీకు శాంతిలేకుండా కుత కుత వుడికిస్తోంది మీ మనసును ! అందుకే , మీ మంచికోసమే చెప్తున్నాను. ద్వేషాన్ని దగ్గరకు రానీయవద్దని ! తరతమ విచక్షణ లేకుండా నిండుమనసుతో, రోగు లందరికీ ఆదరంగా సేవలు చేస్తున్నారు. ఆ మమతానురాగాలతోనే మీ బ్రతు కంతా నింపుకోండి ఇంతకుమించిన తరుణోపాయమేదీలేదు" అన్నాడు.

సుభద్ర సమాధానం చెప్పకుండానే వెళ్ళిపోయింది.

విశ్వమానవ కల్యాణసంఘం సెక్రటరీ శ్రీధర్,మూర్తిని చూడటానికి వచ్చాడు. సాధారణంగా శ్రీధర్ ఎప్పుడూ రాడు. జగన్నాథం, శంకరయ్య మొదలయిన వాళ్ళే వస్తూవుంటారు. శ్రీధర్‌ని చూశాక విశ్వమానవ కల్యాణసంఘం అంత పాప్యులర్ అకటంతో రహస్యం అర్థమయింది మూర్తికి.శ్రీధర్ చూపులు చురుగ్గా తీక్షణంగా వుంటాయి. ఆవులిస్తే పేగులు లెక్కపెట్టగల మనిషిలా కని పిస్తాడు. హుందాగా, ఆకర్షణీయంగా ఉండేఆకృతి,గడుసుగా వుండే చిరునవ్వు, చక్కగా తూచితూచి జాగ్రత్తగా మాట్లాడతాడు.

"కంగ్రాచ్యులేషన్స్ మూర్తిగారూ!కొద్దికాలంలోనే ఈ పునరావాస కేంద్రాన్ని బాగా అభివృద్ధిలోకి తీసుకొచ్చారు" అన్నాడు శ్రీధర్.

"చేసినది ఏముందండీ ! చెయ్యవలసిందే చాలా వుంది. రోజూ ఎంతోమంది ఈ పునరావాస కేంద్రంలో చేరడానికి వస్తున్నారు.ఫండ్స్ లేక అందరినీ చేర్చుకో లేకపోతున్నాను" శ్రీధర్‌లాంటి వ్యక్తులతో ఫండ్స్ విషయం చెప్పటం ఎందు కయినా మంచిదని గడుసుగా అన్నాడు మూర్తి.

"అలాగా ! నిజంగా విచారించవలసిన విషయమే ! ఇటీవల ఎవర్నయినా కొత్తవాళ్ళను చేర్చుకున్నారా ?"

"ఇంచుమించు రోజూ చేరుతూనే ఉంటారు. అందులో విశేషమేముంది ?"

"ప్రత్యేకించి చెప్పుకోవలసిన వారెవరూ లేరన్నమాట !"

"అలాంటివాళ్ళు ఇక్కడికెందుకు వస్తారు ? ఈ మధ్య ఒక యోగి చేరాడు !"

"యోగి చేరాడా ? యోగులలో మీకు నమ్మకం ఉందా ?"

"ప్రార్థనల్లోనూ, పూజలలోనూ నమ్మకంలేదు. కానీ ఈ యోగి తాను బల హీనమైన దశలో ఉండికూడా తన మూత్రపిండాన్ని మరొక రోగికి దానం చేశాడు. అందుకే ఈ యోగిని యోగిగా నమ్ముతున్నాను !''

"గమ్మత్తుగా వుందే ? ఆ యోగిని చూపిస్తారా ?"

"దానిదేముందీ? చూద్దాం రండి! ప్రస్తుతం అనారోగ్యంగా వుండి లేచి తిరగ లేకపోతున్నాడు. అతని కాటేజికి వెళ్ళి చూద్దాం !"

శ్రీధర్‌తో కలిసి మూర్తి వచ్చేసరికి యోగి కళ్ళుమూసుకుని పడుకుని ఉన్నాడు.

"మిస్టర్ యోగీ !" అని మూర్తి పిలిచేసరికి కళ్ళుతెరిచి శ్రీధర్‌ని, మూర్తినీ చూశాడు. అతని ముఖం రక్తం పూర్తిగా నశించినట్లు పాలిపోయింది. లేవబోయి వెనక్కి తూలాడు.

"అరెరె ! లేవకండి ! చూసారా? పాపం చాలా నీరసంగా ఉన్నారు."

యోగిని సరిగ్గా పడుకోబెట్టాడు మూర్తి.

"మనం అతణ్ని డిస్టర్బ్‌చెయ్యటం దేనికి ? వెళ్దాం రండి !" అన్నాడు శ్రీధర్.

ఆ తరువాత శ్రీధర్‌కి మూర్తి తమ పునరావాస కేంద్రంలో విభాగాలన్నీ చూపించాడు. చేతులకు స్పర్శాజ్ఞానం నశించినవాళ్ళు వంట చేసుకోవటానికి తయారుచేసిన ప్రత్యేకమైన పాత్రలూ అవకరం పొందిన అవయవాలు తిరిగి సక్రమంగా కావటానికి తయారుచేసిన ప్లాస్టిక్ తొడుగులు. నశించిపోయిన అవయవాలకు మారుగా ఉపయోగించుకోవటానికి వీలయిన కృత్రిమపు అవయ వాలు, మొదలైనవన్నీ చూపించాడు.

శ్రీధర్ అన్నీ చూసి, రోగులు తయారుచేసిన పేపర్ ప్లేట్లూ, కొవ్వొత్తులు మొదలైనవి కొని వీలుచూసుకొని కొంత మొత్తాన్ని పునరావాస కేంద్రానికి విరాళంగా ఇస్తానని వాగ్దానంచేసి వెళ్ళిపోయాడు.

ఆ మరునాడే యోగి పునరావాస కేంద్రంలోంచి మాయమయిపోయాడు. చౌకీదారుగా ఉన్న నాగులు తెలివితప్పి పడివున్నాడు. మూర్తి డాక్టర్‌ని పిలి పించి నాగులుకి తెలివి తెప్పించాడు.

"అయ్యగారూ ! యోగి ఎంతో మంచోడనుకున్నాం ! వాడు మోసగాడు. రమణయ్యగాడు యోగిని భుజంమీద వేసుకుని యెత్తుకుపోతావుంటే, నేను

కళ్ళారా చూశాను. నాకు మత్తుమందు వాసనచూపించి తీసుకువెళ్ళిపోయాడు. రమణయ్యగాడు నన్ను మించిపోయిన ంగూడా! ఈ యోగికి గూండాలతో లావాదేవీలున్నాయి" అని చెప్పాడు నాగులు.

"యోగికి గూండాలతో లావాదేవీలున్నాయి.ఒక గూండా సహాయంతో పునరావాస కేంద్రంలోంచి తప్పించుకు పోయాడు" ఈ వార్త పునరావాస కేంద్రంలో అందరినీ దిగ్భ్రాంతిలో ముంచింది.

మూర్తి ఆశ్చర్యానికి అంతులేదు. కానీ పోలీస్ ఆఫీసరుగా అతని అనుభవాలు ఈ సంఘటనతో అనేక సందేహాలను కలిగించాయి.

యోగి తప్పించుకుని పారిపోవాలంటే ఆరోగ్యంగా ఉన్నప్పుడు పోక మంచం మీదనుండి లేవలేని స్థితిలో ఎందుకు పోవాలి ? పారిపోవాలనే ఉద్దేశంలో ఉన్న వ్యక్తి తన ఆరోగ్యాన్నికూడా లక్ష్యపెట్టకుండా తన మూత్రపిండాన్ని మరొకరికి దానంగా ఇస్తాడా ? రమణయ్యకు, యోగికీ లావాదేవీలున్నది నిజమో అబద్ధమో, కానీ యోగి శారీరక పరిస్థితి ఇలా ఉన్నట్లు రమణయ్యకెలా తెలుసు. రమణయ్య యోగిని భుజంమీద మోసుకుపోయాడు అంటున్నాడు నాగులు. ఆరోగ్యం సరిగా లేని స్థితిలో యోగిని భుజంమీద మోసుకుపోవలసిన అవసరం రమణయ్యకేం వచ్చింది ? గూండాలు డబ్బులేకుండా ఏ పనీ చెయ్యరు ? యోగి దగ్గర ఏమీ డబ్బు లేదని మూర్తికి బాగా తెలుసు ! మరి, ఏ ప్రయోజనాన్ని ఆశించి రమణయ్య యోగిని మోసుకుపోయినట్లు ?

పునరావాస కేంద్రంనుంచి పారిపోయిన వ్యక్తులు తిరిగి తిరిగి, చచ్చినట్లు పునరావాస కేంద్రానికి చేరుకోవటం రివాజు. అలాగే యోగికూడా మళ్ళీ వచ్చినప్పుడు ఈ విషయాలన్నీ తెలుసుకోవచ్చుననుకుని తన నిత్య కార్యక్రమంలో పడిపోయాడు మూర్తి.

ఎదురుగా సంకోచంగా మూర్తి ముందుకు వచ్చి నిలబడింది సుభద్ర.

"ఏం కావాలమ్మా !" ఆదరంగా అడిగాడు మూర్తి.

"యోగి ఆచూకీ ఏమైనా తెలిసిందా సార్ ?"

"లేదమ్మా ! ఎక్కడికి పోతారు వీళ్ళు ? ఇక్కడ ఉండలేక బయటకు పారిపోతారు. బయట ఎవ్వరూ నిలవనియ్యకపోతే మళ్ళీ ఇక్కడికే వస్తారు. మనకి శాస్త్ర న్యూసెన్స్ ! అంతే !"

"యోగిని తీసుకుపోయి అప్పుడే ఏడురోజులయింది కదండీ !"

"నువ్వు రోజులు లెక్కపెడుతున్నావన్నమాట ! తమాషాగా ఉందే !"

"సార్ ! యోగి ఏమైపోయాడో! మీరు విచారించి తెలుసుకోవాలండీ !"

"ఏమయిపోతాడు ? వచ్చాక తెలుస్తుందిగా !"

"కాదు, అసలు రాకపోవచ్చు.ఏదో జరిగి ఉంటుందని అనుమానంగా ఉంది."

"ఎందుకొచ్చింది నీ కా అనుమానం ?"

"ఆయన మన పునరావాసకేంద్రం వదిలి వెళ్ళే ఉద్దేశంలో లేరు ఎవరో బలవంతాన ఎత్తుకుపోయి ఉండాలి !"

"అంత ఖచ్చితంగా ఎలా చెప్పగలవు ? అదీగాక యోగి విషయంలో నీ కెందుకింత ఆరాటం ?"

సుభద్ర తల వంచుకుని సమాధానం చెప్పింది.

"ఆయన నా భర్త !"

మతిపోయినట్లయింది మూర్తికి.

"వాట్ ?"

"అవునుసార్ ! మీరు నన్ను క్షమించాలి. ఇక్కడ నర్సులుగా పనిచెయ్యటానికి పెళ్ళికాని స్త్రీలే కావాలని మీరు ప్రకటించారు. జీతంకోసం ఆశపడి పెళ్ళి కాలేదని నేనూ అప్లయిచేశాను. అదీగాక పెళ్ళిఅయినా పెళ్ళికాని స్త్రీలాగే జీవిస్తున్నాను నేను..."

"నీ సంగతి చాలా తమాషాగావుందే ? అతనికి రోగం రాగానే వదిలేసి వచ్చేశావా ?'' నిరసనగా అడిగాడు మూర్తి. దీనంగా దెబ్బతిన్నట్లు చూసింది సుభద్ర.

"సార్ ! నేను అలాంటి మనిషిలా కనిపిస్తున్నానా ? ఆయనకు శారీరకంగా ఎన్నిరోగాలువచ్చినా, సంతోషంగా సేవలుచేసి ఆయనను వదలకుండా ఉండే దాన్ని-కానీ, ఈ శారీరక రోగాలనన్నింటినీ మించిన భయంకరమైన మానసిక రోగం పట్టుకుంది ఆయనకు ! ఆ మానసిక రోగంతో ఆయనే నన్ను దూరం చేసుకున్నారు. క్షోభించి క్షోభించి బండబారిపోయాను. ఇదివరలో అయితే ఆయన ఏమయిపోయినా నేను పట్టించుకునేదానినికాదు. కానీ ఇటీవల ఆయనతో పతివ్రతన కళ్ళారా చూశాను. మా స్త్రీ జాతి దౌర్భాగ్యం సార్, ఇది ! ఎన్నెన్ని అవస్థలు అనుభవించినా సర్వసాధారణంగా తన భర్తను వదులుకోలేదు స్త్రీ. అందుకే చేతులు జోడించి ఆయన ఏమైపోయారో తెలుసు కోమని మిమ్మల్ని ప్రార్థిస్తున్నాను..."

"యోగి ఆపదలో చిక్కుకున్నాడేమోనని ఎందుకు భయపడుతున్నావమ్మా! నాకు వివరంగా చెప్పు."

మూర్తికి తన విషయాలన్నీ వివరంగా చెప్పటానికే పూనుకొంది సుభద్ర.

## 11

"పెళ్ళికొడుక్కి జోస్యం వచ్చుట ! పెళ్ళికూతురు చెయ్యి చూసి కాని ఇష్టమో, కాదో చెప్పడట !"

సుభద్ర పెళ్ళిచూపులకు అలంకరిస్తూ ఇంట్లో అంతా విడ్డూరంగా చెప్పుకున్నారు. సుభద్ర లోలోపల చాలా చికాకుపడింది. సుభద్ర మెట్రిక్ వరకూ మాత్రమే చదువుకొంది. అయినా జ్యోతిష్యాలూ, దెయ్యాలూ, దేవతలూ ఇలాటి వాటిల్లో నమ్మకంలేదు.

"అదేమిటమ్మా, నా చెయ్యి చూసి నా బ్రతుకంతా ఎలా ఉంటుందో నిర్ణయిస్తాడా ఈయన ? నా చెయ్యి చూడటానికి వీల్లేదు" అని దెబ్బలాడింది తల్లితో.

అన్నివిధాలా అనుకూలమయిన సంబంధాన్ని ఇంత చిన్న కారణానికి వదులుకోవటం సుభద్ర తల్లికి అంత నచ్చలేదు. ఆవిడా లోకంలో అందరి లాంటిదే ! జ్యోతిష్యం అంటే నమ్మకమూ లేదు, అపనమ్మకమూ లేదు. ఎవరైనా జ్యోతిష్యం చెపుతానంటే సరదాగా చెప్పించుకుంటుంది. బాగుంటే, జ్యోతిష్యాన్ని మెచ్చుకుంటుంది. ఆ జ్యోతిష్యంలో తనకు నచ్చనివి ఏవైనా ఉంటే, 'వెధవ జ్యోతిష్యం' అని ఈసడించి పారేస్తుంది.

"పోనీలే చూడనియ్యి — ఏంపోయిందీ ? చెయ్యి చూసి బాగుంటే బంగారంలాంటి సంబంధం కుదురుతుంది. ఒకవేళ అతడు చెయ్యి చూసి నచ్చలేదంటే, మనమూ జాతకాలు కలవలేదందాం ?" అని కూతురికి హితబోధ చేసింది తల్లి. సుభద్ర ఆ సమాధానానికి నవ్వుకుంది. తన తలిదండ్రులు తనకు పెళ్ళి కుదర్చటానికి పడుతున్న పాట్లు తెలుసుకుని మనసు సమాధాన పరచుకుని, పెళ్ళిచూపులకు వచ్చిన శ్రీహరి ముందు కూచుని తన చెయ్యి జాపింది. ఆ చేతిని తన చేతిలోకి తీసుకున్నాడు శ్రీహరి. గతుక్కుమంది సుభద్ర. ఇంకా ఏదీ నిశ్చయం కాలేదు. పెళ్ళి కుదురుతుందో, లేదో తెలియదు. అప్పుడే తన చెయ్యి చేతిలోకి తీసుకోవటమా ? కంగారుగా చెయ్యి వెనక్కు లాక్కోబోయింది. అతడి చేతిలో వణికిపోయింది సుభద్ర చెయ్యి. వణుకుతోన్న ఆ చెయ్యిని సుతారంగా, దృఢంగా పట్టుకున్నాడు శ్రీహరి.




"వ్యక్తిత్వం ఉన్న మనిషే కాని, నిదానస్థురాలు. దేనైనా ఎదుర్కొ-గలదు, కానీ, సహనశీలి - ప్రేమించిన వ్యక్తిని ఏ పరిస్థితుల్లోనూ వదలని బంగారు చెయ్యి ఇది. మీ అమ్మాయికి అభ్యంతరం లేకపోతే, ఈవిడను పెళ్ళి చేసుకుంటాను."

అక్కడే, అంతమందిలోనూ తన అభిప్రాయాన్ని నిస్సంకోచంగా ప్రకటించాడు శ్రీహరి. సుభద్ర ఇంట్లో అందరూ చాలా ఆనందించారు. సుభద్ర మనసు కూడా శ్రీహరి మాటలతో, శ్రీహరి చిరునవ్వులతో-శ్రీహరి మూర్తితో నిండిపోయింది.

"ప్రేమించిన వ్యక్తిని ఏ పరిస్థితుల్లోనూ వదలలేని చెయ్యి అట ! అప్పుడే తనను నేను ప్రేమించేసినట్లే మాట్లాడుతున్నాడు, ఏం అహంకారం !" అనుకుంది మురిపెంగా.

సుభద్ర తండ్రి మరీ సంపన్నుడు కాకపోయినా, లేనివాడు కాడు. శక్తి ఉన్నంతలో కట్నకానుకలకు లోపం చెయ్యకుండా చాలా ఘనంగా జరిపించాడు సుభద్ర పెళ్ళి. పెళ్ళి కాగానే సుభద్రను కాపురానికి తీసుకుపోయాడు శ్రీహరి. గవర్నమెంట్ ఆఫీసులో అకౌంటెంట్‌గా ఉద్యోగం చేస్తున్నాడు శ్రీహరి. దేనికీ లోటులేకుండా హాయిగానే గడిచిపోతోంది సంసారం. శ్రీహరి రోజూ తెల్లవారుజామునే లేచి స్నానంచేసి పూజలో కూచునేవాడు. దగ్గర దగ్గర రెండుగంటలు ఏకాగ్ర ధ్యానంగా జపం చేసుకునేవాడు. పూజనుండి లేచిన

తర్వాత శ్రీహరి ముఖంలో కనిపించే ప్రశాంతత స్పష్టంగా చూసి పూజను నిరసిస్తూ మాట్లాడలేకపోయేది సుభద్ర. అయినా ఈ తతంగాలన్నీ అంగీకరించ లేకపోయేది. "మీకు దేవుడంటే అంత నమ్మకం ఉందా ?" అని నవ్వుతూ అడిగేది శ్రీహరిని.

శ్రీహరి నవ్వుతూ "నీలాటి 'గృహలక్ష్మి'ని నాకు ప్రసాదించాక్కూడా దేవుణ్ణి నమ్మవద్దంటావా ?" అనేవాడు.

ఈ సమాధానానికి పులకించిపోయేది సుభద్ర. ఆ తరువాత అతడి పూజలను, జపాలనూ, హేళన చెయ్యటానికి నోరు వచ్చేదికాదు. సుభద్రను కూడా జపం చెయ్యమనేవాడు శ్రీహరి. తనకు నమ్మకం లేకపోయినా శ్రీహరి మాట కాదనలేక జపంలో కూచునేది సుభద్ర. కానీ, జపంలో కూచున్న మరుక్షణం నుంచీ, ఫక్కింటి పిన్నిగారి ఎత్తిపొడుపు మాటలూ, అదేదో సినిమాలో హీరోయిన్ నటనా, నీళ్ళపాలు పోస్తున్నందుకు పాలవాడితో దెబ్బలాడాలని అనుకోవటం, పనిమనిషితో బాత్‌రూమ్ కడిగించటం మరిచిపోకూడదనుకోవటం, పోయిన నెల కొనుక్కోవాలనుకుని మానేసిన సిల్కుచీర ఎప్పుడు కొనుక్కుంటే బాగుంటుందోననే ఆలోచన... ఇవన్నీ మనసులో సుడిగుండాలు తిరుగుతూ జపంచేస్తున్న మంత్రాధిదేవత ఏ మరుగునో పడిపోయేది. ఒకగంట సేపు అలా కూచుని విసుగ్గా లేచిపోయి "ఇవాళ కుదరలేదు. రేపటినుంచి నిష్టగా జపం చేసుకోవాలి !" అనుకొనేది ప్రతిరోజూ.

ఒకరోజు శ్రీహరి జపంచేసుకుంటూ ఉండగా సుభద్ర చేతిలోంచి గిన్నె జారి క్రిందపడి పెద్ద చప్పుడయింది. తన పూజ పాడుచేసినందుకు శ్రీహరి విసుక్కుంటాడేమోనని చాలా భయపడింది సుభద్ర. కానీ శ్రీహరి కళ్ళు తెరవనే లేదు. అతని నిష్టను మనసులో మెచ్చుకుంది సుభద్ర.

చేతులు చూసి జ్యోతిష్యాలు చెప్పటంలో శ్రీహరి ఉత్సాహం ఇంతా అంతా కాదు. ఇంచుమించు ప్రతిరోజూ బంధువులు, మిత్రులు, ఎవరెవరో అతని దగ్గరకి చేతులు చూపించుకోవటానికి ప్రశ్న లడగటానికీ వచ్చేవారు. వాళ్ళతో కూచుంటే, శ్రీహరికి బాహ్యప్రపంచం తెలిసేదికాదు. సాయంత్రంవేళ సరదాగా ఏ సినిమాకో, షికారుకో వెళ్ళకుండా ఈ గోలంతా ఏమిటని సుభద్రకు చాలా చికాగ్గా ఉండేది. వచ్చినవాళ్ళంతా శ్రీహరి జ్యోతిష్యాన్ని పొగుడుతూంటే, ఏమీ అనలేక ఊరుకునేది. అప్పుడప్పుడు ఆడవాళ్ళు కూడా వచ్చేవారు. వాళ్ళచేతులు పట్టుకుని శ్రీహరి జ్యోతిష్యం చెపుతూంటే సుభద్ర మండిపోయేది.

"అలా చెయ్యిపట్టుకుంటే కాని, జ్యోతిష్యం స్ఫురించదా ?" అనేది వెటకారంగా.

శ్రీహరి సుభద్ర బుగ్గమీద చిటికవేసి "ఎందుకోయ్, అంత జెలసీ ! నీ చెయ్యి పట్టుకున్నట్లుగా ఎవరి చెయ్యీ పట్టుకోనులే !" అని నవ్వేవాడు.

సుభద్రా, శ్రీహరుల సంసారంలోకి చిట్టి జ్యోతి రాకతో సుభద్ర జీవితం మరింత మధురమయింది. జ్యోతి ఇంకా పురుటి గుడ్డుగా ఉండగానే "చూడు ! దీనిది చాలా గొప్ప జాతకం. అందుకే 'జ్యోతి' అని పేరు పెడుతున్నాను," అన్నాడు శ్రీహరి ఆ పసికందు చేతిని శ్రద్ధగా పరిశీలిస్తూ – సుభద్ర పొంగి పోయింది. రాను రాను తనకు తెలియకుండానే తను కూడా శ్రీహరి జ్యోతిష్యంలో నమ్మకం పెంచుకుంటున్నానన్న విషయాన్ని గుర్తించి నవ్వు కుంది సుభద్ర. జ్యోతిష్యాలూ, జాతకాలూ, మహత్తులూ వీటిలో ఉన్న గమ్మత్తేమిటో, వద్దు, వద్దనుకొంటూనే వెంటపడతారు జనం.

జ్యోతి అంటే శ్రీహరికి పంచప్రాణాలూ ... జ్యోతి ఏడుపు వినిపిస్తే చేస్తున్న పని వదిలి వచ్చేసేవాడు. అలా ఏడిపిస్తున్నందుకు సుభద్రను చీవాట్లు పెట్టేవాడు.

"పసిపిల్లలు ఏడవరేమిటండీ ! మీ కూతురు కనుక ఏడవకూడదని శాసిస్తారేమిటి ?" అని కృత్రిమంగా విసుక్కుని హాయిగా నవ్వేది సుభద్ర.

జ్యోతి తొక్కు పలుకులు ముద్దుగా పలుకుతూ ఉండగానే శ్రీహరి జ్యోతికి ప్రార్థనా శ్లోకాలు నేర్పించటం ప్రారంభించాడు.

"అబ్బా ! ఇప్పటినుంచీ ఏమిటిది ?" అని మొదట విసుక్కున్నా జ్యోతి ముద్దు ముద్దుగా, స్పష్టంగా ప్రార్థనా శ్లోకాలు చదువుతోంటే సుభద్రకు కూడా ఎంతో ముచ్చటగా ఉండేది. జ్యోతి సూక్ష్మగ్రాహి. ఇలా చేస్తే అలా పట్టు కునేది. జ్యోతి కింకా అయిదోయేడు రాకుండానే పొద్దున్నే లేచి స్నానంచేసి పూజలో కూచోవటం అలవాటు చేసాడు శ్రీహరి.

"పసిపిల్ల – ఇంత శ్రమ ఎలా పడగలదండీ ?" అని సుభద్ర మొత్తుకునేది.

"పిచ్చి సుభద్రా ! ఇది శ్రమ అనుకుంటున్నావా ? లోకంలో టానిక్ లన్నింటినీ మించిపోయిన టానిక్ ! నిజానికి పసితనంలో మనసు నిలిచినంత ఏకాగ్రంగా పెద్దయ్యాక నిలవనే నిలవదు. లోకంలో వృద్ధాప్యం వచ్చాక "కృష్ణా ! రామా ! అనుకోవాలి " అంటారు. కాని మొదటినుంచీ మనసుకి

అలాంటి సంస్కారంలేకుండా వయసు మీరినంతమాత్రాన వైరాగ్యం రమ్మన్నా రాదు" అనేవాడు శ్రీహరి.

"కొంపదీసి దీనిని యోగినిని చేస్తానంటా రేమిటి ?"

"యోగం అంటే ఆదర్శాలకు పోయి ముక్కు మూసుకోవటం అనుకుంటున్నావా ? నలుగురి మధ్యా ఉంటూ నిర్మలంగా ఉండగలిగితే అంతకు మించిన యోగమేముందీ ? ఈ యోగాలన్నీ ఆ యోగానికి మార్గం చూపించటానికే !"

శ్రీహరి ఇలా మాట్లాడుతున్నప్పుడు అతని వాదన ఖండించటానికి మాటలు దొరకవు సుభద్రకి.

చిట్టి చేతులు జోడించి, కలువలలాంటి కళ్ళు మూసుకుని పసిముఖంలో అమాయకపు అందాలు చిందులు వేస్తుండగా, పూజలో కూచున్న జ్యోతిని లేవగొట్టాలంటే ఎందుకో భయంవేసేది.

శ్రీహరి జ్యోతిష్యం బాగా చెప్పుతాడనే పేరు చుట్టుపక్కల వ్యాపించింది. రోజూ అతనిచేత జ్యోతిష్యం చెప్పించుకోవటానికి వచ్చే జనం సంఖ్య రోజు రోజుకీ ఎక్కువకాసాగింది.

ఒకరోజు ఎవరో కారులో వచ్చి శ్రీహరిని తమతో రమ్మని కోరారు. శ్రీహరి సాధారణంగా ఎవరిళ్ళకూ వెళ్ళడు. అంచేత మొదట రాననే చెప్పాడు. ఆ వచ్చినవాళ్లు ప్రాధేయపడుతున్నట్లు "మేం ఎవరిదగ్గరకు రమ్మంటున్నామో, వాళ్ళు సామాన్యులు కారు. అటు రాజకీయ రంగంలోనూ, ఇటు సమాజంలోనూ ఎంతో పలుకుబడి ఉన్నవారు — మీకు అన్నివిధాలా మంచిది. మీ కీర్తి ప్రతిష్ఠలు మరింత పెరుగుతాయి" అన్నారు.

ప్రలోభాన్ని జయించలేకపోయాడు శ్రీహరి. కుతూహలంతో వాళ్ళ వెంట వెళ్ళాడు. ఆనాటినుండి కారులో రోజూ ఎక్కడికో ఒకచోటికి వెళ్ళటం పరిపాటి అయిపోయింది శ్రీహరికి సుభద్రకు ఇది ఏమాత్రం నచ్చలేదు. కానీ, ఏం చెయ్యగలదు ? సుభద్ర మాటలు ఏనాడూ లక్ష్యపెట్టలేదు శ్రీహరి. ఈనాడు అసలు లెక్కచెయ్యలేదు తండ్రితో కలిసి అన్నం తినటం అలవాటు చేసుకున్న జ్యోతి ఒకొక్కరోజు తండ్రికోసం ఎదురుచూసి చూసి అన్నం తినకుండానే నిద్రపోయేది. అప్పుడుమాత్రం శ్రీహరి చాలా బాధపడేవాడు నిద్రపోతున్న జ్యోతిని నుదుటిమీద ముద్దుపెట్టుకుని "ఎలాగో బుజ్జగించి అన్నం తినిపించక పోయావా ? ఛా ! పిల్లల్ని పెంచటం కూడా చేతకాదు" అని విసుక్కునే

వాడు. చీటికీ మాటికీ సుభద్రమీద విసుక్కోటం, సుభద్ర ప్రతి పనిలోనూ తప్పు లెంచటం ఎక్కువయిపోయింది, శ్రీహరిలో.

ఒకరోజు పెద్ద గుంపుతో కలిసి వచ్చాడు శ్రీహరి. మధ్యాహ్నంవేళ శ్రీహరి వచ్చినందుకు ఆశ్చర్యపోతూ, "మీకు ఇవాళ ఆఫీస్ లేదూ ?" అని అడిగింది సుభద్ర.

శ్రీహరి గట్టిగా నవ్వి "నాకు ఆఫీస్ ఏమిటీ ? ఎప్పుడో రిజైన్ చేసానుగా!" అన్నాడు.

నిర్ఘాంతపోయింది సుభద్ర. శ్రీహరి తన ఉద్యోగానికి రాజీనామా ఇచ్చాడా ? తనకు తెలియనే తెలియదు ! తలపని తలంపుగా ఏమిటీ అఘాతం తమ మధ్య ?

"అయ్యగారికి ఉద్యోగం ఎందుకమ్మా ! ఆయన సాక్షాద్భగవదవతారం !" అన్నాడు వచ్చినవాళ్ళలో ఒకడు గొప్పగా నవ్వుతూ.

తల తిరిగినట్లయింది సుభద్రకి. శ్రీహరితో మాట్లాడదామన్నా, అతనితో ఏకాంతం దొరకటంలేదు.

"స్వామీ ! ముహూర్తంవచ్చిందా ?" అని అడిగాడు ఒకడు వినయంగా.

శ్రీహరి గడియారం చూసుకొంటూ "ఇంకొక్క మూడు నిముషాలు !" అన్నాడు.

"ముహూర్తం దేనికి ?" అయోమయంగా అడిగింది సుభద్ర.

"స్వామివారి ఇష్టదైవాన్ని మందిరంలో ప్రతిష్ఠించటానికి !"

'ఏ మందిరం ? ఎవరు ప్రతిష్టిస్తున్నారు ? తన భర్త ఇష్టదైవాన్ని ఎక్కడో ప్రతిష్ఠించటమేమిటి ?' ఈ ప్రశ్నలన్నీ మనసులో మార్మోగుతున్నా గొంతెత్తి అడగలేకపోయింది సుభద్ర. ఆ అపరిచితుల మధ్య తనను తాను చులకన చేసుకోలేకపోయింది.

సుభద్ర చూస్తూ ఉండగా మేళతాళాలతో, మంత్రపఠనంతో పూజావిగ్రహాలను కారులో తరలించుకు వెళ్ళాడు శ్రీహరి.

మ్రాన్పడిపోయింది సుభద్ర.

"ఆయన సాక్షాద్భగవదవతారం !" అన్న మాటలు హృదయానికి సమ్మెట పోటుల్లా తగలగా కళ్ళముందు అంధకారం వ్యాపించింది సుభద్రకు.



"శ్రీహరిగారు సాక్షాత్తూ దేవుడు !"

ఏ నోట విన్నా ఈ మాటే ! కొన్ని కొన్ని వార్తలు ఇలాగే తమాషాగా కార్చిచ్చులాగా వ్యాపించిపోతాయి. బ్రహ్మాండమైన ప్రళయవృష్టితప్ప అలాంటి వాటిని అణగార్చలేదు.

"జరిగిందీ, జరగబోయేదీ, తు.చ. తప్పకుండా చెపుతారు !"

"ఆయన మంత్రించి వీభూతి ఇస్తే చాలు, ఏ రోగమైనా నయమయిపోతుంది."

"ఎప్పుడూ జపంచేసుకుంటూ ఉంటారు. ఆయన తపశ్శక్తితో మూడు లోకాలలో ఏ మూల ఏం జరుగుతుందో తెలుసుకోగలరు."

ఇలాంటి వార్తలు విని విని విసిగిపోతోంది సుభద్ర. శ్రీహరి, సుభద్ర కంటికే కనిపించడంలేదు. ఏ సంగతీ మనసు విప్పి మాట్లాడుకోవటానికయినా లేదు.

మొదట్లో ఎవరెవరో వచ్చి "అమ్మగారూ ! స్వామివారు ఇంట్లోకి ఏం కావాలో కనుక్కోమన్నారు ! చెప్పండి – తెచ్చిపెడతాము" అనేవారు.

ఇది సుభద్ర సహించలేకపోయింది శ్రీహరి కంటికయినా కనిపించకుండా ఎవరినో పంపించి బిచ్చంలా కావలసినది పడేస్తా నంటోంటే తీసుకోవటానికి అభిమానపడింది.

"నాకేం అక్కర్లేదు !" అని సమాధానంగా చెప్పింది బింకంగా. కొన్ని రోజులు వరసగా అడిగి అడిగి ఎప్పుడూ అలాంటి సమాధానమే వచ్చేసరికి ఆ 'భక్తులు' అడగటమూ మానేసారు, రావటమూ మానేసారు.

తనవంటిమీది వస్తువులు అమ్మి ఇల్లు గడపసాగింది సుభద్ర. ఈ చికాకులకు తోడు జ్యోతి ప్రతిరోజూ రాత్రి తండ్రితో కాని, అన్నం తిననని పేచీ పెట్టేది. జ్యోతిని బతిమాలి బతిమాలి అన్నం తినిపించేసరికి సుభద్రకి తల ప్రాణం తోక కొచ్చేది. సుభద్ర వంటిమీది నగలన్నీ హరించుకుపోయాయి. ముందు ఎలా గడుస్తుందో అర్థంకావటంలేదు. ఈ విషమపరిస్థితిని ఎలా ఎదుర్కోవాలో దిక్కుతోచటంలేదు. ఎప్పటిలాగే ఆ రోజు కూడా జ్యోతి "నాన్నతోనే అన్నం తింటానూ !" అని రాగం మొదలుపెట్టింది. ఈ పేచీలు భరించలేని సుభద్ర విసుగ్గా,

"మీ నాన్న రారు !" అనేసింది.

"ఎందుకు రారూ ?"




"మీ నాన్నకి మనం వద్దుట !" కోపంలో ఉన్న సుభద్ర వెనకా, ముందూ ఆలోచించకుండా మాట్లాడేస్తోంది.

జ్యోతి భయంగా చూసింది.

"ఒట్టిది ! నాన్న వస్తారు. నేను రమ్మంటే వస్తారు. నన్ను నాన్నదగ్గరకి తీసుకుపో !" అని ఏడుపు ప్రారంభించింది.

సుభద్ర ఎన్నివిధాలుగా సముదాయించినా ఊరుకోలేదు. తల్లి "మీ నాన్న రారు !" అనేసరికి భయంతో మరి కాస్త మొండిపట్టుపట్టింది. సుభద్ర భరించలేక జ్యోతిని వీపుమీద ఒక్కటి కొట్టింది. జ్యోతి అకస్మాత్తుగా ఏడుపు ఆపేసి తల్లిని తెల్లబోయి చూసింది. ఆ చూపులకు తల్లడిల్లిపోయింది సుభద్ర. జ్ఞానం వచ్చిన దగ్గరనుండీ తనూ, శ్రీహరీ ఇద్దరూ జ్యోతిని అల్లారు ముద్దుగా చూసారు.

దెబ్బలు కొట్టటం మాట అటుంచి ఏనాడూ విసుక్కోవటం కూడా జరిగేది కాదు.

రెండుచేతులూ జాపి జ్యోతిని గుండెల కదుముకుని క్షోభ భరించలేక ఏడ్చేసింది. జ్యోతి తల్లి కన్నీళ్ళు తుడిచి "ఏడవకమ్మా ! మనం నాన్న దగ్గరకు వెళ్దాం ! నాన్న నేను పిలుస్తే వస్తారు" అంది.

"సరే ! అలాగే పిలుద్దువు కాని, ముందు అన్నం తిను !" అంది సుభద్ర అప్పటికయినా ఎలాగయినా మరిపిద్దామని.

"నేను తినను. నాన్నని రమ్మంటాను నాన్న దగ్గరకి పోదాం ! నాన్న వచ్చాక ముగ్గురమూ తిందాం," అంది మొండిగా. జ్యోతి మంచి పిల్ల, సాత్వికురాలు. కానీ, ఏదైనా పట్టుబడితేమాత్రం వదలదు. చేసేదిలేక జ్యోతిని తీసుకుని అభిమానం చంపుకుని అందరి నోటా వినే ఆ మందిరానికి బయలు దేరింది. మందిరంలో కోలాహలంగా భజనలు సాగుతున్నాయి. ఒక మండపంలో ముఖమల్ దిళ్ళ మధ్య కూచుని ఏదో ప్రసంగం చేస్తున్నాడు శ్రీహరి. తండ్రిని చూడగానే 'నాన్నా' అంటూ ఒక్క పరుగున తండ్రిదగ్గరకి వెళ్ళి మెడ చుట్టూ చేతులువేసి ఒళ్లో కూచోబోయింది జ్యోతి. జ్యోతిని చూడగానే శ్రీహరి నోట్లో మాట ఆగిపోయింది. జ్యోతిని దగ్గరగా తియ్యలేక, దూరంగా పొమ్మన లేక జడప్రాయంగా ఉండిపోయాడు. శ్రీహరిదగ్గరగా కూచున్న ఒక యూరోపియన్ యువతి జ్యోతిని దూరంగా లాగుతూ—

''తప్పు ! ఆయనమీదకి వెళ్ళకూడదు. ఆయన దేవుడు !" అంది యూరోపియన్ ఏసతోకూడిన ఉచ్చారణతో.

కోపంగా "ఆయన మా నాన్న. మా నాన్న నాకు దేవుడు ! మీ నాన్న నీకు దేవుడు ! మా నాన్న నీకు దెవు డెలా అవుతాడు ?" అంది.

ఆ మాటలకు అక్కడున్న కొందరు నవ్వేసారు.

యూరోపియన్ యువతి రోషంగా "షటప్ !" అంటూ జ్యోతిని లెంపకాయ కొట్టింది. ''నాన్నా !'' అన్ని కెవ్వున కేకపెట్టింది. శ్రీహరి గభాలున ముందుకు వంగి అంతలోనే ఎవరో లాగినట్లు వెనక్కు తూలి శిలలా కూచున్నాడు. జ్యోతి తండ్రిని వింతగా, భయంగా చూసింది. అంతలోనే తండ్రిదగ్గరున్న చనువు కొద్దీ ధైర్యం తెచ్చుకుంది.

"నాన్నా ! దేవుడు మనం పిలిస్తే పలుకుతాడనీ, మనం కష్టంలో ఉంటే సాయంచేస్తాడనీ చెప్పారుగా ? ఇది నన్ను కొట్టింది. నేను కష్టాలలో ఉండి పిలిస్తే మీరు పలకటంలేదేం ? మీరు దేవుడు కాదు. నాన్న కూడా కారు !"

జ్యోతి మాటలు అక్కడున్న అందరూ ఆశ్చర్యంగా విన్నారు. కొందరు నవ్వారు. యూరోపియన్ యువతి భరించలేనట్లు నిలబడి "స్వామీ పూజకు వేళయింది" అంది. మరబొమ్మలా శ్రీహరి లేచి ఆ యువతి ననుసరించి లోపలి గదిలోకి వెళ్ళబోతుంటే సుభద్ర తనూ వెళ్ళబోయింది. ఆ యువతి సుభద్రను అటకాయించి "ఆగు ! నువ్వెక్కడికి ?" అంది.

సుభద్ర విస్తుపోయి చూస్తూ "నువ్వెవరు, నన్నిలా అడగటానికి ?". అని స్వతంత్రంగా లోపలకు ప్రవేశించబోయింది.

ఆ యువతి బలప్రయోగంతో సుభద్రను ఆపి "ఇది స్వామివారి పూజా సమయం ! నేను తప్ప మరెవరూ అక్కడుండటానికి వీలులేదు !" అంది.

సుభద్ర మండిపడుతూ "నేను కట్టుకున్న భార్యను. ఆయన పూజచేస్తోంటే నేను ఉండటానికి వీల్లేదా ? ఎక్కడినుండో వచ్చిన నీకు మాత్రమేనా ఆయన పక్కన ఉండే అర్హత ?" అని అరిచింది.

సుభద్ర "నేను భార్యను" అని చెప్పినా ఆ యువతి కొంచెం కూడా జంక లేదు.

"ఆయన స్వామి. భక్తిమాత్రమే ఆయనకు ప్రధానమైనది. నేను ఆయన ఆంతరంగిక భక్తురాలిని" అని సుభద్రను వెనక్కు తోసి శ్రీహరితో చరచర లోపలికి వెళ్ళిపోయింది. అందరిముందూ సుభద్ర ముఖంమీద తలుపులు దభాలున మూసుకున్నాయి.

సుభద్ర అణువణువూ రగిలిపోయింది. అక్కడ కూచుని తమాషాగా చోద్యం చూస్తున్న ఆ భక్తుల్ని చూస్తోంటే భరింపరాని అసహ్యం కలిగింది.

"ఛీ ! ఇంతమంది ఇక్కడచేరి మీలాంటి ఒక మనిషిని దేవుడని భజనలు చేస్తున్నారా ? సిగ్గులేదూ ? అసలు దేవుడంటే ఎవరు ? సినిమా సెట్టింగుల్లో లాగ పాలసముద్రంమీద పాముపైన పడుకుని లక్ష్మీదేవితో కాళ్ళు పట్టించు కుంటూ – మీరు కొట్టే కొబ్బరికాయలకు – ఇచ్చే నిలువు దోపిడీలకూ – చేసే కుంకంపూజలకూ ఆశపడి – మీకు కాలేజీల్లో సీట్లూ – పర్మనెంటు ఉద్యో గాలు – వ్యాపారాల్లో లాభాలూ వగైరా వగైరాలన్నీ సంచీలో వేసుకుని మీకు పంచి పెట్టడానికి సిద్ధంగా ఉండే అట్టబొమ్మ అనుకుంటున్నారా ?

"ఫారిన్ సెంటూ, ఫారిన్ క్లాత్, ఫారిన్ రేడియో, ఫారిన్ కారులాగ భక్తి కూడా ఫారిన్ భక్తి అయితే కాని రక్తికట్టదా ? మీ దేవుడి పూజామందిరంలో ప్రవేశించటానికి కట్టుకున్న ఇల్లాలికి లేని అర్హత ఒక యూరోపియన్ యువతికి ఉందా ? యూరోపియన్ యువతి భక్తురాలయిందని అంటే అదొక గ్లామర్ ! ఆ రకంగా మరికొంత ప్రచారం ! ఈ రకంగా ఆత్మవంచన చేసుకుంటూ, పరులను వంచించే మీరా భక్తులు ? మీరు భ్రష్టులయింది కాక. నా బ్రతుకు సర్వనాశనం చేస్తున్నారు ! పాప పుణ్యాలనేవి నిజంగా ఉంటే,

పుణ్యకార్యం కాదు, మీరు చేస్తున్నది ! జన్మజన్మలకూ విముక్తిలేని ఘోర పాపం !"

పిడుగులు కురిపిస్తున్నట్లు మాట్లాడి, బిత్తరపోయి నిలబడ్డ జ్యోతిని ఎత్తుకుని చరచర నడిచి వచ్చేసింది సుభద్ర.

ఒకరాత్రివేళ తలుపు నెమ్మదిగా తట్టిన చప్పుడయింది. జ్యోతిని మరింత దగ్గరగా లాక్కుని భయంగా వింది సుభద్ర— మళ్ళీ తలుపు చప్పుడు.

"ఎవరూ ?" సాధ్యమయినంత గట్టిగా అరిచింది సుభద్ర, కంఠంలో వణుకు కనిపించనీయకుండా.

"హుష్ ! తలుపు తెరు !"

శ్రీహరి కంఠ స్వరం అది ! సంభ్రమంగా లేచి తలుపు తెరిచింది. శ్రీహరి లోపలికి అడుగుపెడుతూ బయట ఉన్న కారు దూరంగా నిలపమని సైగ చేసాడు. కారు గుమ్మం ముందునుంచి కదిలింది.

'దేవుడు'గా ప్రఖ్యాతిపొందినా శ్రీహరి కాషాయాంబరాలు కట్టుకోవటం లేదు. ఖరీదైన బట్టల్లో దర్జాగా నడుస్తూ ఏం జరగనట్లు అతి మామూలుగా తనను చూసి నవ్వుతోన్న భర్తను కళ్ళప్పగించి చూసింది సుభద్ర.

"ఏవిటలా చూస్తావ్ పిచ్చిదానిలా ? నేను అంత అందంగా ఉన్నానా ?" పక్కమీద జ్యోతికి దగ్గరగా కూచుంటూ అన్నాడు శ్రీహరి. తాను అందమైన వాడిననే అహంకారం శ్రీహరికి బాగా ఉంది. దేవుడని అందరూ గుర్తించాక ఆ అహంకారం మరింత ఎక్కువయింది కాబోలు ! సుభద్ర ఏం మాట్లాడలేక పోతోంది. ఎంత అణచుకుందామన్నా దుఃఖం పొంగి వస్తోంది. బాత్‌రూంలోకి పరుగుపెట్టి తలుపులు గట్టిగా వేసుకుంది. నలుగురిలోనూ తనను బయటకు నెట్టి ఒక యూరోపియన్ యువతితో శ్రీహరి లోపలకు పోయి తలుపులు వేసు కోవటం వద్దన్నా గుర్తుకొస్తూంది. అభిమానంతో మనసు దహించుకుపోతోంది. కన్నీళ్ళు తుడుచుకుని తడిగా ఉన్న చేతులను జాలిగా చూసుకుంది "తను ప్రేమించిన వ్యక్తిని ఏ పరిస్థితుల్లోనూ వదలని చెయ్యి ఇది" పెళ్ళిచూపుల ఆనాటి శ్రీహరి మాటలు గుర్తుకొచ్చాయి.

"ఇలా అభిమానపడి ప్రయోజనంలేదు. చేజేతులా తన కాపురాన్ని కూల దోసుకుని ప్రయోజనంలేదు. జ్యోతి కోసమన్నా అన్నీ భరించి ఎలాగో ఆయన మనసు మళ్ళించుకోవాలి !" అని తనకు తను నచ్చచెప్పుకుని నీళ్ళతో ముఖం కడుక్కుని బొట్టు పెట్టుకుని శ్రీహరి దగ్గిరకు వచ్చి కూచుంది. నిద్రలో ఉన్న



జ్యోతిని ఆప్యాయంగా చూస్తున్న శ్రీహరి సుభద్రరాగానే చికాగ్గా "నువ్విలా ప్రవర్తిస్తావని నేనెప్పుడూ అనుకోలేదు," అన్నాడు.

ఎలాగైనా భర్తతో రాజీ పడాలని నిశ్చయించుకున్న సుభద్ర ఆ చికాకుకు చిన్న బుచ్చుకున్నా, నవ్వటానికే ప్రయత్నిస్తూ "అంత కాని పని నేనేం చేసాను?" అంది.

"మందిరంలోకి వచ్చి నలుగురిలోనూ అంత గొడవ చేస్తావా ?"

"నా దేవుడ్ని అందరూ తమ దేవుడంటోంటే ఎలా భరించనండీ మరి !" దీనంగా అంది సుభద్ర.

"షటప్! నేను అందరికీ దేవుడ్నే !"

"ఏమిటీ? మీరు అందరికీ దేవుడా? ఇక్కడ-ఎవరూ లేనపుడు...నా ముందు కూడా అదే మాట అంటున్నారా ?"

"ఒకప్పుడు దేవుడు రాముడిగా జన్మించలేదా ? కృష్ణుడిగా జన్మించలేదా ? ఈనాడు కలియుగంలో ధర్మరక్షణార్థం ఈ రూపంలో జన్మించాను."

హడలిపోయి చూసింది సుభద్ర-శ్రీహరి ఆ మాటలను తమాషాగా అనటం లేదు. చాలా సిన్సియర్‌గా అంటున్నాడు. అతని కళ్ళలో అంతులేని అహంకారం చిరునవ్వులో దేన్నీ లెక్క చెయ్యని దర్పం ! కళకళపడిపోయింది సుభద్ర.

సహజంగా శ్రీహరిది చాలా దృఢమైన వ్యక్తిత్వం. ఏ విషయంలోనైనా ఎదుటి వాళ్ళను తన మార్గానికి రప్పించుకొంటాడేకాని, తాను మరొకరి మార్గానికి మళ్ళడు.

"ఛ ! ఏమిటండీ ! మీరు దేవుడెలా అవుతారు ?" అంది నచ్చజెప్పటానికి ప్రయత్నిస్తూ.

"నీ మొహం ! నీకేం తెలుసు ? నేను కారులో తప్ప అడుగు బయట పెట్టను. విమానంలో తప్ప మరొక చోటికి ప్రయాణం చెయ్యను. పెద్ద పెద్ద రాజకీయ నాయకులు, వ్యాపారవేత్తలు... గొప్ప అధికారంలో ఉన్నవాళ్ళు. అందరూ నాకు దాసోహమంటున్నారు. నేను తలచుకుంటే, ఈ క్షణంలో ఏ అర్హతలూ లేనివాడికి మంచి ఉద్యోగం ఇప్పించగలను. కోపం వచ్చిందంటే ఎలాంటి పొజిషన్‌లో ఉన్న వ్యక్తినయినా ముప్పతిప్పలుపెట్టి మూడు చెరువుల నీళ్ళు త్రాగించగలను. నా కరుణాకటాక్ష వీక్షణాలకోసం ప్రతిరోజూ ఎంత మంది పడిగాపులు పడి ఉంటున్నారో నీకేం తెలుసు ?"

శ్రీహరి ఏ స్థితికి చేరుకున్నాడో పూర్తిగా అర్థమయింది సుభద్రకి – ఇక తనేం చెప్పి ప్రయోజనంలేదు.

"మీరు దేవుడు మాత్రమేకాదు. దేవుడికంటే కూడా చాలా గొప్పవారు. ఏ అర్హతలూ లేకపోయినా మంచి ఉద్యోగంలో కూచోబెట్టడం, ఏ తప్పు చెయ్యని ఉద్యోగిని కోపం వచ్చినంత మాత్రాన ముప్పతిప్పలు పెట్టి ఏడిపించ గలగటం, ఏ దేవుడివల్లాకాదు."

సుభద్ర మాటలలో వ్యంగ్యం అర్థంచేసుకోలేనంతటి తెలివితక్కువవాడు కాదు శ్రీహరి. నిజాన్ని ఎత్తిచూపే ఎత్తిపొడుపు భరించటమే అన్నింటికంటె కష్టం ! శ్రీహరికి వొళ్ళు తెలియని కోప మొచ్చింది.

"షటప్ ! నోటికొచ్చినట్లు వాగుతున్నావు. మొన్న అంతమందిలో అలా అల్లరిచేసినందుకు మొదటి తప్పుగా భావించి క్షమిస్తున్నాను. మరొక్కసారి అలా జరిగితే..."గట్టిగా అరిచాడు శ్రీహరి. సుభద్ర మనసు మొద్దుబారి పోతోంది !

తనను... అతను... క్షమిస్తున్నాడు ! ఎందుకు ? తన కళ్ళముందు ఎవరినో వెంటబెట్టుకుని ఎక్కడికో పోతూ తనను బయటకు నెట్టివేసి – అంతటి అవమానాన్ని దిగమ్రింగి సంసారం నిలుపుకోవాలని చూస్తున్నందుకు... క్షమిస్తున్నాడు !

శ్రీహరి ఉద్రేకంలో గట్టిగా అరిచిన అరుపులకు ఉలికిపడిలేచింది జ్యోతి తండ్రిని చూడగానే పట్టరాని ఆనందంతో "నాన్నా !" అని అరిచి తండ్రి మీదకు ఉరికింది. తన కోపమూ, దైవత్వమూ అన్నీ మరిచి జ్యోతిని హృదయానికి హత్తుకుని రెండు చెక్కిళ్ళమీదా ముద్దు పెట్టుకుని "నా బంగారు జ్యోతి" అన్నాడు గద్గదస్వరంతో శ్రీహరి. ఆ దృశ్యం చూస్తూ మరింత దహించుకుపోయింది సుభద్ర.

"ఇలా రహస్యంగా అర్ధరాత్రి మా దగ్గరకు రావటం... పగలు దేవుణ్నంటూ పూజలందుకోవటం, ఎంత నీచం ! అన్నీ తెలిసిన మీరు ఇంత హీనస్థితికి ఎలా దిగజారారు ! ఇప్పటికయినా మించిపోయిందిలేదు. ఆ భజనలూ, గోలా వదిలేసిరండి ? ఉద్యోగానికి రాజీనామా ఇచ్చినా ఫరవాలేదు. మరో ఉద్యోగం చూసుకోవచ్చు."

"సుభద్రా ! నన్ను నిష్కారణంగా రెచ్చగొట్టకు. ఇంకోసారి ఇలా మాట్లాడావంటే..."

"ఏం చేస్తారు ? ఒకసారి కాదు, లక్షసార్లు మాట్లాడతాను. 'ఈ శ్రీహరి దేవుడు కాదు, మీలాంటి మనిషే !' అని గొంతెత్తి అరుస్తాను. 'దేవుడు, దేవుడ'ని ఈయన చట్టూ చేరి భజనలు చేసి నా బ్రతుకు సర్వనాశనం చెయ్యొద్దని వాళ్ళందరినీ చేతులు జోడించి ప్రార్థిస్తాను..."

ఉద్రేకంగా మాట్లాడుతోన్న సుభద్ర చెంపమీద ఛెళ్ళున కొట్టాడు శ్రీహరి. అంతవరకూ శ్రీహరి ఒళ్ళోనే కూచుని తలిదండ్రుల సంభాషణ భయంగా వింటున్న జ్యోతి తల్లి చెంపమీద దెబ్బపడగానే కెవ్వున కేకపెట్టి తండ్రి చేతులు విడిపించుకుని తల్లి దగ్గిరకు వచ్చి తల్లి చెంపమీద తన చెయ్యివేసి నిమిరింది కన్నీళ్ళతో.

"నాన్నా ! ఛీ ! అమ్మని కొట్టావా ? దేవుడు నీ ముక్కు కోసేస్తాడు." అంది తండ్రిని కోపంగా చూస్తూ... ఏదైనా తప్పు చేసినప్పుడు" దేవుడు నీ ముక్కుకోసేస్తాడు" అనటం శ్రీహరి చేసిన అలవాటే !

సుభద్రను సునాయాసంగా విదిలించి కొట్టగలిగిన శ్రీహరి కూతురి తిరస్కారాన్ని మాత్రం సహించలేకపోయాడు.

"దేవుడు నా ముక్కు కొయ్యడమ్మా ! నేదే దేవుణ్ని," అన్నాడు జ్యోతిని తన వైపుకు తిప్పుకోవాలనే తాపత్రయంతో, అనునయంగా...

"నువ్వు దేవుడుకాదు. దేవుడు ఎవరినీ కొట్టడు. కష్టంలో ఉన్నవాళ్ళకి సాయంచేస్తాడు."

తను తండ్రిదగ్గిర నేర్చుకున్న పాఠాలనే రామచిలుకలాగ అప్పజెపుతోంది జ్యోతి.

శ్రీహరి చాలా తెలివైనవాడు. అతని బుర్రకు మెరుపులా ఒక ఆలోచన తోచింది. "జ్యోతీ ! నువ్వు నాతో వస్తావా ?" అన్నాడు.

"ఓ ! వచ్చేస్తాను." సంబరంగా అంది జ్యోతి. వెంటనే జ్యోతిని ఎత్తుకుని బయల్దేరాడు శ్రీహరి. సుభద్ర నిలవలేక "అమ్మా జ్యోతీ ! నువ్వు నన్ను వదిలిపోతున్నావా ?" అని బావురుమంది. జ్యోతి బిత్తరపోయి "నాన్నా! అమ్మ రావటంలేదా ? అయితే, నేనూ రాను." అని తండ్రి చేతుల్లో గింజుకుంది. శ్రీహరి అదేమి వినిపించుకోకుండా జ్యోతిని గట్టిగా పట్టుకుని బయటకు నడిచాడు

"అమ్మా !" అన్న జ్యోతి దీనమైన పిలుపు సుభద్ర రోదనధ్వనిలో కలిసిపోయింది.

## 14

సుభద్రకు వంట చేసుకోవాలనిపించలేదు. తినాలనిపించలేదు. లేచి ఎలాగో ముఖం కడుక్కుని కాఫీ అయినా త్రాగకుండా అలాగే పడుకుంది. అంతలో "అమ్మా !" అన్న జ్యోతి పిలుపు వినిపించి ఒక్క ఉదుటున లేచి తలుపు తెరిచింది. జ్యోతి తల్లి చేతుల్లో వాలిపోయి తల్లిని కౌగలించుకుంది. సుభద్ర కూతుర్ని ముద్దులతో ముంచెత్తుతూ, "నా తల్లీ ! వచ్చేసావా ! నువ్వు కూడా దూరమయిపోతావని భయపడ్డానమ్మా ! నా బ్రతుకు మొత్తం ఎడారి అయిపోతుందని అనుకున్నానమ్మా! అంధకారంలో మునిగిపోయిన నా ముందుకు జ్యోతిలాగే వచ్చావు తల్లీ !" అని వాపోయింది.

పోయిన ఉత్సాహమంతా తిరిగివచ్చినట్లయింది సుభద్రకి. పెద్ద గీతముందు చిన్న గీతలాగ జ్యోతి దూరమయిన దుఃఖంముందు శ్రీహరి దూరమయిన దుఃఖం మరుగునపడిపోయి జ్యోతిని చూడగానే గుండెలమీదనుంచి కొండంత బరువు దింపినట్లయింది. చకచక పాలు కాచి జ్యోతికిచ్చి, తను కాఫీ త్రాగి అప్పుడడిగింది, "ఒక్కదానివీ ఎలా వచ్చావమ్మా, నిన్ను రానిచ్చారా" అని. జ్యోతి కళ్ళు పెద్దవిచేసి అక్కడందరూ నన్ను 'దేవుడిగారి అమ్మాయి' అని చాలా ముద్దుగా చూసారమ్మా ! బిస్కట్లూ, చాకొలెట్లూ, చాలా చాలా

పెట్టారు. అన్నీ తిని 'అమ్మ దగ్గిరకి తీసుకుపొండి,' అని అడిగాను. 'తప్పమ్మా ! అలా అనకూడదు,' అన్నారు. ఆ చీరదొరసాని లేదూ, ఆ వేళ నన్ను కొట్టిందే, అది ! .... 'నువ్వు మీ అమ్మదగ్గిరకి వెళ్ళకూడదు! నా దగ్గిరే ఉండాలి !' అంది. అని నా చెయ్యిపట్టుకుంది. ఆ చెయ్యి కొరికేసానులే ! భలే అరిచింది. మళ్ళీ కొడుతుందనుకున్నాను. ఎందుకో కొట్టలేదు. బోలెడుమంది ఆ చీరదొరసాని చేతికి ఏవేవో మందులు రాసారు. నాన్న నన్ను కోపంగా చూసారు. నేను ఏడ్చేసాను. నన్ను ఎవరో ఎత్తుకుని అక్కడి నుంచి తీసుకొచ్చేసారు. వాళ్ళంతా భజనలు చేస్తున్నారు. నాకు ఏడుపొస్తూంది. నెమ్మదిగా బయటకు వచ్చేసాను. నీ దగ్గిరకి ఎలా రావాలో అర్థం కాలేదు. ఒకాయన కనిపిస్తే 'ఏవండీ ! నన్ను మా ఇంటిదగ్గిర దింపండి !' అన్నాను ఏడుస్తూ. ఆయన నన్ను ఎత్తుకుని 'ఎక్కడమ్మా మీ ఇల్లు ?' అన్నారు 'నాకు తెలియదండీ ? నేను దేవుడిగారి అమ్మాయిని. దేవుడిగారి ఇంట్లో... అంటే అమ్మ ఉండే ఇంట్లో దింపండీ !' అన్నాను. ఆయన వాళ్ళనీ వీళ్ళనీ అడిగి నన్ను మన ఇంటిముందు దింపారు. దింపాక 'పాపా ! నాకు నీ గొలుసును ఇస్తావా ?' అని అడిగారు. 'పోనీ, పాపం !' అని ఇచ్చేసాను. ఆయన వెళ్ళిపోయారు." అని చెప్పింది గొప్పగా.

ఎంత గండం గడిచిందో తలుచుకుని గుండె గుభిల్లుమంది సుభద్రకి. ఇక అక్కడే ఉంటే శ్రీహరి తనకు జ్యోతిని కూడా దక్కనియ్యడేమోనని భయం పట్టుకుంది. ఎలాగో భోజనాలు కానిచ్చి సామాన్లు సర్దుకుని జ్యోతినెత్తుకుని రైలెక్కి పుట్టింటికి వచ్చేసింది.

విషయాలన్నీ విని తల్లీ తండ్రీ విస్తుపోయారు.

"అన్నివిధాలా అనుకూలమైన సంబంధమని కట్నాలు గుమ్మరించి పెళ్ళి చేస్తే ఇదెక్కడి ప్రారబ్ధమే !" అని కుమిలిపోయింది తల్లి.

"వీడేమిటో, ఈ భక్తులేమిటో, అంతు తేలుస్తాను," అని ఎగిరిపడ్డాడు తండ్రి.

సుభద్ర అడ్డుపడి "వద్దు నాన్నగారూ! ఆయనతో మన కే పేచీలూ వద్దు. నేను నా కాళ్ళమీద నిలబడే ఆధారమేదైనా చూపించండి," అంది.

తల్లికష్టపెట్టుకుని "నీకేం తక్కువయిందమ్మా! నీకూ నీ బిడ్డకీ ఇంత తిండి పెట్టలేమా ?" అంది.

"అదికాదమ్మా! నాకూ ఏదైనా వ్యాపకం ఉంటే మంచిది. ఇప్పుడు ఇంటర్, బి.ఏ. ఇవన్నీ చదవలేను. నర్స్ ట్రైనింగ్‌కి వెళ్తాను," అంది.

తల్లి దండీ మొదట్లో ఒప్పుకోలేదు. సుభద్ర నచ్చజెప్పిఒప్పించింది. అప్లికేషన్లు పడేసింది. ఈలోగా సుభద్రకు మరో చిక్కు ఎదురయింది. జ్యోతి ప్రతి రోజూ స్నానంచేసి శ్రద్ధగా పూజలో కూచోసాగింది. ఒక్కొక్కసారి అలా పూజలో రెండు మూడు గంటలు కూచోసాగింది సుభద్ర గుండెల్లో రాయిపడింది. అంతసేపు పూజలో కూచోవద్దని జ్యోతిని మందలించబోయింది. జ్యోతి వినిపించుకోలేదు." నాన్నని మన దగ్గరకు పంపించమని దేవుణ్ని ప్రార్థిస్తున్నానమ్మా! నేను ఎంత బాగా పూజచేస్తే, దేవుడికి అంత త్వరగా దయ కలుగుతుంది." అని సమాధానం చెప్పింది. మ్రాన్పడిపోయింది సుభద్ర. మొదటినుంచీ అల్లారుముద్దుగా పెరిగిన జ్యోతి అదలింపులకు అసలు లొంగదు. అదీగాక తండ్రికోసం బెంగపెట్టుకున్న జ్యోతిని గట్టిగా మందలించాలంటే సుభద్రకి నోరు రావటంలేదు. బెంగవల్లనో, మరే కారణంవల్లనో, జ్యోతికి జ్వరం వచ్చింది. సుభద్ర గాభరాపడి డాక్టర్‌ని పిలిపించింది. డాక్టర్ మందు లిచ్చి భయం లేదని చెప్పాడు. కాని, జ్వరం తగ్గుముఖం పట్టలేదు. అంత జర్వంలోనూ జ్యోతి మొండిగా పూజదగ్గిర కూచోటం మానలేదు. "అమ్మా! నాకు దేవుడు కనిపించాడు. నాన్నను మన దగ్గిరకు పంపిస్తానన్నాడు" అని కలవరించటం ప్రారంభించింది. సుభద్ర గుండె బెదిరింది. ఇంక నిబ్బరంగా ఉండలేక శ్రీహరిమీదపడి అతణ్ని తీసుకురావటానికి బయలుదేరింది. సుభద్ర వచ్చేసరికి శ్రీహరిని ఘనంగా ఊరేగించటానికి సన్నాహాలు జరుగుతున్నాయి. కారును పూలమాలలతో అలంకరించారు. మేళతాళాలు మధురంగా మ్రోగుతున్నాయి. భక్తులు హారతులిస్తున్నారు. ఈ హడావుడి మధ్య సుభద్ర ఎలాగో శ్రీహరిని సమీపించి అతడి పాదాలమీద వ్రాలిపోయి "ఏమండీ! మన జ్యోతి ప్రాణాపాయస్థితిలో ఉండి మీకోసం కలవరిస్తోంది. ఒక్కసారి వచ్చిదాన్ని కాపాడండి. నా అపరాధాలకు నన్ను ఎంత శిక్షించినా భరిస్తాను. కానీ ఆ పసిదాన్ని మనం అల్లారుముద్దుగా పెంచుకున్న మన జ్యోతిని కాపాడండి!" అని ఏడ్చింది.

శ్రీహరి ఒకే ఒక్క క్షణం శిలలా నిలబడ్డాడు. మరుక్షణం తన పాదాల మీది సుభద్ర శిరసును పాదంతోనే పక్కకుతోసేసి వెళ్ళి కారులో కూచున్నాడు. భజనగీతాలు మిన్నంటుతున్నాయి. మేళతాళాలు హోరుమంటున్నాయి.




మహా వైభవంగా కారు కదిలింది. కన్నీళ్ళతో క్రింద కూలబడ్డ సుభద్రను చూసి ఏ ఒక్కరూ జాలిపడలేదు.

"ఆహా ! స్వామివారిది ఏం వైరాగ్యం ? కన్న కూతురు ప్రాణాపాయ స్థితిలో ఉంటే కూడా నిర్వికారంగా ఉండిపోయారు !" అని స్వామివారి వైరాగ్యాన్ని మెచ్చుకుంటూ టపటప లెంపలు వాయించుకుని దణ్ణాలు పెట్టుకున్నారు.

గొఱ్ఱెల మందలాంటి ఆ జనాన్ని చూసి అసహ్యంతో శరీరం జలదరించింది సుభద్రకి. చదువుకున్నవాళ్లూ, చదువుకోనివాళ్లూ అందరూ ఒక్కలా ఇలా ఉన్మాదంలో కొట్టుకుపోతున్నా రేమిటి ? భయమో, భక్తో తప్ప — సొంత ఆలోచన - వివక్షణా జ్ఞానం అసలు ఈ జనంలో లేనేలేదా ?

చేసేదిలేక నిరాశతో తిరిగి వచ్చేసింది సుభద్ర. జ్యోతికి జ్వరం బాగా ఎక్కువయిపోయింది. ఉండుండి తెలివి తప్పిపోతోంది. ఏదేదో పరాగ్గా మాట్లాడసాగింది.

సుభద్ర జ్యోతి మంచం పక్కనే కూలబడి వెక్కి వెక్కి ఏడవసాగింది. జ్యోతి కళ్ళు తెరిచి "అమ్మా ! ఎందు కేడుస్తున్నావ్ ? ఏడవకు. నాన్నను నీ దగ్గరకు పంపిస్తానని దేవుడు నాతో చెప్పాడు" అంది తల్లి కళ్లు తుడుస్తూ. అవే జ్యోతి మాట్లాడిన ఆఖరు మాటలు. ఆ మరునాడంతా బాధపడి జ్యోతి శాశ్వతంగా ఈ లోకాన్ని వీడిపోయింది.

## 15

సుభద్ర కథ విని చాలా జాలిపడ్డాడు మూర్తి.

"అయితే నీ భర్త శ్రీహరి ఈ యోగి అంటావా ? విచిత్రంగా ఉందే ? నువ్వు చెప్పినదానినిబట్టి అతడు డబ్బుకు లోటులేకుండా ఉండి ఉండాలి కదా ! మరి, మన పునరావాస కేంద్రానికి రావలసిన అవసర మేముంది ? ఏ ప్రైవేట్ డిస్పెన్సరీలోనయినా చేరి వైద్యం చేయించుకోవచ్చును కదా ? అదీకాక అతణ్ణి అందరూ దేవుడని ఆరాధిస్తున్నప్పుడు, ఇలా దొంగతనంగా ఎవరు ఎత్తుకుపోతారు ? దేనికి ఎత్తుకుపోతారు ?"

తన మనసులో అనుమానాలన్నీ బయటపెట్టాడు మూర్తి. ఆ ప్రశ్నలలో ఒక్కదానికీ సమాధానం చెప్పలేకపోయింది సుభద్ర.

"సరే ! దిగులుపడకు – ప్రయత్నం చేస్తాను" అని ధైర్యం చెప్పాడు మూర్తి.

రాజారావుకు జబ్బు నయమయిపోయింది. డాక్టర్లు పరీక్షించి బ్లడ్‌లో 'నెగిటివ్' కనిపించిందని నిశ్చయంగా చెప్పారు. రాజారావు సంతోషానికి హద్దులు లేవు. మూర్తి దగ్గరకువచ్చి నమస్కారంచేసి "సార్ ! మీ దయ వల్ల ఆరోగ్యవంతుణ్ణయ్యాను. ఇక మంచి ఉద్యోగం కూడా దొరికితే నా కుటుంబాన్ని ఆదుకుంటాను. మా చెల్లెలికి ... " అని ఆగిపోయి గొంతు సర్దుకుని "ఇక ముందైనా ఏ కష్టమూ రాకుండా ఆదుకుంటాను" అన్నాడు.

"విశ్వమానవ కల్యాణసంఘంలో అకౌంటెంట్ కావాలని అన్నాడు జగన్నాధం. ట్రై చెయ్యి–విష్‌యు బెస్ట్‌ఆఫ్ లక్ అని సంతోషంగా రాజారావుని సాగనంపాడు మూర్తి.

పట్టుమని పదిరోజులైనా కాకుండానే పునరాస కేంద్రానికే తిరిగివచ్చాడు. రాజారావు–అతడిముఖం అగ్నిజ్వాలలా రగులుకుపోతోంది.

"ఏంజరిగింది రాజారావ్? మళ్ళీ ఇక్కడికి వచ్చావేం?" అన్నాడు మూర్తి...

"ఇక్కడకురాక మరెక్కడికి వెళ్ళగలను సార్? ఈ సమాజంలో ఉన్నది మనుష్యులా? కాదు. గొర్రెలమందలు–తోడేళ్ళు–గోముఖవ్యాఘ్రాలు. వీళ్ళందరినీ తుపాకులతో కాల్చినా, లాఠీలతో చావబాదినా, నిలువునా కాల్చినా, ఏంచేసినా పాపంలేదు–నాకు రోగం నయమయింది–కానీ, రోగం వదిలిన ముద్ర నా ముఖం మీద ఉందికదుసార్! అంచేత ఎక్కడకు వెళ్ళినా నిర్దాక్షిణ్యంగా మెడపట్టి గెంటే వారే తప్ప అర్హతలుచూసి ఉద్యోగం ఇచ్చేవారే లేరు– నాది అంటురోగంకాద నీ

నా రక్తంలో "నెగెటివ్ కనిపించిందనీ, మొత్తుకున్నా, వినిపించుకునేవాడుకానీ, అర్ధంచేసుకునేవాడు కానీ ఒక్కడూలేడు — మళీ' మీదగ్గరకురాక ఏంచెయ్యను?"

"జగన్నాధం దయకలవాడనుకున్నానే? అతడేం సహాయం చెయ్యలేదా?"

"వాడా? వాడికా దయ? ఈ నికృష్టులు — ఈ నిర్భాగ్యులు... అంటూ మమ్మల్ని పురుగుల్లా చూస్తూ మా ముఖాన్న ఏదో పారేసి ఫోటోలు తీయించుకుని పత్రికల్లో ప్రచురించుకునే ఆ బఫూన్ కా దయాదాక్షిణ్యాలు? నన్ను చూడగానే కంగారుపడిపోయి బయటకు పొమ్మన్నాడు-నాలాంటివాళ్ళు సంఘంలో ఉంటే, సంఘం 'పరువు ప్రతిష్టలు మట్టికొట్టుకుపోతాయట! బస్‌చార్జీలకు ఒక్కరూపాయి ధర్మంచెయ్యమన్నా, లేదు, పొమ్మన్నాడు! పక్కన ఫొటోగ్రాఫర్ లేడుగా, మరి! అన్నట్లు ఒక విచిత్రం సార్! వాళ్ళు అక్కడ ఒక ఫోటోకి దండలువేసి పూజలుచేస్తున్నారు-ఆ ఫోటోలో వ్యక్తి మన యోగిలాగ ఉన్నాడు!"

ఈ చివరిమాటలు వినగానే మూర్తి పోలీస్‌ఆఫీసర్ వ్యక్తిత్వం చురుగ్గా పనిచెయ్యటం మొదలుపెట్టింది-ఏదో పనిమీదవెళ్ళినట్లు విశ్వమానవ కల్యాణ సంఘానికి వెళ్ళాడు-ఆఫోటో పరీక్షగా చూసాడు. సందేహంలేదు, అది యోగి ఫోటో! జగన్నాధం భోళాగా వాగుతాడని తెలిసిన మూర్తి అతడినే కదిలించాడు—

"ఆ ఫోటోలో వ్యక్తి ఎవరు?"

"అది, మీకు తెలియదా? మా గురువుగారు—అరవిందయోగులవారు—సాక్షాద్భగవదవతారం?"

భక్తిగా లెంపలువేసుకుని నమస్కారంచేస్తూ మరీ చెప్పాడు జగన్నాధం—

"నాకు ఆయన దర్శనం చేయించగలరా?"

తనుకూడా భక్తితో అడిగాడు మూర్తి—

"అరరె! ఇప్పుడు సాధ్యంకాదండీ! స్వామివారు సమాధిలో ఉన్నారు .."

"సమాధిలో ఉంటే దర్శనంచేసుకోకూడదా?"

"ఆయన ఎక్కడుంటారో ఎవరికీ తెలియదు. ఎక్కడో ఏకాంత ప్రదేశంలో కొన్నాళ్ల సమాధిలోఉండి మళ్ళీవస్తారు—చిత్రంగా సందేశాలుమాత్రం పంపిస్తూం ఉంటారు- ఆయనకు సాధ్యంకానిదేముంది? సాక్షాద్భగవంతుడు— ఈ సారి

ఆయన సమాధిలోనుండి రాగానే మీకు కబురు పంపిస్తాను. వచ్చి దర్శనం చేసుకుందురుగాని..."

ఈ సంభాషణ తర్వాత మూర్తిలో అనుమానాలు పెరిగాయి-నాగుల్ని పిలిపించాడు-సంఘాలను ఒక్కసారి స్వాధీనం చేసుకుని మంచిమార్గంలోకి మళ్ళించగలిగితే వాళ్ళవల్ల ఎంతైనా సాధించవచ్చునని మూర్తికి తెలుసు-పెద్ద పెద్ద ఏజిటేషన్స్‌లో ఈ సంఘాలే మూర్తికి అండగా నిలిచి ఎంతో సహాయం చేసారు.

"నాగులూ! రమణయ్య యోగిని ఎందుకు ఎత్తుకుపోయాడో, అలా ఎత్తుకుపొమ్మని ఎవరు చెప్పారో, తెలుసుకోగలవా?" అని అడిగాడు నాగుల్ని.

"అదెంతపని అయ్యగారూ! కల్లుదుకాణంలో ఖర్చుచెయ్యటానికి ఒక పది రూపాయలిలా పారెయ్యండి-రేపీపాటికి అన్నిసంగతులూ తెలుసుకొస్తా!"

మూర్తి నాగులుకి డబ్బులిచ్చి పంపించాడు-అన్నట్టుగానే నాగులు మరునాటి కల్లా సమాచారమంతా సేకరించాడు.

"రమణయ్యని పంపింది శ్రీధర్‌బాబట! ఎందుకో, ఏటో ఆడికేం తెలవదంట! యోగిని తెచ్చి కారులో అప్పగించేంతవరకే ఆడి డ్యూటీ అంట!"

మూర్తికొక్కసారిగా అనేక విషయాలు స్ఫురించాయి ఎన్నడూరాని శ్రీధర్ తమ పునరావాస కేంద్రానికి రావటం, యోగి ప్రస్తావన రాగానే చూస్తానని బయలుదేరటం, శ్రీధర్‌ని చూడగానే యోగి ముఖం పాలిపోయి వెనక్కు తూలి పడిపోవటం-ఇవన్నీ కలిపిచూసుకుని విషయం క్రైమ్ బ్రాంచ్‌కి రిపోర్ట్‌చేసి ఇన్‌వెస్టిగేషన్ ప్రారంభించమన్నాడు- క్రైమ్‌బ్రాంచ్ సి.ఐ.డి. ఆఫీసర్ కొంచెం భయంగా "శ్రీధర్ ఎవరోతెలుసా మూర్తిగారూ! ఆయనకు రాజకీయరంగంలో ఎంతో పలుకుబడి ఉంది-తలుచుకుంటే ఏమైనా చెయ్యగలడు-" అన్నాడు-

ఆ భయంచూసి లోలోపల నవ్వుకున్నాడు మూర్తి.

తను పోలీస్ ఆఫీసరుగా ఉన్నంతవరకూ ఏనాడూ ఎవరికీ భయపడలేదు. ఒకసారి ఒక కమర్షియల్ టేక్స్ ఆఫీసర్‌పైనే కేసుపెట్టాడు. అతని లంచగొండితనాన్ని పట్టుకుని అతణ్ని వదిలెయ్యమని ఎంతో పెద్ద పెద్ద వాళ్ళదగ్గరనుండి రికమండేషన్స్ వచ్చాయి. బెదిరింపులు కూడా వచ్చాయి. దేనికీ చలించలేదు మూర్తి. ఫలితంగా అతనికి రావలసిన ప్రమోషన్ ఆగిపోవటమేకాక, శ్రీకాకుళం ప్రాంతాలకు బదలీకూడా అయింది. 'ఎక్కడున్నా నా డ్యూటీ నేను సక్రమంగానే చేస్తాను.' అనుకున్నాడు మూర్తి నిబ్బరంగా.

"వీళ్ళంతా లోగుట్టు బయటపడేవరకే పెద్దమనుష్యులు ! అది బయటపడితే కోరలు తీసిన పాములు ! ఇలాంటివి పట్టుకుంటేనే, మనకు పేరూ ప్రతిష్ట. విశ్వమానవ కళ్యాణ సంఘానికి సంబంధించిన వివరాలన్నీ తెలుసుకోండి !" అన్నాడు మూర్తి. కేస్ రిపోర్టుచేస్తూ.

రెండు రోజుల్లోనే క్రైమ్ బ్రాంచి సహాయంతో విశ్వమానవ కళ్యాణ సంఘానికి సంబంధించిన వివరాలన్నీ తెలుసుకోగలిగాడు మూర్తి. ఆ సంఘానికి కార్యదర్శి శ్రీధర్, అఘటనా ఘటనా సమర్థుడు. తలలు తీసి తలలు మార్చ డంలో దిట్ట. అతడు కావాలనే కొంత తెలివితక్కువవాళ్ళను ఏరి కోరి తన సంఘానికి అధ్యక్షులుగా, ఉపాధ్యక్షులుగా వేసుకున్నాడు. సాధ్యమయినంత వరకూ అతడు రంగంమీదకు రాకుండా తెరవెనుక ఉండి భాగవతం నడిపిస్తాడు.

అరవిందయోగి ఈ సంఘానికి పరోక్షమైన అండ. ఆ యోగికీ ఈ సంఘానికీ ఎలా సంబంధం కలిసిందో ఆ యోగిని దేవుడని ఎవరు ప్రచారం చేశారో, తెలుసుకోవటం కష్టం. ఆ యోగి భూత వర్తమాన భవిష్యద్వృత్తాంతాలన్నీ తెలుసుకోగలడనే ప్రతీతి ఏర్పడిపోయింది. అనేకమంది రాజకీయ నాయకులు తమ భవిష్యత్తు తెలుసుకోవటానికీ, తాము చేయబోయే కార్యక్రమాలకు మంచి ముహూర్తలు నిర్ణయించుకోవటానికీ, రహస్యంగానూ, బాహాటంగానూ కూడా యోగిదగ్గరకు వస్తూ పోతూ ఉండేవారు. ఆ రకంగా శ్రీధర్ పై వర్గాలలో పలుకుబడి సంపాదించుకుని అది సందర్భానుసారంగా ఉపయోగించుకుంటూ తను పైకి వస్తున్నాడు. తనవాళ్ళనూ, తనను ఆశ్రయించినవాళ్ళనూ, పైకి తేగలుగుతున్నాడు. బేంక్ అకౌంటు పెంచుకోగలుగుతున్నాడు. ఈ సంఘానికి ఢిల్లీలోకూడా ఒక బ్రాంచి ఉంది. శ్రీధర్ ఎక్కువగా అక్కడే ఉంటాడు. యోగి సమాధిలోకి వెళ్ళాడంటున్నారు. అతడి ఆచూకి అంతుపట్టటంలేదు.

మూర్తి తీవ్రంగా ఆలోచనలో పడ్డాడు ఒకనాడు జగన్నాధంతో వచ్చిన శంకరయ్యను చూసి మీనా ఉలికిపడటం గుర్తుకొచ్చింది. మీనాను పిలిపించాడు.

"మీనా ! ఆనాడు శంకరయ్య మిమ్మల్ని ఎక్కడికో తీసికెళ్ళేవాడని చెప్పావుగదూ ! ఎక్కడికో చెప్పగలవా ?"

"చెప్పలేనండీ ! ఆ వివరాలన్నీ మాకు చెప్పరు. ఎవరిదగ్గరకు తీసుకెళు తున్నారోకూడా చెప్పరు. నేను ఢిల్లీలో లక్ష్మీదేవి దగ్గర వుండే రోజుల్లోమాత్రమే శంకరయ్య మా దగ్గరకు వచ్చేవాడు. మాలో కొందరిని తీసుకెళ్ళటానికి. ఆ

తరువాత నా కతను కనిపించలేదు. నా కీ రోగం వచ్చాక,లక్ష్మీదేవి నన్ను పంపే సింది. నేను అలా ఇలా తిరిగి ఇక్కడ చేరుకున్నాను. ఇంతే నాకు తెలిసింది."

"పోనీ నీకా బిల్డింగు చూపిస్తే, నిన్ను తీసికెళ్ళింది అక్కడికి అవునో, కాదో చెప్పగలవా ?"

"చెప్పగలనండీ. ఆ పరిసరాలు నాకు బాగా గుర్తు. శంకరయ్య అయిదారు సార్లు తీసికెళ్ళాడు నన్నక్కడికి."

మూర్తి ఆలోచనలో పడ్డాడు. ఈ కిడ్నేపింగ్ వ్యవహారాలు చాలా తమాషాగా ఉంటాయి. ఇదివరలో ఇలాగే ఒక వ్యాపారిని కొందరు దుండగులు డబ్బుకోసం కిడ్నేప్ చేశారు. ఎంతో పకడ్బందీగా ప్లాన్ వేసుకున్నారు. అయినా ఇరవై నాలుగు గంటలలోగా ఆ దుర్మార్గులను పట్టుకుని ఆ వ్యాపారిని విడిపించగలిగాడు తను ! ఇప్పుడీ యోగిని కిడ్నేప్‌చేసిన వాళ్ళనుకూడా పట్టుకోవాలి. ఈ కిడ్నేపింగ్‌లో రహస్యం ఛేదించాలి !

పోలీస్ డిపార్టుమెంటు సహకారంతో మీనాను వెంటబెట్టుకుని ఢిల్లీకి వెళ్ళి ఢిల్లీలో ఉన్న విశ్వమానవ కళ్యాణసంఘం బ్రాంచి నడుస్తున్న బిల్డింగ్‌ని మీనాకు చూపించాడు మూర్తి. తనను శంకరయ్య ఒకప్పుడు తీసుకొచ్చిన బిల్డింగ్ అదేనని నిర్ధారణగా చెప్పింది మీనా.

అకస్మాత్తుగా ఆ బిల్డింగుపైన రెయిడ్ చేశారు పోలీసులు. లోపలి గదిలో రహస్యంగా బందీగా ఉన్న యోగి బయటపడ్డాడు. విశ్వమానవ కళ్యాణ సంఘం కొనసాగిస్తున్న "లోక కళ్యాణ కార్యక్రమం"లో ఘోరాలు కూడా బయటపడ్డాయి.

శ్రీహరిని దేవుడని ప్రచారంచేసి ఆ ప్రచారంద్వారా అనేక స్వప్రయోజనాలు సాధించుకుంటున్నాడు శ్రీధర్. శ్రీహరి శరీరంమీద రోగలక్షణాలు కనిపించాయి. ఊపిరాడని కార్యక్రమాల మధ్య వైద్యం చేయించుకోటానికి కూడా తీరికలేక మొదట్లో నిర్లక్ష్యంచేసి కప్పిపెట్టుకోటానికి ప్రయత్నించారు. ముదిరి మించి రాగానపడ్డాక దాచటానికి సాధ్యంకాకపోయింది. ఏ దేవుడు లోకంలో అందరి రోగాలూ నయం చెయ్యగలడని ప్రచారం జరుగుతుందో, ఆ దేవుడికే భయంకరమైన రోగం వచ్చిందంటే, ఇక ఆ దేవుణ్ని ఎవరు నమ్ముతారు ? దేవుడిపట్ల ప్రజలకున్న నమ్మకాన్ని నమ్ముకున్న శ్రీధర్ ఏమయిపోతాడు ? ఆ కారణంచేత యోగి సమాధిలోకి వెళ్ళాడని ప్రచారంచేసి రహస్యంగా ఉంచి వైద్యంచేయించటం ప్రారంభించాడు.

శ్రీహరికి రోగం రాగానే శ్రీధర్‌కి అతనిమీద శ్రద్ధ తగ్గిపోయింది. ఆ రోగం

తగ్గుతుందనీ, శ్రీహరి మళ్ళీ మామూలు 'దేవుడు' కాగలడనీ అతనికి నమ్మకం కలగలేదు. అదీగాక ఈ రోగం అతి ప్రయత్నంమీద తగ్గినా రోగ చిహ్నాలు శరీరంమీద నిలిచిపోతాయి. అలాంటివాడు దేవుడెలా అవుతాడు ఇక? ఈకారణాల చేత శ్రీహరి వైద్యం విషయంలో శ్రద్ధతీసుకోవటం మానేశాడు శ్రీధర్. శ్రీహరి రోగం ముదరసాగింది. అతనికి అన్నపానాదులూ అంతంతమాత్రంగానే అందుతున్నాయి. ఈ పరిస్థితుల్లో శ్రీహరి ఎలాగో తప్పించుకుని పునరావాస కేంద్రం చేరుకున్నాడు. శ్రీహరి తప్పించుకుపోయిన విషయం చాలారోజుల వరకూ శ్రీధర్‌కి తెలియలేదు. అసలు శ్రీహరి తప్పించుకుపోవటానికి ప్రయత్నిస్తాడని శ్రీధర్ అనుమానించలేదు. ఎందుకంటే దేవుడిగా అందరి ఆరాధనలూ అందుకున్న శ్రీహరి ఒక దిక్కులేని రోగిగా మళ్ళీ వాళ్ళముందుకే వెళ్ళటం అంత తేలిక కాదనుకున్నాడు. అందుకే అంతగా కట్టుదిట్టాలు చెయ్యలేదు. తీరా శ్రీహరి తప్పించుకుపోయాక కంగారుపడి, పునరావాస కార్యక్రమంలో అతణ్ని గుర్తించి, కిడ్‌నేప్ చేసి మంచి కట్టుదిట్టాలతో బంధించాడు.

వివరాలన్నీ తెలిసాక ముఠాదారులందరూ అరెస్టయ్యారు. యోగిని కూడా అరెస్టుచేశారు. కానీ, అతడి శారీరక పరిస్థితినిబట్టి అతడు కేవలం ముఠాదారుల చేతుల్లో ఉపకరణంగా మారాడే తప్ప తానై ఏ కార్యాలూ చెయ్యలేదని నిర్దేశించి, యోగిని వదిలేశారు

రెండు చేతులూ జోడించి మూర్తికి నమస్కారంచేసి "థేంక్యూ సార్ !" అన్నాడు యోగి.

"నాకు థేంక్సు చెప్పటంకాదు. మీ ఇల్లాలికి క్షమార్పణలు చెప్పుకోండి !"

"పాపం, సుభద్ర నన్నెప్పుడో క్షమించింది. భగవంతుడే దయతలచి నన్ను శిక్షించాడు."

"మీ మాటలు తమాషాగా ఉన్నాయి. దయతలిచి శిక్షించడం ఏమిటండీ ?"

"అవును సర్ ! ఈ శిక్ష నాకు భగవంతుడు విధించకపోతే, ఈ నాటికీ నేను పోగొట్టుకున్నదేమిటో నాకు తెలిసేదికాదు. ఒకప్పుడు నేను ఎంతో నిష్టగా జపంచేసుకునేవాడిని. ఆ రోజుల్లో కేవలం భగవత్స్వరూపాన్ని అర్థంచేసుకోవాలనే జిజ్ఞాస తప్ప నా మనసులో మరే స్వార్థమూ ఉండేదికాదు. మానవుడు తన మనసు వికసింపచేసుకోవటానికి ప్రధానమైన సాధనం ధ్యానమని నమ్మే వాళ్ళలో నేనూ ఒకణ్ని. జ్యోతిష్యం ఒక శాస్త్రంగా అభ్యసించాను. ఒక కళగా

అందరికీ జ్యోతిషం చెప్పటం ప్రారంభించాను. ఎలా జరిగిందో కొందరు స్వార్థ పరులు నన్ను దేవుడ్ని చేశారు. ఆ కీర్తి సింహాసనాలు నా కళ్ళకు మిరుమిట్లు గొలిపాయి. ఆ స్తోత్ర పాఠాలు నన్ను మైకంలో ముంచేశాయి. నేను సృష్టించు కున్న ఆ మాయలో నేనే మునిగిపోయాను. నాలో ఉన్న దేవుడ్ని అందుకోవ టానికి ప్రయత్నం చెయ్యకపోగా నేనే దేవుణ్ని అనే భ్రమలో మునిగిపోయాను. నా జ్యోతి మరణంతో నాలో మధనం ప్రారంభమయిం . అనాటినుంచీ కళ్ళు మూసినా, కళ్ళు తెరిచినా జ్యోతిరూపం నన్ను వదలేదికాదు ఈ జీవన్మరణాల రహస్యమేమిటి ? మానవ జీవితానికి ధ్యేయమేమిటి ? నిరంతరమూ ఎడతెరిపి లేకుండా సాగే ఈ జీవన సంగ్రామానికి సాఫల్యమేమిటి ? ఈ ప్రశ్నలకు సమా ధానాలకోసం అల్లాడిపోవటం ప్రారంభించాను. నా ఆరాధ్య దైవాన్ని నాకు సమాధానం చెప్పమని ఆర్తితో ప్రార్థించాను ఆ సమాధానమే ఈ రోగం. మొదట భయపడ్డాను బాధపడ్డాను కానీ, రాను రాను ఈ రోగం నాకెన్నో నేర్పింది. జీవిత రహస్యాన్నే విడమరిచి చెప్పింది. అత్యున్నత శిఖరాలమీద నిలబడిన నేను క్షణాలలో అధఃపాతాళానికి కృంగిపోయాను. యథార్థమైన ఔన్నత్యంతో శిఖరాలు అందుకోగలిగిన మూర్తిగారిలాంటి ధీరులకు ఇలాంటి భంగపాటు ఉండదు. అడ్డదారులతో ఆత్మవంచనతో ఎంత ఎత్తుకు చేరుకున్నా ఏ క్షణంలో అక్కడినుంచి అఘాధాలలోకి జారిపడతామో ఎవరూ ఊహించ లేరు. భ్రమలలో నేను ఆపాదించుకున్న ఔన్నత్యం కరిగిపోగా నిజమైన ఔన్న త్యానికి సోపానాలు నిర్మించుకునే అవకాశం కలిగించింది ఈ రోగం. ఇది—దేవుడు దయతలచి విధించిన శిక్షకాదా ?"

యోగి మాటలు విని అతడి సంస్కారాన్ని గుర్తించి చాలా జాలిపడ్డాడు మూర్తి.

"ప్రజలలో అజ్ఞానాన్నీ, మూర్ఖత్వాన్నీ వ్యాపింపచేస్తోంది, ఈ మతం !" అన్నాడు.

"పొరపాటు మూర్తిగారూ! జీవితంలో ఒడిదుడుకులను తట్టుకోవటానికీ, మానవత్వంనుండి దివ్యత్వాన్ని పొందటానికి ఒక సాధనంగా దేవుణి సృష్టించుకొన్నది, ఆస్తికత్వం. ఏ సాధనలూ అక్కర్లేకుండా మానవుడు తన చిత్త స్థైర్యంతోనే ముందుకు సాగిపోగలడనేది నాస్తికత్వం. సిద్ధాంతరీత్యా రెండూ మంచివే! కానీ ఆచరణలో దేవుడిపేరిట

ఎన్నో మూఢవిశ్వాసాలకు బానిసలు ధ్యాన ధారణలకు బదులుగా తంతులకు ప్రాధాన్యమిచ్చి మరింత అజ్ఞానంలోకి జనాన్ని దింపుతున్నారు ఆస్తికులు. దేవుడు లేడు, పాపపుణ్యాలు లేవు పైలోకాలు లేవు అని,మనసును శాస్త్రీయంగా వికసింపచేసుకోవటానికి మారుగా విశృంఖలత్వాన్ని జనానికి అలవాటు చేస్తున్నారు నాస్తికులు. అల్పుడు, అలగుడు, సుఖలాలసుడు, స్వార్థపరుడు అయిన సాధారణ మానవుడు ఏ సిద్ధాంతాన్నయినా ఇలాగే భ్రష్టంచెయ్యగలడు. దోషం సిద్ధాంతాలలోలేదు, మనలో ఉంది."

యోగిమాటలలో సత్యాన్ని కాదనలేకపోయాడు మూర్తి. రోగులకోసం తాను చెయ్యగలిగినదంతా చేస్తున్నా మూర్తికి తృప్తిగాలేదు. రోగం నయమయిపోయినా, వాళ్ళను సమాజం స్వీకరించడంలేదు, ఈ సమస్యకు పరిష్కారం యెలా ?

ముఖ్యమంత్రితో మాట్లాడి ప్రత్యేకించి పునరావాస కేంద్రంలో బాగుపడిన రోగులకోసం ఏవైనా కర్మాగారాలు స్థాపించాలి. బ్లడ్‌లో నెగెటివ్ కనిపించిన రోగులకందరికీ ఆ కర్మాగారాలలో ఉపాధి కల్పించాలి ! తిరిగి వాళ్లు సుఖసంతోషాలతో సాధారణజీవితం గడిపే అవకాశం కల్పించాలి ! ఈ బాధ్యత ప్రభుత్వానిదేకాదు, ప్రజలదికూడా. ఈ కృషిలో ప్రతి ఒక్కరూ తమ చేయూత అందివ్వాలి !

జీవితంపై ఆశ నశించి అలమటించిపోతున్న ఆ అభాగ్యులకు ఆశాజ్యోతి చూపించటానికి ముఖ్యమంత్రి దగ్గరకు బయలుదేరాడు మూర్తి.

## అంకితం

ఐ.పి.యస్. గా రిటైరయి, ప్రస్తుతం కుష్ఠురోగుల పునరావాస కేంద్రానికి అడ్మినిస్ట్రేటివ్ ఆఫీసర్‌గా ఉంటున్నారు శ్రీ యస్.యన్. మూర్తిగారు. వారి నిస్స్వార్థ సేవానిరతి ప్రేరణగా రచించిన ఈ నవలను వారికే అంకితం చేస్తున్నాను.

డాక్టర్ సి. ఆనందారామం




సాయంత్రం అయిదుగంటలయింది.

ఫోర్టులోంచి అందరమూ ఒకేసారి బయటపడ్డాం మిడతలదండులా. రోడ్డు క్రిక్కిరిసిపోయింది. అందరికీ త్వరగా యిల్లు చేరుకోవాలనే ఆతృత! మాలో చాలామందికి సైకిళ్లున్నాయ్! బారులు తీర్చి పోతున్నాయ్! కారియర్లు మోసే వారు అకస్మాత్తుగా అడ్డంగా వచ్చి రోడ్డు ఎక్కారు. మా సైకిళ్ళ బ్రేకులకి పని తగిలింది – మెల్లిగా పోతున్నాయ్, వాళ్ళని తప్పించుకొంటూ.

"ఎంతపని చేసావే! ఆ కేరేజీకూడా ఒప్పేసుకోలేకపోనావా! ఆ యీదిలోకి ఎలాగూ వెల్తున్నావ్ గందా!"

వెనుకనుంచి మాటలు విన్పించాయ్.

ఆ గొంతు నాకు బాగా పరిచయం అయిందే!

'ఎవరు చెప్మా!' అనుకొంటూ వెనక్కి తిరిగి చూసా. ఆమె నన్ను చూసి గబగబా అడుగులు వేసుకొంటూ వచ్చింది. ఒకరినొకరం పరీక్షగా చూసుకొన్నాం. పోల్చుకోలేకపోయాం.

"ఏం బాబూ?" అడిగిందామె. కారియర్ కుదుర్చుకొంటానేమో నన్న ఆశతో.

"నీ పేరేంటి?" అడిగా.

పేరు చెప్పలేదు. కాస్త ఎడంగా

జరుగుతూ "మా దీవూరే బాబూ!" అంది.

ఆమె దీవూరుకాదని నాకు బాగా తెల్సు. ఆమె నాకు తెల్సున్న మనిషే! కానీ జ్ఞాపకానికి రావటంలేదు.

"అసలు మీ దేవూరు ?"

నిజం చెప్పమన్నట్లు చూసా.

"మాది తునిదగ్గర మల్లారం బాబూ! ఇక్కడి కొచ్చి పదేళ్ళయింది ! అందు కని అలా చెప్పా! బాబూ తవర్నెక్కడో సూసినట్టుంది!" అంది కన్నార్పకుండా నన్ను చూస్తూ.

"నువ్వు పోలయ్య పెళ్ళానివి కదూ?" అన్నా.

ఆమె ముఖం వికసించింది నెత్తిమీది తట్టను కారియర్లు పడిపోకుండా నెమ్మ దిగా దించి రోడ్డుకి పక్కగా పెట్టింది నేనూ నా సైకిల్ని బాగా పక్కకి తీసా.

"తవరు సాత్తుర్లుగారి రెండో అబ్బాయి రమేశ్ బాబుగారు కదండీ! ఎంత పెద్దయిపోయారు బాబూ ! ఎదవ ముండని పోల్చునేకపోయాను! నాన్న గారూ, అమ్మగారూ బావున్నారా బాబూ? ఈ పోరుటులోనే నేంటి బాబూ తవరికి పని? నాన్నగార్నీ, అమ్మగార్నీ సూసి సానా సంవచ్చరాలయింది ! అన్నయ్యగోరు కూడా యిక్కడనే ఉంటున్నారా బాబూ ? అమ్మగారి ఆరోగ్గం బావుందా?"

ఫుల్ స్టాప్ లేకుండా ప్రశ్నలవర్షం కురిపించింది. ఆప్యాయంగా ఆమెలోని మార్పు నాకు ఆశ్చర్యాన్ని కల్గించింది. శారీరకంగానూ, ఆర్థికంగానూ, మాన సికంగానూ బాగా కృంగిపోయింది. కానీ ఆ గొంతులోనూ, మాటలోనూ, ఆప్యాయతలోనూ మార్పులేదు. ఆమె అభిమానం అప్పటికీ యిప్పటికీ ఒక్క లాగే ఉంది. ఆమె నా జవాబుకోసం ఆతృతగా చూస్తోంది.

"నాన్నగారు పోయి అయిదు సంవ త్సరాలు అయింది ! అమ్మ అన్నయ్య దగ్గర హైదరాబాదులో ఉంటోంది ! చెల్లికి పెళ్ళి చేసాం! బెజవాడలో ఉంది! అన్నట్టు నీకో కూతురుండాలి !" అని ఆగిపోయా. ఆమె పేరు జ్ఞాపకంలేదు.

"అవును బాబూ ! లచ్మి! దానికింకా మనువు కుదరనేదు! నా దగ్గిరే ఉంది! తవ కెంతమంది పిల్లలు బాబూ!"

అలా అంటున్నప్పుడు ఆమె గొంతు జీరవోయింది. ఆవేదన - కానీ వెంటనే హుషారు తెచ్చుకొంది– ఆమెతో ఏవేవో మాట్లాడాలన్న కుతూహలం!

"ఇంకా పిల్లలు లేరు ! ఓసారి ఇంటికిరా!"

నా మాటలు ఆమె కెంతో సంతో షాన్ని కలగజేసాయ్.

"అలాగే బాబూ ! యియ్యాల రాలేను ! సీకటి పడిపోద్ది ! ఆదారం తప్పకుండా వత్తా ! ఎక్కడుంటున్నా రేంటి బాబూ ?"

"కైలాసపురం క్వార్టర్సులో !"

నెంబరూ ఆనవాలూ చెప్పా.

ఆమె కళ్లు ఆనందంతో మెరిసాయ్. సత్తువ వచ్చింది కాబోలు. గభాలున గంప నెత్తిన పెట్టుకొంది.

"మిమ్మల్ని చూడగానే ప్రాణం లేచొచ్చింది బాబూ!" అంది.

* * *

క్వార్టర్సు చేరేసరికి బాగా సాయంత్రం అయింది. వీధి వరండా తుడుచుకొంటోంది శాంతి. 'ఈవేళ కూడా పనిమనిషి రాలేదు కాబోలు' అనుకొంటూ సైకిలు దిగా.

"మీ చిరాకులూ, పరాకులూ పని మనుషులమీద చూపిస్తే ఊరుకుంటారా? నిక్షేపంగా నోరెత్తకుండా పనిచేసే పిల్లని మాన్పించేసారు ! దీన్ని పెట్టారు ! వారానికి మూడురోజులు నాగా. చెప్పా చెయ్యకుండా మానేస్తుంది ! ఈ పనులు నేను చెయ్యలేను బాబూ !"

నన్ను చూడగానే చ్రుమంది.

"పోనీ మరో మనిషిని చూద్దాం !" అన్నా లోనికి అడుగుపెడుతూ.

"చూస్తారు, చూస్తారు ! ఇప్పటికే అందరూ చెప్పుకొంటున్నారు ! నెలకో పనిమనిషిని మారుస్తామని! మన కింకెవ్వరూ కుదర్రు ! అనవసరంగా జీతం హెచ్చించేసారు పనిమనిషి మారినప్పుడల్లా !" అంటూ విసురుగా లోనికి పోయింది.

శాంతి అన్నమాటలు నిజమే ! డబ్బు ఎక్కువ పారేస్తే ఆశకొద్దీ జాగ్రత్తగా చేసుకొంటారనుకొన్నా. పది రూపాయిలనుంచి పదహారు రకూ పెంచుకొచ్చా! డబ్బిచ్చి అభిమానాన్నీ, ఆప్యాయతనీ సంపాదించలేం?

"ఊఁ ! కాఫీ తీసుకోండి ! వంట గిన్నెలు తోముకోవాలి !" అంటూ కాఫీ గ్లాసు నా చేతిలో పెట్టింది. వేళ్ళు చుర్రుమన్నాయ్! ఆమెలాగే కాఫీకూడా వేడిగా వుంది.

"పోనీ ఈ మాటు నీవు చూసుకో, నీకు నచ్చిన మనిషిని !" అన్నా.

ఆమె మాట్లాడలేదు. పెరట్లోకి పోయింది గిన్నెలు పట్టుకొని.

ఆవేళ ఆదివారం ! నేనూ, శాంతి గదిలో కూర్చొని రేడియోలో వస్తూన్న నాటకం వింటున్నాం. వీధిలో ఎవరో పిలుస్తూన్నట్లు అనిపించింది. రేడియో గొడవలో వినిపించలేదు.

"ఎవరో చూడు!" అన్నా.

డిస్టర్బెన్సుకి కోపం వచ్చి విసురుగా వీధిలోకి వెళ్ళింది. రేడియో వాల్యూం తగ్గించా. ఆమె మరలా పిలిచింది.

"అమ్మగారూ!" అని.

అది పోలయ్య పెళ్ళాం రత్తమ్మ గొంతే.

నేనుకూడా లేచి వీధిలోకి వెళ్ళా.

"వేళాపాళా లేదు ! మరో యింటికి వెళ్ళండి!"



కసురుకొంటోంది శాంతి. రత్తమ్మ మొహం చిన్నబుచ్చుకొంది. కానీ నన్ను చూసిన వెంటనే గట్టిగా ఊపిరి తీసుకొని ధైర్యంగా నిలబడింది. శాంతికి ఆ పేరంటే పెట్టారుగానీ ఆమె స్వభావానికి ఆ పేరు విరుద్ధం! దురుసుతనం ఎక్కువ. అసలు పనిమనుషులు మానెయ్యడానికి ఆమే కారణం! అలా అంటే ఆమెకి కోపంవస్తుంది.

రత్తమ్మా, దాని కూతురూ వీధిమెట్ల మీద నిలబడ్డారు. మంచి ఎండలో వచ్చారేమో మొహాలు మాడిపోయి ఉన్నాయ్! చెమటలు కక్కుతున్నారు. వాళ్ళవేషం అలా వుంది మరి, శాంతి తప్పులేదు అనిపించింది. రత్తమ్మకి పోయిన ఉత్సాహమూ, ఆనందమూ పుంజుకొచ్చాయ్. లక్ష్మి తలవంచుకొని నిలబడింది తల్లి పక్కనే. వయస్సు పదహారేళ్ళుండొచ్చు! తైలసంస్కారం లేని జుత్తు! చినిగిన బట్టలు! అయినా అందమయిన మొహం!

"రా రత్తమ్మా!" అన్నా.

రత్తమ్మ సంకోచిస్తున్నట్టు నెమ్మదిగా వరండాలో అడుగుబెట్టింది. ఆమె వెనుకనే లక్ష్మి! శాంతి నా వేపు చిరాగ్గా చూసింది.

"ఆ పిల్ల నీ కూతురు కదూ?" అడిగా.

నా పలకరింపుకు ఎంతో సంబర పడుతూ, "అవును బాబూ ! లచ్మి !" అంది.

శాంతి మాటాడకుండా గదిలోకి పోయింది.

"రండి లోపలికి !" అంటూ నేనూ గదిలోకి దారితీసా. నా వెనుకనే రత్తమ్మా, లక్ష్మి వచ్చారు. నేను మంచంమీద కూర్చున్నా. తల్లీ, కూతు ళ్ళిద్దరూ గది లోపలి గుమ్మంలో కూర్చున్నారు. శాంతి టేబిలు దగ్గరున్న కుర్చీలో కూర్చొంది మాటా మంతీ లేకుండా.

"విశాఖపట్నం వచ్చాక మరి మన ఊరు రావడమే మానేసారు ! పాపం పోలయ్య పోయాట్ట !"

మాటల్లోకి దింపా.

అంతా వివరంగా చెప్పింది రత్తమ్మ.

* * *

పోలయ్యకి జబ్బు ఎక్కువయాక విశాఖపట్నం పెద్దాస్పత్రిలో జాయిన్ చేసార్ట ! మూడునెలలు హాస్పిటల్లో వున్నాట్ట ! జబ్బు నయంకాలేదట ! హాస్పిటల్లోనే చనిపోయాట్ట. ఎక్కడో తెల్సినవాళ్ళ గుడిసెల్లో వుండేవారట! రత్తమ్మ కొడుకు రాములు అప్పుడే రిక్షా తొక్కడం ప్రారంభించేడుట ! పోలయ్య పోయాక యిక్కడనే వుండి పోవాలనుకొన్నారుట, ఎక్కడైనా రెక్కల కష్టంమీదనే బతకాలిగదా అని. రోజుకి రెండూ మూడూ తెచ్చేవాడుట రాములు. కాలక్షేపం కష్టంగా వుండి రత్తమ్మ షిప్‌యార్డు వాళ్ళకీ పోర్టులో వాళ్ళకీ కారియర్లు మోయడం మొదలు పెట్టిందట. రెండు సంవత్సరాలు పోయాక రాములుకి పెళ్ళిచేసిందిట ! రాములు కొంతకాలం బాగానే వున్నా డుట. తర్వాత త్రాగుడూ, బ్రాకెట్టూ నేర్చాట్ట! ఇంటికి డబ్బుతేవడం పూర్తిగా మానేసాట్ట ! ఇల్లు గడవటం కష్టంగా వుండి రత్తమ్మ కోడలూ, కూతురు లక్ష్మికూడా కారియర్లు మోయడం ప్రారంభించారుట. రాములు ఎప్పుడొస్తాడో ఎలా వస్తాడో తెలీదట ! బాగా తాగి వచ్చి గిన్నినిండా అన్నం పెట్టకపోతే పెళ్ళాన్ని చితకబాది పోతా డుట ! వాడు యింటికి వచ్చాడంటేనే భయంట వాళ్ళకి.

వాళ్ళకి దగ్గరివాడే ఒకడు పోర్టులో కళాసీగా పనిచేస్తున్నాడుట. లక్ష్మిని పెళ్ళిచేసుకొంటా నన్నాడుట ! వాడికి నెలకి మూడొందలు వస్తాయట ! పెళ్ళి చేయడానికి డబ్బుకోసం చూస్తోందిట రత్తమ్మ. తల్లీ కూతుళ్లూ రహస్యంగా నూట ఎనభయి రూపాయిలు కూడ బెట్టారట! అయిదు వందలయినా కూడేక లక్ష్మికి పెళ్ళిచేయా లనుకొంటోందిట ? ఆ మధ్య అకస్మాత్తుగా పెళ్ళికొడుకు వచ్చి ఓ షరతు పెట్టాడుట! "లక్ష్మిచేత కారియర్లు మోయిస్తే ఒప్పుకోను !"

అని. అందుచేత లక్ష్మి మూడునెలలబట్టి యింటిదగ్గరే వుండిపోతోందిట ! ఆదాయం తగ్గిపోయింది ! ఇక్కడ ఒక్క కానీగూడా మిగల్చలేకపోతోం దిట! కొడుకు చూస్తే ఆ తీరు ! లక్ష్మికి పెళ్ళి ఎలా చెయ్యడమా అని బెంగ పెట్టుకొందిట.

* * *

రత్తమ్మ కథవిన్నాక నాకన్న ఎక్కువగా శాంతే సానుభూతి చూపింది. ఆ పైన శాంతితో తక్కిన విషయాలు నేను చెప్పాను.

పోలయ్యా, రత్తమ్మా మా ఊళ్లో మా యింట్లోనే పనిచేసేవారు. రత్తమ్మ యింట్లో పనిచేస్తూ వుండేది. పోలయ్య మాకు పాలేరు ! అమ్మకి యిప్పటిలాగే అప్పుడూ ఏదో ఒక అనారోగ్యం. అమ్మకు అన్నివిధాలా సాయంగా వుండేది రత్తమ్మ. పోలయ్యకి అకస్మా త్తుగా జబ్బుచేసింది. మా ఊరిలోనే ఆచారిచేత నాటుమందు లిప్పించారు. కానీ పూర్తిగా నయంకాలేదు. అశ్రద్ధ చేసారు చాలాకాలం ! ఉన్నట్టుండి ఓనాడు జబ్బు తిరగబెట్టింది. పోల య్యనూ. పిల్లలనూ తీసుకొని రత్తమ్మ విశాఖపట్నం వచ్చేసింది. ఆ తర్వాత పదేళ్ళయ్యాక యిదే చూడ్డం!

"అన్నయ్యగారికి పిల్లలా బాబూ ?" అడిగింది రత్తమ్మ.

"ఆఁ ఇద్దరు పిల్లలు ! అమ్మకూడా అన్నయ్యదగ్గరే వుంటోంది హైదరా బాదులో. చెల్లిని బెజవాడ యిచ్చాం !" చెప్పాను వివరంగా.

"మా లచ్మి, మీ చెల్లెమ్మా ఒక్కీడు వారు బాబూ !" అంది బాధగా. తన కూతురి కింకా పెళ్ళిచేయలేదని.

"చెల్లమ్మ కడుపు పండిందా బాబూ ?" మరలా అడిగింది.

"లేదు ! పెళ్ళయి రెండేళ్ళే అయింది ?" మాటలు కలుపుతూ జవాబి చ్చింది శాంతి.

శాంతి కాఫీ తెచ్చి వాళ్ళిద్దరికీ కూడా యిచ్చింది.

"అమ్మగోరు లచ్మీదేవి లాగున్నారు బాబూ ! ఈడూ జోడూ సరిపోనాది !" మెచ్చుకొంది కాఫీ గ్లాసులు అందు కొంటూ.

లక్ష్మి ఏమీ మాట్లాడలేదు. చిరుగుల పవిటను కూడదీసుకొని సర్దుకొని కూర్చుంది.

"అయితే నీ కూతురిచేత ఏ పనీ చేయించడం లేదన్నమాట !" అడిగింది శాంతి నా వైపుచూస్తూ. ఆమె ఉద్దేశం నా కర్థం అయింది. అయినా కలుగ జేసుకోలేదు.

"ఏం చైమంటారమ్మగోరూ ! ఆడు సూత్తే అలా కట్టడిబెట్టాడు! ఇరుద్దంగా సేత్తే పెళ్ళిచేసుకోనంటా డేమోనని బ ం!"

"అవును మరి! కాలంతో వున్న పిల్ల! రోడ్లవెంట తిరుగుతే ఏ మగాడు ఒప్పుకొంటాడు!" అంది శాంతి ఏదో అడగడానికి నాందిగా.

వాళ్ళ సంభాషణలు వింటూ మౌనంగా వుండిపోయా.

"రోజులు గడవటం కష్టంగా వుందమ్మ గోరూ! ఇంటికాడ కూకుంటే మాలాంటోళ్ళ కెలా జరుగుద్ది!"

"పోనీ ఓ పనిచేయరాదూ? గుట్టుగానూ మర్యాదగానూ వుంటుంది!" ఏదో అడగబోతోంది శాంతి.

"ఏంటమ్మగోరూ?" ఆశగా ఆసక్తిగా అడిగింది రత్తమ్మ.

"మేమేమీ మీకు కొత్తగాదుగా? లక్ష్మిని మా యింట్లో పనిచేసుకోమను! జీతం అంటావా? మీ అయ్యగారిష్టం! నా మట్టుక్కు నేను స్వంతపిల్లలా చూసుకొంటా!" అంది శాంతి నావైపొక సారి చూసి. నేనేమీ కలుగజేసుకోలేదు కాబట్టి మౌనంగా వుండిపోయా.

"నాకు తెల్సమ్మగోరూ! మిమ్మల్ని సూడగానే అనుకొన్నా! లచ్మి దేవమ్మని! అలాగే పంపిత్తానమ్మ గోరూ! జీతం రమేస్ బాబెంతిస్తే అంత!"

కృతజ్ఞతతో ఆమె కళ్లు మెరిసాయ్.

ఆ రోజునుంచీ మా పనిమనిషి సమస్య తీరిపోయింది! రెండు పూటలా వచ్చి శుభ్రంగా పనిచేస్తోంది లక్ష్మి. ముఖ్యంగా శాంతికి తృప్తిగా వుంది. నా కారియర్ మోయడానికి కూడా రత్తమ్మనే కుదుర్చుకొన్నా. నెలలు గడుస్తున్నాయ్! లక్ష్మి మా యింట్లో మనిషిగా అయిపోయింది. ఆమె లేనిదే ఓ పూటకూడా జరగదు. ఏవైనా అవాంతరాలూ అడ్డంకులూ వస్తే అప్పుడు రత్తమ్మ వచ్చి చేస్తూవుండేది. లక్ష్మి రానందుకు ఆ మూడురోజులూ కొట్టుకుపోతుంది శాంతి. ఆ మధ్య లక్ష్మికి జ్వరంవస్తే విలవిల్లాడిపోయింది శాంతి. పనిచేసుకొందుకు విసుక్కోలేదు. ఆమె ఆరోగ్యం గురించి బెంగపెట్టుకొంది కూడా. అయిదోరోజున లక్ష్మి వచ్చింది పనిలోకి. ఆమెను చూసి ఎంతగానో బాధపడింది

"ఎంతలా చిక్కిపోయావే ఈ నాలుగు రోజులకి! మరో రెండురోజులు రెస్టు తీసుకోలేకపోయావా? ఏం తొందరొచ్చింది!"

నిద్రమంచంమీదనే వున్న నాకు శాంతి మాటలు విన్పించాయ్.

"బాగానే వుందమ్మగోరూ! కొంచెం నీర్సంగా వుందంతే! 'అమ్మగారు వట్టి మనిషి కూడా గాదూ మెల్లిగా వెళ్ళి పని చేసుకొనిరా!' అని అమ్మ చెబితే వచ్చానమ్మగోరూ!"

జవాబిచ్చింది లక్ష్మి.

"సరే వచ్చేవుగానీ ఏ పనీ చెయ్యక్కర్లేదు! అలా కూర్చో! ముందీ కాఫీ

తాగు ! మధ్యాహ్నం ఎండలో వెళ్ళి రావడం కష్టం ! నాలుగు మెతుకులు యిక్కడనే తిందువుగాని ! అలసట అయితే మళ్ళా తిరగబెడుతుంది ! తెల్సిందా ?"

అభిమానంగా అదమాయించింది శాంతి. లక్ష్మి ఏమీ మాట్లాడలేదు. కాఫీ త్రాగుతోంది కాబోలు !

"చిన్న చిన్న పనులు చెయ్యి ! బాబు గారు లేచాక వేడినీళ్ళు తొరుపు!"

శాంతికి ఆమెమీదనున్న ఆప్యాయతకీ అభిమానానికీ ఆశ్చర్య పోయాను. ప్రేమా ఆదరణా బలవంతాన ఎవరికీ కలిగించలేము. శాంతిని మనసులోనే అభినందించా.

శాంతిని వేళాకోళంగా. అడిగా ఆ నాటి రాత్రి.

"లక్ష్మిని సొంత చెల్లెలుగా చూసుకొంటున్నట్లున్నావ్ !"

"కాబోయే పెళ్ళి కూతురు! ఎంతలా చిక్కిపోయిందో చూడండి ! పాపం !" అంది మంచం పట్టిమీద కూర్చొంటూ.

నిజానికి మా యింట్లో చేరాకనే లక్ష్మి శారీరకంగా పెరిగింది. ఆమె నెమ్మదీ అమాయకత్వమూ అణకువా శాంతిని బాగా ఆకర్షించాయ్. లక్ష్మి మా యింట్లో చేరి ఆరునెల్లయింది. ఈ ఆరునెలల్లోనూ మూడు చీరలూ, నాలుగు జాకెట్లు యిచ్చింది. ఓ పూట భోజనం కూడా మా యింట్లోనే. రెండు పూటలా కాఫీ, పదిరోజుల కోసారి సినిమా చూడ్డానికి డబ్బులూ ! టిఫిన్లు సరే సరి ! శాంతి ఎప్పుడైనా ఎవరింటికైనా వెళితే యింటిని లక్ష్మికి అప్పజెప్పి వెళ్తుంది. ఆమె లేనిదే ఓ పూటయినా గడవని పరిస్థితి ఏర్పడింది. నాకూ అభిమానం వున్నా బయటకు చూపలేదు. ఎందుకయినా మంచిదని—ముఖావంగా, చూసీ చూడనట్టు అంటీ అంటనట్టుగా మసలేవాణ్ణి.

* * *

"ఏవండీ ! మీ దెంత రాతి గుండెండీ!" అంది శాంతి అకస్మాత్తుగా సందర్భంలేకుండా.

ఆమె మాటలు అర్థంకాలేదు. అలాగే చూసా శాంతివైపు.

"సినిమా చూడు! లేకపోతే గాజులు వేయించుకో ! అని ఎప్పుడైనా లక్ష్మి చేతిలో ఓ అర్ధరూపాయి డబ్బులు పడేసారా?" నిష్ఠూరంగా అంది.

లక్ష్మిమీది వాత్సల్యమే ఆమెచేత ఈ నిష్ఠూరోక్తుల్ని పలికించినందుకు నా శరీరం పులకరించింది ఆనందంతో. అయినా బయటకు తెలీనీయలేదు.

"నీవే యిస్తున్నావ్‌గా పదిరోజుల కొకసారి ! ఇంకా నేనెందు కీయడం ?" అన్నా అయిష్టతగా. నా సమాధానం ఆమెకు నచ్చలేదు.

"బావుంది! అయ్యగా రిచ్చారంటే అదోరకం ఆనందం వాళ్ళకి ! నిజానికి

అది చేసే చాకిరీకి మనం యిచ్చే డబ్బే పాటి? డబ్బిచ్చి పనిచేయించుకోగలం కానీ అభిమానాన్ని కొనగలవా చెప్పండి!"

"ఊఁ సరేలే!" అన్నా అంతగా సుముఖత కనబర్చకుండా.

"ఊఁ అంటేకాదు! దసరా యింక అయిదురోజులే వుంది! ఏమిస్తారో మీ చేతుల్తోనే ఈయండి! కానీ ఒకటిమాత్రం గుర్తుంచుకోండి! పనిమనిషికి యిస్తు నట్లుగామాత్రం యివ్వద్దు! తెల్సిందా?" హెచ్చరించింది - ఘనంగా వుండాలని ఆమె అభిలాష.

"అయితే అమ్మగారి అభిమానాన్ని అపారంగా ఆర్జించుకొందన్నమాట! నీ సంతోషమే నా సంతోషం! ఆ తర్వాత లక్ష్మి సంతోషం!" అనేసా అప్పుడే ఓ నిర్ణయానికి వచ్చి.

* * *

"ఇదిగో లక్ష్మి! ఓసారిలారా!" కేకేసా ఆఫీసు కెళ్లానికి బట్టలు వేసుకొంటూ.

ఎదురుగా వచ్చి సిగ్గుతో తలవొంచు కొని నిలబడింది. అంతవరకూ ఆమె నా ఎదురుగా వచ్చి ఎప్పుడూ నిలబడ లేదు. ఆమె వెనుకనే శాంతి కూడా వచ్చింది.

"ఎల్లుండేకదా దసరా! ఈ డబ్బు తీసుకొని ఓ చీరా, జాకెట్టూ కొనుక్కో!" అంటూ మడతపెటిన నోట్లను ఆమెచేతిలో పడేసా. వెంటనే శాంతి మొహంలోకి చూసా. ఆమె మొహం విప్పారింది.

"ఎంతిచ్చారేవిటి అయ్యగారు?" అడిగింది ఆమె నోట వినాలన్న వేడుకతో.

నోట్లు విప్పి లెక్కపెట్టి సంతోషంతో తబ్బిబ్బయింది లక్ష్మి.

"పాతిక రూపాయి లమ్మగారూ!"

"చూడు! మీ అమ్మ కియ్యకు! ఇప్పుడే బజారుకుపోయి చీరా, జాకెట్టు కొనుక్కొని మరీ యింటి కెళ్ళు! తెల్సిందా?" హెచ్చరించింది తనూ సంబరపడుతూ.

శాంతి ఆమోదంతోనూ, ప్రోత్సాహంతోనూ నాలో అంతర్గతంగా వున్న ఆదరణా, వాత్సల్యం పైకుబికాయ్. చనువుతీసుకొని ప్రతి పనీ ఆమెచేతనే చేయించుకొనేవాణ్ణి! నేనంటే ఆమెకూ భయంపోయి చనువు ఏర్పడింది. 'అయ్యగారూ!' అని పిలుస్తూండేది.

ఆ నాడు ఆఫీసు టైమయిపోతోంది. లక్ష్మి వేడినీళ్ళు తొరపలేదు-రెండు సార్లు పిలిచినా పలకలేదు.

"అబ్బబ్బ! కూరలు తేవడానికి వెళ్ళిందండీ!"

దేవుడి గదిలోంచి కేకవేసింది శాంతి శాంతంగా.

మరో అయిదు నిముషాలు గడిచాయ్! కూరలు తేవడాని కింత



ఆలస్యం ఏమిటి చెప్మా అనుకొంటూ వీధి గుమ్మంలోకి వెళ్ళి చూసాం వీధి మలుపులో జనం గుమిగూడి వున్నారు. అందరివీ నవ్వుమొహాలే ! ఏమి జరిగిందో తెలియదు ! లక్ష్మికూడా కొంచెం దూరంగా నిలబడి ముసిముసిగా నవ్వుకొంటోంది. నన్ను చూసి గబ గబా వచ్చేసింది. కూరలు సంచీ గదిలోపెట్టి బాత్‌రూంలోకి వచ్చింది నీళ్ళు తొరపడానికి.

"ఏం జరిగింది ?" అడిగా కుతూహలంగా.

నవ్వు ఆపుకోలేకపోతూ చెప్పింది ఒకడు సైకిలుమీద పోతున్నాట్ట! ముందు హాండిల్‌కు రెండు చిన్న పాల కేన్‌లూ, వెనుక అరటిపండ్ల గెలా వున్నాయట ! సైకిలు కుదుపుకి నాలుగు అరటిపళ్లు రాలి కిందపడ్డాయట. దారిని పోయే కుర్రాళ్ళు గబగబా తీసుకొని తినేసారుట ! సైకిలువాడు అదిచూసి కోపంగా సైకిలు దిగి స్టాండువేసి వాళ్ళ దగ్గరకి పరుగెత్తుకొని వెళ్ళాడుట ! ఆ కుర్రాళ్ళు పారిపోయార్ట ! కుర్రాళ్ళు దొరకలేదుగానీ వాళ్లు పారేసిన అరటి తొక్కలమీద కాలువేసి దబాలున పడిపోయాడుట సైకిలువాడు. నడుము

జెణికిందిట ! ఎలాగో లేచి ఏడుపు మొహంతో సైకిలు ఎక్కబోతూండగా పడిపోయాడుట. అరటిపళ్ళు బాగా మగ్గిపోయాయేమో ! ముద్దముద్దయి పోయాయిట ! ముందునున్న పాలకేన్స్ లోని పాలు నేలపాలయ్యాయిట ! వాడి పరిస్థితి చూసి అందరూ నవ్వులు కురిపించారుట !

నవ్వాపుకోలేక పైకే నవ్వేసింది లక్ష్మి. నాకూ నవ్వాగలేదు. గలగలా నవ్వేసాను.

"...మిటా వికవికలూ, పకపక లూనూ ?"

చటాలున గదిలోంచి ఊడిపడి ఘర్జించింది శాంతి !

"అది కాదమ్మగారూ!..." అంటూ లక్ష్మి ఏదో చెప్పబోయింది. కానీ దాన్ని మాట్లాడనీయలేదు శాంతి.

"పెద్దవాళ్ళతో ఏవిటే ఆ నవ్వులు ? అలాంటివి నాకు నచ్చవ్ !" మొట్ట మొదటిసారిగా కసిరింది – లక్ష్మి చిన్న బుచ్చుకొని తల దించేసుకొంది. నేరం చేసిన వానిలా నేనూ గప్‌చిప్‌గా బాత్ రూంలోంచి బయటపడ్డా

"పనిపిల్లగదా అని నిర్లక్ష్యమూ నిరసనా గాకుండా కొంచెం దయా, జాలీ చూపించమన్నానుగానీ పనిపిల్లతో ఏవిటండీ ఆనవ్వులూ, కేరింతాలూనూ?"

ఆ వేళ రాత్రి అడిగింది. ఎలాగూ అడుగుతుందని నాకు తెలుసు!

"నవ్వొచ్చే యిన్సిడెంటు జరిగిం దట ! చెప్పింది ! నాకూ నవ్వొచ్చింది, నవ్వాను !" అన్నా మామూలుగా. ఆమెలో అనుమానబీజం నాటుకొంది. అది మొలకెత్తింది కూడా.

"పదిహేనురోజులనుంచీ చూస్తున్నా! మీ ప్రవర్తనేమీ బాగుండటంలేదు. బొత్తిగా తువ్వాలు అందీయడానికీ, బూట్లు అందియ్యడానికీ కూడా దాన్నే పిలుస్తున్నారు!"

"అంటే ఏవిటి నీ వుద్దేశం?" చికాగ్గా అడిగా.

"ముందు మీ వుద్దేశం చెప్పండి !" తిరిగి అంది పట్టుదలగా.

"హుఁ స్త్రీ బుద్ధి !" అనేసా పైకే

"అదే ! ఆ స్త్రీ బుద్ధిని తెల్సుకొనే జాగ్రత్తగా మసలుకోమంటున్నా ! అది ఎన్ని కొంపలు తిరిగిందో, ఎన్ని చేతులు మారిందో మనకేం తెల్సు ! పనిపిల్లని నెత్తిమీద కెక్కించుకో కూడదు ! దాని హద్దులో దాన్ని వుంచాలి ! ఎలాగోలాగ వల్లో వేసుకోవాలని చూస్తోంది !" అంది అక్కసుగా.

"శాంతీ !" గట్టిగా అరిచా అసహ నంగా.

"ఏం ? అంత కోపం ! లేకపోతే బాత్‌రూంలో స్నానంచేస్తూంటే ఎదు రుగా నిలబడి సరసాలా ? నవ్వు లాట్లా ? నేనుండగానే ? ఎంత ధైర్యం!

ఆ చనువూ, ఆ అవకాశమూ మీ రిచ్చింది కాదూ !"

*  *  *

పోలయ్యా, రత్తమ్మా యిదివరలో మా యింట్లోనే పనిజేసేవారు. పోలయ్యే జబ్బుమనిషి ! మా అమ్మ ఆస్మా పేషెంటు ! రత్తమ్మ మా యింట్లోనే తిరుగుతూండటంవల్ల రత్తమ్మకీ మా నాన్నగారికీ సంబంధం ఏర్పడింది. తత్ఫలితంగా లక్ష్మి పుట్టింది. ఆ విషయం మా ఊరిలో అందరికీ తెల్సు. కానీ మా శాంతికి తెలియదు. లక్ష్మి నా తోబుట్టువులాంటిది. అదే భావంతో చూస్తున్నా ! ఈ విషయం వివరంగా చెప్పి శాంతిని శాంతింపజేయాలి ! చెప్పినా నమ్ముతుందా ? నమ్మినా నాకలాంటి దురుద్దేశం లేదంటే విశ్వసిస్తుందా ?"

*  *  *

"ఏం మాట్లాడరు ? ఎలా చెప్పి నమ్మిద్దామని ఆలోచిస్తున్నారా ?"

శివమెత్తినట్లుగా తయారైంది శాంతి. ఏమి చెప్పాలో, ఎలా చెప్పాలో అర్థంగాక మౌనంగా వుండిపోయా.

మరలా ఆమే మొదలుపెట్టింది.

"రెండునెల్లో నన్ను పురిటికి పంపేస్తారు ! అప్పుడు దాంతో..."

ఆమె మాటలు వినలేక చేయెత్తా.

"ఏం? కొడతారా? కొట్టండి!"

ఆమె మొండికెత్తింది.

ఆమె మొహంలోకి చూసా. అసూయ ! ఆవేదన !! అమాయకత్వం !!! వెంటనే చేయి దించేసా. నార్మల్ అవడానికి ప్రయత్నించా.

"ఎంత అమాయకురాలవు శాంతీ ! నీవా భయం పెట్టుకోకు ! నీ కన్యాయం చెయ్యను !" అన్నా లాలనగా చూస్తూ.

అయినా ఆమె తృప్తిచెందలేదు. కోపం తగ్గలేదు. ఆ రాత్రి మౌనంగానే గడిచిపోయింది. ఈ సమస్య నెలా పరిష్కరించాలా అని రాత్రంతా ఓ నిర్ణయానికి వచ్చా.

మర్నాడు మధ్యాహ్నం కారియర్ తెచ్చిన రత్తమ్మని అడిగా.

"లక్ష్మి పెళ్ళికి ఎంత కూడబెట్టావ్?" అని.

"ఏది బాబూ, నెలనెలా తవరిచ్చిన డబ్బే దాస్తున్నా ! ఇదివర కూడబెట్టిందంతా కర్చయిపోయింది ! రెండు వందల రూపాయిలున్నాయ్ బాబూ!" చెప్పింది నిరుత్సాహంగా.

"వచ్చే నెల్లో చాలా ముహుర్తాలున్నాయ్ ! పెళ్ళిచేసెయ్ !" అన్నా కారియర్ విప్పుతూ.

"అయిందొందలయినా లేపోతే ఎలా బాబూ ! కట్నం అంటే లేదుగానీ కర్చులుండాలికదా బాబూ !"

డీలాపడి నా కెదురుగా కూర్చుండిపోయింది.

"ఆ మూడొందలూ నేనిస్తా ! పెళ్ళి చేసెయ్! నేను డబ్బిచ్చినట్టు అమ్మ గారికిగానీ, లక్ష్మికిగానీ తెలియకూడదు, తెల్సిందా?"

షరతుపెడుతూ హెచ్చరించాను.

కృతజ్ఞతతో వుక్కిరిబిక్కిరి అయి పోయింది రత్తమ్మ.

"అలాగే బాబూ ! ధర్మాత్ములు నాన్నగారే మీ కీబుద్ధి పుట్టించారు ! పిల్ల పెళ్ళి చేయిస్తున్నారు !"

ఇంకా ఏవేవో అంది.

* * *

"లక్ష్మి పెళ్ళికి ఏవిద్దావండీ?"

ఆఫీసుకు పోతూంటే అడిగింది శాంతి.

"చూద్దాంలే!" అన్నా అయిష్టంగా.

"చూద్దాంలే అంటే కాదు ! పెళ్ళింక రెండురోజులే వుంది!"

నిలదీసింది.

"నెలాఖరురోజులు ! నా దగ్గర డబ్బులేదు ! నీ దగ్గరుంటే నాలుగో అయిదో పెట్టి జాకెట్ పీస్ కొనియ్యి!"

"ఇంకా నయం ! పావలా యిచ్చి పూలు కొనుక్కోమన్నారుగాదు! డబ్బు లేకపోతే నే నొకటి చేస్తా!" అంది.

"ఏం చేస్తావ్ ?"

"కిందటి నెల్లో మీరు కొన్న చీర యిచ్చేస్తా! ఇంకా కట్టుకోలేదు !" అంది దృఢంగా.

"అరవై అయిదురూపాయిల చీరె ! నీకేమయినా మతిపోయిందా ?"

ఆమె ధాతృత్వానికి నిజంగా నాకు మతిపోయింది.

"పెళ్ళికూతురు ! పైగా అంద మయిన పిల్ల! ఆ చీరలో ఎంత బాగుం టుందని ! మీరెన్ని చెప్పండి ! ఆ చీర యివ్వాలనుకొన్నా, యిచ్చేస్తా, అంతే!" అంది.

'స్త్రీ బుద్ధి !' అనుకొన్నా ఈసారి మనసులోనే.

ఆమె నా అనుమతికోసం చూస్తోంది. అది కేవలం లాంఛనప్రాయం మాత్రమే. నేను సమ్మతించకపోయినా ఆమె యివ్వక మానదు! కాబట్టి నేనెందుకు బయటపడాలి.

"సరే నీ యిష్టం !" అనేసి సైకిలు ఎక్కేసా.



# కోరుకున్నది



పి.వి.ఆర్. శివకుమార్

శరవేగంతో పరుగెడుతోంది సూపర్ డీలక్స్. కిటికీల్లోంచి లోపలికి దూసుకొస్తున్న గాలి ఆ వేసవి వాతావరణంలో ప్రయాణీకుల్ని కాస్తంత తేరుకునేలా చేసేందుకు ప్రయత్నిస్తోంది. తిరగటం మాని, మొండికేసిన ఫాన్లు ఆ గాలికేసి నిస్సహాయంగానూ, అసూయగానూ చూస్తున్నాయి. చిలిపిగా

కవ్విస్తూ, వాటిమీదగూడా ఓ విసురు విసుర్తోంది గాలి.

ఇవన్నీ పట్టించుకునే మూడ్లోలేడు శాయి. అతడి మనసంతా ఇప్పుడు 'కస్తూరి' ఆక్రమించుకుంది.

'కస్తూరి! ... తనని కల్సుకు మూడేళ్లు దాటుతోంది. ఎలా ఉందో !

ఇంతకాలం ఆమెని చూడకుండా ఎలా ఉండగలిగాడు ? అంతకుముందు ఒక్కరోజయినా ఆమెని చూడకుండా ఉండగలిగేవాడా ? రోజులో ఒక్క పూటైనా ఆమె సహచర్యంలో గడప కుండా ఉండగలిగేవాడా ?

అప్పట్లో అలానే అనుకునేవాళ్ళు ఇద్దరూ ! ఏ రోజు కలుసుకోలేక పోయినా– ఇద్దరికీ ఆ రోజు గడవదనీ, ఆ రాత్రి నిద్రపట్టదనీ !!

రోజులు కాదు... నెలలూ కాదు... ఏళ్ళకి ఏళ్ళే వెళ్ళిపోతున్నాయి... నిర్వి క్షారంగా, తమ బంధాలతో ఏ సంబం ధమూ లేకుండా !!

ఒక్కసారి నిట్టూర్చాడు శాయి.

'ఎలాగుందో యిప్పుడు కస్తూరి ? ఆ ఉత్సాహం, ఆ చిలిపిదనం, ఆ సౌందర్యం ... అలాగే ఉందా చెలరేగే సెలయేటిలా ?

ఉండదు ! ఎలా ఉ టుంది ? ఆ రోజుల సంతోషం – ఈ రోజున ఉంటే కదా – ఆ ఉత్సాహం మి ిలు ాదేది !

ఇష్టంలేని భర్తతో...ఉత్సాహం లేని కాపురంలో ... నిస్సారంగా బతుకుతూ ...బరువుగా బతుకు గడ పుతూ...

ప్చ్...ఎలా తయారయిందో !

కన్నతండ్రి అయ్యుండీ ఎంత కర్కషంగా ప్రవర్తించాడు మామయ్య! ఆయనా నాడలా ప్రవర్తించి ఉండక పోతే, ఇవాళ తనూ, కస్తూరీ ... ఎంత సంతోషంగా ..

కేవలం డబ్బే జీవిత సర్వస్వం అనుకున్నాడు ! డబ్బుతోనే సుఖ సంతో షాల్నీ, శాంతీ సంతృప్తుల్నీ కొనొచ్చు ననుకున్నాడు. ఎంత పొరబడ్డాడో యీనాడు కూతురి కాపురం చూస్తే తెలి సొస్తుంది !

'రెండు నిండుజీవితాల సంతో షాల్ని తన కాఠిన్యానికి బలితీసు కున్నాడు.

కళ్ళు గట్టిగా మూసుకు, సీటు వెనక్కి జారగిలపడ్డాడు శాయి అతని కళ్ళముందు చీకటి వలయాలు – వాటి వెనగ్గా గతం...

*  *  *

చంద్రశేఖరంగారు పూర్తిగా డబ్బు మనిషి. ఆయనకి తండ్రినించి సంక్ర మించిన ఆస్తి చిల్లిగవ్వలేదు. లేమితో మనిషి ఎంత నికృష్టమైన బతుకు బతకాల్సి ఉంటుందో ఆయనకి బాల్యం లోనే బాగా అనుభూతమైంది. లేనిపోని ఆడంబరాలకి పోయి, తన తండ్రి ఉన్నదంతా తగలేసి యిద్దరక్కలకూ

గొప్ప సంబంధాలు చెయ్యడమూ, ఆ తరవాత వాళ్లతో సరితూగలేక పూర్తిగా కృంగిపోవడమూ – ముఖ్యంగా తనకి సరైన చదువు కూడా చెప్పించలేక ఆయన నానా యాతనలూ అనుభవించి చివరికి కన్నుమూయడమూ— చంద్రశేఖరంగారు కళ్ళు పూర్తిగా తెరుచుకునేలా చేసాయి.

పి.యు.సి. ప్యాసై, తండ్రి లేని స్థితిలో రోడ్డుమీద నిలబడితే, బావగార్లు పలకరించి పట్టెడన్నం పెట్టిన పాపాన గూడా పోలేదు. అక్కలకి అభిమానం ఉండేమోగానీ – ఉంటేమాత్రం అది బావల నిరంకుశత్వం కింద అణిగిపోయింది.

తల్లితో కలిసి ఆ వయసులోనే ఆయన తమ బతుకునావ కష్టాల సముద్రంలో బోల్తాపడకుండా అష్టకష్టాలూ పడవలసివచ్చింది. చిన్నవాడైనా తెలివయినవాడూ, తలలు మార్చి తాకట్టు పెట్టగలవాడూ కావడంతో—ఎవరో వడ్డీవ్యాపారి దగ్గర జీతానికి కుదురుకుని, కష్టపడి చివరికి తనూ ఎదిగాడు – అంతస్థులోనూ, పరపతిలోనూ!

కిట్టనివాళ్లు మోసగాడనీ, తనని చేరదీసిన వ్యాపారుల్నే ముంచి, తాను పైకి తేలాడనీ అంటారుగానీ, యీ అన్నవాళ్ళెవరూ తను కష్టాల్లో ఉన్ననాడు ఏ దారీ చూపలేదు గనుక, యీనాడు తన దారిని తప్పు పట్టే అధికారం వాళ్లకెవ్వరికీ లేదని ఆయన అంటారు.

ఆయన కాస్త పచ్చగా తేరుకునే సరికి బావగార్ల ఆదరాభిమానాలు ఆయన మీద కురిశాయి. అయితే వాటిని ఆయన పట్టించుకోలేదు. చిన్నప్పటి నుంచీ మారుతూ వచ్చిన పరిస్థితులు ఆయన్ని పరమ లౌకికుడిగానూ, కఠినుడిగానూ మార్చేశాయి ఆ కారణంగానే, భేషజాల్తో చితికిపోయిన పెద్ద బావగారి కొడుకు శాయి – చదువు పేరుతో తమ ఊరికే చేరినా, హాస్టల్లోనే ఉండనిచ్చాడు తప్ప, తమ ఇంట్లో ఉండమని మర్యాదకోసం కూడా అనలేదు

అయినా శాయి వారాని కొక్క రోజైనా మామయ్య గారింటికి వెళ్ళేవాడు—మొదట్లో అందుకు ముఖ్యకారణం క్రమంతప్పకుండా ప్రతి ఉత్తరంలోనూ తల్లి పెట్టే పోరుమాత్రమే అయినా, క్రమంగా అతడిని ఆకర్షించి, ప్రతి సాయంత్రమూ అటు వెళ్లేలా చేసింది మాత్రం కస్తూరి అందమూ, కలుపుగోలుతనమూ!

మేనత్త గుణాలు పుణికి పుచ్చుకున్న కస్తూరి, శాయి అన్నా, అతడి మాటలన్నా అభిమానం పెంచుకుంది. వయసులో ఉన్న ఆ ఇద్దరూ తమ మధ్య విస్తరించిన ఆకర్షణకి 'ప్రేమ' అనే పేరు పెట్టుకోవటానికి ఆట్టే ఆలో

చించలేదు. వరసలూ కుదిరినవే గనక జత కుదరటానికి అభ్యంతరాలుంటాయని ఊహించలేదు వాళ్లు !

ఇద్దరూ ఇంత చనువుగా తిరగటం చంద్రశేఖరంగారికి మాత్రం అంతగా రుచించలేదు.

ఇంజనీరింగ్ చెప్పించటానికే డబ్బు లేక, కొడుకుని ఆర్ట్స్‌లో చేర్పించిన బావగారితో — ఇద్దరు పేదవిద్యార్థులకి ఏటా స్కాలర్‌షిప్ లిస్తున్న ఆయన వియ్యమందడం — అన్న విషయాన్ని కలలో గూడా సహించగలస్థితిలో లేడు.

అందుకే, మూడేళ్లు తిరిగి వాళ్ళ ప్రేమ పాకానపడే స్థితికి, వాళ్లు మూడు ముళ్ళమాట ఎత్తే సమయానికి రాక ముందే, భార్యతో సంప్రదించి ఓ గవర్నమెంట్ ఆఫీసర్‌ని అల్లుడుగా ఎన్నుకుని యింటికి తీసుకువచ్చాడు.

కుందనపు బొమ్మలాంటి కస్తూరి — బి. ఏ. చదువుతున్న కస్తూరి — లక్షల ఆస్తికి ఏకైక వారసురాలైన కస్తూరి— అతడికి నచ్చటంలో ఆశ్చర్యం లేకపోయింది.

విషయం తెలిసిన శాయి ధైర్యంగా మామయ్య ముందుకి వెళ్లాడు — తన కోరిక తెలిపాడు.

"చూడు శాయీ ! నువ్వు నా మేనల్లుడివి. అందుకే నీ కెలాటి సహాయం కావాలన్నా అడుగు. తప్ప కుండా చేస్తాను డబ్బు సాయమైనా సరే నా కభ్యంతరం లేదు.

కానీ — నా కూతుర్నే కోరుకునే దుస్సాహసానికి మాత్రం ఒడిగట్టకు.

నా కూతురి మనసు గెలిచావను కుంటున్నావేమో ! అది మాత్రం చాలదు దాన్ని నీ భార్యని చేసుకోవ డానికి.

ఎవరెస్టు శిఖరం ఎక్కినంతమాత్రాన హిమాలయం నీ స్వంతమయి పోతుం దనుకోవటం వెర్రితనం ! ఎక్కినంత వేగంగానూ దిగిపోయి మనుషుల్లో పడక తప్పదు. లేదా, హిమాలయాన్ని కొనగల స్తోమతు నీకుండాలి — అది అసాధ్యం కాబట్టి, అలాటి ఆశలు పెట్టుకోకు.

నా కూతురు బంగారుకొండ. దాన్ని నీలాటి కాబోయే గుమస్తా కివ్వడం నా అభిమతం కాదు. ఇంతకన్న సీరియస్‌గా నన్ను మాట్లాడించబోకు" అన్నాడాయన.

ఇది విన్న కస్తూరి ఏడ్చింది — గోల చేసింది — అన్నం, నీళ్ళు ముట్టనని రాగాలు పెట్టింది.

ఏదీ లెక్కచెయ్యలేదు చంద్రశేఖరం గారు.

అన్నీ వాటంతటవే అణిగిపోయేదాకా ఊరుకున్నారు.

ఆ వెంటనే ముహూర్తం పెట్టిం చారు. కళ్ళు చెదిరేలా పెళ్ళి జరిపిం చారు. స్ఫురద్రూపీ, అందగాడూ

అయిన ప్రకాశం – కస్తూరి పాణి గ్రహణం చేశాడు – ఆ రెండే క్వాలి ఫికేషన్లతోకాక, అంతస్థు కూడా ఉండటంతో !

కాపరానికి వెళ్ళిపోయిన వారం రోజులకే రహస్యంగా ఉత్తరం రాసింది కస్తూరి–

"బావా,

నిన్ను కాదన్న నాన్న నిర్ణయానికి తలొగ్గినందుకు నాకు తగిన శిక్షే పడింది. మా అత్తగారు పరమగయ్యాళి. ఆయన ఓ అమ్మ కూచి. ఆవిడ నోటికి హద్దులేదు – ఆ నోటికి యీ ఇంట తిరుగులేదు. వెరశి నా బతుకు నరకాన పడింది. అయినా నేను బాధపడ్డంలేదు. నాకీ శిక్షపడటం న్యాయమే !

ఏదో నా బాధ నీతోనయినా చెప్పు కోవాలని రహస్యంగా ఈ ఉత్తరం రాస్తున్నాను. జవాబుమాత్రం రాయొద్దు. ఎవరిచేతోపడి అది, ఇంకెన్ని గొడవలు రేపుతుందో..."

అంటూ ఆమె రాసిన ఉత్తరం చూసి కంటతడిపెట్టాడు శాయి. అంతకన్నా ఏంచెయ్యగలడో అతనికీ తెలీలేదు.

క్రమంగా అయిదారు నెలలు గడి చాయి. శాయికి బొంబాయిలో ఓ ప్రైవేటు కంపెనీలో క్లర్క్ పోస్టు రావడంతో ఆ ఊరికి దూరమై పోయాడు.

* * *

చాలీచాలని జీతంతో సతమత మవుతూ అక్కడ బతుకు వెళ్ళదియ్య టమేకాక, చీటికీ మాటికీ ఇంటికి కూడా ఇన్ని వందల మైళ్లురావడం శాయికి సాధ్యంకాలేదు. తల్లీ, తండ్రీ ఎన్ని ఉత్తరాలు రాసినా అందుకే యీ మూడే ళ్లుగా రాలేకపోయాడు.

ఇన్నాళ్ళ తరవాత ఆర్థికంగా కాస్త తేరుకున్నాక, ఇంటికి బయల్దేరాడు.

మూడేళ్లు గడిచినా అతడి మనసు కస్తూరిని మరువలేదు. ఏ కాస్త వ్యవధి చిక్కినా ఆమె మీదికే పరుగులెత్తేది. తల్లిదండ్రులు ఎన్ని సంబంధాల గురించి రాసినా, పెళ్ళిని వెనక్కి నెడుతూ గడిపాడు ఇన్నాళ్ళూ !

'కస్తూరికి అంకితమైన యీ మనసు మరో వ్యక్తిని మళ్ళీ ఆదరించగలదా ? అలా రాజీపడలేనినాడు ఆ వ్యక్తి మను గడనీ చేజేతులా దుర్భరం చేయడమే కాదూ ?'

అనుకుని ఊరుకున్నాడు.

ఇంటికి వచ్చాక తెలిసింది, కస్తూరి భర్త ఇప్పుడు విశాఖపట్నంలో ఉంటు న్నాడని. ఎలాగయినా ఆమెని కలుసు కోవాలనిపించింది.

మళ్ళీ ఏదో పనివంకన విశాఖపట్నం బయలుదేరాడు.

* * *

వైజాగ్‌లో దిగటంతోనే బస్‌స్టాండుకి దగ్గర్లోని ఓ హోటల్లో గది తీసు

కున్నాడు శాయి. అక్కడినించే కస్తూరి భర్తకి ఫోన్ చేశాడు—ఆఫీసుకి.

పరిచయం చేసుకోగానే సంతోషాన్ని వెలిబుచ్చాడు అతను. 'హోటల్లో దిగటం బాగాలేదనీ, నేరుగా తమ ఇంటికే వచ్చి ఉండాల్సిందనీ' అన్నాడు.

ఆ అభిమానం ఎంచేతో శాయికి మింగుడుపడలేదు.

'సాయంత్రం అయిదున్నరకల్లా ఇంటికి వచ్చేస్తాననీ, ఒకవేళ కాస్త ఆలస్యమైనా వెయిట్ చెయ్యమనీ, వెంటనే తన ఇంటికి వెళ్లమనీ - అడ్రసు చెప్పాడు అతను.

ఆ అడ్రసు వెతుక్కుంటూ ఆటోలో కూర్చున్నాడు శాయి. ఆటోలో కూర్చున్నా ఆలోచనలు వదల్లేదు.

'ఇన్నేళ్ళ తర్వాత ఇప్పుడు కస్తూరి దర్శనం ! ఎన్ని కష్టాలు పడుతుందో ! తనామెని చూడగలడా ఆ మారిపోయిన అవతారంతో ? తనని చూసి కళ్లనీళ్లు నింపుకుంటే ? ఏమని ఓదార్చాలి ? తన కసలు మాట పెగులుతుందా ?'

"సార్...ఇదే సందు" అన్న ఆటో డ్రైవర్ మాటల్తో స్పృహలోపడ్డాడు శాయి. ప్రకాశం చెప్పిన బంగళా గుర్తు పట్టాడు.

అనుకోకుండా ప్రత్యక్షమయిన శాయిని చూసి, ఆనందాశ్చర్యాలతో ఉక్కిరి బిక్కిరయింది కస్తూరి.

"రా ... రా ! ఇదేమిటి బావా ? ఇంత హఠాత్తుగా ఊడిపడ్డావేం ? బొంబాయినించి ఎప్పుడొచ్చావ్ ?— కులాసానా ?"

నవ్వుతూ పలకరించింది.

"మూడు రోజులయింది కస్తూరీ బొంబాయినించి వచ్చి. మీరిక్కడున్నారని తెలిసింది. ఉండబట్టలేక వచ్చేశాను," అన్నాడు శాయి.

"లేకపోతే వచ్చేవాడివి కాదా ? భలే వాడివి" నవ్వింది కస్తూరి.

"బాగున్నావా...కస్తూరీ?" భారంగా అడిగాడు శాయి.

"ఆహా! నిక్షేపంలా! కనబడ్డంలా?"

కస్తూరి నిజంగానే బాగుంది ! ఇది వరకటికన్న కాస్త వొళ్ళు చేసింది. ముఖంలో ఉత్సాహం తొణికిసలాడుతోంది !

'కస్తూరి నటించటం బాగా నేర్చుకుంది' అనుకున్నాడు శాయి.

"ఇంట్లో ఎవరూ లేరా ?" నిశ్శబ్దాన్ని చీలుస్తూ అడిగాడు.

"అత్తగారు పోయి ఏడాది దాటింది..."

"అరె !..." అన్నాడు శాయి.

"రా ! వంటింట్లో కూర్చుని కబుర్లు చెబుదువుగాని. నేను టిఫిన్ చేసేస్తాను," అందామె. ఆమె వెనకే నడిచాడతను.

"ఊ... ఏమిటి కబుర్లు ? ఉద్యోగం



ఎలా ఉంది ? పెళ్ళెప్పుడు చేసు కుంటావ్ ?" అందరిలాగే, అంతే మామూలుగా ఆమెవేసిన ప్రశ్న శాయి గుండెల్లో సూటిగా గుచ్చుకుంది.

"పెళ్ళెప్పుడంటావా! మనస్ఫూర్తిగా చెప్పు కస్తూరీ - పెళ్ళిచేసుకున్న నువ్వు ఇవాళ సుఖంగానే ఉంటున్నావా ?"

ఒక్కసారి వెనక్కి తిరిగి అతడి ముఖంలోకి చూసి, తిరిగి తలతిప్పు కుంటూ అంది కస్తూరి-

"నిజంగానే ... నా జీవితం సుఖం గానే ఉంది బావా !"

"అంతే... అంతే ... మన కలలు నీ కెప్పుడూ గుర్తురావా ?"

అతడలా సూటిగా నిగ్గదీస్తాడని ఊహించని కస్తూరి — రెండు నిమిషాలు మాట్లాడలేనట్టుగా ఉండిపోయింది. ఆ తరువాత మెల్లగా అంది :

"నువ్వు ఇవాళ నన్నీ ప్రశ్న వెయ్య కూడదు బావా !"

"నన్ను మరోలా అర్థంచేసుకుం టున్నావా కస్తూరీ? అయితే క్షమించు. నువ్వు పెళ్ళయిన మొదటి వారం లోనే నాకు రాసిన ఉత్తరం నాకింకా గుర్తుండటమూ, మనసారా నువ్వు సుఖపడాలని నే నెప్పటికీ కోరుకొం టూండటమే నేనిలా అడగటానికి కారణం...."

"మొన్న మొన్నటిదాకా, నీకు అప్పుడు రాసినట్టు, నేను కష్టపడిన మాట నిజమే !

అనుకోకూడదుగానీ—మా అత్తగారు పోయినదగ్గర్నుంచే నాకు యీ మనశ్శాంతీ, సుఖమూ లభించేయి !

ఆయన నిజానికి ఏ మర్మంలేని అమాయకులు. తల్లిమాట జవదాటని వారు కావడంతో, ఆమె మాటకు ఎదురు చెప్పలేక అలా ప్రవర్తించేవారు. ఇప్పుడు నా మాట కాదనలేరు ! ఆయన తత్వమే అంత!"

ఆ మాటలు ఆమె మనస్ఫూర్తిగా అన్నవి కాదనిపించినా, తర్కించటం ఇష్టంలేక ఊరుకున్నాడు శాయి.

అయిదున్నరకల్లా వస్తానన్న ప్రకాశం, ఆరు- ఏడు - ఎనిమిది దాటు తున్నా రాలేదు !

"ఏమిటీ, మీ ఆయనింకా రాలేదూ?" అడిగాడు శాయి.

"ఆయన ఒకొక్కప్పుడు యింతే ! ఈ మధ్య ప్రమోషన్ వచ్చిందగ్గర్నుంచీ మరీ బిజీ అయిపోయారు — ఏవో మీటిం గులూ, ఆఫీసు పనులూనూ ! నువ్వు భోంచేసెయ్" అంది కస్తూరి.

తొమ్మిది దాటుతున్నా అతను రాక పోవటంతో, శాయి భోంచేసేశాడు. వెళ్ళిపోతానంటే ఊరుకోలేదు కస్తూరి.

"ఆయనొస్తారుగా ! రేపుదయం వెళ్ళొచ్చులే" అంటూ ఉంచేసింది.

తనకోసం ఏర్పాటుచేసిన గదిలోకి వెళ్ళి, పక్కమీద వాలాడు.

అర్ధరాత్రవుతుండగా వచ్చాడు ప్రకాశం. దబదబ తలుపులు బాదాడు. తలుపు తీసిన కస్తూరి, "ఏమే — ఇంతా లస్యం దేనికే తలుపు తియ్యటానికి ?" అంటూ ముద్దముద్దగా అరిచిన అతడి అరుపుకి, "గట్టిగా అరవకండీ ! మా బావ వచ్చాడు. పడుకున్నాడు." అని ప్రాధేయపడటంతో, అతను మరింత రెచ్చిపోయి, "ఎవడే ఆ బావ ? నేనింటో లేకుండా చూసి నీ బావల్ని పిలిపించుకుంటున్నావా ?" అంటూ మళ్ళీ అరిచాడు. ఆ వెనకే దభీ, దభీమని చప్పుడు, సన్నని గొంతుతో కస్తూరి ఏడుపు-

బర్ర్... బర్ర్ ... మన్న కాలింగ్ బెల్ మోతకి చటుక్కుమని మెలుకువ వచ్చింది శాయికి.

హలో డాళింగ్ ! వెరీసారీ - ఆలస్యం శృతిమించింది !" అంటున్న ప్రకాశం గొంతు వినపడింది. ఆ వెనకే బూట్లచప్పుడు.

"నా కిది మామూలేగానీ — ఇవాళ మా బావ వస్తాడని తెలిసీ ఇంతాలస్యం చేయడం..."

"అరెరె. నిజమే కదూ ! ఆయన వస్తున్న మాటే మర్చిపోయాను వెధవ మీటింగ్ గొడవల్లో పడి ! సాయంత్రం అనుకోకుండా హెడ్డాఫీసునుంచి మా




డైరెక్టర్ వచ్చాడు ! ఇప్పటిదాకా ఆయన్తోనే...వచ్చారా మీ బావ ?"

"ఆ ! భోజనంచేసి, పడుకున్నాడు గూడాను !"

"రేపుదయం మాట్లాడుకోవచ్చులే తీరిగ్గా ! ఆకలి దంచేస్తోంది – భోజనం వడ్డించు."

"ఇంత సేపూ మీటింగులో ఏమీ తిన్లేమా ?" చిలిపిగా వినిపించింది కస్తూరి గొంతు.

"ఎక్కడ ఏవితిన్నా – నీ చేతి మీదుగా రెండు ముద్దలు తింటేనే కదూ ఆకలి తీరేది..."

"చాల్లే పదండి."

ఇద్దరూ మధ్య గదిలోంచి డైనింగ్ రూములోకి వెళ్ళినట్టు గ్రహించాడు అడుగుల చప్పుడుని బట్టి, శాయి.

ఇప్పుడు శాయి గుండెల్లో సన్నని మంట !

'అయితే కస్తూరి నిజంగానే సుఖంగా ఉంటోందన్న మాట !' అనుకున్నాడు మనసులోనే !

కస్తూరి బతుకు కష్టాల పాలయిందేమోనని బాధపడుతూ, అలా కాకూడదనీ, ఆమె సుఖంగా ఉండాలనీ దేవుణ్ణి కోరుకుంటూ ఇంతదూరం వచ్చినా, తను కోరుకున్నది నిజమై, ఆమె సుఖంగా ఉందని తెలిసేక ఇంకా తన గుండెలో ఈ మంట దేనికో అర్థంకాలేదు శాయికి !!




ఇది కథ కాదు; జీవిత పథంలో నాకు ఎదురయిన ఒక విచిత్ర వ్యక్తిని ఇతరులకు పరిచయం చేయాలనే ప్రయత్నం.

నేను మూర్తిని కలుసుకున్నది డెహరాడూన్‌లో. నా భర్త రాజు అక్కడి గవర్నమెంటు హాస్పటల్‌లో డాక్టరు. ఒకరోజు మధ్యాహ్నం హాస్పిటల్‌నుంచి నాకు ఫోన్‌చేసి చెప్పారు. ఈ రోజు ఒక తెలుగాయనను కలుసుకున్నాను. ఆయనది విజయవాడట. సాయంత్రం అయిదు గంటలకు మన ఇంటికి ధమ్మని ఆహ్వానించాను."

సాయంత్రానికి టిఫిన్, కాఫీ తయారు చేసి మావారికోసం, ఆ గెస్టు కోసం ఎదురుచూస్తూ కూర్చున్నాను. ప్రవాసాంధ్రులమైన మాకు మన వైపునించి, అందులోనూ స్వస్థలమైన విజయవాడ నుంచి ఎవరయినా వచ్చారంటే ప్రాణం లేచివచ్చినట్లు ఉంటుంది!

అంతలోనే రాజువద్దనించి మళ్ళీ ఫోన్‌కాల్ వచ్చింది——"హాస్పిటల్‌లో



అధికారాన్ని దుర్వినియోగం చేస్తూ ప్రజాకంటకు లుద్భవించినప్పుడు.

అర్జెంటు కేస్ వచ్చింది. శ్యామా ! ఇంటికి రావటం ఓ గంట ఆలస్య మవుతుంది. నేను ఆహ్వానించిన వ్యక్తి ఈ లోపలే వస్తే, నేను వచ్చేదాకా ఉండమని చెప్తావు కదూ ?"

సరిగ్గా అయిదు గంటలకు కాలింగ్ బెల్ మ్రోగింది. తలుపు తీశాను. చేతిలో బ్రీఫ్‌కేస్ పట్టుకొని ఎదురుగా నిలబడి ఉన్న యువకుడు ఆకర్షణీయంగా ఉన్నాడు.

"డాక్టరుగారు ఉన్నారా ?" మర్యాదగా అడిగాడు.

"త్వరలోనే వస్తారు. లోపలికి రండి !"

"నా పేరు మూర్తి..."

"నాకు తెలుసు ఆయన ఫోన్‌చేసి చెప్పారు" లోనికి దారితీస్తూ అన్నది. కుర్చీలో కూర్చోమని. చెప్పి "అనుకోకుండా అర్జెంట్ కేసేదో వచ్చిందిట. రావటానికి కాస్త ఆలస్య మవుతుందన్నారు" అని చెప్పాను నేనూ కూర్చుంటూ.

విజయవాడేటకదా ? మీ ఇల్లెక్కడ ఆ ఊర్లో ?"

అతనికి ఆ ప్రశ్న ఎందుకో అట్టే రుచించినట్లు లేదు. కుర్చీలో ఇబ్బందిగా కదులుతూ అన్నాడు. "విజయవాడ నా స్వంత ఊరే కానీ, చాలా కాలం క్రితమే నేను ఆ ఊరు వదిలిపెట్టాను. నాకు

ఆ ఊరితో ఇప్పుడు పెద్దగా కాంటాక్ట్స్ లేవు."

కొద్ది నిమిషాలు నిశ్శబ్దంగా గడిచాయి అతను ఏమైనా మాట్లాడుతాడేమోనని కాస్సేపు ఎదురుచూశాను. అపరిచిత వ్యక్తి... పెద్దగా కబుర్లు చెప్పేరకం లాగా లేడు, ఏం మాట్లాడాలో నాకూ తోచలేదు. అతనికి నాలుగు మాగజైన్స్ న్యూస్ పేపరు అందించి లోనికి వచ్చేశాను.

దాదాపు అరగంట గడిచినా రాజు రాలేదు ఒక్కడినే ఇంత సేపు కూర్చో బెట్టడం మర్యాద కాదనిపించి, టిఫిన్ ప్లేటు తీసుకొని హాల్లోకి వెళ్ళాను. అతను బ్రీఫ్ కేస్‌లో తెచ్చుకున్నాడేమో, చిన్న చెస్‌బోర్డ్‌ని టేబిల్ పైన పెట్టి, ఒక్కడే ఆడుకుంటున్నాడు.

"ఒక్కరినే కూర్చోబెట్టేశాను, బోర్ కొడ్తున్నదేమోనని భయపడుతూ వచ్చాను ! మిమ్మల్ని మీరు బాగా ఎంటర్‌టెయిన్ చేసుకుంటున్నట్లు న్నారు..." నవ్వుతూ అన్నాను.

తీవ్రాలోచనలోనించి డిస్టర్బ్ చేయ బడినట్లు ఉలిక్కిపడి, తలెత్తాడు అతను "ఓ మీరా ! నాకు చదరంగం అంటే చాలా ఇష్టమండి" అన్నాడు. సంజాయిషీ ఇస్తున్నట్లు.

పది నిమిషాల తర్వాత కాఫీ కప్‌తో హాస్టల్లోకి అడుగుపెట్టిన నాకు చాలా ఆశ్చర్యమనిపించింది. అతను టిఫిన్ ముట్టుకొనేలేదు. చెస్‌బోర్డుని చూస్తూ దీర్ఘంగా ఆలోచిస్తున్నాడు. మధ్య మధ్యలో పావులు కదిలిస్తున్నాడు.

"టిఫిన్ తీసుకోనేలేదు !" అన్నాను.

నా మాట వినిపించుకున్నట్లు లేదు ఆటగురించే ఆలోచిస్తున్నాడు.

మరో కుర్చీలో కూర్చుని "ముందు ఫలహారం కానివ్వండి, చల్లారిపోతున్నది." అన్నాను, కాస్త గట్టిగా.

ఉలిక్కిపడి తలెత్తాడు. "ఓ టిఫినా ? థాంక్స్" అని తినసాగాడు. "మీరిచ్చిన న్యూస్‌పేపర్లో ఒకచెస్ ప్రాబ్లమ్ ఉన్నది. అది సాల్వ్‌చేయాలని ప్రయత్నిస్తున్నాను నాకు చదరంగం ఉంటే చాలునండి, నిద్రాహారాలు అక్కర్లేదు !"

"క్రితం జన్మలో రష్యన్ అయి ఉంటారు; వాళ్ళకీ అంతేనట!" నవ్వుతూ అన్నాను "మీకు ఇంత ఆసక్తి ఎలా ఏర్పడిందో చెప్పండి. వినాలనిపిస్తున్నది."

కాఫీ కప్ చేతిలోకి తీసుకుంటూ అడిగాడు. "మీరు సైకాలజీ గురించి చదివారా ఎప్పుడయినా ?"

"బి.ఏ. లో నా సబ్జెక్టు సైకాలజీయే నండీ !"

"అలాగా ?.........చదరంగంపట్ల అభిమానం అనేది నా జీవితంలో ఓ ముఖ్యాంశం. ప్రేమకోసం, డబ్బుకోసం పేరుకోసం — ఇంకా ఎన్నిటికోసమో అన్వేషిస్తూ జీవితం సాగిస్తూంటారు




ఒక వర్గపు అభిమానంకోసం యితర వర్గాలను కష్టనష్టాలకు గురిచేస్తే...

మానవులు. ఎంతో రిస్కు ఉన్నదని తెలిసినా కారురేసుల్లో పాల్గొంటారు. క్రికెట్ ఆడలో కాళ్ళు విరిగినా, కళ్ళు పోయినా, తిరిగి క్రికెట్ ఆడుతూనే ఉంటారు రాత్రింబవళ్ళు విజ్ఞాన పరిశోధనలు చేసేవాళ్ళు. ఏదో రెండువేల సంవత్సరాల క్రితం ఒక ప్రాంతపు ప్రజలు ఎలా జీవించారనేది తెలుసుకోడానికి జీవితాన్నంతా వినియోగించేవాళ్లు నాటకాలు వేయటంలో, చిత్రలేఖనంలో సాహిత్యంలో ఆనందం కోసం జీవితాన్ని వెచ్చించేవాళ్ళు.......ఉన్నారు ! ఇక వ్యసనాల సంగతి చెప్పనే అక్కర్లేదు... నేను జీవితంలో అన్నిటికీ మించిన ప్రేమను చదరంగానికి యిచ్చాను..." సడెన్‌గా ఆపాడతను. ఓ క్షణంపోయాక

"ఆఁ తెలిసింది ! ఈ గుర్రాన్ని ఇటు పెడ్తే ప్రాబ్లమ్ సాల్వ్ అయిపోతుంది" అంటూ గబగబా పావులు కదల్చాడు. ముఖంలో విజయ గర్వం కనిపిస్తున్నది.

మనిషి మాటలధోరణి చూస్తే తెలివయిన వ్యక్తిలాగే ఉన్నాడు. ఇతని చదరంగం. 'పిచ్చి' ఆసక్తి దాయకంగా ఉంది !

పావులన్నీ కదిపేసి, తిరిగి సరిగా సర్దసాగాడు. ఎంతసేపటికీ మాట్లాడక పోవటంతో నేనే అడిగాను.

"ఈ ఆసక్తి ఎలా ఏర్పడిందో చెప్పారు కాదు ?"

"నా తల్లితండ్రులు నా చిన్నతనంలోనే చనిపోవటంవలన రిటైరయిన పెదనాన్నగారి వద్ద పెరిగాను. ఏ కార

ణము చేతనో అతను పెళ్ళిచేసుకోలేదు. ఆయన నన్నెప్పుడూ ఆప్యాయంగా దగ్గరకు తీయలేదు. అలాగని చికాకుపడి, ద్వేషమూ చూపించలేదు. కేవలం నిర్లిప్తంగా ఉండేవారు. వంటమనిషి వంట చేసి పెడ్తే తిని, నా దారిన నేను పెరిగాను.

"మా పెదనాన్న గారికి రెండే వ్యాపకాలు ఒకటి స్నేహితులతో, పిచ్చాపాటీ రెండవది చదరంగం ఆడటం. స్నేహితులతో పెదనాన్నగారు చదరంగం ఆడటం మొదలుపెట్టారంటే, కొన్ని గంటలు గడిచినా లేచేవారు కాదు. ఆ సమయంలో పలుకరిస్తే ఆయనకు చాలా కోపం వచ్చేది. నేను అప్పుడప్పుడు వాళ్ళ ఆట చూస్తూ కూర్చునేవాడిని బాగా చిన్నప్పుడు ఆట సరిగా అర్థమవకపోయినా, అది యుద్ధరంగమని, గుర్రాలు, ఏనుగులు, భటులు మొదలైనవారంతా యుద్ధం చేస్తున్నారని తెలిసేది, ఆ యుద్ధంలో ఎన్నో నిబంధనలు—అవన్నీ పాటిస్తూ రాజుని బందీచేయాలి; ఎవరు చేయగలరనేది పోటీ—అంతవరకు అర్థమయేది. నిజంగా రాజు. ఏనుగులు అన్నీ ఉన్నట్లే ఊహించుకుని ఆటలో లీనమయ్యేవాడిని క్రమంగా పావుల నడకలు, నిబంధనలు ఎత్తులు, పై ఎత్తులు—అన్నీ అర్థమవసాగాయి. అది నిజమైన యుద్ధం కాదని రెండు మనసుల మధ్య పోటీ అని తెలిసాక కూడా ఆటపట్ల ఆసక్తి నాలో పోలేదు. చూడండి.... నిజజీవితంలో నేను ప్రేమాభిమానాలు అనుభవించింది లేదు. ఇంట్లో తల్లి తండ్రుల, తోబుట్టువులమధ్య పెరగకపోవడంతోశారీరకంగా మానసికంగా కూడా ఒంటరితనం బాగా అలవాటయింది. అందువలన నామనసులో ఏర్పడిన శూన్యాలను చదరంగం నింపిందనుకుంటా...

చదరంగం ఆడుతున్నంత సేపూ నేనొక చిన్నసైజు దేవుడిని — రాజులు మంత్రులు, రథాలు, గుర్రాలు అన్నీ నా ఆజ్ఞమేరకు నడుస్తాయి. నాకు వాటిపైనున్న అధికారం అనంతమైనది. ఆ అధికారం నాకు ఎంతో తృప్తిని ఇచ్చేది. అందుకే చదరంగం ఆట ఎంతో థ్రిల్లింగ్‌గా ఉందనుకొనేవాడిని చెప్పటం ఆపా డతను కాస్సేపు.

చీకటిపడుతున్నది. లేచి లైటువేసి పనిమనిషిని పిలిచి, ఫ్లాస్క్‌లోని కాఫీ రెండు కప్పుల్లో పోసి తెమ్మని చెప్పాను.

"మళ్ళీ ఎందుకండీ ? ఇప్పుడేగా త్రాగాను" అంటూ మొహమాటపడ్డాడు.

"కాఫీయేగా, ఎన్నిసార్లయినా త్రాగవచ్చు !"

తిరిగి చెప్పసాగాడు — "నేను స్కూల్ ఫైనల్ పూర్తిచేసిన కొద్ది రోజులకే పెదనాన్నగారు చనిపోయారు. ఆయన మిత్రుల సలహా మేరకు ఇంట్లో ఒక గదిలో నేను ఉండి, మిగతా




కార్యక్రమాలను అమలుజరపడంలో తీవ్ర ధోరణి అవలంబిస్తే...

ఇల్లంతా అద్దెకు ఇచ్చి కాలేజీలో చేరాను. ఆ కొద్ది అద్దెతో ఎంతో కష్టంమీద కాలం గడుపుతూ బి.ఏ. పూర్తిచేశాను. ఎంత ప్రయత్నించినా ఉద్యోగం దొరకలేదు. అద్దె డబ్బులతో రోజులు గడవటం మరీ కష్టమవసాగింది. క్రమంగా ఇంట్లోని అమ్మదగిన సామానంతా అమ్మసాగాను. పెదనాన్నగారి వద్ద నున్న చెస్‌బోర్డు పావులు చాలా విలువైనవి. ఆయన ఒక బ్రిటిష్ ఆఫీసరు వద్ద పనిచేసిన రోజుల్లో గొప్పగా ఆడేవారట చెస్. ఆ ఆఫీసరూ, పెదనాన్నగారూ తీరికవేళలు చెస్‌లో గడిపేవారట. ఆ ఆఫీసరు ప్రత్యేకంగా రోజ్‌వుడ్‌తో బోర్డు, దంతంతో పావులు చేయించి స్వదేశానికి వెళ్ళిపోయేటప్పుడు పెదనాన్నగారికి బహూకరించారు. నా చిన్నతనంలో నా ఆ సక్తిని గమనించిన పెదనాన్నగారు మరొక చెస్ సెట్ నాకు కొనిపెట్టారేకాని, ఆ విలువైన సెట్‌ను తాకనిచ్చేవారుకూడా కాదు! ఆయన పోయినాక ఆ సెట్ నాదయింది.

"మీరు నమ్మరు—నాకు ఉద్యోగం దొరకక, రోజులు గడవడం ఎంతో కష్టంగా ఉన్నప్పుడుకూడా ఆ చెస్ సెట్ అమ్మలేదు నేను. ఉద్యోగం దొరకలేదనే నిరాశ, తినటానికి సరిగా తిండి కూడా లేని పరిస్థితి...ఆ చెస్ బోర్డు తీసి ఆడుతూ కూర్చుంటే అన్ని బాధలూ మరచిపోయేవాడిని. ఎదురాడటానికి ఎవరయినా ఉన్నపుడు మరీ బాగుండేది. ఎవరూ లేకపోయినా ఒక్కడినే రెండువైపులా ఆడుతుండేవాడిని.

అలా నిరుద్యోగపర్వం రెండేళ్ల సాగింది.

ఒక మందుల కంపెనీలో గుమాస్తాలను వేసుకుంటున్నారనితెలిసి అప్లయి చేశాను. ఇంటర్వ్యూలో ఆ కంపెనీ ప్రొప్రయిటర్ 'నీ హాబీస్ ఏమిటి ? ' అని అడిగితే "చెస్ ఆడటం" అని చెప్పాను.

'నాకూ చదరంగం అంటే సరదానోయ్! జీవితమే ఓ చదరంగం కదూ?' అన్నారాయన.

కాలింగ్‌బెల్ మ్రోగటంతో చెప్పటం ఆపాడతను. నేను లేచి వెళ్ళి తలుపు తీశాను. రాజు వస్తూనే లేటయినందుకు మూర్తికి 'సారీ' చెప్పి స్నానంచేసి డ్రెస్ మార్చుకు రావటానికి వెళ్ళాడు.

"తర్వాతేం జరిగింది." అని అడిగాను.

"మీకు నా కథ నచ్చినట్టుందే !" నవ్వాడతను. తర్వాత ఏముంది జరగటానికి ? నాకు ఆ కంపెనీలో జాబ్ రావటం, తర్వాత మెడికల్ రిప్రజెంటేటివ్‌గా మరో కంపెనీలో స్థిరపడటం, అందువలన ఇదిగో. ఈ విధంగా ప్రయాణాలు, మీవంటి వారితో పరిచయాలు..." నవ్వుతూ క్లుప్తంగా ముగించాడతను.

ఆ నవ్వులో వెలితి ఉన్నట్లు, అతని జీవితంలోని ముఖ్యఘట్టాలేవోచెప్పకుండా దాస్తున్నట్లు అనిపించింది నాకు. కుతూహలంగా ఉన్నా చెప్పమని మరీ మరీ అడగటానికి నాకు తగిన పరిచయం లేదుకదా! కాస్సేపు మౌనంగా గడిచాక 'మీరు ఇప్పుడు ఆడుతున్న చెస్ రోజ్‌వుడ్, దంతంది కాదే, అదేమయింది?' అన్నాను.

అతని ముఖంలో ఏవో బాధా వీచికలు కదలాడాయి, ఓ నిమిషంపాటు. తర్వాత సర్దుకొని— "అది ఇప్పుడు లేదు... అదంతా ఓ కథ...ఆఁ, ఏమయినా సరదాగా కబుర్లు చెప్పండి ! వచ్చినప్పటి నించీ నా సొదతో బోర్ కొడుతున్నానేమో" అన్నాడు,

ఇంతలో రాజు హాల్లోకి రావటంతో సంభాషణ మరో దారి పట్టింది. చాలా సేపు కబుర్లతో సరదాగా గడిచాక, మర్నాడు సాయంత్రం మళ్ళీ వస్తానని చెప్పి, మూర్తి శలవు తీసుకున్నాడు.

ఆరాత్రి పడుకున్నాక రాజుకి,అతను చెప్పిన కథంతా వినిపించాను. చాలా తమాషా వ్యక్తివలె ఉన్నాడే" అన్నారు ఆసక్తిగా అంతా విని.

"విజయవాడలో స్వర్ణలత అని నాకో స్నేహితురాలుండేది. ఆ అమ్మాయి భర్త ఇంకా తమాషా వ్యక్తి. అతని సంగతి వింటే మీరు మరీ ఆశ్చర్యపోతారు !" అన్నాను.

"చెప్పు !" అన్నారు కుతూహలంగా.

"ధనవంతుల యింట పుట్టిన ఒక్కగానొక్క పిల్ల స్వర్ణ. బి. ఏ. పాసయినాక




గతంలో యెడాపెడాగా నడిచిన పార్టీలు ఐక్యమైపోయినప్పుడు...

వరునికోసంవెతకసాగారు,తల్లితండ్రులు. పెళ్ళయినాక కూతురు, అల్లుడు తమ ఇంటనే ఉండాలని వాళ్ళ కోరిక. స్వర్ణ తండ్రి ఆఫీసులో పనిచేసే మురళికి ముందూ, వెనకా ఎవరూలేరు. అందమైన వాడు, బి.ఏ. చదువుకున్నాడు స్వర్ణా మురళీ ఒకరికొకరు నచ్చటంతో వాళ్ళ పెళ్ళయింది.

మురళి స్వర్ణ అంటే ప్రాణం పెట్టే వాడు. స్వర్ణకీ అతనంటే అంతే ! పెళ్ళ యినాక స్వర్ణ ఇంట్లోనే ఉంటున్నా కంపెనీలో ఉద్యోగం మాత్రం అతను మామూలుగానే చేస్తూ ఉండేవాడు.

"చిన్నప్పటినుండి గారాబంగా పెరగటంవలన స్వర్ణలో పెంకితనం పాలె క్కువ. తాను కోరుకున్నది ఆరు నూర యినా జరిగితీరవలసిందే ! మురళి చాలా నెమ్మదిగా ఉండేవాడు. అతనికి వ్యసనాలేలేవు. షికారుకో, సినిమాకో వెళ్ళినా ప్రక్కన స్వర్ణ ఉండవలసిందే. అతనికి ఉన్న సరదా ఒక్కటే – చద రంగం ఆట. అడపా దడపా ఆడుతూ కూర్చునేవాడు. స్వర్ణకి నేర్పించటానికి ప్రయత్నించాడు. కాని, దానికి ఆ ఆట పట్ల ఆసక్తి, ఉత్సాహం కలుగనేలేదు. 'అర్థంలేని ఆట ! అలా పావులని చూస్తూ గంటల తరబడి కూర్చోవటం ! బోర్, అని విసుక్కునేది.

కొన్నాళ్ళు ఇద్దరికీ ఆనందంగానే గడిచిపోయాయి. ఒక ఆదివారం మధ్యాహ్నం మ్యాట్నీ ప్రోగ్రాం వేసింది స్వర్ణ. ఒంటిగంటవేళ అతని మిత్రులు



కొందరు వచ్చారు. కాస్సేపు కబుర్లయి నాక, 'చెస్ ఆడ్దామా ?'' అన్నాడొకడు. ఇన్నాళ్ళకు ఇంట్రెస్టుతో చెస్ ఆడేవాళ్ళు దొరకటంతో ప్రాణం లేచివచ్చినట్టయింది మురళికి. గబగబా వెళ్ళి బోర్డు, పావులు తీసుకువచ్చాడు. అంతా ఆటలో నిమగ్న మయినారు. మురళీ ఒక ఫ్రెండ్ ఆడు తుంటే తక్కినవాళ్ళంతా కామెంట్స్ చేస్తూ ఆనందిస్తున్నారు. సినిమావేళ అవుతున్నా మురళి లేవలేదు. చెప్పాను కదూ స్వర్ణ మొండిదని, తను కోరు కున్నది జరగవలసిందేనని. అయినా మురళి ఆట బాగా ఎంజాయ్‌చేయటం చూసి, ఫస్ట్‌షోకి వెళ్ళవచ్చునని సర్దు కుంది. ఆటలో లీనమైన మిత్రులకి టైమే తెలియలేదు. సాయంకాల మయింది. ఆట ఇంకా అవలేదు.

ఆరుగంటలవుతున్నా మురళి లేవక




ఒకరి ఓటమిని మరొకరి విజయాన్నీ ముందుగానే పసిగట్టి లాభం పొందగలిగి:

పోవటంతో స్వర్ణ సహనం నశించింది. పనికుర్రవాడిని పంపించి సినిమా విషయం గుర్తుచేసింది.

'ఓ, సినిమానా? ఇప్పుడు కుదరదని చెప్పు.' అన్యమనస్కంగా అనేసి మళ్ళీ ఆటలో పడ్డాడు.

రాత్రి తొమ్మిది గంటలవుతూ వుండగా ఆట పూర్తయింది. స్నేహితులు శలవు తీసుకున్నారు. మురళి ఒక్కడే కూర్చుని ఏదో ఆడుకోసాగాడు. స్వర్ణ వచ్చి, 'సెకండ్ షోకి వెళ్దాం లేవండి' అంది తెచ్చిపెట్టుకున్న నవ్వుతో.

'ఇప్పుడు సినిమా ఏమిటి ? సారీ డియర్' పావులు కదిలిస్తూ అన్నాడు.

'మధ్యాహ్నం నుంచి ఆడుతున్నారు ఇంకా తనివి తీరలేదా ?' విసుగు స్పష్టంగా ఉన్నది ముఖంలో.

మురళి అదేమీ గమనించలేదు. 'నన్ను ఆడుకోనివ్వు !' అనేసి పావుల వైపే చూస్తూ ఆలోచిస్తున్నాడు. స్వర్ణ అలాగే చూస్తూ నిల్చుంది. పదినిమిషాలు గడిచాయి. ఓపిక పూర్తిగా నశించటంతో చటుక్కున వంగి పావులు కదిపేసింది. మురళి తలెత్తి స్వర్ణవైపు తీవ్రంగా చూశాడు. పెళ్ళయినాక భర్త కోపం చూడటం అదే ప్రథమం స్వర్ణకి.

'నా సరదా మీరు గమనించనపుడు మీ సరదా మాత్రం నేనెందుకు గమనించాలి ?' పెంకిగా అని వెళ్ళి పోయింది.

చేతులతో తల పట్టుకుని కూర్చుండి పోయాడు మురళి !

రెండురోజులు ఇద్దరూ ఎడమొహం పెడమొహంగానే గడిపారు. తను కోరి నది జరగకపోవటం, అందులోనూ భర్త తనదే తప్పన్నట్లు ప్రవర్తించ టంతో స్వర్ణ అహం దెబ్బతిన్నది. మూడవరోజు సాయంకాలం మురళే రాజీకి వచ్చాడు. 'స్వర్ణా సినిమాకు టికెట్స్ తీసుకొచ్చాను. పోదామా' అంటూ మళ్ళీ ఇద్దరూ మామూలుగా అయిపోయారు.

కానీ వాళ్ళిద్దరూ ఆ పోట్లాటని మరచి పోలేదు. మురళి తనను మరచిపోయేలాగ చేసింది చదరంగం, అని స్వర్ణ అను కుంది. తనకూ చదరంగానికీ మధ్య అడ్డువచ్చింది స్వర్ణ, అని మురళి అనుకున్నాడు !

బజారుకి వెళ్ళినపుడు పుస్తకాల షాపులో తను మ్యాగజైన్లు చూస్తుంటే మురళి 'చెస్' గురించిన పుస్తకాలు తీసు కోవటం చూసి స్వర్ణ విసుక్కునేది. అందంగా అలంకరించుకొని స్వర్ణ పడక గదిలోకి వస్తే, మురళి ఆ పుస్తకాల్లోని ప్రాబ్లమ్స్ సాల్వ్ చేస్తూ స్వర్ణ ఉనికిని గుర్తించేవాడేకాదు. నిజానికి మురళి పెళ్ల యిన కొత్తలో భార్య శ్రద్ధ చూపక పోవటంవలన చెస్ మూల పడవేయ టానికి ప్రయత్నించాడు. కాని అతని నరాల్లో జీర్ణించుకుపోయి ఉంది, ఆ ఆట పట్ల అభిమానం. ఆడుతున్నంత సేపూ అతను ఆ ప్రపంచంలో దేవుడితో సమానం; ఆ నిషాకి సమానమయినది మరేమీలేదు !

క్రమంగా స్వర్ణ గ్రహించింది, జీవి తంలో మురళికి అత్యంత ముఖ్యమైనది చదరంగం పట్ల అభిమానం. తనకు అతని మనసులో ఉన్నది రెండవస్థానమే. స్వర్ణ—ఓటమి ఎన్నడూ ఎరుగని స్వర్ణ లక్షాధికారిణి, గారాలపట్టి—ఈ భావాన్ని భరించలేకపోయింది. అదీ ఒక ఆటేనని ఎంత సర్ది చెప్పుకున్నా సర్దుకోలేక పోయింది. తనతో గడపవలసిన సమ యాన్ని భర్త మరొక స్త్రీతో గడిపితే ఎంత అసూయ, ఎంత కసి కలుగు తాయో అంతా స్వర్ణలో కలిగింది చదరంగంపట్ల.

ఓమారు ఎక్కడో చదరంగం పోటీలు జరుగుతుంటే వెళ్ళాలనుకున్నాడు మురళి. స్వర్ణ ఎలాగా ఒప్పుకోదని తెలుసు కనక, స్వర్ణ స్నేహితురాలి యింటికి వెళ్ళినపుడు, చీటీ రాసిపెట్టి వెళ్ళిపోయాడు. స్వర్ణ ఫ్రెండ్స్‌తో మర్నాటికి పిక్నిక్ ప్రోగ్రామ్ ఏర్పాటు చేసి ఇంటికి వచ్చింది. అందరూ భర్త లతో, పిల్లలతో నాగార్జునసాగర్ వెళ్ళా లని ప్లాను. ఈ మధ్య మురళికీ, తనకీ మధ్య యెడం హెచ్చుతున్నదని గుర్తిం చిన స్వర్ణ, ఈ పిక్నిక్ రెండురోజు లైనా చెస్‌గొడవ మరచిపోయి తామిద్దరూ




నిజానిజాలను అవగాహన చేసుకొని ప్రజలు సకాలంలో మేలుకున్నప్పుడు..

హాయిగా కలిసి ఉండవచ్చునని ఆశ పడింది. ఎంత ఆత్రుతగా మురళికి చెప్పాలని వచ్చిందో, అంత నిరాశ కలి గింది. అతను రాసిన చీటీ చదివేసరికి చెప్పలేనంత నిస్సత్తువ ఆవరించగా అలా కూలబడిపోయింది. తల్లీ, తండ్రీ బ్రతిమిలాడినా ఆ రాత్రి అన్నం తినాలని పించలేదు. మర్నాడు ఉదయమే కార్లలో వచ్చారు, బిలబిల్లాడుతూ ఫ్రెండ్స్ కుటుంబాలతో సహా. లేనిఓపిక తెచ్చు కొని, లేచి ఇవతలికి వచ్చి, అర్జంటుగా మురళి ఊరికి వెళ్ళవలసి వచ్చిందని, తాము రాలేమని చెప్పింది. వాళ్ళంతా కేరింతలతో, అల్లరిచేసుకుంటూ, వెళ్ళి పోతుంటే, లోపలికి వచ్చి ఏడుస్తూ పక్క మీద పడుకుంది.

కూతురు, అల్లుడు అప్పుడప్పుడు ఎందుకు కీచులాడుకుంటున్నారో అర్థం కాని స్వర్ణ తల్లి తండ్రులు స్వర్ణ ఏడుపు చూసి మరీ కంగారుపడ్డారు. ఎన్ని విధాల ప్రశ్నించినా స్వర్ణనించి వాళ్ళకు జవాబు రాలేదు.

తిండి తినీ తినకా దిగులుగా వారం రోజులు స్వర్ణ గడిపాక, ఒక ఉదయం వచ్చాడు మురళి. ఆటలు బాగా ఎంజాయ్ చేశాడేమో, హుషారుగా ఈలవేసు కుంటూ వచ్చాడు. గదిలోకి వస్తూనే బ్రీఫ్‌కేస్‌లోని చెస్‌బోర్డు బల్లపైన పెట్టాడు.

స్వర్ణ వచ్చింది. ఆమె నీరసాన్ని, ముఖంలోని దిగులుని గుర్తించనేలేదు అతను.

'ఆటలు ఎంత బాగున్నాయనుకు న్నావు!' ఉత్సాహంగా మొదలుపెట్టాడు.

స్వర్ణకి కోపం ఉవ్వెత్తున పొంగి వస్తోంది.

నాకు మొదట టికెట్స్ దొరకనే లేదు, స్వర్ణా. తర్వాత నా కాలేజీ ఫ్రెండ్ ఒకడు కనిపించి సాయంచేశాడు.' పావులు పేరుస్తూ 'ఇది ఓపెనింగ్ మూవ్...నిజం చెప్పొద్దూ చివరిదాకా బలం నల్లవాటికే ఉంది. చివరి రెండు ఎత్తులూ...'

స్వర్ణకి సహనం పూర్తిగా నశించింది. ఒక్కసారిగా బోర్డు లాక్కుని కిటికీ లోనించి రోడ్డుపైకి విసిరేసింది.

తెల్లమొహం వేసుకొని అయోమయంగా చూడసాగాడు మురళి. స్వర్ణ ముఖం జేవురించి ఉంది. ఒక్కొక్క పావునీ తీసి బయటకు విసరసాగింది.

రెండు నిమిషాలకు తేరుకున్నాడు మురళి. కోపంతో అతని కళ్ళు అగ్నినే కురిపిస్తున్నాయి.

'ఏమిటిది ?' అరిచాడు స్వర్ణ చేతి లోని పావులు లాక్కోవటానికి ప్రయత్నిస్తూ. అంతలోనే స్వర్ణ అతనికి అందకుండా అన్నీ బయట పడేసింది.

'ఏమిటో తెలియదా? చదరంగంపట్ల నాకున్న కక్ష...కోరి చేసుకున్నందుకు నన్ను మీరు తృణీకరించటం, ఈ చదరంగానికి దాసులవడం సహించలేను !' అతనికంటే గట్టిగా అరిచింది.

'నిన్ను నేను తృణీకరించానా ? నీవే నా సరదాలను గుర్తించక...'

'సరదానా ?' హేళనగా అంది స్వర్ణ. ఇది సరదా కాదు...మరొక ప్రేయసి. ఇకనించి మీరు చెస్ ముట్టుకోకూడదు. ఎవరయినా ఆడుతుంటే చూడకూడదు. దాన్ని గురించి చదవకూడదు !'

'నోర్ముయ్ ! నేను నీ పనిమనిషి ననుకున్నావా ?'

'లేదు, కాని మీరు నన్ను భార్యగా ట్రీట్ చేయటం వలన ఇలా మాట్లాడవలసి వస్తున్నది. నేను అడిగినది ప్రామిస్ చేయండి..." చేయి చాపింది.

'నేను చెస్ మరచిపోతానని ప్రామిస్ చేయాలా ?'

'అవును.'

'చేయను !'

'అయితే...'

'ఊఁ, అయితే ?'

'మనం భార్యాభర్తలుగా ఉండటం కుదరదు.'

సూటిగా స్వర్ణ కళ్ళలోకి చూస్తూ ఓనిమిషంపాటు అక్కడేచూపు నిలిపాడు మురళి. ఆమె ఏదో బెదరించటం కోసం అంటున్న మాటలు కావని, నిజంగానే అంటున్నదని గ్రహించాడు. కిటికీవద్దకు నడిచివెళ్ళి రోడ్డువైపు చూశాడు. రెండంతస్థుల పైనించి పడినవేమో డ్రైనేజ్ కాలవలో, చెస్, పావులు

పొలిటిక్సులో నవరసాలు :




స్వార్థబుద్ధితోనూ స్వకులపక్షపాతంతోనూగాక ప్రజాహిత కార్యాలన తలపెడి

ఏవీ లేకక్కడ. ఐదు నిమిషాలు నిశ్శబ్దంగా గడిచాక స్వర్ణ వైపు తిరిగి,

'సరే !' అన్నాడు.

తను కోరిన వాగ్దానం ఇవ్వడానికి ఒప్పుకున్నాడనుకున్న స్వర్ణ ముఖంలో విజయగర్వం మెరిసింది. అతను ఊరి నించి తీసుకువచ్చిన బ్యాగ్ బల్లపైనే ఉంది. నింపాదిగా దాన్ని అందుకొని బయటకు నడిచాడు. వాకిలివద్ద ఓ క్షణం ఆగి, వెనుదిరిగి చూడకుండానే "వెళుతున్నాను " అన్నాడు. మరునిమిషంలో అతను రోడ్డుమీద ఉన్నాడు.

హతాశురాలయి చూస్తూ నిలబడింది స్వర్ణ.

శ్రద్ధగా వింటున్న మా వారు, "ఊఁ తర్వాత ?" అన్నారు.

"అయిపోయింది కథ. తర్వాత ఏమీ లేదు."

''అదేమిటి ? !"

మురళి తిరిగి రాలేదు. అందుకే కథ అయిపోయిందంటున్నాను."

"భార్యని, ఉద్యోగాన్ని, డబ్బుని— అన్నీ వదిలేసుకున్నా డన్నమాట, చదరంగంకోసం ?"

"అవును !"

"స్వర్ణ భర్తను పంపించివేసి సంసారము మంటకలుపు కుంది, అతని సరదాను సహించలేక ?"

"స్వర్ణ ఎలాగయినా లక్కీ గర్లే ! రెండేళ్ళు దాటిపోయినా మురళి రానందున విడాకులు తేలికగానే లభించాయి. ఆమెకి. తర్వాత అమెరికానించి వచ్చిన

ఓ యువకుడిని పెళ్ళి చేసుకుంది. అత నికి మురళితో పెళ్ళి, సంసారం అన్నీ ముందరే చెప్తే విని సానుభూతితో అర్థం చేసుకున్నాడు. అతని సాహచర్యంలో తిరిగి జీవితం బాగుచేసుకుంది. కాస్త మొండితనం, పెంకితనం తప్పించి స్వర్ణ మామూలు ఆడపిల్లే! విచిత్రమైన మనిషల్లా మురళే!"

"అవును! అతను ఇప్పుడేం చేస్తు న్నాడో ?"

"ఏమో మరి! అలా చదరంగం ఆడుకుంటూ ఆనందంగా కాలం గడిపే స్తున్నాడేమో పిచ్చిమానవుడు!"

మర్నాడు ఉదయమే ఫోన్ కాల్ వచ్చింది నిన్నటి మిత్రుడు మూర్తి వద్దనించి.

"శ్యామలగారూ, ఈ సాయంత్రం మీ యింటికి వస్తానని చెప్పానుకదూ! రాలేను సారీ, పూనాలో మా కంపెనీ రిప్రజెంటేటివ్స్ కాన్ఫరెన్స్ ఉన్నదిట. వెళ్ళమని టెలిగ్రాం వచ్చింది. ఇప్పుడే వెంటనే ట్రెయిన్ ఎక్కితేకాని కాన్ఫ రెన్స్‌కి అందుకోలేను."

"మళ్ళీ ఇటు వైపు వస్తే మా యింటికి తప్పకుండా రండి!"

"ఓ యస్! నా కెందుకో మిమ్మల్ని చూస్తే ఆత్మీయులను చూసినట్లనిపిం చింది. అందుకే నా కథంతా నిన్న మీతో చెప్పుకున్నాను."

"పూర్తిగా చెప్పలేదుగా?...సరే లెండి, పూనా ఇంతకుముందు ఎప్పుడైనా వెళ్ళారా? బ్యూటిఫుల్ సిటీ...మీ వాళ్లెవ రయినా ఉన్నారా అక్కడ ?"

"నా వాళ్ళంటూ ఈ ప్రపంచంలోనే ఎవరూ లేరండీ!"

ఆ మాటలలోని నిస్పృహకు నాకు జాలికలిగింది.

"హాయిగా పెళ్ళిచేసుకోండి. మీ వాళ్ళంటూ ఏర్పడతారు." నవ్వుతూ అన్నాను.

"అదీ ప్రయత్నించా నండోయ్! ఒక ఒరలో రెండు కత్తులు ఇమడనట్లే నా జీవితంలో సంసారం, చదరంగం ఇమడవని తేలిపోయింది......అన్నట్లు పూనాలో నాలుగురోజుల్లో చెస్ పోటీ లున్నాయిట, పేపర్లో రాశారు. అవి చూడవచ్చు!" ఆనందంగా అన్నాడు"

"ఇక ఉంటానండీ! డాక్టరుగారిని అడిగా నని చెప్పండి."

"మీ పూర్తిపేరేమిటి?" ఎందుకో అడిగాను.

"మురళీకృష్ణమూర్తి... గుడ్‌బై!" ఫోన్ పెట్టేశాడు.

నివ్వెరపోయాను నేను



# వాగొచ్చింది



శీలంశెట్టి రమాదేవి

ప్రొద్దుట్నుంచీ ఆగకుండా కురుస్తోంది వర్షం. చెట్లు పెకలించిపారేసేటంత వేగంగా గాలి. సాయంత్రం మూడింటినుంచీ చీకటిగానే తయారయింది. రోడ్డంతా ఎఱ్ఱని బురద అలుముకుపోయింది. వర్షం చూస్తోంటే, నాగరాజుకి, తగని చిరాకుగా ఉంది. సర్వర్ కుఱ్ఱాడు ఓ మూల టేబుల్ దగ్గర కూర్చుని కొత్తగా రిలీజయిన సినిమాపాట ఒకటి పాడుతున్నాడు.

నాగరాజు కౌంటర్ దగ్గర్నుంచి లేచి బిల్లల మధ్యనుంచి నడిచి వెనుకవేపు కెళ్ళాడు. హోటల్ పాక నానుకొనే వెనుక చిన్న రేకుల షెడ్ ఉంది. దాని చుట్టూ కూడా రేకులే గోడల్లా ఉన్నయ్.

రాజ్యలక్ష్మి జడవేసుకొంటూ కిటికీలో నుంచి బయట దారాల్లా కారుతోన్న వర్షపునీటిని చూస్తోంది. ఓ మూలగా నులకమంచం, దానిమీద శుభ్రంగా ఉతికిన రంగుదుప్పటి రెండు తలగడ దిళ్ళు ముచ్చటగా కనబడుతున్నయ్

రాజ్యలక్ష్మి కాపరానికొచ్చిన కొద్ది రోజుల్లోనే ఆ షెడ్‌కి ఎంతో కళ వచ్చేసింది. అంతకుముందు అందులో బొగ్గులు, కట్టెలు పడిఉండేవి. హోటల్ పాకలోనే తను ఓ బెంచీమీద పడుకొని నిద్రపోయేవాడు. రాజ్యలక్ష్మి వివాహమయి రావడంతోనే ఆ షెడ్‌నే తమ ఇల్లుగా మార్చేసింది.

అతన్ని చూసి "ఏమయినా అమ్ముడుపోయినయ్యా ?" అంది రాజ్యలక్ష్మి నవ్వుతూ. నవ్వుతూన్నప్పుడు మరింతగా విజృంభించిన ఆమె అందం చూసి అతనికి ఉద్రేకం పొంగుకొచ్చింది. దగ్గరగా నడిచి ఆమె నడుం మీద చేయివేసి ఆమెను తన గుండెలకు అదుముకొన్నాడు.

"వదులు, జడ వేసుకోవాలి !" అంది రాజ్యలక్ష్మి అతనినుంచి విడివడడానికి ప్రయత్నిస్తూ.

ఎప్పటికప్పుడు నూతన ఉత్తేజాన్ని కలిగిస్తున్న ఆమె స్పర్శ అతనికి మరింత కోరికను కలుగజేసింది.

"వదిలేయడానికేనా – మీ అయ్యని బ్రతిమాలి నిన్ను పెళ్ళిచేసుకొంది ?" నవ్వుతూ అన్నాడతను.

రాజ్యలక్ష్మి ఆ మాటతో పూర్తిగా కరిగిపోయింది. సిగ్గుతో ముఖం ఎర్రబడిపోయింది. అతనిమీదకు ఒరిగిపోయి గుండెల్లో ముఖం దాచేసుకొంది.

నాగరాజు తన్మయత్వంలో ఓ క్షణం కళ్లు మూసుకున్నాడు.

"చాల్లే వదులు ! రాత్రంతా దగ్గరుంది చాల్లేదు కామాలు !" దూరంగా జరుగుతూ అంది రాజ్యలక్ష్మి.

నాగరాజు నవ్వాడు.

"ఎట్టా సరిపోద్దే ! నీ అందం రోజు రోజుకీ ఎక్కువయిపోతోంటే !"

ఇంతకూ సరుకేమయినా అమ్ముడుపోయిందా ?" మాట తప్పిస్తూ అడిగింది రాజ్యలక్ష్మి.

ఆ విషయం గుర్తు తెచ్చేసరికి నాగరాజు బాగా నిరుత్సాహపడిపోయాడు.

"ఈపాటికి అయిపోవల్సిందేనే – ఈ ఎదవ్వర్షం పట్టుకొని వదలటంలేదు! ఇది తుఫానంటున్నారు ! ఈ లారీ నాయాళ్ళేమో వర్షం ఎక్కువగా ఉందని, వాగులకు భయపడి 'టీ'కికూడా




"లోక" కళ్యాణంకోసం ఆరోగ్యం, ఆసువులూ
ధారపోసిన "నాయకు"లను తలుచుకున్నప్పుడు...

ఆగకుండా దంచుకెళ్లిపోతున్నారు !" చిరాగ్గా అన్నాడు నాగరాజు.

"వెళ్ళి అక్కడే కూర్చోరాదూ ! నేనీలోగా వంటచేస్తాను !" అంది రాజ్యలక్ష్మి.

నాగరాజు పాకలోకి నడిచాడు. పాక వెనుకభాగంలో బొగ్గుపొయ్యిమీద సాంబారు గిన్నె సెగలు కక్కుతోంది.

తన కౌంటర్ ముందు కూర్చున్నాడు నాగరాజు. వర్షం జోరు కొంచెం తగ్గింది. ఇప్పుడు సన్నగా కురుస్తోంది. మళ్ళీ ఓసారి అల్మారావంక చూశాడు నాగరాజు. ఉదయం తయారుచేసిన వడలు-ఖర్చుకాకుండా అలాగే ఉన్నయ్! తుఫాను లేకపోతే అన్నీ అయిపోవాల్సింది. బేసిన్‌లో ఓ పక్క ఇడ్లీలు, మరోపక్క పూరీలు ఉన్నయ్. పూరీలు ఫరవాలేదు మరో రోజువరకూ పాడవకుండా ఉంటాయ్ !

కుర్రాడు మరో కొత్తపాట అందుకున్నాడు. వేగంగా పోతోన్న లారీ సర్రుమన్న బ్రేకులతో ఆగింది. టిఫినేమయినా వేడిగా ఉందా ?" కిటికీలో నుంచి తల బయటకుపెట్టి అడిగాడు డ్రైవర్.

"వడా, ఇడ్లీ సాంబార్ వేడిగా ఉన్నయ్ !" కుర్రాడు పాక బయటకు నడిచి అరిచాడు.

లారీ పక్కకు తీసి డ్రైవరూ, క్లీనరూ, ఓ పాసింజరూ దిగి హోటల్లో కొచ్చారు. ముగ్గురికీ మూడు ప్లేట్లు వడాసాంబారు తీసుకొచ్చి టేబుల్ మీదుంచాడు కుర్రాడు

"మీరొచ్చిన దోవలో వాగు లేమయినా పొంగినయ్యా ?" అడిగాడు నాగరాజు.

"ఇంత వర్షం పడుతోంటే ఎందుకు పొంగవు ? రెండు వాగులు తేలిగ్గానే దాటేశాం ! కాని మూడో వాగు చాలా ఉధృతంగా ఉంది. బాడీవరకూ వచ్చేసి నయ్ నీళ్లు. ఈ లెక్కలో సాయంత్రాని కల్లా రాకపోక లాగిపోవాల్సిందే ..."

నాగరాజు గుండెలు ఝల్లుమన్నయ్! ఇక హోటల్లోని సరుకంతా నష్టపోవ ల్సిందేనేమో ! కుర్రాడు పాడుకుంటూ స్టౌవ్‌మీద టీ తయారుచేస్తున్నాడు. అసలిలాంటి ఊరూ, వాడా లేనిచోట హోటల్ పెట్టడం తనదే పొరబాటు. ఇప్పుడే కాదు. ప్రతి వర్షాకాలం ఇలాగే దెబ్బతింటున్నాడు తను. సంవత్సరం పాటు మిగుల్చుకొన్న సంపాదనంతా ఈ రెండునెలల్లో తుడిచిపెట్టుకు పోతోంది. అలాంటిచోట హోటల్ పెడి తేనే పోటీలేకుండా ఉంటుందని తన చిన్నాన్న సలహా ఇచ్చి ఆ పాడు ప్రదే శంలో పెట్టించాడు హోటలు !

టీ తాగింతర్వాత లారీ వెళ్ళి పోయింది. మళ్ళీ ఆలోచనల్లో పడి పోయాడు నాగరాజు. అతనికి సంవ త్సరం క్రితం ఇలాగే ఓ రోజు విప రీతంగా వర్షం కురవడం, ఆ రోజు రాజ్యలక్ష్మి వర్షంలో తడుస్తూనే హోటల్‌కి పాలు తీసుకురావడం అన్నీ గుర్తుకొచ్చినయ్ ! వాళ్ళ ఊరు తన హోటల్‌కి రెండు మైళ్లుంటుందేమో ! రోజూ అక్కడినుంచి పాలు పోయడాని కొచ్చేది. మొదట్లో ఆమె తండ్రి పాలు తీసుకొచ్చేవాడు. అతను ఏదో జబ్బుతో మంచ పట్టేసరికి ఆ బాధ్యత ఒకేఒక్క కూతురయిన రాజ్యలక్ష్మిమీద పడింది. కొద్దిరోజుల్లోనే తామిద్దరికీ మాటలు కలిసినయ్. తరువాత మనసులు. ఆ రోజున...

ఉధృతంగా కురుస్తోన్న వర్షంలో ఆమె తడుస్తూ వచ్చిన ఆ ఏకాంత సమ యంలో – ఇద్దరి శరీరాలు కూడా ఏక మయినాయ్.

"మీ నాన్న నడిగి మనిద్దరం పెళ్ళి చేసుకొందాం !" అన్నాడతను.

ముందు రాజ్యలక్ష్మి భయపడింది. గాని తరువాత ఆమే ధైర్యం చేసింది. ఎలాగయితేనేం చివరకు దంపతు లయ్యారు.

అంతకుముందు నెల్లూరువేపు వెళ్ళిన లారీ వేగంగా తిరిగిరావడం కనిపించి ఆదుర్దాపడిపోయాడు నాగరాజు.

త్వరగా లేచి వర్షంలోనే రోడ్డు పక్కకు వెళ్ళి లారీని ఆపమన్నట్లు







తమ బాధ్యతలను యితరుల తప్పులతో కప్పిపుచ్చినప్పుడు.

చేయి ఊపాడు. ఆ లారీ డ్రైవర్ నరసింహం తనకు బాగా తెలుసు. మద్రాస్ ట్రిప్ వెళ్ళేప్పుడూ, వచ్చేప్పుడూ తప్పక తన హోటల్ దగ్గర ఆగి కాఫీ, టిఫినూ తీసుకొని వెళ్తాంటాడు.

లారీ దగ్గరకొచ్చి ఆగింది.

"ప్రతియేడూ ఈ వాగుదే భయం ! అందుకే వెళ్ళేప్పుడు నీ హోటల్ దగ్గర దిగకుండా వెళ్ళిపోయాను. కాని ఏం లాభం ! వెనక్కు తిరిగిరాక తప్ప లేదు!" దిగులుగా అన్నాడు నరసింహం "వాగొచ్చేసింది !"

నాగరాజు ముఖం వివర్ణమయిపోయింది.

"పోతన్నా ! ఒంగోలు దగ్గర్నుంచీ చుట్టూ తిరిగిపోవాలి !"

లారీ వెళ్ళిపోయింది.

క్రిందటేడూ ఇలాగే జరిగింది. తన హోటల్‌కి మైలున్నర దూరంలో ఉందా వాగు. ఉధృతంగా పొంగింది. అంతే ! మెయిన్‌రోడ్డు అయిదువందల గజాలమేర మునిగిపోయింది. రోడ్డు మీద ఆరడుగుల ఎత్తున ప్రవహించింది నీరు. సుమారు రెండువందల లారీలు ఇవతలివేపున, మరో రెండువందలు అవతలివేపున నిలబడిపోయినయ్ ! దాంతో తన సరుకంతా అలాగే నిలబడి ఉండిపోయింది. చివరకు అర్ధరాత్రి లాంతరు తీసుకొని ఆ సన్నని వర్షంలో వాగువరకూ నడిచి అక్కడ లారీల వాళ్ళకు అమ్ముకోవాల్సి వచ్చింది. ఆ వాగు తగ్గటానికి ఒకరోజు పట్టింది.

ఇప్పుడూ అదే వాగు పొంగింది.

నిజానికి మద్రాసువేపు వెళ్ళే లారీల కంటే వచ్చే లారీల మూలంగానే తన సరుకు ఎక్కువ ఖర్చవుతుంది.

పాకలో కొచ్చి మళ్ళీ కౌంటర్ ముందు కూర్చున్నాడు నాగరాజు.

ఒక్క లారీకూడా అటువేపునుంచీ రావటంలేదు.

అంతకుముందురోజు కూడా సరుకు సరిగ్గా ఖర్చవ్వక యాభై రూపాయల నష్టం వచ్చింది. ఇవాళ కూడా అమ్మకం ఇలాగే ఉంటే - డెబ్భైఅయిదు రూపాయలవరకూ మునిగిపోతాడు తను !

దిగులుగా మరోసారి అద్దాల అల్మారా వంక చూశాడు నాగరాజు.

ఇంక తప్పదు ! రాత్రికి వర్షం తగ్గితే - సరుకంతా తీసుకొని, కుర్రాడితో ఓ బొగ్గుపొయ్యి పట్టించుకొని వాగుదగ్గర కెళ్తేగాని ఈ గండం గడిచి గట్టెక్కలేడు తను !

వర్షం మరికొంచెం తగ్గింది కాని పూర్తిగా ఆగిపోలేదు.

"అలా కూర్చుని దిక్కులు చూడక పోతే – ఇలా రారాదూ ?" పాక వెనుక నుంచి పిలిచింది రాజ్యలక్ష్మి.

లేచి రేకుల షెడ్లోకి నడిచాడు నాగరాజు.

రాజ్యలక్ష్మి నల్లపువ్వుల చీర కట్టుకొంది. తను పట్నంలో కొనుక్కొచ్చిన నైలాన్ జాకెట్ తొడుక్కొంది. ఆ జాకెట్ సైజ్ తక్కువయిపోయినట్లు పిటపిటలాడిపోతోంది.

"ఏమిటా చూపు ?" కొంటెగా అడిగింది రాజ్యలక్ష్మి.

హోటల్ ముందునుంచి కార్లలోనూ, బస్సుల్లోనూ, నడిచీ, లారీలమీదా పోయే ఎంతోమంది స్త్రీలను చూశాడు నాగరాజు. కాని రాజ్యలక్ష్మిలాంటి శరీర సౌష్టవం, అందంగల అమ్మాయి ఎక్కడా తారసపడలేదు.

"నీ అందం సినిమా యాక్టర్లకి కూడా లేదే !" అన్నాడు నాగరాజు తన్మయత్వంతో.

"మరింకేం ? అలాగయితే సినిమాల్లో చేరిపోతాను !" అంది రాజ్యలక్ష్మి కిలకిల నవ్వుతూ !

నిన్ను వదిలి నేనేమయిపోను !" ఆమెని దగ్గరకు లాక్కొంటూ అన్నాడతను.

"ఏమీ అవద్దులేగాని ... నీ చెవిలో చిన్నమాట చెప్పాలి !" అంది రాజ్యలక్ష్మి తనూ అతని మెడచుట్టూ చేతులు వేసి.

"ఏమిటది ?"

"చెవిలోనే చెప్పాలి, తలవంచు !"

తల వంచుతున్నట్లు నటిస్తూ ఆమె పెదాలమీద గట్టిగా ముద్దుపెట్టుకొన్నాడతను. అతని గడ్డం ఆమె చెక్కిళ్ళకు గరుగ్గా తగిలి ఒళ్ళంతా జలదరించినట్లయింది.

"ఇదిగో, అందుకే నాకో కోపం వచ్చేది !" అంది కొద్దిక్షణాల్లోనే తేరుకొంటూ.

"ఎందుకు ?" నవ్వుతూ అడిగాడు నాగరాజు ఆమెను మరింతగా తనలోకి పొదువుకొంటూ !"

"ఇలా వేళా పాళా లేకుండా కావ లించు క్కూర్చుంటే!" అంది వదిలించు కోవడానికి ప్రయత్నించకుండానే కోపం నటిస్తూ.

"అదేమిటో చెప్పేవరకూ వదలను," అన్నాడు నాగరాజు.

"వదిలేవరకూ చెప్పను !" అంది రాజ్యలక్ష్మి పంతం పట్టినట్లు.

"సరే ! ఎవరు గెలుస్తారో చూద్దాం !" అన్నాడు నాగరాజు నవ్వుతూ.

ఇద్దరికీ నవ్వొచ్చేసింది.

"సరే – నీతో వాదన నా కెందు గ్గానీ – చెప్పేస్తాలే !" అతని తల వంచి చెవిలో

"మనకి పాపాయి నిస్తున్నాడు దేముడు !" అంది సంతోషంగా.

నాగరాజు ఆశ్చర్యపోయాడు.

"నిజంగానా ?" అన్నాడు నమ్మ లేనట్లు.

"ఊహూ, కాదు అబద్ధం !" వెక్కిరిస్తూ అంది రాజ్యలక్ష్మి.

"మరి పొద్దున్నుంచీ చెప్పకుండా – ఇప్పటివరకూ ఎందుకు దాచావ్ ?"

"రాత్రి సరదాగా కబుర్లు చెప్పుకొనే ప్పుడు చెప్దామని ఊరుకొన్నాను ! కాని ఇప్పుడిక ఉండబుద్ధికాక చెప్పేశాను !" చిరునవ్వుతో అందామె.

అంతవరకూ ఆమెను గట్టిగా నొక్కి పట్టిన అతని చేతులు నెమ్మదిగా సడలినయ్.

"గట్టిగా కావలించుకొన్నాను, నీకేం నొప్పి లేదుకదా !" భయంగా అడిగాడతను.

"నేనేం అంత సుకుమారంగా పెరగ లేదులే !" నవ్వుతూ అంది రాజ్యలక్ష్మి.

"ఇంతకు ముందెలా పెరిగినా – నా దగ్గరమాత్రం నువ్వో పాపాయి వనుకొంటాను !"

"నీ సరసాలు చాల్లే కాని– భోజనం చేద్దాం కూర్చో !" పీట వాలుస్తూ అందామె. తను కిందే కూర్చుంది.

"నువ్వు పీటమీద కూర్చో ! నేను కింద కూర్చుంటాను !" అన్నాడు నాగరాజు పీట లాగి ఆమె ముందుకు తోస్తూ.

"ఊహుఁ, నా కొద్దు, నువ్వే కూచో !" అంది రాజ్యలక్ష్మి.

"అదిగో – చెప్పినమాట వినకపోతే నాకు కోపమొస్తుంది. నువ్విప్పుడు అది వరకులాగా నీ ఇష్టంవచ్చినట్లు పని చేయకూడదు ! తెలుసా ?"

"ఆడంగి అబ్బాయికి అన్నీ

తెలుసు !" వెక్కిరిస్తూ ఇద్దరి కంచాల్లోనూ అన్నం వడ్డించింది రాజ్యలక్ష్మి.

కబుర్లలో మునిగిపోయేసరికి అర గంటసేపయినా భోజనం పూర్తి కాలేదు

"త్వరగా కానీ–పాపం ఆ కుర్రాడికి ఆకలేస్తుందేమో !" అందామె.

నాగరాజుకి కుర్రాడి సంగతే గుర్తు లేదు .

"అవును పాపం ! పొద్దున్ననగా తిన్నాడు. నేను వెళ్ళి వాడిని పంపిస్తానుండు" అంటూ త్వరత్వరగా భోజనం చేయటం ముగించి పాకలోకి నడిచాడు. అప్పటికే కుర్రాడు లాంతరు వెలిగించి పాకమధ్యలో వ్రేలాడుతోన్న కొక్కానికి తగిలించాడు.

"వెళ్ళరా, త్వరగా అన్నం తినిరా !" అన్నాడు కుర్రాడితో.

కుర్రాడు పాట పాడుతూనే రేకుల షెడ్లోకి నడిచాడు. రాజ్యలక్ష్మి అప్పటికే వాడికి భోజనం వడ్డించి ఎదురు చూస్తోంది.

వాడు సంవత్సరం క్రితం నాగరాజు హోటల్లో చేరాడు. రోడ్డు వెంబడి పోతోంటే నాగరాజే వాడిని పిలిచి మిగిలిపోయిన వడలు తినడానికిచ్చాడు. ఆ రోజునుంచీ అక్కడే ఉండిపోయాడు వాడు. వాడికి తండ్రి లేడట ! తల్లి ఉండేదిట కానీ – ఒకరోజు ఓ సత్రం వసారాలో పడుకొని ఉదయం లేచేసరికి కనబడకుండా పోయిందిట ! ఇంతా చేస్తే వాడి వయసు తొమ్మిదేళ్ళకు మించదు.

భోజనం ముగించి మళ్ళీ పాకలోకి వచ్చి బెంచీమీద కూర్చున్నాడు వాడు.

"మనం సరుకంతా తీసుకొని వాగు దగ్గర కెళ్దాం. కొంచెం బొగ్గులు – బొగ్గుల కుంపటీ తయారుగా ఉంచుకో" అన్నాడు నాగరాజు.

వాడు తలూపి అక్కడినుంచి పాక వెనుకకు వెళ్ళిపోయాడు.

రాజ్యలక్ష్మి పాకలో కొచ్చి నాగరాజు దగ్గరగా ఓ టేబుల్ముందు కూర్చుంది.

సాధారణంగా రోజూ రాత్రిళ్ళు కాసేపు–ఎవ్వరూ లేనప్పుడు– హోటల్లో కూర్చుని మాట్లాడుకోవడం అలవాటయి పోయింది.

"ఏమిటి, వాడితో కుంపటి, బొగ్గులు సిద్ధంచేసుకోమన్నావుట ?" అడిగింది ఆశ్చర్యంగా.

"రాత్రికి వాగు దగ్గర కెళ్ళి సరుకు అమ్ముకొస్తాను ! చాలా లారీలు ఆగి ఉంటయ్యక్కడ," అన్నాడు నాగరాజు.

"అబ్బ ! ఇవాళ నువ్వు నా దగ్గరే ఉండాలనుంది నాకు !" విలవిలలాడుతూ అంది రాజ్యలక్ష్మి.

"మరి సరుకెలా అమ్ముడుపోతుంది? ఇప్పటికే చాలా దెబ్బతిన్నాం !"

"ఆ కుర్రాణ్ణి కూడా నేనేమవాలి ? గిజురుమంటోంది ఇంత పెద్ద పాకలో ఒక్కర్తెను ఎలా ఉండను ? నేనూ నీతో వస్తాను బాబూ, భయంవేస్తోంది !" అంది రాజ్యలక్ష్మి మొండిగా.

"ఛీ ! అక్కడికి నువ్వొస్తావా ? లారీ డ్రయివర్లు- క్లీనర్ల సంగతి నీకు తెలియదు ! కళ్ళతోనే తినేస్తారు ఆడాళ్ళని !" అసహ్యించుకొంటూ అన్నాడతను.

"అలాగయితే నువ్వూ వెళ్ళొద్దులే!"

"ఎంతసేపే ! రెండుగంటల్లో తిరిగివచ్చేయనూ ? అరగంటలో అమ్ముడయిపోతుంది సరుకంతా ! నాకు బాగా తెలుసుగా !" అనునయంగా అన్నాడు నాగరాజు.

కుర్రాడు ఓ సంచీలో బొగ్గులు - కుంపటి తీసుకొచ్చి పాకలో ఉంచి మళ్ళీ వెనక్కు వెళ్ళాడు

దూరంగా చిన్నకారు లైట్లు ఫోకస్ కనిపించింది నాగరాజుకి !

రెండునిముషాల్లో అందమయిన కారు వచ్చి హోటల్ నానుకొని కీచు మంటూ ఆగిపోయింది. ఆ కారుని దగ్గరగా చూస్తూనే గుర్తుపట్టాడు నాగరాజు.

భుజంగరావుగారి కారది. ఆయన సినిమా బిజినెస్‌లో అగ్రగణ్యులు ! మద్రాసు వెళ్లేప్పుడూ, వచ్చేప్పుడూ తప్పక నాగరాజు హోటల్లో కాఫీ తాగడం ఆయన కిష్టం !

ఓసారి జరిగిన సంఘటన నాగరాజు కింకా బాగా గుర్తుంది.

ఇలాగే ఆయన భార్యతో మద్రా సెళ్తూండగా కారు తమ హోటల్‌కి కొద్ది దూరం ఉండగానే చెడిపోయింది.

అప్పటికే బాగా చీకటిపడిపోయింది. తన సహాయంతో కారుని హోటల్ వరకూ తీసుకొచ్చారు.

భార్యను హోటల్లో ఉంచి, ఆయన లారీలో ఒంగోలు వెళ్ళి మెకానిక్‌ని తీసుకొచ్చేసరికి తెల్లారిపోయింది.

ఆమెను చూడటం అదే మొదటిసారి తను. తెల్లగా, లావుగా, బొమ్మలా ఉంది

పాక వెనుక హోటల్ బెంచీలు నాలుగు కలిపి, వాళ్ళు తెచ్చుకొన్న బెడ్డింగ్ వేసి ఆమెకు పక్క ఏర్పాటు చేశాడు తను.

తను హోటల్ బయట బెంచీ వేసు కొని పడుకొన్నాడు.

అర్థరాత్రి మంచినీళ్ళకోసమని పాకలో కెళ్లేసరికి అప్రయత్నంగా తన దృష్టి గాఢంగా నిద్రపోతున్న ఆమెమీద పడింది. తొలగిపోయిన పైటా, జాకెట్టుకీ, చీరకూ మధ్య నగ్నంగా కనబడు తోన్న పాలరాతిలాంటి శరీరం — తనకి పిచ్చెక్కించేసినయ్. ఇంచుమించుగా అడవిలాంటి ప్రదేశంలో - ఆ చీకట్లో-

తనూ, ఆమే ఇద్దరే ఉన్నారు ! తను బలవంతం చేస్తే ఆమె కాదనగలదా ? ఒకవేళ ఆమె కిష్టం లేకపోయినా, ఆమెని ఆదుకొనే వారెవరున్నారు ?

నెమ్మదిగా ఆమె దగ్గరికి నడిచాడు నాగరాజు. కోరిక పడగ విప్పి బుసలు కొడుతోంది. ఆమె పెదాలమీద మృదువుగా చుంబించాడు.

ఆమె పక్కకు తిరిగి పడుకోవడంతో అతని గుండెలు వేగంగా కొట్టుకొన్నయ్. ఏదో తప్పుచేస్తున్న భావన! ఒకవేళ మెలకువ వస్తే భుజంగరావుకి విషయం తెలిస్తే ? అసలు అలాంటాయనకి ద్రోహం చేయగలడా ? బయట భుజంగరావు కారు కనిపించింది. తనమీద ఎంతో నమ్మకంతో, భార్యని ఇక్కడ వదలి వెళ్ళాడు చదువు సంధ్యలు అట్టే లేకపోయినా, సంస్కారం ఉందనే అలా చేశాడు. కాని తను ఎంత క్రూరమైన ఆలోచనల్తో ఉన్నాడు. అలా తొందరపడి, ఆమెను పొందాలనుకోవడం — తనెంత నీచమయిన ప్రవృత్తిగలవాడో తెలియజేస్తోంది.

తెల్లారేవరకూ తిరిగి పాకలోకి వెళ్ళకుండా బయటే గడిపాడు నాగరాజు.

తెల్లారుజామునే భుజంగరావు మెకానిక్‌తో రావడం— కారు రిపేర్ చేయించుకొని, ఆమెతో వెళ్ళిపోవడం — వెళ్లే ముందు తనకి ధన్యవాదాలు తెలియజేయడం – తను మనిషిలాగా ప్రవర్తించినందుకు ఎంతో సంతోషించాడు తను !

ఆ రోజునుంచీ భుజంగరావుకి తన మీద మరింత అభిమానం !

"నమస్కారమండీ !" కారు దిగుతోన్న భుజంగరావుకి నమస్కరించాడు, నాగరాజు.

"నమస్తే నాగరాజూ ! మూడు నెలలయిపోయింది నిన్ను చూసి !" నవ్వుతూ పాకలోపలి కొచ్చాడతను.

భుజంగరావుని చూసి రాజ్యలక్ష్మి చటుక్కున లేచి పైట నిండుగా కప్పుకొని లోపలి కెళ్ళిపోయింది.

"ఆ అమ్మా యెవరోయ్ ?" ఆశ్చర్యంగా అడిగాడాయన.

"నా భార్యండీ !"

"ఓరి నీ — పెళ్ళెప్పుడు చేసుకొన్నావ్ ?"

"రెండునెలలు దాటిందండీ !"

"భలేవాడివేలే ! నాకు తెలియకుండానే చేసుకొన్నావన్నమాట !" నవ్వుతూ అన్నాడాయన.

ఆయన ఆ మాట సరదాగా అన్నా చాలా నొచ్చుకున్నాడు నాగరాజు.

"అప్పట్లో — మీరు వస్తారేమోనని ఎదుర్చూశానండీ ! మీరు రాలేదు !"

"సర్దాగా అంటున్నాలేగానీ – మొత్తానికి ఓ ఇంటివాడివయ్యావన్నమాట !"




"త్వరలో ఓ పాపాయి కూడా రాబోతోందండీ !" అందామనుకొని బలవంతంగా ఆ మాట బయటకు రాకుండా అణచేసుకొన్నాడు.

"అవతల వాగొచ్చిందటగా ! లారీ వాడొకడు చెప్పాడు. తెల్లారేవరకూ నీ హోటల్లో పడకేశానంటే, పొద్దున్నే వేడి వేడి ఇడ్లీ, సాంబారు కొట్టేసి - మాంఛి కాఫీ తాగి తయారయేసరికల్లా— వాగు తగ్గిపోతుందని లెక్కవేశాను !"

"అవునండీ, అలా చేస్తేనే బావుంటుంది ! ఎలాగూ తెల్లారురఝాముకి తగ్గిపోతుందది ! మీరు బయల్దేరేసరికి ట్రాఫిక్ కూడా సర్దుకొంటుంది !"

కొద్దిసేపు అవీ ఇవీ మాట్లాడాడు భుజంగరావు.

కుర్రాడిని పిలిచి బెంచీలన్నీ పాక మధ్యలో కలిపి వేయించి, కార్లోంచి భుజంగరావుగారి బెడ్డింగ్ తెప్పించి పక్క పరిపించాడు నాగరాజు.

కారు తలుపులన్నీ మూసి లాక్ చేసి వచ్చి పక్కమీద వాలి సిగరెట్ వెలిగించాడు భుజంగరావు.

ఆయన కాల్చే సిగరెట్ చాలా ఖరీదయినది. చాలాసార్లు ఆయన దగ్గర ఆ సిగరెట్ చూడటం మూలాన బాగా గుర్తుంది. మరెవ్వరూ అలాంటి సిగరెట్ తాగగా చూడలేదు నాగరాజు.

"భోజనం అదీ అయిందా?" మర్యాదా పూర్వకంగా అడిగాడు నాగరాజు.

"ఒంగోలులో చేసి బయల్దేరా నోయ్! 'వాగు' సంగతి ముందే తెలిసిందిగా! నువ్వుకూడా పడుకో బోయావా?" నాగరాజువంక చూస్తూ అన్నాడాయన.

"నేనోసారి వాగుదగ్గర కెళ్ళి రావాలండీ! ఉదయంనుంచీ సరుకేమీ అమ్ముడుపోలేదు! అక్కడయినా లారీల వాళ్ళకి తోసేస్తే — నష్టంలేకుండా ఉంటుంది!"

"అరె పాపం! ఇంత రాత్రప్పుడు కూడా తిప్పలేనా?" జాలిపడ్డా డాయన

"ఎంతలోకి లెండి! రెండుగంటల్లో వచ్చేయనూ?"

మరికాసేపు కూర్చుని కుర్రాడితో పాటు బయల్దేరాడు నాగరాజు. వర్షం చినుకులు ఒకటొకటిగా పడుతున్నయ్!

వాగుదగ్గరికి చేరుకొనేసరికి రాత్రి పదకొండయిపోయింది. కుంపటి వెలి గించి సాంబారు వేడిచేశాడు కుర్రాడు.

లారీ డ్రయివర్లూ, క్లీనర్లూ అతని చుట్టూ మూగారు.

సగానికి పైగా సరుకు గంటలో అమ్ముడయిపోయింది.

మిగతా సగం అమ్ముడవటంలేదు. కుర్రాడిని లారీల వరుస చూసుకొంటూ వాగువరకు వెళ్ళిరమ్మని చెప్పి ఓ బేసిన్‌లో వడలూ, ఇడ్లీలూ ఉంచి లాంతరు వాడి కిచ్చి పంపించాడు.

వాడు అన్నీ అమ్ముకొని తిరిగొచ్చే సరికి తెల్లారుజామున నాలుగయి పోయింది. అప్పటిగ్గాని ధైర్యంరాలేదు నాగరాజుకి. ఇంక చాలా కొద్దిగా మిగిలినయ్! అవి అమ్ముడవకపోయినా ఫరవాలేదు. పెట్టుబడికంటె ఎక్కువే సంపాదించాడు.

"ఇంక పోదాం పద" అన్నాడు కుర్రాడితో. కుర్రాడు సామానంతా సర్దుతూంటే అంతవరకూ లేని నిద్ర ఒక్కసారిగా ఆవహించినట్లయింది నాగరాజుకి. బలవంతంగా కళ్ళు నులుము కొని లేచి కెటిల్ ఓ చేత్తోనూ, సంచి మరో చేత్తోనూ పట్టుకొని ఇంటివేపు నడువసాగాడు. కుర్రాడు కుంపటీ, గిన్నెలూ తీసుకొని అతనిని వెంబ డించాడు.

హోటల్ చేరుకొనేసరికి తెల్లారి పోతోంది. వర్షం పూర్తిగా ఆగి పోయింది. మబ్బులు విచ్చుకొన్నయ్. మరికాసేపట్లో ఎండవచ్చేట్లుగా కూడా ఉంది.

భుజంగరావు టూత్‌బ్రష్‌తో పాక బయట రోడ్డువారగా నుంచుని పళ్ళు తోముకొంటున్నాడు నాగరాజుని చూడ గానే "సరుకంతా అమ్ముడయిందా?" అంటూ నవ్వుతూ అడిగాడు.

"ఆ! చాలావరకూ అయిపోయింది.




లెండి ! అరేయ్, ఆ సామానంతా లోపల పడేసి అయ్యగారికి బక్కెట్లో, నీళ్లూ, సబ్బూ అందివ్వు !" కుర్రాడికి పని పురమాయించి పాకలోకి నడిచాడు నాగరాజు. భుజంగరావు మంచందగ్గర సిగరెట్ పీకలు నిండిపోయినయ్ ! 'బాబోయ్ ! ఇన్ని సిగరెట్లే !' ఆశ్చర్యంగా అనుకొన్నాడు నాగరాజు.

తెల్లార్లూ నిద్రలేకుండా సిగరెట్లు కాల్చారన్నమాట ! అయినా ఇలాంటి పాకలో నిద్రేం పడుతుందాయనకు ! షెడ్‌లోకి నడిచాడు నాగరాజు. రాజ్యలక్ష్మి ఇంకా మంచంమీద పడుకొనే ఉంది. కళ్ళు తెరచి పై రేకులవంక చూస్తోంది.

"పొద్దున్నే ఆలోచిస్తున్నా వేమిటోయ్ ?" ఆమెమీదకు ఒరుగుతూ అన్నాడు నాగరాజు. రాజ్యలక్ష్మి అతనిని తోసివేసి లేచి కూర్చుంది.

"మాట్లాడ వేమోయ్ ! మగపిల్లడా, ఆడపిల్లా అని ఆలోచిస్తున్నావా ?"

రాజ్యలక్ష్మి కళ్ళలో నీళ్ళు నిండినయ్.

మాట్లాడకుండా లేచి తన పనిలో మునిగిపోయింది.

"ఏమోయ్, కోపం వచ్చిందా, వదిలేసి వెళ్ళానని ..." అమాంతం ఆమెని లేవనెత్తి తన గుండెలకు హత్తుకొంటూ అన్నాడతను.

కొద్దిక్షణాలు మూగగా అతని కళ్ళల్లోకి చూసి అతని శిరస్సుని గాఢంగా తన హృదయానికి హత్తుకొందామె. ఆమె కిక దుఃఖం ఆగలేదు. ఉప్పెనలా ఏడ్చేసింది.

"ఏయ్, ఏడుపెందుకు ? పిచ్చి పిల్లలాగా !"

కొద్దిసేపటికి తేరుకొందామె.

బయట కారు స్టార్టయిన శబ్దం

అయింది. ఆమెను వదలి ఆత్రుతగా బయటకు నడిచాడు నాగరాజు. కారు అప్పటికే రోడ్డెక్కి వేగంగా పోతూ కనిపించింది. కొద్దిక్షణాలు ఆశ్చర్యంగా వెళ్ళిపోతోన్న కారువంకే చూస్తూ నిలబడిపోయాడతను. కాఫీ, టిఫినూ తీసుకోకుండానే భుజంగరావుగారు ఎందుకు వెళ్ళిపోతున్నట్లు? కనీసం తనతో వెళ్ళేప్పుడయినా చెప్పలేదేం? ఏమీ అర్థంకాలే దతనికి.

దూరంగా లారీలు పెద్ద ఊరేగింపులా పరుసగా వస్తూ కనిపించినయ్ నాగరాజుకి. అంటే వాగు తగ్గిపోయిందన్నమాట! ఇక తన హోటల్ మీద పడతారందరూ! త్వరగా ఏవయినా ఫలహారాలు సిద్ధంచేయాలి! హడావుడిగా పాకలోకి నడిచా డతను. కుర్రాడప్పటికే అన్నీ సిద్ధంచేసేశాడు. మరి కొద్దిసేపట్లో హోటలంతా డ్రయివర్లతోనూ, క్లీనర్లతోనూ నిండిపోయింది. అందరికీ ఇడ్లీలూ, కాఫీలూ అందించడంలో మునిగిపోయా డతను.

మధ్యలో కుర్రాడు పరుగెత్తుకొచ్చాడు తన దగ్గరకు.

"అమ్మగారు పిలుస్తున్నారు ..." అన్నాడు.

"ఎందుకు?" చిరాగ్గా అన్నాడు నాగరాజు.

"ఏమోనండీ!"

విసుగ్గా షెడ్‌లోకి నడిచా డతను. అక్కడ రాజ్యలక్ష్మిని చూసి చకితుడయిపోయాడు. పూర్తి అలంకరణతో, కొత్తచీరలో సరికొత్త అందం సంతరించు కొందామె. కళ్ళకు కాటుకా, పెద్ద బొట్టూ — తమాషాగా ఉన్నయ్. కళ్ళల్లో కొత్తవెలుగు! అంతకు ముందెప్పుడూ చూడని నిర్లిప్తతా!

"ఏమిటి పిలిచావ్, నిన్ను ఈ వేషంలో చూడ్డానికా?"

"కాదు!" అంటూనే చటుక్కున వంగి అతని కాళ్ళు తన కళ్ళ కద్దుకొంది.

"నీకేం పిచ్చెక్కలేదుకదా!" ఆశ్చర్యంగా అన్నాడు నాగరాజు.

"ఏమీ లేదు ..." నెమ్మదిగా అందామె.

"సరే - ఇప్పుడు నీతో మాట్లాడుతూ కూర్చుంటే లాభంలేదు ..." అక్కడినుంచి పాకవేపు పరుగెత్తాడు నాగరాజు.

హడావుడంతా సద్దుమణిగాక షెడ్‌లోకి నడిచేసరికి రాజ్యలక్ష్మి నిశ్చింతగా మంచంమీద పడుకొని కనిపించింది.

"ఏయ్ రాజ్యం! ఆమెను కుదిపి లేపబోయి షాక్ కొట్టినట్లు లేచి నుంచున్నా డతను. ఆమె శరీరం చల్లగా, నిర్జీవంగా ఉంది.

"రాజ్యం!" పిచ్చివాడిలా ఆమెని కుదిపివేయసాగాడు. మరుక్షణంలో ఆ ప్రాంతమంతా అతని ఏడుపుతో దద్దరిల్లిపోయింది.

# తొలగిన ప్రమాదాలు

వజీర్ జఫర్ ఒకనాటిరాత్రి ఖలీఫా హారూన్ అల్‌రషీద్‌ను తన ఇంట అతిథిగా స్వీకరించి ఆయన ఆనందానికి ఎలాంటి లోటూ లేకుండా ఉండే లాగు ఏర్పాటు చేశాడు.

విందు మాంచి ఉచ్చస్థాయినందుకుంటూ ఉండగా ఖలీఫా ఆకస్మికంగా, "జఫర్, నాకు జ్ఞాపకం వస్తున్నది. నువ్వీ మధ్య ఒక అపురూప సుందరి అయిన బానిసను కొనుక్కున్నావు. నేను ఆమెను చూశాను. ఆమెను నీనుంచి కొనాలనుకుంటున్నాను. అందుచేత నువు నీ యిష్టంవచ్చిన ధర పుచ్చుకుని ఆమెను నాకు అమ్మెయ్యి," అన్నాడు.

"ఆమెను అమ్మే ఉద్దేశం నాకు లేదు, మహాప్రభూ !" అన్నాడు జఫర్.

"అలా అయితే ఆమెను నాకు ఇచ్చెయ్యి," అన్నాడు ఖలీఫా.

"ఆమెను తమకు ఇచ్చే ఉద్దేశం కూడా నాకులేదు, మహాప్రభూ !" అన్నాడు జఫర్.

ఖలీఫా కనుబొమలు ముడిపడ్డాయి.

"నీ బానిసను నాకు నువ్వు అమ్మక పోయినా, ఇయ్యకపోయినా నా పట్టపు రాణి జుబేదాదేవిని వదిలేస్తానని మూడు ప్రమాణాలమీద ఒట్టుపెట్టుకుంటున్నాను," అన్నాడాయన.

"ఆ రెంటిలో ఏది చేసినా నా భార్యను, నా పిల్లల తల్లిని వదిలేస్తానని నేనూ అదే ప్రమాణం చేస్తున్నాను," అన్నాడు జఫర్.

ఇద్దరూ ఇలాంటి ఘోరప్రమాణాలు చేసిన అనంతరం, తాగుడు మైకంలో తాము కఱుపు దాటి వెళ్లామని గ్రహించి, గండకత్తెరనుంచి తలలు వెనక్కు తీసుకోవటం ఎలాగా అని దిగులు పడసాగారు.

కొంతసేపు దిగ్భ్రమలో ఉండిపోయినమీదట అల్‌రషీద్, "మనం ఈ ఘోరపరిస్థితినుంచి బయటపడేమార్గం చెప్పగలవాడు కాజీ అబూ యూసుఫ్ ఒకడే. విడాకుల నియమాలు అతనికి ఒకడికే క్షుణ్ణంగా తెలుసు."

వెంటనే కాజీకోసం కబురు వెళ్ళింది.

"ఈ అర్థరాత్రివేళ ఖలీఫా నాకోసం కబురుపెట్టాడూ అంటే ఇస్లాముకే ఏదో

పెద్ద విపత్తు సంభవించి ఉండాలి," అనుకుని అబూ యూసుఫ్ తక్షణమే తన కంచరగాడిద నెక్కి, తన వెంట వచ్చే బానిసతో, "ఒరే దాణా సంచీ పట్టుకురా కంచరగాడిద తిండి ఇంకా పూర్తికాలేదు. మనం చేరగానే సంచీని దాని నోటికి కట్టటం మరిచిపోయేవు," అన్నాడు.

ఖలీఫా, జఫర్లు తనకోసం ఎదురు చూస్తున్న మందిరంలోకి అడుగుపెడుతూనే ఆయనను చూసి, ఆయన గౌరవార్థం హారూన్ అల్‌రషీద్ లేచి నిలబడి, తన ఆసనంమీద ఆయనకు చోటిచ్చాడు. (అబూ యూసుఫ్‌కు తప్ప ఖలీఫా అలాంటి గౌరవం మరెవరికీ చూపి ఎరగడు.)

"నేను నిన్ను అతి ప్రమాదకరమూ, సున్నితమూ అయిన వ్యవహారం గురించి పిలవనంపాను," అంటూ ఖలీఫా కాజీకి జరిగినదంతా చెప్పాడు.

అంతా విని కాజీ, "మహాప్రభూ, ఇది అతి తేలికగా పరిష్కారం అయే సమస్య," అని, జఫర్‌కేసి తిరిగి, "మీరు మీ బానిసను ఖలీఫాకు అమ్మనూవద్దు, ఇయ్యనూవద్దు. సగం అమ్మి, సగం బహూకరించండి," అన్నాడు.

ఖలీఫా పరమానందం చెందాడు. ఈ ఉపాయం ఆయనకు అమోఘంగా కనిపించింది. దీని మూలంగా ఇద్దరూ చేసిన ఘోరప్రమాణాలకూ విఘాతం కలగకపోవటమేగాక, బానిసపిల్ల తనది కాబోతున్నది!

బానిసపిల్లను పిలిపించారు.

"చట్టప్రకారం ఆమె బానిసత్వం నుంచి విముక్తి పొందేదాకా నేను ఆగలేను. అందుచేత ఏదైనా మార్గం చూడు," అన్నాడు ఖలీఫా.

"అది మరీ తేలిక. ఎవడన్నా మమ్లూక్ యువకుణ్ణి పిలిపించండి," అన్నాడు కాజీ.

ఎవడో మమ్లూక్ వచ్చాడు.

"ఈమె బానిసత్వం వెంటనే జరగాలంటే ఈమెకు శాస్త్రపద్ధతిన పెళ్ళి చెయ్యాలి అందుచేత నేను ఈ మమ్లూక్‌కు కొంత డబ్బిచ్చి, ఈమెను పెళ్ళిచేస్తాను. షరతు ఏమిటంటే, వీడు ఈమెను తాకకుండా, వెంటనే విడాకులిచ్చెయ్యాలి. అప్పుడామె అదే క్షణంలో తమ ఉండుపుగత్తె కాగలదు, మహాప్రభూ!" అన్నాడు కాజీ.

ఆయన మమ్లూక్‌తో, "నువు ఈ బానిసను నీ అర్థాంగిగా స్వీకరిస్తావా?" అన్నాడు.

"స్వీకరిస్తాను," అన్నాడు మమ్లూక్.

"ఇంకేం? మీ ఇద్దరికీ వివాహం అయిపోయింది. ఇవిగో వెయ్యిదీనారాలు! ఇక ఆమెకు విడాకులిచ్చెయ్యి," అన్నాడు కాజీ.

"ఆమె నాకు శాస్త్రోక్తంగా భార్య




అయింది గనక ఆమెను భార్యగానే ఉంచుకుంటాను, ఆమె నాకు నచ్చింది," అన్నాడు మమ్లూక్.

ఈ మాట వినగానే కోపంతో ఖలీఫా కనుబొమలు ముడిపడ్డాయి. "కాజీ, నీ తెలివితేటలు నిన్ను ఉరికంబం ఎక్కించబోతున్నాయి!" అన్నాడాయన.

కాని అబూ యూసుఫ్ కొంచెమైనా తొణకకుండా, "మమ్లూక్ నిరాకరణకు ఏలినవారు కలతచెంద నవసరం లేదు. ఎందుకంటే, సమస్య మరింత తేలిక అయిపోయింది. తమరు చేయవలసిందల్లా ఏమంటే ఈ మమ్లూక్‌ను నా బానిసగా ఉపయోగించుకోవటానికి అనుమతి నియ్యండి," అన్నాడు.

"తప్పకుండా తీసుకో. వాడు నీ బానిస, నీ సొత్తు!" అన్నాడు ఖలీఫా.

వెంటనే అబూ యూసుఫ్ పిల్లకేసి తిరిగి, "ఈ మమ్లూక్‌ను నీకు బానిసగా ఇచ్చేస్తున్నాను. అందుకు ఆమోదిస్తావా?" అని అడిగాడు.

"ఆమోదిస్తాను," అన్నదామె.

"అలా అయితే మీ ఇద్దరి పెళ్ళి చెల్లదు. నీకు అతనినుంచి పూర్తి స్వేచ్ఛ ఉన్నది. అలా అని చట్టం చెబుతున్నది. అదే నా తీర్పు," అన్నాడు కాజీ.

హారూన్ అల్‌రషీద్ చప్పున లేచి పారవశ్యంతో, "ఓ అబూ యూసుఫ్, ఇస్లాం ప్రపంచంలో నీకు ఎవరూ సాటి రారు," అని, ఒక పళ్లెంనిండా బంగారం తెప్పించి, కాజీని స్వీకరించమన్నాడు.

యూసుఫ్ ఆయనకు పుష్కలంగా ధన్యవాదాలు చెప్పుకున్నాడు, కాని అంత బంగారాన్ని ఎలా తీసుకుపోవాలో ఆయనకు తెలియలేదు. ఇంతలో దాణా సంచీ జ్ఞాపకం వచ్చింది. బంగారం అందులో నించి, ఆయన ఇంటికి వెళ్ళిపోయాడు.

# పుణ్య పురుషుడు



అలహరి రంగహరి

పద్మావతి మనస్సేమీ బాగాలేదు. శారద వ్రాసిన ఉత్తరము చూచినప్పటినుంచీ తన మనస్సదోలా వుంది. ఆలోచన్లు అస్తవ్యస్తంగా ఉన్నాయి.

పద్మావతి ఒక పేరుమోసిన కంపెనీ మేనేజరు రామారావుగారి భార్య. వారికి యిద్దరు పిల్లలు. పెద్దవాడు తన అమ్మమ్మ దగ్గర వుండి ఇంటరు చదువుకుంటున్నాడు. పాపమాత్రం తల్లి దండ్రుల వద్దనే వుండి కాన్వెంటులో చదువుతుంది.

పద్మ చిన్ననాటి స్నేహితురాలు శారద. కలిసి మెలసి చదువుకున్నారు. ఆప్యాయతలు, అనుబంధాలు పెనవేసుకుని పెరిగి పెద్దవారయ్యారు.

శారద తనకన్నా ముందే పెళ్ళిచేసుకుని కాపురానికి వెళ్ళిపోయింది. మొదట్లో తన భర్త చాలా మంచివాడని, ప్రేమగా చూస్తున్నాడని ఉత్తరాల్లో వ్రాస్తూ వుంటుండేది. ఈమధ్య మాత్రం అతని ధోరణి మారిపోయిందని, సరిగా రాత్రి పూట యింటిపట్టున వుండక, చెడు

తిరుగుళ్ళు తిరుగుతున్నాడని వ్రాస్తూ వుంది.

కానీ, నిన్న వచ్చిన ఉత్తరంలో శారద దాంపత్యజీవితంలో తనూ హించని మలుపు తిరిగిపోయింది. శారద భర్త బంగారంలాంటి భార్యను, ముత్యాల్లాంటి బిడ్డలను పదిహేను సంవత్సరాలు పైగా కాపురం చేసిన తరువాత వదిలేసాడు.

కొన్నేళ్లు కాపురం చేసిన తరువాత వున్నట్లుండి భర్త వదిలేస్తే ఆ భార్యాబిడ్డల గతేంకావాలి? పుణ్యంకొద్దీ పురుషులంటారేగానీ, యే స్త్రీ చరిత్ర తిరగవేసినా యేం కనబడుతుంది పుణ్యం?

ఆడది ఒక కామయంత్రం. ఇంటి చాకిరీకి పలుపుతాడు వేసి తీసుకుని వచ్చిన పనిమనిషి. ఇంతేగా? శారద బ్రతుకిలా కాలిపోవటానికి యింకా వేరే కారణాలేమున్నాయి? వయస్సులో ఉన్నన్నాళ్లూ ఆమెను పీల్చి పిప్పిని చేసాడు. ఆ అందం, ఆ పొంకం దిగజారిపోయాయి. ఇప్పుడు పనికిరానిదయింది. ఎవరైనో ఉంచుకుని ఆమెను వదిలేశాడు.

ఎందుకిలాంటి బుద్ధులు మనుష్యులకు పుడతాయో తనకు అర్థంకావటంలేదు. స్త్రీ ఏంపాపంచేసుకుంది? సృష్టిలో తన పట్ల ఎందుకీ — వివక్షత? చిన్నచూపు?

అనురాగాన్నీ, అనుబంధాన్నీ అనుభూతినీ ప్రసాదించే దేవతామూర్తి స్త్రీ. కానీ, ప్రతిఫలంగా తనేం పొందుతుంది? చిన్నతనంలో రంగులహరివిల్లయి ఆటపాటలతో అన్నదమ్ముల హృదయాలలరారిస్తుంది. రేసుగుర్రంలా పరిగెడుతున్న యౌవనానికి జవ్వని తన పరువాన్ని అంకితంజేసి, భర్త మదిలో అనురాగ వీణలు మీటుతుంది. నవమాసాలు మోసి పండంటి బిడ్డను ప్రసాదిస్తుంది. వారసత్వం నిలబెడుతుంది. తను తరిగిపోతూ మరో ప్రాణి కండకు అండగా తన పాలు పడుతుంది. ప్రేమానురాగాలలో మనిషిగా తీర్చి దిద్దుతుంది.

త్యాగం స్త్రీది. భోగం మగవాడిది. బానిసత్వం ఆడదానిది. స్వేచ్ఛ పురుష పుంగవుడిది.

అలాంటి త్యాగమయి జీవితం ఎప్పటికీ కన్నీటి కథగానే మిగిలిపోవలసిందేనా?

ఆదినుంచీ ఆడది మగవాడి దుర్మార్గానికి బలిఅవుతూనే వుంది. అనుక్షణం వంచింపబడుతూ జీవచ్ఛవంలా బ్రతుకుతూవుంది.

శారద భర్తలాంటి దుర్మార్గుల్ని చిత్రవధచేయాలి. అదే...తనయితే... అదే స్థానంలో తను వున్నట్లయితే..... అలాగే రావు చేసివుండి వుంటే... ఛా...రావు అలాంటివాడుకాదు. చాలా మంచివాడు. తననెంతో ప్రేమతో చూసుకుంటూ వున్నాడు. ఎంతో

ఉన్నతుడు. తన మనస్సుకు నెప్పి కలిగించే పని యేనాడూ చేయలేదు, చేయడు.

పద్మని, రావుని చూస్తున్నవారికి వారి సంసారం ముచ్చటగా కన్పిస్తుంది. నిజం చెప్పాలంటే పద్మా, రావుల మధ్య విడదీయరాని అనురాగంవుంది. అంతులేని ప్రేమవుంది. అందుకే వారిద్దరికీ జీవితమొక తీయని అనుభూతి.

రావుకు యిష్టా యిష్టాలంటూ యేమీ లేవు, పద్మ అభిప్రాయాలు తప్ప. పద్మ గర్వపోతని అందరూ అనుకుంటూ వుంటారు. అందులో ఆశ్చర్యంలేదు. యదార్థానికి పద్మకు గర్వమే! అనుకూలమయిన భార్యవున్న భర్త గర్వపడతాడో లేదోగానీ, అనురాగం చూపిస్తూ, జీవితాన్ని ప్రేమమయం చేసే భర్తను కలిగివున్నందుకు స్త్రీ గర్వపడకుండా వుండగలదా?

పద్మకు రావు ఏమీ తెలియని అమాయకుడు. పరస్త్రీని కన్నెత్తి చూడడు. అతనంటే ఆమెకెంతో నమ్మకం వుంది. పద్మ సంసారం పచ్చగా ఉంటానికి కారణమదే!

'మమ్మీ......' — బడినుంచి వచ్చిన పాప తల్లిఒడిలో వాలి మెడ చుట్టూ చేతులువేసి అల్లుకుపోయింది

తామర తంపరలా ఉన్న ఆలోచన్ల నుంచి తేరుకుని పద్మావతి, సరళను తన హృదయానికి హత్తుకుంది.

"ఏమ్మా...డాడీయింకా రాలేదా?"— తన బుల్లిచేతులతో తల్లి చెంపలను రాస్తూ అడిగింది.

"రాలేదమ్మా...పద...నీవు టిఫిన్ చేద్దువుగానీ..."

లోనికి తీసుకువెళ్ళింది.

పాపకు యిష్టమని తను జిలేబీ చేసింది. ఒక ప్లేటులో జిలేబీ, మరో ప్లేటులో పకోడీలు ఉంచి, పాపముందు పెట్టింది. ప్రేమగా తలనిమురుతూ తినమంది. తాను చాకు తీసుకుని యాపిలు కాయను ముక్కలుచేస్తూ పాపప్రక్కనే కూర్చుంది.

ఇంతలో బయట కాలింగ్ బెల్లు మ్రోగింది.

ఎవరో చూడటానికని బయటకు వచ్చింది పద్మ.

ఓ యువకుడు వరండాలో నిలబడి ఉన్నాడు. సన్నగా పీలగా ఉన్నాడు. గడ్డంమాసివుంది. కళ్ళు పీక్కుపోయి ఉన్నాయి. బుగ్గలు తోసుకుపోయి ఉన్నాయి.

యవ్వనానికి, బ్రతుక్కి మధ్య నలిగిపోతున్నట్లున్నాడతను.

పద్మావతిని చూచి చేతులు జోడించి నమస్కరించాడు.

"ఎవరుబాబు నీవు? ఎవరుకావాలి?

"రామారావుగారికోసం వచ్చానండీ!"

"ఆయన యింకా రాలేదు? ఏంపని?"



అతను తటపటాయిస్తున్నాడు.

"ఫరవాలేదు బాబూ చెప్పు? ఏం కావాలి?"

తన చేతిలోవున్న పుస్తకంలోంచి ఓ కవరు బయటకు తీసాడు.

"ఇది రామారావుగారికి యిచ్చి మాట్లాడాలండీ! ఆఫీసుకు వెళ్ళాను. లేరని చెప్పారు. ఇంటి అడ్రసు తీసుకుని వచ్చాను."

"ఓ! అలాగా! ఆయన వచ్చే వేళయింది. వచ్చి లోపల కూర్చో"—లోపలికి దారితీసింది.

పద్మ సోఫా చూపించి కూర్చో మందతన్ని.

"ఎవరిచ్చారా ఉత్తరం" —అడిగింది ఉత్తరంవంకచూస్తూ.

"మా అమ్మండి. పేరు సుశీల. టీచరుగా పనిచేస్తుంది. ఈ ఉత్తరం రామారావుగారికి అందజేస్తే యేదైనా ఉద్యోగం యిప్పిస్తారని చెప్పింది. నాకు

తం్రడి లేరండి. నే పుట్టకముందే పోయా రట. అమ్మే నన్ను డి్రగీవరకూ చదివించింది. ఇప్పుడామె ఆరోగ్యం ఏమీ బాగాలేదండీ. హాస్పిటల్లో ఉంది. నేనెలాగయినా ఉద్యోగం సంపాదించి ఆమె జబ్బు నయంచేయించాలి. దయ ఉంచి మీరాయనతో చెప్పి నాకెలా గయినా ఉద్యోగం వచ్చేట్లు చూడండి..."

అతని మాటలు దీనంగా ఉన్నాయి.

ఆమెకళ్ళు చెమ్మగిల్లాయి. ఈ సుశీల ఎవరో తనకు తెలీదు. తనకు తెలిసి నట్లుగా రావేనాడూ తనతో చెప్పలేదు. రావుకు కాస్త పలుకుబడివుంది. ఆతని "సిఫారసు" కోసం చాలామంది వస్తూ ఉంటారు.

పద్మ కతన్ని చూస్తూఉంటే జాలి కలిగింది. రావుతో ఆ కుర్రవాడికి ఉద్యోగంయిప్పించమని గట్టిగాచెప్పాలను కుంది.

సాయం్రతం ఆరుగంటలయినా రావు రాలేదు. అతనికి కాఫీ యిచ్చి ఎదురుగా కూర్చుంటూ అతనివంక చూసింది.

తను సోఫాలో వొదిగొదిగి కూర్చుని కాఫీ తాగుతున్నాడు. కవరుచించి, కాగితాలు కవరులోంచి తీసి మడత విప్పింది. ఉత్తరం చాలా పెద్దది.

"రామారావుగారికి,

సుశీల నమస్కారములు.

ఈ సుశీలెవరో మీకు గుర్తుకువచ్చి ఉండదనుకుంటాను.

మీరు విశాఖలో చదువుకుంటున్న ప్పుడు సుబ్బారావుగారింట్లో ఒక రూము అద్దెకు తీసుకుని వుండేవారు. గుర్తుందా? ఆ యింట్లో సుశీలనే, నేను!

ఇప్పటికయినా గుర్తుకు వచ్చానా ?

ఈ మధ్య పేపర్లో మీ ఫోటోని చూసాను. నాకు అప్పుడే మీ అ్రడసు తెలిసింది. మీరో పెద్ద కంపెనీకి మేనేజ రయినందుకు నాకు చాలా సంతోషంగా ఉంది.

ఈ ఉత్తరము మీకు తెచ్చియిచ్చిన వాడు, నా పేగు తెంచుకు పుట్టిన నా బిడ్డ.

నా పేగుకు వాడ్ని పెనవేసింది మీరేనని మీకు తెలీదనుకుంటాను.

పద్మావతి ఉత్తరం చదవటం ఆపింది.

"బాబూ యీ ఉత్తరం ఏ రామా రావుగారికి?"

"ఎ.బి. రామారావుగారికి...కంపెనీ మేనేజరు......" —చెప్పుకుపోతున్నా డతను.

పద్మ గుండె దడదడలాడింది, అవును ఆ రామారావు యీ రావుగారే! చేతులు వణుకుతున్నాయి. తనకు నమ్మకం కుదరటంలేదు.

రావు తనవద్ద ఏ విషయమూ దాచలేదు. కానీ, అతని జీవితంలో యింత మచ్చ వుందా?

నా పేగుకి వాడ్ని పెనవేసింది మీరేనని మీకు తెలీదనుకుంటాను.

అదే వాక్యం మళ్ళీ మళ్ళీ చదివింది. తనకు నమ్మబుద్ధి కావటంలేదు. తన భర్త అలాంటివాడుకాదు. తను కాపురానికి వచ్చింది మొదలు రావు పరస్త్రీని కన్నెత్తి చూడటం తనకు తెలీదు. అతనెప్పుడూ అలా బిహేవ్ చేయలేదు. అలాంటి రావు జీవితంలో యింత నిగూఢమయిన చరిత్ర వుందా?

తన భర్తపట్ల తనకున్న నమ్మకం వమ్మేనా?

అక్కడ కూర్చోలేక లోపలికి వెళ్ళింది. బెడ్ మీద వాలింది. ఉత్తరం చదవటం మొదలుపెట్టింది.

అక్షరాలు కన్పించటంలేదు.

కళ్ళు తుడుచుకుంది.

నా పేగుకు వాడ్ని పెనవేసింది మీరేనని మీకు తెలీదనుకుంటాను.

భూత భవిష్యత్తులతో మీకు పనిలేదు. కేవలం వర్తమానంతో రాజీపడి ఎడ్జస్టయిపోయే నిర్బల హృదయులు మీరు. మీకేమాత్రం భవిష్యత్తనే భయమే ఉండిఉంటే. ఆనాడు నన్నలా చేసేవారే కాదు. కనీసం గతంపై మమత కలవారయితే మమ్మల్నిలా మరచిపోయేవారే కాదు.

మీరు మిగిల్చిన చేదు జ్ఞాపకాలు నన్ను లోలోనే తినివేసాయి. నా పని యీ రోజో, రేపో అనేట్లుగా ఉంది.

రాంబాబు నాన్నేడని అడిగేవాడు.

ఏమని చెప్పను ?

వయస్సులో కళ్ళుకానరాని కామోద్రేకంలో ఒక దుర్మార్గుడి దుష్కార్యానికి నా కడుపున పడ్డావని—వాడితో ఎలా చెప్పను?

వాడితో చెప్పలేక – ఆ నిజాన్ని నాలోనే దాచుకున్నాను. అందుకే అది దహించుకు తింటూవుంది నన్ను.

ఆ రోజు మీకు గుర్తుందా ?

పండువెన్నెల్లో డాబామీద పడుకుని ఉన్నాను నేను. అంతలో మీరు వచ్చారు. నేను లేచి క్రిందకు వెళ్ళిపోబోతూవుంటే నన్నాపారు. నేనంటే మీకు చాలా యిష్టమన్నారు. నే లేందే మీ జీవితానికి అర్థం లేదన్నారు. నన్ను విడిచి మీరు బ్రతకలేనన్నారు. మీకు తెలుసు—నాకు తల్లిదండ్రులు లేరని, అన్నయ్య నీడనే బ్రతుకుతున్నానని. నన్ను పెళ్ళి చేసుకుంటానన్నారు. అందలం ఎక్కిస్తానన్నారు. ఆ సమయంకోసమే ఎన్నాళ్ళగానో ఎదురుచూస్తున్నానని నా చేయి పట్టుకున్నారు.

మీ మాటలు, మీ తీరు చూసి భయపడి పారిపోబోతూవుంటే నన్ను పట్టుకున్నారు.

ఆ తరువాత ఏంచేసారు మీరు? ఏంచేయకూడదో-అదే చేసారు. నాలో వేడిని రగిలించారు. వెచ్చగా చలికాచుకున్నారు మీరు.

ఇవన్నీ మీకు బాధకలిగించాలని వ్రాయటంలేదు రామూ, నే పడిన బాధ మీరిప్పటికయినా అర్థంచేసుకుంటారనే ఆశ చావక వ్రాస్తున్నాను.

నాకు నెలతప్పినరోజు మీకావిషయం చెప్పి, మన పెళ్ళిమాట ఎత్తితే! మీరేం చేసారు?

ఏంచేసారో చెప్పండి?

పారిపోయారు !

ఆ తరువాత నా జీవితం ఏమయిందో ఏ మిటో మీకు పట్టలేదు.

ఇప్పుడు నేను జీవితం ఆఖరిమెట్టు మీద ఉన్నాను. ఒక్కసారి జరిగింది తలచుకుంటూ వుంటే హృదయం బ్రద్ద లవుతుంది. ఎవరికయినా చెప్పుకుని సానుభూతిని పొందగల్గితే మనస్సు తేలికపడి తృప్తిచెందుతుంది. కానీ, నాకు ఎవరున్నారు చెప్పుకునేందుకు? రాంబాబు ఉన్నాడు గాని, వాడితో యీ విషయం ఎలా చెప్పగలను?

అందుకే మీకు వ్రాస్తున్నాను.

నా వక్రించిన ఈ జీవితానికి సూత్ర ధారులు మీరు. మీకు చెప్పుకుని మీ సాను భూతిని పొందగల్గితే నా ఆత్మకు శాంతిగల్గుతుందేమోనని నా భ్రమ!

అందుకే చెప్పుకుంటున్నాను.

నే తప్పుచేసినా అన్నయ్య కడుపులో దాచుకున్నాడు. నాకు కళంకం కలగ కుండా కడిగించేస్తానన్నాడు. ఆ పనే చేసివుంటే, రాంబాబు ఉండేవాడే కాదు! నాకీ అవకాశమూ వచ్చేదికాదు.

ఎబార్షన్ చేయించుకోటానికి నా మనస్సొప్పలేదు. ఎవరేమనుకున్నా ఖాతరు చేయలేదు నేను. తల్లినయ్యాను. చదువు పూర్తిచేసుకుని టీచరునయ్యాను. వాడ్ని యింతటివాడిని చేసాను. కానీ, నా దురదృష్టం. నా అన్నా వదినలు బస్సు యాక్సిడెంటులో మరణించారు. నాకు వాడు, వాడికి నేనూ మిగిలాం.

ఇప్పుడు వాడు 'ఏకాకి'గ అవబోతూ వుంటే నా మాతృహృదయం తల్లడిల్లి పోతుంది. ఇన్నాళ్ళు తండ్రి లేనివాడు, ఇప్పుడు తల్లికూడ లేనివాడయితే వాడి పసి మనస్సు తట్టుకోలేదని మీ వద్దకు పంపుతున్నాను.

నేనెక్కువరోజులు బ్రతకనని డాక్టర్లు నిర్ణయించుకున్నారు. నా చావు వాడు చూడకూడదని మిమ్మల్ని కలవ మని ఈ ఉత్తరం యిచ్చి పంపు తున్నాను. మీరు తనకేమవుతారో వాడికి మీరు చెప్పేంతవరకు తెలీదు! ఆ జాగ్రత్త నేను తీసుకున్నాను. మీరు వాడినొక ఉద్యోగస్తుడిగా చేస్తారో, తనయుడిగా చూసుకుంటారో-అంతా వాడి అదృష్టం మరి.

శలవు

మీ సుశీల.

పద్మ చేతిలో కాగితాలు జారిపడ్డాయి, శూన్యంలోకి చూస్తూ, ఆలోచిస్తుంది.

అంతా భ్రమేనా? ఏజన్మలో తను చేసుకున్న పుణ్యఫలితమో రావు సాహచర్య మనుకున్నదంతా భ్రమేనా? రావుకూడా వట్టి పురుషుడేనా? పుణ్య పురుషుడు కాదూ?

అప్పుడే లోపలికి వచ్చిన రావామెను చూసి కంగారుపడ్డాడు.

"ఏమయింది పద్మా? ఏమిటలా వున్నావు?" నుదురు పట్టుకుని చూసాడు. చేయి అందుకుని నాడి చూస్తున్నాడు.

తనవంక పేలవంగా చూస్తూ నవ్వింది.

తన చేతిలోని కాగితాలు అందించింది

రావు అంతా చదువుకుని నిశ్చేష్టుడయ్యాడు. ఆ కాగితాలవంక అలానే చూస్తూ నిలబడ్డాడు.

"ఎందుకలా చూస్తారు. మీ జీవితానికి మచ్చలేదనుకున్నాను. ఇంత నయవంచకులనుకోలేదు."

"అదికాదు పద్మా..."

"మీరు కల్లబొల్లి మాటలతో నన్ను నమ్మించి మరొకసారి వంచించాలని ప్రయత్నించవద్దు..."

"అదికాదు పద్మా... పెద్దగా కేకలు వేయకు."

"ఏదికాదు ఆ ఉత్తరంలో ఉన్నదంతా నిజంకాదా? ఆ పిల్లవాడికి తండ్రి నన్నది నిజంకాదా?ఆమెను సర్వనాశనం చేసింది నిజంకాదా? ఏమిటలా చూస్తారు. చెప్పరేం?......పైగా కేకలు వేయకూడదా ? అమ్మో...మీరెంత గుండెలు తీసిన బంటులండీ?..."

గుండెలు బాదుకుంటుంది.

"సుశీల వ్రాసినదంతా నిజమే!... కానీ"

"ఛీ...యింకా మాట్లాడకండి."

లేచి గదిలోకి పరుగెత్తింది. గబగబా బట్టలు సర్దింది. పాపకు డ్రస్సు మార్చింది.

"పద్మా...నన్ను క్షమించు పద్మా."

"చూడండి! నాకు మీ క్షమాపణలు అవసరంలేదు. నేను క్రితంజన్మలో ఎంత పుణ్యంచేసుకున్నానో మీలాంటి పుణ్యపురుషులు దొరికారనుకున్నాను. కానీ, నేను పుణ్యంచేసుకోలేదండీ!... అంతా పాపాన్నే మూటకట్టుకున్నాను. అందుకే ప్రాయశ్చిత్తం చేసుకుంటాను."

"పద్మా...ఆవేశపడకు. ఆ కుర్రవాడిని ఎలాగోలా పంపించేస్తాను. నే చెప్పేది విను."

"వినను. వినాల్సిన అవసరం నాకు లేదు. మీ అహంకారం, కామాంధకారం మూలంగా ఒక నిండుమనస్సుకు బాధ కలిగించారు మరో పసిహృదయాన్ని గాయపరచాలని చూస్తున్నారు. ఆ బాధ ఎలాంటిదో మీకు తెలీదు. నేనిక్కడ ఉండగా మీ కా నరకం కన్పించదు. అందుకే వెళ్ళిపోతున్నాను."

గబగబా పాపను, పెట్టెను తీసుకుని హాల్లోకి వచ్చింది.

"బాబూ...పద...యిప్పటికే చాలా ఆలస్యమయింది ... మనం త్వరగా వెళ్ళి అమ్మను దక్కించుకోవాలి."

అప్పటివరకు జీవచ్ఛవంలా నిలబడి ఉన్న రాంబాబు అమాయకంగానే ఆమెను అనుసరించాడు.




రామంకు ఒంట్లో బాగాలేదని తెలిసి చూద్దామని ఫీవర్ హాస్పిటల్‌కు వెళ్ళాడు సత్యం, ఆ ఆదివారం సాయంత్రం అయిదుగంటలప్పుడు.

రామంకు హెవీ ఫీవర్ ... అపస్మారక స్థితి.

చిక్కడపల్లిలో బస్సు దిగి తోటలో నుండి అడ్డంపడి ఆసుపత్రి వెనక గేటు నుంచి లోపలికి వెళ్ళాడు. అసలు అతడికి ఆసుపత్రికి వెళ్ళాలంటేనే భయం. అందునా నల్లకుంటలో ఉన్న ఆ ఆసుపత్రి అంటే మరీను...

కారణం—శారద !

బెడ్‌మీద ఏమీ తెలియనిస్థితిలో

ఊగిపోతున్న రామాన్ని చూస్తూ ఎక్కువసేపు ఉండలేకపోయాడు సత్యం !

అందునా చీకటి ముంచుకొచ్చేస్తోంది ... ఇంటికి వెళ్ళేటప్పటికి వెంట వెంట బస్సులు దొరికినా ఎనిమిదికి తక్కువ గాదు.

బయటకు వచ్చేశాడు.

ఇటువైపుకు వచ్చినట్లుగా శారదకు తెలియకుండా ఉండటమే అతడికి కావాల్సింది ... తెలిస్తే జీవితాంతం దెప్పుతూనే ఉంటోంది !

రోడ్డుమీద దీపాలు వెలా తెలా బోతున్నయి.

శారదకు భయపడుతున్నట్లుగానే—బాగా కిక్కిరిసి ఉన్న బస్సును చూసి మరీ దాంట్లో ఎక్కి లోపలికల్లా ఈదు కుంటూపోయి దాక్కున్నట్లుగా మను ష్యుల మధ్యలో నిలబడ్డాడు సత్యం.

—శారదగానీ చూచిందంటే తన పని హరీ ! ఆవిడగారి నోరు మంచిది గాదు ... దులిపేస్తుంది ... వెళితే తన గొప్పలు చెప్పుకోవటంతోటే సరి పోతుంది ... వెళ్ళకపోతే ... సరి... సరి...

"టికెట్..."

వెనుక జేబులో డబ్బులు తీద్దామని చేయిపెట్టిన సత్యం ఉలిక్కిపడుతూ అలాగే బిగుసుకుపోయాడు ... జేబులో ఉన్న పది రూపాయలూ ఎవడో కొట్టే శాడని తెలుసుకోవటానికి ఒక్కక్షణం చాలు !

తనని శారదే వెక్కిరిస్తున్నట్లుగా శంకరమంతం ముందు బిక్కముఖం వేసుకొని దిగక తప్పలేదు !

—శారదంటే తను అంతగా భయపడాలా ?

అది భయమో తెలియదు ... అభి మానమో తెలియదు...

కారణం ఏదైనా ఆమెను తప్పుకు తిరగాలనే తన మనస్సు కోరుకుంటుంది.

ఇప్పుడేం చేయాలి ?—జేరవలసింది అక్కడకు పది కిలోమీటర్ల దూరంలో ఉన్న బాలానగరు !

—నడుచుకుంటూ ఫీవర్ హాస్పి టల్‌కు వెళ్ళి రామం నాన్నగారి నడిగి రెండు రూపాయలు తెచ్చుకుంటేనో ... ఊఁహూఁ ... వాళ్ళ గొడవల్లో వాళ్ళున్నారు ... మధ్యలో తన దొక సొద...వద్దు...

మనిషి విధి చేతిలో కీలుబొమ్మ.

శారద దగ్గరకు వెళితేను ? ఛ !

ఆటో చేసుకు వెళదామన్నా అక్కడ మహారాణీగారు తను ఎలాగూ ఆలస్యంగా వస్తానన్నాడు గదా అని యింటికి తాళం బిగించి సినిమాకు చెక్కేసి ఉంటుంది...

కృష్ణ ! కృష్ణా ! ...

మనిషి ఏది జరగకూడదనుకుంటాడో

సామాన్యంగా అదే జరుగుతుంది. శారద కంఠం సత్యం గతుక్కుమనేలా ఖంగ్గు మన్నది !

"హల్లో సత్యం ! కమాన్... కమాన్ ... ఎన్నాళ్ళ కెన్నాళ్ళకు..."

నెత్తిన పిడుగులు పడుతున్నట్లే ఉన్నది.

— ఇవాళ లేచినవేళ మంచిదిగాదు.

'ఓయ్ బోడి సత్యం ... జేబులో డబ్బుల్లేకపోతే కండక్టరు దించేశాడు గదూ ... రా ... రెండు రూపాయలు కావాలంటే నేను పారేస్తాలే ... ఏం చేస్తాం ... రా' అన్నట్లే ఉన్నది ఆమె కంఠం.

ఆమెను చూసి ఏడ్వలేక వెధవ నవ్వొకటి నవ్వాడు సత్యం.

"అవును !"

"ఏంటి అవును !" అన్నది ఎగతాళిగా శారద.

"నిన్ను చూద్దామని !"

పై కొకసారి చూసి, కళ్ళు రెపరెప లాడించి నవ్వును బిగపట్టుకుంటూ, "పైన ఎక్కడా మబ్బులు కనపడటం లేదే...అయినా అంత ప్రేమతో వచ్చి నప్పుడు సంతోషించక పైకి చూడట మేమిటి నా ముఖం ... పద పద ..." అన్నది.

అదుగో ఎగతాళి మొదలుపెట్టింది శారద !

—డబ్బున్న ప్రతివాళ్ళకూ అంత అహం ఉంటుందో లేదో తెలియదుగాని శారదకుమాత్రం ఉన్నది ... డబ్బు వాయువే అయితే ఆవిడగారి తండ్రి దానికి అగ్ని...ఇక సరేసరి ఆవిడగారి గోల్డ్ ఫ్రేమ్‌కు కళ్ళజోడు తల్లి ఆజ్యమే...

"రా సత్యం ! ... నా కెంత ఆనం దంగా ఉన్నదో తెలుసా ఈ క్షణాన !" అక్కడే తను బోల్తాపడేది.

ఆమె మాటలు తేనెపూసిన కత్తులు !

ఏమీ లేని ఎవ్వరూ లేని తను వాళ్ళింట్లో పదేళ్ళు గడిపాడు. లోకుల దృష్టిలో తన మేనమామ తనని ఆదరించాడు. చెట్లక్రింద బ్రతకవలసినవాడిని మేడల్లో పెంచాడు. అడుక్కు తినవలసినవాడిని అందల మెక్కించి పంచభక్ష్య పరమాన్నాలు పెట్టాడు — కానీ సీసం పెంకులు గుచ్చిన కాంపౌండ్ లోపల రెండంతస్థుల మేడలో తను బ్రతికిన బానిస బ్రతుకు లోకులకేం తెలుసు...ప్రతిక్షణం తను చెట్టుక్రింద బ్రతుకునే కోరుకునేవాడని, అడుక్కు తినటమే హాయిగా ఉంటుందని ఆరాట పడేవాడని వాళ్ళకేం తెలుసు !

తను వాళ్ళింట్లో జీతం భత్యం లేని నౌకరు !

శారద ఒక చేత్తో ప్లాస్టిక్ బుట్ట పట్టుకున్నది. దాన్నిండా యాపిల్స్ అరటిపండ్లు...

"ఇవాళ నామీద నీ మనస్సెందుకు

పోయిందబ్బా !" అన్నది. మూతిని సున్నాలా చుట్టి నాలుగడుగులు వేసిం తరువాత.

సత్యం కవ్వింపుగా అన్నాడు "ఇవ్వాళలో ప్రత్యేకతేమీలేదు...ఇరవై నాలుగు గంటలూ నీ చుట్టూనే నా మనస్సంతా తిరుగుతుంటుంది !"

"నిజమా సత్యం !" అన్నది కళ్ళు పెద్దవి చేసుకొని ... ఆ చీకటి దారిలో అతడి చేతిని తన చేతిలోకి తీసుకో ప్రయత్నించింది

సత్యమే దూరంగా జరిగాడు.

ఆమె ఆనందాన్ని ఎద్దేవగా చూస్తూ అనుకున్నాడు: 'ఈ డబ్బున్న వాళ్ళకు రోగం ఇదే ... అందరూ సర్వకాల సర్వావస్థలలోనూ తమనే భజనచేస్తూ ఉండాలనుకుంటారు !'

— రెండు నిముషాలు మాట్లాడేసి రెండు రూపాయలు సరిపోతుంది !

డబ్బు అడిగితే పెద్ద పోజు పెట్ట వచ్చు. 'ఓహో! అలాగా... అవసరం ఉండి ఇలా వచ్చావా నాయనా' అనవచ్చు ... అననీయ్ ... ఇప్పుడు ఆవిడగారు ఎంత అహం చూపించినా అవసరం తనది... తప్పదు మరి !

శారదను అడగకుండా—శారదతో మాటలు పడకుండా— మరెక్కడికైనా వెళితే ... ఎలా వెళ్ళటం ... ఎవ్వరి దగ్గరకు వెళ్ళాలన్నా అయిదారు కిలో మీటర్లు తక్కువలేకుండా నడవాలి... ఒకళ్ళు "మలక్ పేట ... మరొకళ్ళు విజయనగర కాలని ... ఇంకొకరు అమీర్ పేట...

మనస్సు తన చేతగాని తనాన్ని— తన ఆ క్షణపు అసహాయస్థితిని... తనను శారద అహంభావపు వలలో చిక్కుకునేలా చేస్తున్నది !

"సత్యం! కమాన్...నీ మనస్సులో ప్రతిక్షణం నేనే మెదులుతున్నా ననేది ఎంత నిజమో — మా యిల్లే గుర్తుచేసేని నీ మాటలు చెబుతున్నాయి...మా యిల్లు ఇదే బాబూ !" అన్నది.

తడబడతూ — తన ఆలోచనలను కట్టిపెట్టి వెనుదిరిగాడు సత్యం.

శారద నవ్వింది "సత్యం ! ఎంత అబద్ధమైనా నిజం అమ్మమొగుడిలా ఉంటేనే అందంగా ఉంటుంది !" అన్నది.

తనని దెప్పిపొడవటానికి సందు దొరికింది శారదకు.

ఇక శారదను డబ్బు అడగగూడదు ... తన యిల్లు దూరమయితే అయింది నడిస్తేనే పరువు దక్కుతుంది !

"కూర్చో, బోరన్విటా కలుపుకు వస్తా సయిస్తుందా నీకు ..."

—వాళ్ళుతప్ప ఈ ప్రపంచంలో ఎవ్వరూ బోరన్విటా తాగలేరని, ఎవ్వరికీ సహించదనీ అన్నంత గర్వం ఉన్నది ఆ మాటల్లో అనుకున్నాడు సత్యం !

"వద్దు శారదా !"

"అదేం ... నే నిచ్చినవి త్రాగ గూడదా !"

"అబ్బెబ్బే..."

"మరి !"

"ఇప్పుడెందుకని..."

"ఫ్రిజ్‌లో నాలుగు సీసాల పాలున్నయి..."

'—అబ్బ ! వెధవ సోత్కర్ష... నాకు తెలుసు తల్లీ, మీకు ఫ్రిజ్ ఉన్నది ...నీ మాటల్నీ, మీ అమ్మా, నాన్నా మాటల్నీ పది సంవత్సరాలు భరించాను నేను!' అనుకున్నాడు విసుగ్గా.

"అసలు ఇవాళ భోజనం చేయందే వెళ్ళనీయను నిన్ను ... నీకు పెద్ద చిక్కుడుకూరంటే యిష్టం...కుక్కర్లో పడేస్తాను... ఏం...గ్యాస్‌మీద అయిదు నిముషాల్లో ఉడికేస్తుంది ! లేదనబోకు సత్యం .." అన్నది శారద ఆత్మీయంగా సత్యం ముఖంలోకి చూస్తూ.

ఒక్క-క్షణం కరిగిపోయాడు సత్యం ఆ చూపుకు.

నిజం! వాళ్ళింట్లో ఉన్నంతకాలమూ తనకు కావాల్సినవి కని పెట్టి—అత్తయ్య మామయ్యా తనని ఎంతగా అసహ్యించు కుంటున్నా—రహస్యంగా తెచ్చి పెట్టేది శారద !

కానీ చేతుల్తో పెడితేనేం ... మాటలతో పొడవటంతో ... ఈవిడగారు వాళ్ళకు ముద్దుల కూతురుగాదా !

"చిక్కుడుకాయకూర నాకు యిష్ట మయిన మాట నిజమేగాని ఓ పాదు మా దొడ్లో వేసుకొని రోజూ వండుకుతిన టంతో అదంటే వెగటేసిపోయింది— అవును అసలు మా యింటికి రావటమే మానేశావ్ !"

"మొగవాడివి ... నీవు రాలేవు... ఆడకూతుర్ని నేను పడల్లా ఆ ఊరి బయట కొంపకు రావాలా...అలా అన టానికి సిగ్గువేయటంలేదూ !" చనువుగా దగ్గరకు వస్తూ అన్నది.

నిజమే — శారద యింటిముందు తన యిల్లు చాలా చిన్నదే ... తన దేఁవిటి? ... తన స్వంతమా అది ... తనకు ఓ స్వంత కొంపగూడానా ?...

చిన్నబుచ్చుకున్నట్లుగా తలవంచు కున్నాడు సత్యం.

శారద నవ్వి, "అబ్బా ! మాటకు ముందు ముఖం ముడుచుకోవటం చేతనవును... లేలే ... వంట యింట్లో పీటవేస్తాను... కూర్చొని కబుర్లు చెప్పు .. పూరీలు ఒత్తుతాను !" అన్నది.

'శారద తల్లీ ! నీవేమైనా చేయ గలవు ,.. నీ దృష్టిలో మీ యింట్లో తప్ప నే నీ జన్మలో పూరీలు తిన లేననీ, ఫ్రూట్‌సాలిడ్‌లు త్రాగలేననీ, ఫ్రిజ్‌లో ఉన్న పాలసీసాల బోరన్‌విటా సేవించలేననీ — నీవు అనుకుంటే నీవు చాలా పొరబాటు పడుతున్నావన్న మాట ... నేనేం వాటికోసరం ముఖం



వాచి లేను!' గుండెల్లోనుంచి కసి ఎగతన్నుతుండగా అనుకున్నాడు.

శారద వంటయింట్లోకి వెళుతూ, "ఆయన లేడు...బోడి ఫ్రెండ్స్ ఎవరో ఎక్కడినించో వచ్చారట...సినిమాకని వెళ్ళారు...సినిమాకే వెళ్ళారో త్రాగటానికే వెళ్ళారో ఆ భగవంతుడికే తెలియాలి... బోరుకొడుతుంటే నాలుగు పండ్లేమైనా కొనుక్కొచ్చి ఫ్రిజ్‌లో పారేద్దామని రోడ్డుమీద కొచ్చాను... నీవు దేవుడిలా కనబడ్డావ్ చాలా థాంక్స్ !" అన్నది. "ఇక్కడకు వచ్చి కూర్చో !"

తప్పక సత్యమూ లేచాడు.

"చెప్పు ! సీత ఏమంటున్నది... కులాసానా ?"

"పశ్రథంగా ఉన్నది !"

శారద వెనక్కి తిరిగి ఫక్కున నవ్వింది — ముందుకు పడుతున్న జుట్టును వెనక్కి తోసుకుంటూ, జారుతున్న పమిటను గూడా లెక్క చేయకుండా.

"అంటే ?"

"అదే ... కులాసాగానే ఉన్న దంటున్నాను !"

శారద గ్యాస్ వెలిగిస్తూ, "అవును క్రితంసారి వచ్చినప్పుడు గ్యాస్‌కోసరం అప్లయి చేశానన్నావ్ ... వచ్చిందా... లేకపోతే చెప్పు ... ఆయనకు చెబుతాను. ఆ బోడి క్లబ్బుల్లో కలుసుకుంటుంటారు గదా ... అనవలసినవాళ్ళతో ఒక్క మాటంటే రెక్కలు గట్టుకొని అదే వచ్చి వాలుతుంది ... చెప్పమంటావా ఏం ?" అన్నది.

"అక్కర్లేదు...వచ్చింది." అన్నాడు ముభావంగా సత్యం.

—డబ్బున్న ఆమెకు, ఆమె భర్తకూ అరచేతిమందాన ఇన్‌ఫ్లుయన్స్ ఉన్నదని తనకు తెలుసు !

చిరాగ్గా టైమ్ చూసుకున్నాడు.

వెధవ గొప్పలు చెప్పుకునే ఈమెను డబ్బు అడగాలా ? వద్దా ?

—ఒకరోజు రాత్రి అంతా నిద్ర పోయిం తరువాత మేడమీద తనని ఒంటరిగా నిలవేసి, 'సత్యం ! నన్ను పెళ్ళిచేసుకోరాదూ !' అన్నది.

ఇంకా నయం ... సిగ్గు విడిచి అడిగిన ఆమెనూ, ఆమె డబ్బునూ చూచి 'ఊఁ' అనేశాడుగాదు ఆ చీకట్లో—జీవితమంతా తను ఎలాంటి అధ్వాన్నపు బ్రతుకు బ్రతకవలసి వచ్చేదో !

ఆమెలాగా తనకు కార్లున్నయ్యా ? మేడలున్నయ్యా ? డబ్బున్నదా ?

—సీతతో జీవితం సుఖంగా గడిచి పోతుంది !

"మొన్నేమయిందో తెలుసా సత్యం! ఆయన మధ్యాహ్నం ఫోన్ చేశాడు... మా యింట్లో ఫోన్ పెట్టారుగదా... చూడలేదూ ముందు గదిలో ... మా గుడ్డలకొట్టు సేటు కొత్తరకం సూటింగులు వచ్చినయ్యని ఫోనుచేసి చెప్పా డట... నాకో పెయిర్ మంచివి సెలెక్ట్ చేసి తెచ్చేయమని నాకు చెప్పారు... వాటిని చూస్తుంటే సడన్‌గా నీవు గుర్తుకు వచ్చావ్...నీకూ ఒకటి తీసుకుందామూ అనిపించింది..."

సత్యం లేచి నిలబడ్డాడు ఇక ఆమె మాటలు భరించలేనట్లుగా.

'నేనంత వెధవగుడ్డలు గూడా కొనుక్కోలేని స్థితిలో లేనని' చెప్పా లనిపించింది సత్యానికి.




"అదేఁవిటి సత్యం ... బోర్నవిటా కలుపుతున్నా ...కుక్కర్లో అన్నం పడే స్తాను ఒక్క క్షణంలో... భోజనంచేసి వెళ్ళిపోదువుగాని !"

"కాదు శారదా !"

"సరే నీ యిష్టం ! నా సంగతి నీకు తెలుసుగదా... నేను ఏ విషయంలోనూ బ్రతిమాలించుకోను ... అలాగే బ్రతిమి లాడను గూడా ! ఇంతైనా చెబుతున్నా నంటే నీవు కాబట్టి ... మనిద్దరం కలసి ఒక యింట్లో కొన్ని సంవత్సరాలు గడిపాం కాబట్టి ..." ముందుకు ఉన్న పొడుగుపాటి జడను విసురుగా వెనక్కు వేసుకున్నది, నిట్టనిటారుగా నిల్చుంటూ.

"చాలు శారదా ! నా లేమినీ, మీ యింట్లో గడిపిన నా బానిస బ్రతుకునీ ఇంకా గుర్తుచేయ నక్కరలేదు !" గొణుగుతున్నట్లుగా పెదాలు కదిలించు కుంటూ వంటయింట్లోనుంచి హాల్లోకి వచ్చేశాడు సత్యం.

ఖాకీ జేబులు ఎంతో దూరాన ఉన్న తన యిల్లు- -కాళ్ళకు బంధా లవుతున్నయి.

దిక్కుతోచనివాడిలా అయోమయంగా చూస్తూ, ఒక్కసారి వెనక్కు తిరిగి, "శారదా ! ఒక్క పది రూపా యలు యివ్వు ... రేపు తెచ్చి యిచ్చే స్తాను !" అన్నాడు—మరీ రెండు రూపాయలు అడగటం నామోషి అనిపించగా.

"పది రూపాయలు కావాలా ?" అన్నది విచిత్రంగా చూస్తూ ముందుకు వచ్చి.

"అవును ... జేబుకొట్టేశారు," అన్నాడు సిగ్గుపడుతున్నట్లుగా తల వంచుకొని.

ఫక్కున నవ్వింది శారద—చీరె చెంగుకున్న తాళంచెవుల గుత్తిని గిర గిరా తిప్పుతూ, "అయితే అందుకోసర మన్నమాట మా యింటికి వచ్చింది... సిగ్గువేయటంలేదూ నీకు—పది రూపా యలు యివ్వు శారదా—అని అడగ టానికి. ఛీ! ఛీ! ... పది రూపాయలు కావాలిట...పదిరూపాయలు... అడుగు తున్నాడు పెద్దమనిషి ... ఎలాంటి అవ సరమూ లేకపోతే నేను గుర్తుకు రానని బాగా ఋజువుచేశావు ... బోడి పది రూపాయలకోసరం పడివచ్చాదండీ..." ఉరుములు మెరుపుల్లా అరవసాగింది— కళ్ళు పెద్దవి చేసుకొని.

—కానీ ఆమె మాటలు వినటానికి సత్యం అక్కడ ఉంటేనా?—ఎప్పుడో ఆ ఇంటి గడప దాటాడు. పరుగెడుతూ నాలుగు రోడ్లుగూడా దాటేశాడు.

—అక్కడ అంత పెద్దయింటిలో వంటరిగా నిల్చున్న శారద శూన్యంలోకి చూస్తూ, 'సత్యం! వెధవ పదిరూపా యలు కావాలని ఏదో తప్పుచేసిన వాడిలా నా ముందు తలవంచుకొని నిలబడి అడుగుతావని నేను కలలో గూడా అనుకోలేదు ... నా దగ్గరకు వచ్చి, ఆత్మీయంగా నా కళ్ళల్లోకి చూస్తూ, నా చీరె చెంగుకున్న ఈ తాళం చెవుల గుత్తిని స్వతంత్రంగా విప్పుకొని, బీరువాతీసి—బోడి పది రూపాయలుగాదు — అందులో ఉన్న దంతా తీసుకు వెళ్ళినా నేనెంత సంతో షించి ఉండేదాన్ని...నేనంటే నీ కెందు కంత చిన్నచూపు ... నీ ఆనందాన్నే గాకుండా, నా ఆనందాన్ని గూడా— నీ పిచ్చి పిచ్చి ఊహలతో, ఆలోచన లతో— ఎందుకు నాశనం చేశావ్ ... సత్యం! నీకున్నది గుండెగాదు ... కాదు సత్యం ... బండరాయి!' ఆమె గుండె వెయ్యి ముక్కలయిందనేందుకు నిదర్శనంగా కళ్ళవెంట నీరు జలజలా కారుతుంది!

అతడు ఆమెకు ఆకాశంలోని మెరుపే!



# చికిత్స

## కప్పగంతుల మల్లికార్జునరావు



మహలక్ష్మి వొడ్డూ పొడుగూ మనిషి.

నల్లగా కాస్తంత మొరటుగా ఉంటుంది. అంచేత మొదటినుంచి ఆమె వయసుకన్నా పెద్దదిగానే కనిపించేది.

యివాళ ఆమెకు ముప్పై సంవత్సరాలంటే ఎవరూ నమ్మరు. పైగా నవ్వుతారు. నవ్వుతారని మహాలక్ష్మికీ తెలుసు. అందుకే ఆమెకు యిరుగుపొరుగు వారంటే మహా మంట.

అందరూ తన వయసును గురించి ఆమె చెప్పే సత్యాన్ని నమ్మకపోవటంతో, ఆమె కూడా తనకు ముప్పై ఏళ్ళన్న విషయాన్ని మర్చిపోయింది. ఇరవయ్యేళ్ళ పడుచులాగా కన్పించాలని ఆరాటపడుతుంది. అందుకు ఆమె చేసే అలంకరణ అంతా ఇంతా కాదు. అంత ఓపిగ్గా అలంకరణను ఎవరూ చేసుకోరు–చేసుకోలేరు.

అయితే చిక్కేమిటంటే ఆమె అలంకరణ కూడా ఆమె జీవితంలాగే అడవి గాచిన వెన్నెల. ఆనందించటానికి, అనుభవించటానికి ఎవరూ లేరు.

మహాలక్ష్మి మొగుడి పేరు పాలసముద్రం. అది అతని తాత పేరు. ఆ తాతక్కూడా అసలు పేరు కాదు అది. పాలవ్యాపారంలో పైకి వచ్చాక అందరూ కలిసి యిచ్చిన బిరుదనామం.

అయితే యీ పాలసముద్రానికి తాత పోలిక ఒక్కటీ రాలేదు. పాలల్లో నీళ్ళు కలపటం కూడా చాతకానంత అమాయకుడు. కానీ ఎలా పట్టుబడిందో ఏమో చిన్నతనంలోనే అతనికి తాగుడు అలవాటయింది

పదిచేతులా డబ్బు సంపాదించే శక్తి ఉన్నవాడినే గుటుక్కున మింగేస్తుంది తాగుడు అలవాటు. యిక పాలసముద్రం ఓ లెక్కా ?

నీళ్ళల్లో పాలు చిలకరించి తాత సంపాదించిన కాస్తో కూస్తో ఆస్తిని మందులో కలుపుకొని తాగిపారేసేడు.

అప్పటికే మహాలక్ష్మికి ఇద్దరు పిల్లలు. పల్లెటూరి ఆడబడుచుకావటం వల్ల మొగుడుచాటు పెళ్ళాంలా కాపురం చేస్తోంది.

భర్త అమాయకత్వంవల్ల, అలవాటు వల్ల కుటుంబం బజారున పడే పరిస్థితి రావటంతో మహాలక్ష్మి ఒక్కసారిగా వ్యవహర్త అయిపోయింది. వ్యాపారం చేతిలోకి తీసుకొని సంవత్సరం తిరక్కముందే సంసారపు ఆర్థికస్థితిని చక్కదిద్దింది. అయితే ఎంత ప్రయత్నించీ మొగుడు తాగుడు అలవాటును మాన్పించలేకపోయింది.

అతను తాగుడుకు బానిస. ఈమెకు ఆ అలవాటు మాన్పించాలన్న పట్టుదల. క్రమంగా సాధింపులు, చీదరింపులు, తగవులాటలు — మహాలక్ష్మి నిత్యకృత్యంలో భాగాలయ్యాయి.

భార్యపోరు పడలేని పాలసముద్రం ఓ రాత్రి చెప్పా పెట్టాకుండా లేచిపోయాడు. అంతే అయిపు లేడు.

మొగుడు అలా వదిలేసి పోయినందుకన్నా, ఆ కారణంగా ఊరంతా తనను గయ్యాళిని చేసి చెవులు కొరుక్కోటం మహాలక్ష్మికి బాధ కలిగించింది. ఊళ్ళో జనంపై మంటకు ఇది మరో కారణం.

అప్పటినుంచి ఆమె శరీర భారీతనానికి నోటి భారీతనం కూడా తోడయింది. మనిషి రూపం అలా — మాటయిలా. అంచేతే ఆమె ఎన్ని అలంకరణలు చేసుకొన్నా స్త్రీ సహజమైన లాలిత్యం ఏ కోశానా కనబడదు. ఏతావాతా ఆమె అలంకరించుకోటం కూడా ఎగతాళి పంచాంగమే అయింది.

అనేకొద్దీ మహాలక్ష్మి మనసు మొరటు తేలిపోయింది.

ఇప్పుడు మహాలక్ష్మి ఒకరి మాటల్ని పట్టించుకొనేస్థితిని దాటిపోయింది.

ఎవరన్నా ఏమనుకొంటారో అన్న ఆలోచన అసలు లేదు. ఆమె అనుకొన్నది సాగాల్సిందే. ఎవరన్నా కాదంటే ఖస్సుమని లేస్తుంది. ఆమె నోరంటే అందరికీ భయమే !

ఆమె ధ్యేయం డబ్బు సంపాదించటం. పాలు, పెరుగు, వెన్న, నెయ్యిలతోపాటు వడ్డీ వ్యాపారంచేసి బోలెడంత సంపాదిస్తోంది. పాత ఇల్లు పీకేయించి కొత్త మేడగట్టి 'పాల సముద్రం' అని పేరు పెట్టింది. ఇంటి నిండా కావల్సినంత సామాను. లావు పాటి ఆమె మెడ బంగారు దండల బరువుతో మెరుస్తుంటోంది.

మహాలక్ష్మి మన స్తత్వం ఎంత వంకర తిరిగిపోయిందంటే కడుపున పుట్టిన బిడ్డలు ఆమెను కానీ అడగటానికి భయపడ్తారు. పిల్లల్ని కూడా తిట్లతో తప్ప ప్రేమగా పలకరించదు, ముద్దాడదు.

అందరూ మహాలక్ష్మిని చాటుగా ఆడిపోసుకొనేవారే. కానీ ఆమె విపరీతమైన మానసికరోగంతో బాధపడుతున్నదని గ్రహించినవారే లేకపోయారు.

అలాంటి సమయంలోనే శర్మ ఆమె ఇంట్లో అద్దెకు చేరేడు. ఆమె మనసును మేల్కొల్పేడు !

* * *

శర్మ యువకుడేం కాదు. నలభై ఏళ్ళుంటాయి. పొట్టిగా, మాడుమీద పల్చబడ్డ జుట్టుతో, కణతల దగ్గర తెల్ల వెంట్రుకలతో కన్పించే అతడిని, అందగాడని చెప్పటం సాహసం. పోనీ డ్రెస్ అన్నా జాగ్రత్తగా చేసుకొంటాడా అంటే అదీ లేదు.

అతను ఒక వారపత్రికలో సబ్ ఎడిటర్. రచయితగా మంచి పేరుంది. ఘాటైన భావాల్ని కూడా చాలా చమత్కారంగా చెప్పగల రచయితగా అతనికి పేరు. చేదుమాత్రలకి చక్కెర కోటింగు యివ్వటమే అతని ప్రత్యేకత! నవ్విస్తూ ఆలోచింపచేసే అతని రచనలంటే చాలామంది పడిచస్తారు

అంచేత శర్మకు రూపం గ్లామర్ కాదు. అతని గ్లామర్, అతని మేధాశక్తి. రేడియోలో శర్మ పేరును, నాటకాలని, గొంతుని ఎన్నోసార్లు విన్నా మహాలక్ష్మికి అతని మేధాశక్తిని అర్థం చేసుకొనే అంత శక్తిలేదు. అతనికోసం వచ్చే కార్లలో మనుష్యుల్ని, యువతీయువకుల్నిబట్టి అతని గొప్పతనాన్ని అంచనావేసే సామర్థ్యం లేదు

మహాలక్ష్మిని ఆకర్షించింది శర్మ గృహజీవితం.

ఆ ఇంట్లోకి అంతకుముందు ఎందరో గొప్పవాళ్ళొచ్చారు. పైన పటారమే కాని అందరి కుటుంబాల్లో ఏవో కల్లోలాలు. ఇంట్లో చేరి చేరగానే కొట్లాటలు, ఏడుపులు, చిరాకులు...

అవి వినగానే మహాలక్ష్మికి భర్త గుర్తుకొచ్చేవాడు. తాగుడు మాన్పించటానికి తన తాపత్రయం గుర్తుకొచ్చేది.

ఆ ఆలోచనల్ని భరించలేక అద్దెకు చేరిన వాళ్ళమీద విరుచుకుపడేది. ఇల్లు ఖాళీ చేసి పారిపోయేలా చేసేది.

శర్మకు భార్య, ముగ్గురు పిల్లలు. ఇంట్లోకి రావటమే నవ్వుమొహాలతో వచ్చారంతా. ఆ ఇంట్లోనుంచి నవ్వులు తప్ప మరొకటి విన్పించలేదు. శర్మ ఇంట్లో ఉన్నంతసేపూ ఏం కబుర్లు చెప్తాడో ఏమో కాని అందరి మొహాలూ కాంతితో మెరిసిపోతుంటాయి. ముగ్గురు పిల్లలూ ఎప్పుడూ రత్నాలల్లాగా నవ్వుతూ హుషారుగా కన్పిస్తారు.

ఎందు కేర్పడిందో ఏమో ఆ సంసారంలో ఆనందానికి శర్మ సెంట్రల్ పాయింట్ అన్న భావన మహలక్ష్మికి ఏర్పడింది.

అలాంటి భర్తను పొందిన సీత ఎంత అదృష్టవంతురాలో ? అలాంటి అదృష్టం జీవితంలో తనకు ఒక్కరోజు ... ఒకే ఒక్కరోజు ... ఒక్క క్షణం ... మధురాలోచనలు మనసంతా ముసురుకొనేవి !

మహలక్ష్మి సీతతో స్నేహంచేసింది. పాలు, పెరుగు, వెన్న యింకా ఏవేవో వస్తువులు అడపా దడపా పంపుతుండేది. పిల్లల్ని దగ్గరికి తీసుకొని అవీ యివీ పెడుతుండేది. శర్మను ఆకర్షించటానికీ, అతనితో మాట్లాడటానికీ ప్రయత్నం చేసింది.

శర్మ మహలక్ష్మిని చూచాడు. మాట్లాడేడు. కాని చూడనట్లే- మాట్లాడనట్లే ! అంతటి నిర్లిప్తత ! అతను సీతతో మాట్లాడుతుంటే రహస్యంగా విని సంతోషించేది. అలా సరదాగా తనతో మాట్లాడితే ఎంత బాగుండును ? తనని కూడా ... ఇరవయ్యేళ్ళ పడుచు పిల్లలా సిగ్గుపడేది !

అద్దెకు చేరినవారితో పోట్లాడకుండా, వారితో అంతగా కలిసిపోవటం పేటలో వాళ్ళకి నచ్చలేదు. నిరాశ కలిగించింది. ఉన్నవి కొన్ని, లేనివి కొన్ని కలిపి ఏవేవో పుకార్లు పుట్టించారు.

ఆ మాటలు చెవినిబడ్డ రాత్రి మహలక్ష్మికి నిద్రలేదు. శర్మ గదివైపు నిర్వికారంగా చూస్తూ గడిపింది.

తెల్లవారింది.

రాత్రంతా మనసులో అంతర్లీనంగా రేగిన కచ్చను కదిలించాడు చిన్న కొడుకు. బడికిపోతూ ఏదో కావాలని అడిగేడు.

అంతే, మహలక్ష్మి రుద్రకాళిలా లేచింది.

లేచిపోయిన మొగుడిని, పిల్లల్ని, ఊరి జనాన్ని శాపనార్థాలు పెట్టింది.

ఆలోచనా ప్రపంచంలో ఉన్న శర్మకు కుర్రాడి ఏడుపు వినబడింది. చూస్తే — తంతున్న తల్లి కన్పించలేదు అతని కళ్ళకి. తన్నులు తింటున్న బిడ్డే కన్పించాడు. అతను దేనినైనా భరించ గలడు కాని పిల్లల్ని కొట్టటాన్ని, ఏడుపుల్ని చూచి భరించలేడు.

లుంగీ పంచెతోనే లేచి చకచకా

దొడ్లోకి వెళ్ళేడు. అప్పటికే పేటలో జనం కిటికీలలోనుంచి 'సినిమా' చూడ టానికి సిద్ధమయ్యారు.

వెళ్ళీ వెళ్ళటంతోనే కొడుతున్న చేతిని పట్టుకొన్నాడు. మరో చేత్తో బిడ్డని దగ్గరికి తీసుకొన్నాడు.

మహాలక్ష్మి తన చేతిని పట్టుకొన్న శర్మను చూచింది. కొత్త పెళ్ళికూతు రులా సిగ్గుతో ఆమె మనసు మెలికలు తిరిగిపోయింది !

అంతలోనే అతని చేతుల్లో వెక్కుతూ నిల్చుని దీనంగా తనవైపు చూస్తున్న కొడుకును చూసింది. నలభై ఏళ్ళ తల్లిగా మారింది.

"అంత మంచివారు. మీరు కూడా పిల్లల్ని కొడుతున్నారా ?"

మృదువుగా వచ్చిన అతని మంద లింపు వింది మహాలక్ష్మి. తనను మంచి దంటున్నాడు. సర్టిఫికెట్ యిస్తున్నాడు, శర్మ !

"తప్పుకదూ ? పిల్లల్ని కష్టపడి కనింది కొట్టుకోటానికా ?"

మహాలక్ష్మి చేయి యింకా అతని చేతిలోనే ఉంది.

అలాగే ఎప్పుడూ పట్టుకొని, యిలా ఎప్పుడూ మాట్లాడితే ? — ఒక్కక్షణం పొరాడిన ఆలోచన !

"ఎవరినైనా ఏడిపించటం సులభం తల్లీ. నవ్వించటం కష్టం. ఏదీ ! నువ్వో సారి నవ్వి నీ కొడుకు నోసారి నవ్వించు చూస్తాను" అంటూ మహాలక్ష్మి చేతిని కొడుకు తలపైన ఉంచాడు.

ఆ క్షణంలో కలిగిన అనుభూతి మహాలక్ష్మికి కొత్త. ఆమె శర్మ మాట లకి నవ్వలేదు. ఆమెకు యిప్పుడు శర్మ కనిపించటం లేదసలు. కొట్టిన చేతుల్తో కొడుకును కౌగిలించుకొని భోరున ఏడవసాగింది.

టిష్యూం, టిష్యూం సినిమా అను కొని న్యూవేవ్ సినిమా కొచ్చిన ప్రేక్ష కుల్లాగయ్యారు చూస్తున్న జనం. సినిమా పూర్తి కాకముందే 'వాకౌట్' చేశారు.

శర్మ మహాలక్ష్మిని ఏడవ నిచ్చాడు. చివరికి ఆమె భుజంమీద చెయ్యివేశాడు.

ఆమె అతనివైపు తిరిగి చూసింది. ఆ చూపుల్లో వేడి లేదు. నలభై ఏళ్ళ తల్లి కరుణామయంగా చూచే చూపు అది !

"నవ్వమంటే ఏడ్చావుటమ్మా ! హానియ్‌కె పీడ వదిలిపోయింది. ఇక ఎప్పుడూ నవ్వుతూ, అందర్నీ నవ్విస్తూ ఉంటావ్ !"

మహాలక్ష్మి మెల్లగా నవ్వింది.

"నాకు తెలుసునమ్మా. యు ఆర్ ఎ గుడ్ గిరల్."

సినిమాలు చూసిన అనుభవంతో, ఆమాత్రం ఇంగ్లీషు అర్థంచేసుకోగలదు మహాలక్ష్మి ! అతనివైపు అదోరకంగా చూచింది.

"సారీ, యు ఆర్ ఎ గుడ్ మదర్!"

అనేసి ఇంట్లోకి వెళ్తున్న అతనికి మహాలక్ష్మి రెండుచేతు లెత్తి నమస్క రించింది !

# మహాతల్లి

(గల్పిక)

నిజంగా మహాతల్లే ! ఆవిడను చూస్తే ఎలాటివాళ్ళకూ పూనకం వచ్చినట్టయేది. తాము ఏంచేస్తున్నదీ, ఏం మాట్లాడుతున్నదీ వాళ్ళకు తెలిసేది కాదు. వెనకటి యుగాల "మదర్ గాడెసెస్" ఇంతకన్న గొప్ప "ఇమేజ్" కలవాళ్ళు కారని రూఢిగా చెప్పవచ్చు.

అయితే ఇది నాస్తికయుగం గనక, ఒకళ్లు దేవత అన్న మనిషిని మరొకళ్లు సైతాను అనటం స్వాభావికం. మహాతల్లిని సైతాను అనలేదుగాని వెర్రిదని ఒక ప్రవాదు వేశారు. ఆవిడ కొందరు భక్తులను కరిచిందనీ, దరిమిలా వాళ్లు చచ్చారనీ వదంతులు వ్యాపింపజేశారు.

ఈ వదంతులను చాలామంది మొదట్లో నమ్మలేదు. కాని ఆమె భక్తులను అప్పుడప్పుడూ కరవటం కొందరి కళ్ళబడింది. ఆమెమీది భక్తికొద్దీ వాళ్లు ఆ సంగతి దాచిపెట్టారు. "ఆవిడచేత కరిపించుకుని చస్తే, మరి జన్మ ఉండదు !" అని కూడా కొందరు వాదించారు.

ఆవిడకు ఈ కరిచే జబ్బు రాను రాను ముదిరిపోయింది. ఆవిడకు పిచ్చి అన్నది దాచేస్తే దాగని సత్యం అయిపోయింది. పోలీసులు వచ్చి ఆమెను అరెస్టుచేశారు. కొంతకాలం విశ్రాంతి ఇస్తామని ఆమెతో చెప్పటానికి చాలా పెద్ద పోలీసాఫీసరు వచ్చాడు.

"నాయనా, నన్ను వెర్రాసుపత్రిలో పెట్టటానికా వచ్చావు ?" అని మహాతల్లి అడిగింది.

"ఛ, ఛ ! ఎంతమాట ! ... కొద్ది కాలం విశ్రాంతి ! ... " అని పోలీసు అధికారి గొణిగాడు.

"నాకు పిచ్చేమిటి, నాయనా ? నాకు పిచ్చి అన్నవాళ్ళకు పిచ్చి ! కావలిస్తే నా కళ్ళలోకి చూడు !"

మహాతల్లి పోలీసు ఆఫీసరును కండ ఊడేట్టు కొరికింది. మహాతల్లిని జైల్లో పెట్టారు. భక్తులు వేలసంఖ్యలో ఆమెను చూసి ఏడవటానికి వచ్చారు.

"నన్ను పిచ్చిదా న్నంటున్నారు. ఇంతకన్న అన్యాయం ఉందా ?" అంటూ మహాతల్లి అందిన వాళ్లందరినీ కొరికింది.

"నిజంగా పిచ్చే అయి ఉంటుందంటావా ?" అని భక్తులు ఒకరినొకరు అనుమానంగా అడుక్కున్నారు.

***కొడవటిగంటి కుటుంబరావు***




ఇచ్ఛాపురపు రామచంద్రం

మళ్ళీ యింటుకి వస్తున్నాను.

ఊరు వదిలి పదిహేనురోజులు దాటి పోయింది. బయలుదేరేముందు—అలాగ జరుగుతుందని అనుకోలేదు మద్రాసని బయలుదేరి - మైసూరు, బెంగుళూరు, హైదరాబాదూ, నాగపూరూకూడా వెళ్ళి రావలసివచ్చింది-బిజినెస్‌కోసం.

మొదట్లో-అతి తరచుగా క్యాంపులు తిరగవలసిన యీ ఉద్యోగం చాలా ఉత్సాహంగా ఉండేది. చాలా తిరిగే వాడిని. అందుకే కంపెనీనుంచి త్వర లోనే మంచి పేరునీ చక్కని ప్రమోషన్‌నీ సంపాదించుకోగలిగాను. కాని—పదేళ్ళు పైగా దేశం తిరిగి **తిరిగి** యిప్పుడు

కొంచెం విసుగేస్తూంది. జీవితంలో అధికభాగం రైళ్ళలోనూ, వాటికోసం నిరీక్షించడంలోనూ వృథా అయిపోతూం దేమో అన్న సందేహం కలుగుతూంది. రోలింగ్ స్టోన్ గాదర్స్ నో మాస్. నిజమేనేమో?

టాక్సీ — మా వీధిలోకి మలుపు తిరిగింది. పదిహేనురోజు లయ్యాక — మా వీధినీ, పరిచితాలయిన యిళ్ళనీ చూస్తుంటే చిన్నపిల్లడికి అమ్మనిచూసే టప్పటి ఆనందంలాటిది కలుగుతూంది. ఇంట్లో అడుగుపెడుతూంటే ఎంతో ఉత్సాహం. ఈ చక్కని అనుభూతితో ప్రయాణపు విసుగంతా తీసిపోయినట్లే అనిపించింది.

బజర్ బటన్‌మీద చెయ్యివేయనక్కర లేకుండానే తలుపులు తెరుచుకున్నాయి. స్వాగతం పలుకుతున్నట్లుగా శాంతి. ఆమె కన్నులలో నన్ను చూస్తూ—వెలుగు.

"రండి. ఇంత ఆలస్యం చేస్తారను కోలేదు. ఏమైంది?" అడిగి—నా సమాధానం కోసం ఆగకుండానే లోపలికి వెళ్ళి ఫ్లాస్కూ, కప్పూ తీసుకువచ్చింది. "టీ తీసుకోండి. ఈలోగా బాత్‌రూమ్‌లో అన్నీ సిద్ధంచేస్తాను." నాకు తెలుసు. ఈ సాయంత్రం రాత్రిఅయి—తెల్లవారే లోగా నాకు మరిన్ని చక్కని అనుభూతులు ప్రసాదించబడతాయి. వరాలిచ్చేది—శాంతి. ఇప్పుడేకాదు. ఎప్పుడూను. ప్రయాణంచేసి వచ్చిన సాయంకాలమూ రాత్రీ చాలా చక్కని అనుభవాలు లభింపజేస్తుందామె. అందుకే—హోమ్!...స్వీట్ హోమ్.

బాత్‌రూమ్ ... షవర్‌కింద నిలుచున్నాను—షేవ్ పూర్తిచేసుకుని. ఒంటిమీద వేడివేడినీళ్ళు పడుతూ...జుత్తుకి షాంపూ గిలిగింతలుపెడుతూ...చాలా హాయిగా, యుడికొలోన్ పరిమళాలతో స్నానంముగించి—వెచ్చనిబట్టలు వేసుకుని డ్రాయింగ్ రూమ్‌లోకి వచ్చాను. స్నాక్స్...టీ...శాంతి.

"డిన్నర్‌లోకి ఏంచేయించేవి?"

ఆమె చాలా అందంగానూ తాజాగానూ తయారయి ఉంది. చెప్పాను. చిన్న ఉత్తరాలకట్టను టీపాయిమీద ఉంచింది ఇదో చిత్రమయిన అనుభవం. ఆ ఉత్తరాలు ఎప్పటినుంచో నాకోసం ఎదురుచూస్తూంటాయి. వాటికి జవాబు రాస్తూ ఆలస్యానికి కారణాలూ క్షమాపణలూ చెప్పాల్సి ఉంటుంది.

కిటికీలోంచి బయటకు చూశాను—విండోసిల్‌వరకూ వచ్చి. సూర్యాస్తమయమయి—చీకటిపడుతోంది. మంచు కూడా ప్రారంభించింది. ఔను, చలి కాలం మరి. అన్నట్లిది శుక్లపక్షమా బహుళపక్షమా?

వెనక్కి—వచ్చి సోఫాలో కూర్చుని ఉత్తరాలు చదవడం ముగించాను—రెండు సిగరెట్ల సాయంతో. అవి అయ్యే సరికి—చిరునవ్వుతో నిలుచుంది శాంతి.

అప్పుడే వికసిస్తున్న పువ్వంత తాజాగా ఇంకా చాలా అందంగా.

"అవతల-చాలా చలిగా ఉంది."

"ఫరవాలేదు. ప్లీజ్..."

ఐదునిముషాల్లో లాన్‌లోంచి పిలిచిం దామె. లాన్‌లో-గార్డెన్ ఛెయిర్స్... టీపాయ్ ... గ్లాసులు ... సీసా... వేయించిన జీడిపప్పు.

నేను కూర్చునేసరికి - రాయల్ సెల్యూట్ గ్లాసులో పోసి-వెస్ ముక్కలువేసి - సోడా నింపింది. నా ప్రాణానికి ఎంతోహాయిగా అనిపించింది.

ఈ చిన్న సుఖాలన్నీ నేను దిగే ఖరీదయిన హోటళ్ళలో లభించనివికాదు కాని-యిక్కడ విషయం వేరు. మనుషు లందరూ మనసులోకి రాలేనట్లే, కొన్ని సుఖాలు అన్నిచోట్లా అంత సంతృప్తినీ యివ్వవు.

"నీ ఆరోగ్యంకోసం-" నవ్వుతూ సిప్ తీసుకున్నాను.

ఆమె-భుజాలమీద బిన్నీషాల్ సరిచేసు కుంది.

"చలివేస్తూందా? స్కార్ఫ్ తీసుకు వొచ్చేదా?" సారీ శాంతీ. నిన్ను చాలా బాధపెడుతున్నాను క్షమిస్తావ్ కదూ?"

"ప్రయాణం సుఖంగా జరిగిందా?" నన్ను వినిపించుకోకుండా అడిగింది. ఆలస్యానికి కారణాలతో సహా నా ప్రయాణం గురించీ నేను సాధించిన మంచి బిజినెస్ డీల్ గురించీ చెప్పి -

"గవర్నమెంట్ సిల్కు ఎంపోరియంలో చక్కని చీర కనిపించింది, తీసు కున్నాను," అన్నాను.

"థాంక్స్." అంటూ నా చేతిని తీసుకుంది తన చేతిలోకి.

మంచు పడుతోంది.

లాన్‌లో డెయిసీలు చలికి వొణు కుతూ-తెల్లగా మెరుస్తున్నాయి.

ఒకటిరెండు నిముషాలు నిశ్శబ్దంగా జారిపోయాయి మా మధ్య.

"ఏమిటి విశేషాలు?" అడిగాను.

"మీరులేక-రోజులు చాలా భారంగా గడిచాయి."

"నాకూ సరిగ్గా అంతే."

మళ్ళీ మౌనం. దూరంగా ట్రాన్సి స్టర్‌లోంచి జాజ్‌మ్యూజిక్-సన్నగా.

"మీ ఫ్రెండ్...డాక్టర్...వచ్చా రొకసారి..."

"దేనికి? కారణం చెప్పాడా?"

"ఈ ఊళ్ళో ఒక యాగమో యజ్ఞమో జరిగింది."

శాంతి యీ ప్రస్తావన ఎందుకుచేసి నట్లు? ఆమెకు నిశ్చయంగా తెలుసు యిటువంటి వార్తలు నాకెంత మాత్రమూ ఉత్సాహాన్నివ్వవని.

"వెయ్యో రెండువేలో కొబ్బరి కాయలూ...పదో పదిహేనో డబ్బాల నెయ్యీ..."

"క్షమించరాని వృధా. అలాగ తగ లెయ్యడంకంటె పేదవాళ్ళకిస్తే...వాళ్ళ

ఆకలి తీరేది." కొంచెం ఉద్రేకంగా అన్నాను.

"స్వాములవారి ఆజ్ఞ. దానినే పాటిం చారు పురజనులూ ప్రముఖులూ..."

"ఆజ్ఞాపించేందుకు ఆ స్వామి ఎవరు?"

"ఆయనకు నాలుగైదు భాషలలో మంచి పాండిత్యం ఉందట..."

"అంతకు మించిన లింగిస్టిక్స్ చాలా మందే ఉన్నారు."

"గాలిలోంచి విభూది తెప్పించ గలరట..."

"రోడ్డుపక్క మోళీవాడు రూపాయ రే తెప్పిస్తాడు."

"స్వామికి ఎందరో పాదపూజ చేశారు. తీర్థం స్వీకరించారు."

"మూర్ఖులు అజ్ఞానులు అమాయకులు...'

"డాక్టరూనా?"

నిర్ఘాంతపోయాను. 'ఏమిటీ?"

"ఆ స్వామికి పాదపూజచేసి... వెయ్యినూటపదహార్లు సమర్పించుకున్న వారిలో మీ డాక్టరు ఫ్రెండూ ఒకరు-"

శాంతి మాటలు-తుపాకి గుళ్లలాగ తగిలాయి నాకు. నేను నన్నూ డాక్టర్ని నమ్మలేకపోతున్నాను. "యు టూ డాక్టర్!" అనుకోవలసిన పరిస్థితి ఏర్ప డింది. నా విశ్వాసాలకూ మా స్నేహా నికీ చాలా పెద్ద దెబ్బ...

రాయల్ సెల్యూట్ నీ...శాంతినీ.. అన్నీ వదిలేసి ఆవేశంగా, డాక్టరింటికి వెళ్ళాను- వీలయినంత వేగంగా.

"బహుకాల దర్శనం -" విష్ చేస్తూ నవ్వాడు డాక్టరు.

"ఊఁ."సంభాషణ ఎలాగ ఎక్కడ మొదలుపెట్టాలా అని ఆలోచిస్తున్నాను. ఈ మంచి స్నేహితుడుకూడా దూరం అయిపోతున్నాడని తెలుస్తున్నకొద్దీ చాలా బాధగా ఉంది.

"డల్‌గా ఉన్నట్లుంది మీకూ నాలాగే. వాతావరణం అనుకూలంగా ఉంది. రూములో జానీవాకరున్నాడు. వాడికి బంధవిముక్తి కలిగిద్దాం. ఏం?"

డాక్టర్-ఎవరో నాలాటి దగ్గరి స్నేహితులతో తప్ప డ్రింకు తీసుకోడు. ఇప్పుడు నేను మాట్లాడబోయే విషయం- డ్రింక్స్‌మీద అయితేనే నయం.

అతని పర్సనల్ రూమ్‌లో-ఏర్పాట్లు జరిగాయి.

డాక్టరు - రెండోరౌండు తరువాత చాలా ఇన్హిబిషన్స్‌నుంచి బయటపడి ఫ్రీగా మాట్లాడడమూ ప్రవర్తించడమూ చేస్తాడని నాకు తప్పకుండా తెలుసు. అందుకే అతని రెండోరౌండ్ అయ్యే వరకూ సహనం వహించాను.

"డాక్టర్!"

"యస్ ప్లీజ్..."

"ప్రాక్టీసుద్వారా మీరు చాలా డబ్బూ...మంచి పేరూ సంపాదించారు. ఔనా?"

"ఊఁ. రెండూ కావలసినంతా లభించాయ్ ... నిజానికి -అవసరానికి మించే..."

"మరి - యింకా మీకు తీరని కోరికలూ, అందని ఆశలూ ఏం మిగిలాయ్? మీ మనసులోని అశాంతికీ అసంతృప్తికీ కారణం ఏమిటి?"

"నథింగ్ ... నథింగ్ ...నాకేమీ లేవు-"

మూడో రౌండులోకి వచ్చాడతను. నేను రెండు పూర్తిచేయలేదు. డ్రింక్‌కంటె ఎక్కువ కిక్ యివ్వగలిగే స్నేహం మమ్మల్ని మోసగిస్తుందేమో అన్న భయం నా నరనరాలలోనూ నిండి ఉంది.

మా స్నేహానికి ఆధారం – మేమిద్దరమూ ఒకే విషయం అంగీకరించడం. దేముళ్ళూ...బాబాలూ... యిటువంటివి వొట్టి ట్రాష్ అన్న విషయంమీద మేమిద్దరమూ ఏకీభవించడం. నిజానికి ఆ ప్రాతిపదిక మీదనే మా యింత స్నేహమూ ఆధారపడి ఉంది. కాని, యిప్పుడు?

తన మాటలను తానేమరచి-ఆస్వామి పాదాలు కళ్ళకద్దుకుని - ఆతడిచ్చిన బూడిద ఒంటికి పూసుకుని - కలుషితమయిన నీళ్ళను తాగి - డాక్టరు నన్నూ మా స్నేహాన్నీ అవమానించాడు. ఇలాగ జరిగాక యిక యితనికీ యితని స్నేహానికీ గుడ్‌బై చెప్పెయ్యకుండా ఆత్మవంచన చేసుకుంటూ కపట స్నేహాన్ని ఎన్నాళ్ళు నటిస్తూ పోగలను?"

డాక్టరు - అమాయకంగా నాలుగో రౌండులోకి వెళ్ళిపోయాడు నన్నువొదిలి. సిగరెట్ కాలుస్తున్న నన్ను చూసి—హటాత్తుగా అడిగాడు. "అలా ఉన్నారేం?"

"ఎలాగ? నిషాలో నేనూ మీ కంటికి ఏ బాబాలాగో, స్వాములారిలాగో కనిపించడంలేదు కద? ప్లీజ్ ... పాద పూజలూ...వెయ్యినూటపదహార్లూ అని మొదలుపెట్టకండి. నాకు చాలా అసహ్యం." క్రూరంగా అన్నాను.

అతని ముఖం రంగులు మారింది. తల వాల్చేసి - కొన్నినిముషాలుండి పోయాడు. తరువాత మెల్లగా తలఎత్తే సరికి—చాలా దీనంగా జాలిగొల్పేలా ఉంది ముఖం.

"మీవరకూ వచ్చిందన్నమాట!-" నేరస్తుడిలా అన్నాడు.

మీ పేరు ప్రఖ్యాతులు తక్కువేమీ కావిక్కడ. గొప్పవాడు మంచిపనిచేస్తే త్వరగా వ్యాపించకపోవచ్చుకాని,... మీరుచేసిన తప్పుపని – అతిత్వరగానూ బహుళంగానూ ప్రచారం పొందింది-"

సిగ్గుతో తలవంచుకున్నాడు.

కొంచెం నిషావల్లా, ఎక్కువఉద్రేకం వల్లా నేను అవధిమీరే అన్నాను- "సిగ్గు పడవలసింది మీరుకాదు. నేను...మన స్నేహానికి..."

నన్ను వినిపించుకోనట్లే అతను చెప్పసాగాడు... "ఒక అదృష్టహీనుడున్నాడు..."

"కథలు చెప్పకండి-" వారించాను.

హటాత్తుగా నా చెయిపట్టుకుని నడిపించసాగాడు డాక్టర్. చాలా గదులు

దాటించి ఒక చిన్నగదిలోకి తీసుకు వెళ్ళాడు.

"ఆ మంచంమీద – జాగ్రత్తగా చూడండి."

చూశాను. హృదయం జాలితో నిండి పోయింది. మనసు వికలమైంది.

నిలబడలేకపోయాను.

"ఆ పాప–మా అమ్మాయి అని చాలామందికి తెలీదు. ఈ రహస్యానికి నా బాధ్యత కొంతవరకూ లేకపోలేదు. కదలలేని ... పలకలేని – యీ పాపకి తండ్రిని నేను. ఎన్నో వేలు... ఎంతో కాలం ... ప్రయత్నించాను నా పాపని పిండిబొమ్మ దశనుంచి చైతన్యవంత మయిన మనిషిగా చేయాలని. కాని– వైద్యశాస్త్రం నాకు సహాయం చేయలేక పోయింది.

పాప ఆడితే చూడాలనీ, పాడితే వినాలని ... నోరువిడిచి కోరితే ఆమె కోరిక తీర్చాలని–నా కెంతో ఆశ. నా కెటు వంటి కలలు వస్తూంటాయో తెలుసా? నా పాప నడుస్తున్నట్లు ... నాట్యం చేస్తున్నట్లు ... మాట్లాడుతున్నట్లు... పాటలు పాడుతున్నట్లు...ఖరీదయిన బట్టలు వేసుకుని బొద్దుగా ముద్దుగా తయారై నాచేతులలోకి గెంతి, ఏవేవో కావాలని మారాముచేస్తున్నట్లు.." డాక్టర్ గొంతు గద్గదికం అయింది..."కాని అవన్నీ కలలే." కొంచెం ఆగి అన్నా డతను." అందుకే...నా పాప చిన్నారి జీవితాన్నలాగ చేసినందుకే భగవంతుణ్ణి ద్వేషించేవాడిని.

"స్వామీజీ నా ఆశలను రేకెత్తించారు తన మాటలతో. ఆయన మాటలు విని– ఏ పుట్టలో ఏ పాముందోఅనుకున్నాను."

"పుట్టలో ఉండేది పామే. పాములూ బాబాలూ మనిషికి మేలుచేయవు. కీడే చేస్తాయి కాటేవేస్తాయి."

"నా పాపకోసం–అతని పాదాలను పూజిస్తే ఏం? అతనికి వెయ్యినూట పదహార్లిస్తే ఏం? ఆ విభూది పూసు కుంటే ఏం? అనిపించింది. అదష్టాని పరీక్షించుకోవా లనిపించింది–"

"కాని–మీరు డాక్టర్ ! పాదపూజ చేస్తే... అతనిచ్చిన నీళ్ళు తాగితే... ఆ బూడిదపూసుకుంటే – పాపకి కాళ్లూ చేతులూ చైతన్యమూ రాగలవని ఎలాగ మిమ్మల్నీ మీలోని శాస్త్రజ్ఞుణ్ణీ మోస గించుకోగలిగారు?" నేరం అంగీకరిస్తు న్నట్లు ... పశ్చాత్తాపపడుతున్నట్లు... సిగ్గుపడుతున్నట్లు – మెల్లగా అన్నాడు. "మొదట నేను మనిషిని. మనిషిగా ఆశాజీవిని. తరువాతనే డాక్టర్ని... శాస్త్రజ్ఞుణ్ని...నా వరకూ వొచ్చేసరికి– నాలోని మనిషి డాక్టర్ని మింగేశాడు... నాలోని తండ్రి–డాక్టర్ని మింగేశాడు."

త్వర త్వరగా ముందు గదిలోకి వొచ్చి–గ్లాసులో మిగిలిన జానీవాకర్ ని గొంతులో పోసుకుని – గట్టిగా కళ్ళు మూసుకున్నాను.

ఎక్కడినుంచో——

ఈ ప్రపంచంలో ఏదీ సత్యమూ కాదు, నిత్యమూ కాదు–




నీళ్ళలో కలిసిన పంచదార కంటికి కనిపించదు. కానీ ఆ నీరు త్రాగిన ప్రతివారికీ అందులో పంచదారున్నట్లు తెలుస్తుంది. పంచదారంటే తెలియని వారికికూడా ఆ నీరు తియ్యగా ఉంటుంది. ప్రేమకూడా అంతే! కంటికి కనిపించదు ప్రేమ—కానీ ప్రేమానుభూతి అందరకూ **తీయగానే ఉంటుంది.**

జబ్బుచేసిన వ్యక్తి చేదుమందు సేవించాల్సివస్తుంది, రోగికి మందురుచి భరించ శక్యంకాకుండా ఉండవచ్చు. కానీ ఆమందు రోగి క్షేమాన్ని కోరింది—

రోగి శరీరంలోని రోగక్రిములను నశింప జేసి అతనికి సంపూర్ణారోగ్యాన్ని సమకూర్చడమే ఆ మందుపని...! నిజానికి ఆ మందురుచికూడా ప్రేమానుభూతి కావాలి...కానీ రోగికి ఆ రుచి తలుచుకుంటేనే భయంకరంగా తోచవచ్చు.

పంచదార పైత్యరోగికి చేదుగా ఉంటుంది. కొంతమందికి కాకరకాయ చేదు చాలా రుచిగా తోస్తుంది.

వీటన్నిటినీ బట్టి చూస్తూంటే రుచిని బట్టి పదార్థవైశిష్ట్యాన్ని నిర్ణయించడం సమంజసం కాదనిపిస్తుంది. పదార్థాల విషయంలోనే—నిరాకారమైన ప్రేమను భౌతికాధారాలతో గుర్తించడం అసాధ్యమని గ్రహించాలి!

ఈ గ్రహింపు మార్కండేయులికి కలిగినట్లులేదు.

మార్కండేయులకి ముగ్గురన్నయ్యాలూ ఒక తమ్ముడూ ముగ్గురు చెల్లెళ్ళూ ఉన్నారు. అతని తండ్రి పేరేమైనప్పటికీ అందరూ పంతులు అని పిలుస్తారు. పంతులుది పదెకరాల వ్యవసాయం. ఆయన చిన్నతనంనుంచీ శ్రద్ధగా జాగ్రత్తగా వ్యవసాయంచేస్తూన్నప్పటికీ—పిల్లలందర్నీ మాత్రం పెద్దచదువులు చదివించే ఉద్దేశ్యంతో ఉన్నాడు. వ్యవసాయం ఆయనకు నచ్చలేదు. తన పిల్లలెవరూ వ్యవసాయం చేయడం ఆయన కిష్టంలేదు ఇంకా స్పష్టంగా చెప్పాలంటే ఆయన తనవృత్తిని ప్రేమించడంలేదు.

మార్కండేయులికి చిన్నతనంనుండీ సాహిత్యమంటే అభిలాష ఉంది. వాళ్ళ ఊళ్లోని గ్రంథాలయంలోని కథలూ నవలలూ అన్నీ చదివేశాడతను. పత్రికలన్నీ చదువుతూంటాడు. ఇవన్నీ కలిసి అతనికి చిన్నతనంనుంచీ ప్రేమ అనే పదానికి ఒక అర్థాన్ని చెప్పాయి. ఆ అర్థం ఇంట్లో ఎక్కడన్నా కనపడుతుందేమోనని అతను చిన్నతనంనుంచీ వెతుకుతూనే ఉన్నాడు.

మార్కండేయులికి కాస్త ఊహ తెలిసే సమయానికి అతని తల్లి కృష్ణవేణమ్మ సుమారు పాతికేళ్ళుంటుంది. పంతులు ముప్పైఏళ్ళ లోపులో ఉన్నాడు. మామూలుగా చెప్పాలంటే సినిమాల్లోనూ కథల్లోనూ చూసే హీరో హీరోయిన్లవయసులో ఉన్నారు వాళ్ళిద్దరూ.

యుగళగీతాల మాటటుంచి తల్లీ తండ్రీ ప్రేమగా మాట్లాడకోవడం మార్కండేయులు చూడలేదు. పైగా వాళ్ళిద్దరూ ఎప్పుడూ దెబ్బలాడుకుంటుండేవారు. ఇంట్లో గొడవ జరగని రోజంటూ ఉండేదికాదు. మార్కండేయుల కర్థమైనంతవరకూ ఎప్పుడూ తప్పు తండ్రిపక్షానే ఉండేది.

పంతులిది మెత్తటి మనసే కావచ్చు కానీ ఆయనకు విపరీతమైన కోపముంది. ఇంట్లో అందరిలోకీ ఆయనే పెద్దవాడూ గృహయజమానీ కాబట్టి ఆయన కోపం

చక్కగా సాగుతోంది. సాధారణంగా పంతులు కోపం చేతల్లోకిరాదు. ఆయన చటుక్కున పిల్లల్నికానీ భార్యనుకానీ కొట్టలేడు. అందువల్ల ఉన్నకోపమంతా ఆయన మాటల్లోనే కనిపిస్తుంది. ఆయన కంఠం చిన్నదేమీకాదు. కోపం మరీ హెచ్చయినపుడాయన ముఖం చెండు కోవడమూ,తల గోడకు కొట్టుకోవడమూ చేస్తూంటాడు.

తండ్రికి ప్రేమంటే అర్థంతెలియదనీ ఆయనకు ప్రేమగా మసలడం చేత కాదనీ మార్కండేయులికి ఒక ఖచ్చిత మైన అభిప్రాయం ఏర్పడిపోయింది. అందు క్కారణాలు లేకపోలేదు.

శ్రద్ధగా వ్యవసాయం చేస్తున్నాడు గదా ఆయనకు వ్యవసాయంమీద ప్రేమ ఉందనుకుందామంటే – ఆయన వ్యవసాయాన్ని తిట్టనిరోజంటూఉండదు. బుద్ధితక్కువై ఇందులో దిగాను-పొల ములో అయినకాడికి అమ్మేసుకుని ఏ వ్యాపారం చేసుకున్నా ప్రాణం సుఖంగా ఉండేదని ఆయన చాలా తరుచుగా అంటూఉండేవాడు.

పోనీ పుట్టిపెరిగిన ఊరిమీద ప్రేముందా అంటే – నాశనికొద్దీ ఈ వెధవవూళ్లో పడ్డానని ఆయన విసు క్కుంటూండేవాడు.

కన్నతలిదండ్రుల్ని ప్రేమిస్తున్నాడా అంటే–వాళ్ళమూలంగానే తను వ్యవ సాయంలోకి దిగవలసి వచ్చిందనీ లేకుంటే ఎక్కడైనా హాయిగా ఉద్యోగం సంపాదించుకొని కాలుమీద కాలువేసు కుని బ్రతికేవాడనని అనుకుంటూంటాడు.

శనిలా దాపరించావని కట్టుకున్న పెళ్ళానంటూండడం ఆయన కించు మించు దినచర్యే!

అల్లరిలో ప్రాణాలు తినేస్తున్నారని కన్నబిడ్డలనికూడా ఆయన అనుక్షణమూ తిడతూంటాడు.

ప్రతి విషయంలోనూ ఆయన కసంతృప్తి కరుగుతూంటుంది. ప్రతి వారిలోనూ ఆయనకు లోపం కనబడు తూంటూంది. మార్కండేయు లాయన్ని ప్రేమించడంచేతకాని మనిషిగా లెక్క కట్టేశాడు.

ఇతరుల విషయంలో ఎలాగున్నప్ప టికీ తల్లివిషయంలో తండ్రి ప్రవర్తన మార్కండేయులికి బాధకలిగిస్తుండేది.

ప్రతివిషయానికీ తిట్టడం సంగత టుంచితే ఆయన తల్లిని బయటవాళ్ళ ముందుకూడా అవమానించడం అతనికి తల తీసేసినట్లుండేది. ఇంటిపాలేరు ముందువీధిలోకి వచ్చిన కూరగాయలవాడి ముందు, తనకు క్షౌరంచేయడానికి వచ్చిన మంగలిముందు...వీళ్లూ వాళ్ళూ పెద్దా చిన్నా వివక్షతలేకుండా ఆయన అందరిముందూ ఆవిడనేదోసందర్భంలో నోర్మూయ్యమని గద్దించో, నానాతిట్లూ తిట్టో అవమానించాడు. కృష్ణవేణమ్మ తన ఇల్లాలనీ–ఆవిడ నలుగురిముందూ

అవమానపడితే అది తనకూ చెందు తుందనీ ఆయన ఎన్నడూ గ్రహించి నట్లు లేదు.

ఎదుగుతున్నకొద్దీ మార్కండేయుల కిది దుస్సహం కాసాగింది. తన అన్నలు పట్నంలో కాలేజీలో చదువుకుంటూండే వారు వాళ్ళు విడిగా హోటల్ భోజనం చేస్తూ ఉండినప్పటికీ పరీక్షలముందు మాత్రం కాలేజీకి దగ్గర్లో ఇల్లుచూసుకుని అక్కడకు మకాం మార్చేసేవాడు పంతులు.

పట్నం వెళ్ళడానికా ఊరునుంచి కొంతదూరం బండిమీదనో, కాలినడకనో వెళ్ళి బస్సు ఎక్కాలి. సాధారణంగా పంతులు బండి కట్టించేవాడు. ఒక పర్యాయం ఏదో చిన్న గొడవవచ్చి బండిలోనే నానామాటలూ అన్నాడు పంతులు భార్యను. బండివాకూడా గొడవలో కలగజేసుకుని పంతులు తరపున తనూ కృష్ణవేణమ్మను మంద లించాడు. మార్కండేయుల శరీరం కుతకుత ఉడికిపోగా బండివాడిమీద మండిపడి — "మా ఇంటిగొడవల్లో నీ జోక్యం అనవసరం—" అన్నాడు. అప్పటికతనికి పన్నెండేళ్ళుంటాయేమో—బండివాడు మరి మాట్లాడలేదు. ఏమను కున్నాడో పంతులుకూడా మాట్లాడ లేదు.

పట్నంలో అద్దెఇంట్లోకూడా పంతులు, కృష్ణవేణమ్మ గట్టిగా దెబ్బ లాడుకుంటూండేవారు. ఒక పర్యాయం మార్కండేయులి అన్నలు తండ్రికి ఖచ్చితంగా చెప్పేశారుకూడా — స్వగ్రామంలో అందరికీ తెలిసినదే కాబట్టి అక్కడెలాగున్నా ఫరవాలేదనీ పట్నంలో మాత్రం ఇలా దెబ్బలాడు కుంటే నలుగురిలో తమకు అవమానంగా ఉంటుందనీ, చదువుకోవడం కూడా కష్టమవుతుందనీ వారంటే పంతులు మాట్లాడకుండా ఊరు కున్నాడు,

తండ్రిపట్ల పెరిగే ఈ ద్వేషభావం—తల్లిపట్ల జాలినికూడా పెంచుతూండేది మార్కండేయులికి. తన తల్లి పడుతున్న కష్టాలన్నీ తనుద్యోగంలోకి రాగానే తీర్చాలని అతను భావించాడు, తల్లినిపువ్వుల్లో పెట్టి చూస్కొని ఆమెకు శేషజీవితము సుఖమయంగా ఉండేలా చేయాలనిఅతను కోరుకున్నాడు. ఆ వాతావరణంలోనే అతను కష్టపడి చదువుకుని—తన ఆశయాలకనుగుణంగా పరీక్షలు ప్యాసవుతూ వచ్చాడు. అతనికి బెంగుళూర్లో మంచి ఉద్యోగం వచ్చింది.

ఉద్యోగంలో జేరి మంచి ఇల్లు చూసుకున్నాక — అతను తల్లిని తీసుకు వెళ్ళాలనే సంకల్పంతో స్వగ్రామం వెళ్ళాడు. అక్కడ పరిస్థితులింకా మారకపోవడం చూసి ఆశ్చర్యపోలేదు.

అతను వెళ్ళినరోజునే పంతులు కొబ్బరినూనెసీసాని గిరవాటేశాడు —

భార్య కూరగాయలకు డబ్బడిగింది. సీసా పోలిథీన్‌ది కాబట్టి సరిపోయింది—లేకపోతే ఆ విసురుకు పగిలిపోవల సిందే...పంతులు ప్రవర్తన కారణంగా ఆ ఇంట్లో గాజుసామగ్రి వాడడం బాగా తగ్గించారు.

పంతులు మనస్తత్వాన్నర్థంచేసు చేసుకోవడం చాలాకష్టం. ఆయన డబ్బంతాతనదగ్గరే ఉంచుకుంటాడు. పైస కావాలంటే భార్య అడిగితీసుకోవల్సిందే! అడిగితే ఆయనకు కోపంవచ్చేస్తుంది. ఇంట్లోని అవసరవస్తువుల గురించి ఒక టికి పదిసార్లడిగితేగాని ఆయన భార్యకు డబ్బివ్వడు. అడిగిందని కోపగిందు కుంటాడు. అడక్కుండా అన్నీ తనే వేయిస్తాడా అంటే అదీలేదు.

కృష్ణవేణమ్మకూడా – వాడెలాగూ నన్ను తీసుకెళతానంటున్నాడు. మీరూ మీ కూతుళ్లూ హాయిగా సంసారం గడుపుదురుగాని-నేను ఉన్నన్నాళ్ళైనా హాయిగా బెంగుళూర్లో ఉండివస్తాను... అంది.

"వెళ్ళు — మేమూ సుఖపడతాం-" అన్నాడు పంతులు.

మార్కండేయులు తనలో తను నవ్వుకున్నాడు. తను తల్లిని శాశ్వతంగా ఈ నరకంనుంచి తప్పించే ఉద్దేశ్యంలో ఉన్నాడని వీళ్ళకు తెలిసినట్లులేదు. తల్లి ఇంకెప్పుడూ తనతోనే ఉంటుంది. సుఖజీవనం చేస్తుంది.

ఉన్న వారంరోజుల్లోనూ మార్కండేయులు దగ్గర్లో ఉన్న రెండు పెళ్ళి సంబంధాలుకూడా చూడవలసివచ్చింది. అదయ్యాక అతని తల్లినీ ఆఖరు చెల్లెల్నీ తీసుకుని బెంగుళూరు వెళ్ళిపోయాడు.

అతను తల్లికి మొదట్లో ఊరంతా చూపించాడు. ఇంట్లో ఆమెకు సౌకర్యంగా ఉండేలా గ్యాస్‌స్టవ్వు, కుక్కరూ కొన్నాడు. నెల మొదట్లోనే అవసరా లన్నీ కొనేసేవాడు. తల్లి నోటివెంట మాటరాలకుండా ఆవిడ అన్నీ ఏర్పాట్లూ జరిపించేస్తుండేవాడు.

ఒక వారంరోజులపాటు కృష్ణవేణమ్మ మరోఆలోచనలేకుండా కాలంగడిపేసింది ఆ తర్వాత ఆవిడ ధ్యాస ఇంటిమీదకు మళ్ళింది.

"వంకాయకూర అద్భుతంగా చేశా వమ్మా-" అని అతను మెచ్చుకుంటే—"ఈ కూర ఆయనకు చాలా ఇష్టం. ఇంట్లో పిల్లలెవ్వరు చేసినా ఆయనకు నచ్చదు, నేను చేసినదే ఆయన కిష్టం." అని ఆవిడ బాధపడేది.

కొడు కావిడను సినిమాకు తీసికెళితే "పట్నం వెడితే సినిమా చూడకుండా వచ్చేవారు కాదాయన—" అనుకునేది.

నగరంలోని వింతలు కొడుకు చూపిస్తుంటే- "ఇవన్నీ నాకేం అర్థ మవుతాయిరా-ఆయనైతే చాలా సరదా పడి చూసేవారు-" అనేసేది.

కొడుకుద్యోగాన్నీ వైభవాన్నిచూసి-

ఆయనకూడా ఒకసారి వచ్చిచూస్తే ఎంత సంతోషపడేవారో అనేది.

ఇలా మాటిమాటికీ తల్లి తండ్రిని తల్చుకుని బాధపడడం మార్కండేయు లకి కష్టంగానే ఉండేది. కానీ అతనా విషయాన్ని పైకి అనలేక ఊరుకునేవాడు. కానీ అతనికింకా కష్టంకలిగించే సంఘట నలు తర్వాత జరిగాయి.

ఒకరోజు కూర మాడిపోయింది. మార్కండేయులు మాట్లాడకుండా తినేశాడు– "ఏమిటో ఇల్లు గుర్తుకొచ్చిం దిరా–ఆలోచనలోపడి కూర మాడ బెట్టేశాను..." అంది కృష్ణవేణమ్మ నొచ్చుకుంటూ.

"మా అమ్మ చేతివంట మాడినా రుచిగానే ఉంటుంది..." అన్నాడు మార్కండేయులు – తల్లి ఇంటిధ్యాస ఇంకా పోనందుకు మనసులో నొచ్చు కొంటూ.

"నువ్వుకాబట్టిఅలా సరిపెట్టుకున్నావు ఆయనైతే కంచం గిరవాటేసి ఉండే వారు. పిల్లలెలా చేస్తున్నారో–ఆయనెలా సరిపెట్టుకుంటున్నారో పాపం !" అంది కృష్ణవేణమ్మ బాధగా.

"పొరపాట్లెవరికైనా వస్తాయి. ఆ మాత్రానికి కంచాలు గిరవాటేయాలా ఏం ? సాగితే సరి ..." అన్నాడు మార్కండేయులు చిరాగ్గా.

"బాగుందిరా – కష్టపడే మగాడి కామాత్రం దురుసుండడం తప్పుకాదు. అయినా వంటచేయటం నా బాధ్యత గదా – నా బాధ్యతను నేను సరిగా నిర్వర్తించాలా అక్కర్లేదా ?" అంది కృష్ణవేణమ్మ మామూలుగా.

మార్కండేయు లింకాట్టే మాట్లాడ లేదు. తండ్రిపట్ల తనకున్న ద్వేషం తల్లికి లేదేమోనని ఆ క్షణంలో అతనికి అనిపించింది.

వచ్చి రెండువారాలు దాటినా తండ్రి క్షేమ సమాచారాలు విచారిస్తూ ఒక్క ఉత్తరమైనా వ్రాయలేదు. ఆ విష యాన్ని మార్కండేయులు తల్లి దగ్గ రంటే ఆవిడ – "ఉత్తరాలు వ్రాయడం ఆయన కలవాటు లేదురా– కానీ ఆయన మనసు నిండా ఇక్కడ మన మెలా గున్నామన్న ఆలోచనే ఉంటుంది–" అంది.

మార్కండేయుల కా విషయంలో నమ్మకం కలగలేదు. కానీ కొన్ని దశాబ్దాలుగా తండ్రితో గడిపిన జీవి తాన్ని నరకప్రాయంగా కాక మధు రోహాలుగా తల్లి గుర్తుచేసుకుంటోందని అతనికి క్రమంగా అర్థంకాసాగింది.

పంతులు తిట్టిన తిట్లనూ, వేసే చీవాట్లనూ, నలుగురిలో తీసిపారేయ డాన్నీ కూడా కృష్ణవేణమ్మ పీడకలగా భావించడంలేదు. ఆ మనిషిప్పుడు దగ్గర లేడే, అలా చేయడం లేదేనని బాధపడు తోంది. ఎలాగున్నాడోనని తపించి పోతోంది.

కృష్ణవేణమ్మ బెంగుళూరు చేరిన

సరిగ్గా ఇరవైమూడురోజులకు ఓ రోజు ఉదయాన్నే ఎవరో ఇంటితలుపు తట్టారు. మార్కండేయులే స్వయంగా వెళ్ళి తలుపు తీసి వచ్చిన వ్యక్తిని చూసి ఆశ్చర్యపోయాడు. ఆయన పంతులు — అతని తండ్రి.

"రండి నాన్నా-" అంటూ ఆత నాప్యాయంగా లోపలి కాహ్వానించాడు. ఆయన కళ్లుమాత్రం ఎవరికోసమో వెతుకుతున్నట్లున్నాయి. "ఎవరూ ?" అంటూ అక్కడికి వచ్చిన కృష్ణవేణమ్మ భర్తను చూసి ఆశ్చర్యపోయింది. ఆమె కళ్ళలో ఒక్కసారిగా వెయ్యిదీపాల వెలుగు చూశాడు మార్కండేయులు. అతను తండ్రిని చూశాడు. ఆయన తదేకదీక్షతో తల్లిని పరీక్షగా చూస్తు న్నాడు. ఆయన కళ్ళలో కనిపించే దాన్ని ప్రేమంటారో అనరో అతను చెప్పలేడు. కానీ - అది ద్వేషం, కోపం, విసుగు, చిరాకుల్లో ఏదీ మాత్రంకాదని అతను స్పష్టంగా చెప్పగలడు.

పంతులు తను వచ్చిన కారణం వివరించాడు. ఆయన ఆఖరు పిల్లను వదిలి ఎప్పుడూ ఇంతకాల ముండలేదు. మనసంతా ఆ అమ్మాయిమీదకే పోగా ఉండబట్టలేక వచ్చేశాడట.

ఉత్తరం ముక్కయినా రాయకుండా తండ్రి ఇలా వచ్చేస్తాడని మార్కం దేయులు కలలో కూడా అనుకోలేదు.

ఏదేమైనా పంతులు రాగానే ఆ ఇంటికి కొత్త కళ వచ్చింది. కృష్ణవేణ మ్మలో కొత్త ఉత్సాహం కనిపించింది. మార్కండే గారు ఈ పర్యాయం — తండ్రినీ, తల్లినీ మైసూరు తీసుకువెళ్ళి ఊరంతా చూపించాడు. పంతులు చాలా సంతోషించాడు. కొడుకు కారణంగా తనకు మైసూరు చూడగల అవకాశం వచ్చిందని పదే పదే అనుకున్నాడు. అక్కడ చూసిన ప్రతి విశేషం గురించీ తనకు తెలిసినదంతా భార్యకు వివరించి చెప్పాడు. కృష్ణవేణమ్మ నిర్లిప్తత వహించలేదు. కుతూహలంగా వింది.

ఇంటికి తిరిగి రాగానే ఏదో చిన్న విషయాన్ని పురస్కరించుకుని పంతులు కృష్ణవేణమ్మని నానా మాటలూ అన్నాడు. కృష్ణవేణమ్మ కూడా మాటకు మాట జవాబిచ్చింది. మళ్ళీ మొదలు— అనుకున్నాడు మార్కండేయులు.

పంతులు అక్కడ వారంరోజు లున్నాడు. ఈ వారంరోజుల్లోనూ భార్యా భర్తలిద్దరూ కనీసం పదిసార్లయినా గట్టిగా దెబ్బలాడుకుని ఉంటారు. మనసులో చికాకుపడ్డా పైకిమాత్రం వ్యక్తపరచలే దతను. ఎలాగూ తండ్రి అన్నిరోజులూ అక్కడుండడు గదా అని సరిపెట్టుకున్నాడు.

కానీ తనక్కడకు వచ్చిన ఏడో రోజున — పంతులు కొడుక్కు తనింటికి వెళ్ళిపోవాలని చెప్పాడు. మార్కం దేయులు మనసులో సంతోషించాడు.

అయితే తర్వాతి మాటగా పంతులు- కృష్ణవేణమ్మనూ, కూతుర్నీ కూడా తీసుకుపోతాననడంతో అతను దెబ్బ తిన్నాడు. ప్రశ్నార్థకంగా తల్లివంక చూస్తేఆవిడ తలవంచుకుని-" ఆ ఇంటికి నా అవసరం చాలా ఉందిరా – పిల్లల కేమీ చేతకావడంలేదు – నేను వెళ్ళి తీరాలి !" అంది.

"మరి నా సంగతి ... " అన్నాడు మార్కండేయులు ఉక్రోషంగా.

"ఎంత-రెండు మూడు నెలలు ఓపిక పట్టావంటే – నీ సంగతి శాశ్వతంగా చూసుకొనే మనిషి రావడానికి ఏర్పాట్లు జరిగిపోతున్నాయి ... " అంది కృష్ణవేణమ్మ.

మార్కండేయులు తల్లిని చాటుగా తీసుకువెళ్ళి - "నా అభిప్రాయాన్ని నువ్వు సరిగ్గా అర్థంచేసుకోలేదు కొంత కాలమైనా నువ్వు సుఖపడతావని నేను నిన్ను ఇక్కడికి తీసుకొచ్చాను. అక్కడ కెడితే నీ కేముంది - కర్రల మీద వంట - క్షణం తీరికలేకుండా పని - ప్రతిఫలంగా ప్రతిరోజూ చీవాట్లూ, చెప్పుదెబ్బలూ..." అన్నాడు దీనంగా.

కృష్ణవేణమ్మ ఆశ్చర్యపోతున్నట్లు కొడుకువంక చూసి - "అదేం నాకు కొత్తకాదుగదా - ముప్పై ఏళ్ళుగా ఆ ఇంట్లో కాపురం చేస్తున్నాను. అక్కడ నాకు కష్టమేమిటి ?" అంది.

మార్కండేయు లావిడ మాటలు సరిగా వినలేదు. "నాన్నగారికి భయపడి నువ్వీ ప్రయాణం చేయనక్కరలేదు. నే నాయనకు నచ్చజెప్పగలను. కనీసం నువ్వు ఇక్కడ మరో నాలుగైదు నెలలైనా ఉండి వెళ్ళు."

"ఆయనకు నేను భయపడడ మేమిటిరా ?" అంది కృష్ణవేణమ్మ నవ్వుతూ – "అది నా ఇల్లు – దాన్ని చూసుకోవడం నా బాధ్యత. ఇప్పటికే ఆలస్యమైపోయింది. మరి నేను వెళ్ళి తీరాలి..."

తల్లి నాపడం తనవల్లకాదని అర్థమైన మార్కండేయులికి ఉక్రోషం వచ్చి – "సరేలే – ఎవరి ఖర్మ కెవరు కర్తలు ? ఆయనచేత చీవాట్లు తింటూ - ఆనం దంతో ఉండడమే మంచిదనుకుంటే అలాగే చేయి..." అన్నాడు.

కృష్ణవేణమ్మ చురుగ్గా కొడుకువైపు చూసింది – మాటిమాటికీ ఆయన్నాడి పోసుకుంటున్నావు. ఆయన నీకు చేసిన అపకార మేమిటి ? నువ్వేకాదు - మీ అన్నయ్యలూ అంతే – ఇంట్లో పిల్ల లంతా అంతే ! మరయితే ఆయన రెక్కలు ముక్కలుచేసుకొని కష్టపడు తున్న దెవరికోసమనుకుంటున్నావ్ ? మీ అందరికీ ఏ లోటూ రాకుండా పెద్ద చదువులు చెప్పించారు. మీరంతా వృద్ధి లోకి రావాలనే ఆయన కష్టపడు తున్నారు. ఆయన జీవితంలో సుఖపడిం

దేమిటో నువ్వే చెప్పు — ఎప్పుడైనా తాగుడుకు వెళ్లేరా- స్వచ్ఛమైన జీవితం గడిపేరు - మీరేమో హాయిగా పట్న వాసాల్లో ఉంటూ — అక్కడి సౌఖ్యా లన్నీ అనుభవిస్తూంటే ఆయన తన జీవితాన్ని పల్లెకు అంకితంచేసి—మీ భవి ష్యత్తుకు బంగారుబాట వేసుకున్నారు — ఆయనకు మీరేమీ చేయనక్కర్లేదు — కనీసం ఒక మంచి మాటాడితే చాలు— కానీ అదీ ప్రాప్తంలేదు ... " ఆవిడ కంఠంలో ఆవేశముంది.

మార్కండేయులు ఆశ్చర్యంగా తల్లివంక చూశాడు. ఆవిడ చెప్పే మాటలు కొంతవరకూ ఆతన్నాలోచింప జేశాయి. తనింతకాలమూ తండ్రి ప్రవ ర్తన గురించే ఆలోచిస్తున్నాడు కానీ ఆయన తనకు చేసిన ఉపకారం గురించి ఆలోచించడంలేదు. ఆయన శ్రమపడి తేనేగదా - తను చదువుకోగలిగాడు ! అయితే మనిషికి కావలసింది ఉపకార మొక్కటేనా ?

అతను మళ్ళీ తల్లితో కాస్త ఆవేశం గానే అన్నాడు - "అమ్మా ! నాన్నగారి పట్ల నా కేమీ ద్వేషభావం లేదు. ఆయన త్యాగాన్ని నే నెప్పుడో గుర్తించాను. కానీ భార్యకు భర్తగా ఒక ప్రేమ వాక్కు, ఒక కొడుక్కు తండ్రిగా అనురాగాప్యాయాలు-ఆయన ఎన్నడూ చూపించలేదు. మనం జంతువులం కాదమ్మా-కాస్త గడ్డివేయగానే తృప్తిగా తలాడించడానికి - మనుషులం !"

కృష్ణవేణమ్మ ఈసారి మరి కాస్త ఆవేశపడింది - "ఏమిట్రా ప్రేమంటే నీ ఉద్దేశ్యం ! చెట్టాపట్టాలు వేసుకుని రోడ్లమీద గంతులేయాలా — కొడుకుని భుజం మీకెక్కించుకుని తిరగాలా - ప్రేమ నర్థంచేసుకొందు కూడా హృదయ ముండాలి - మండే సూర్యుం డిలో మంటలనే చూడగలరు మీరు — చెట్లకు పచ్చదనాన్నిచ్చే శక్తిని మీరు చూడలేరు..."

మార్కండేయు లులిక్కిపడ్డాడు - తల్లి ఏమందో అతనికి అర్థమయింది. అందులో కొంత నిజముందేమో నని పించింది కానీ — తండ్రి సూర్యుడే అయినా — మనుషు చెట్లలా ఉండ లేరని అతనికి తోచింది. ఏదేమైనా తల్లికి తండ్రిమీద చాలా అనురాగ ముర్నదనీ ఆయన్నేమీ అననివ్వదనీ ప్రస్తుతం తనావిడ నాపలేడని అతనికి తెలిసిపోయింది. అతను మారుమాట్లాడ కుండా తక్షణం వాళ్ళగురించి ప్రయా ణపు ఏర్పాట్లు చేశాడు, పంతులు కోరిక మేరకు - మర్నాటికే రిజర్వేషన్ దొరి కింది. వెళ్లేముందు పంతులు కృష్ణవేణమ్మ ద్వారా — మార్కండేయులుకు అయిదు వంద లిప్పించాడు.

"ఇంకా కొత్తగా ఉద్యోగంలో జేరాడు. అప్పుడే మనం వాడి నెత్తిమీద కెక్కేశాం — ఏం ఖర్చులుంటాయో ఏమో - తర్వాతెలాగ అవసరమైతే

మనకు సాయపడతాడు—" అని ఆ డబ్బు నాయన ఇచ్చాడట. నిజంగానే మార్కండేయులికి కాస్త డబ్బు అవసరం కనబడుతోంది. అయితే పై నెల జీతం అందగానే సర్దుబాటవుతుందిగదా అని అనుకుంటున్నాడు — అంబదువందలూ అతను తీసుకున్నా ఆ డబ్బు తర్వాత తండ్రికి పంపించేయదల్చుకున్నాడు. తనకు ముగ్గురు చెల్లెళ్ళున్నారు — వాళ్ళ పెళ్ళిళ్ళకు తనూ తండ్రికి సహాయం చేయాలి !

తలిదండ్రుల్ని, చెల్లెల్ని — ట్రెయినెక్కించి వచ్చేశాక ఇల్లు చిన్నబోయినట్లు తోచింది మార్కండేయులికి. తండ్రి ప్రవర్తనకంటె కూడా తల్లి ప్రవర్తన విపరీతంగా తోచిందతనికి.

తర్వాత వారంరోజులు గడవకుండా అతనికి అన్నలిద్దరి దగ్గర్నుంచీ ఉత్తరాలు వచ్చాయి — రెండింట్లోనూ, ఇంచుమించు ఒకటే సారాంశం — "నువ్వు అమ్మను తీసుకెళ్ళినందుకు సంతోషంగా ఉంది — కానీ ఈపాటికి నాన్నగారు వచ్చి ఆవిణ్ణి తీసుకెళ్ళి ఉంటారని కూడా అనుకుంటున్నాం. మేమూ అమ్మని తీసుకెళ్ళి సుఖపెట్టాలని ప్రయత్నించాం. కానీ ఎన్ని తిట్టినా నాన్నగారావిణ్ణి వదిలి ఉండలేరు. అమ్మకాయన్ని వదిలిపెట్టడం ఇష్టముండదు. వాళ్ళజీవితాల గ్రామంలో గడిచిపోవలసిందే..."

హఠాత్తుగా మార్కండేయులికి అర్థమైంది. తనకు మైసూర్‌పాకు సహించదు. ప్రపంచంలో మైసూర్‌పాకు సహించని వాళ్ళుంటారా అని ఆశ్చర్యపడే వాళ్ళనేకు లున్నారు. రుచినిబట్టి పదార్థ వైశిష్ట్యాన్ని నిర్ణయించకూడదు. ప్రేమ భౌతికంకాదు. కేవలం మనిషి ప్రవర్తననుబట్టి ప్రేమను అంచనా వేయకూడదు.

విసుక్కుంటూనే తండ్రి వ్యవసాయం చేస్తున్నాడు. కానీ ఆయనా వృత్తిని వదిలిపెట్టడు. స్వగ్రామాన్ని, భార్యనూ ఆయన తిడుతూంటాడు. కానీ వదిలిపెట్టి ఉండలేడు. తన తలిదండ్రుల్ని నిందిస్తాడు. కానీ యధావిధిగా వాళ్ళకు తద్దినాలు పెడతాడు. పిల్లల్నెప్పుడూ విసుక్కుంటున్నట్లు కనబడతాడు. కానీ తన శ్రమ ఫలితాన్ని వాళ్ళ అభివృద్ధికోసమే ఖర్చు చేస్తాడు !

తల్లి నాయన ప్రేమగా పలకరించడం సంగతటుంచి పదిమంది ముందూ తీసిపారేయడమే అతనికి తెలిసినది — కానీ సూర్యుడి ఎండను ప్రేమించే పచ్చని చెట్టులా తల్లి ఆయన్ను ప్రేమిస్తోంది. తండ్రి కూడా ఆవిడను ప్రేమిస్తున్నాడు.

"ఇంతకాలం నాకు తెలియక మరోలా అనుకున్నాను — ఇదీ ఒక ప్రేమ కథే !" అనుకున్నాడు మార్కండేయులు.



# ఓటు వేట

ఎస్. పురుషోత్తమాచార్య

బొంబాయి మహానగరం! అద్దె కొంపల్లో నివసించే జనాభా పాలిట మహానరకం. విలాసాలకూ, వినోదాలకూ, కలతలకూ, కలహాలకూ కాణాచి.

అది ఓ మిట్ట మధ్యాహ్నం.

మెరైన్ డ్రైవ్ పైనుంచి ఖరీదయిన సముద్రపవనాలు వేడిగా వీస్తోన్నాయి. వాతావరణంలో దుమ్మూ ధూళీ మిళితమై పోయి మానవుని ఆయుఃపరిమితిని అవనతం చేస్తోన్నాయి.

పదవ అంతస్థులో తమ గృహ మన బడే ఒకే ఒక గదిలోని వాలుకుర్చీలో చేరగిలబడిపోయి దినపత్రికలో లీనమై ఉన్నారు గృహస్థు ఆచారిగారు. వారి గృహిణి వారి ఎదటే నేలపై చతికిలబడి పోయి ఆ నగరంలో అతికష్టంగా లభ్య మయ్యే రాళ్ళలోని బియ్యాన్ని ఓపిగ్గా ఏరుతోంది.

"ఆచారీ సాబ్, నమస్తే!" సహో ద్యోగి దేశ్‌పాండే కంఠస్వరాన్ని గుర్తించి లేచి వెళ్లి అతన్ని లోనికి ఆహ్వానించేరు ఆచారిగారు.

"మీ ప్రక్క పోర్షను ఖాళీగా ఉందని తెలిసి యిలా వచ్చేను" అంటూ కూచున్నాడు దేశ్‌పాండే.

చాలాకాలంగా ఆ భవనంలో ఉంటూన్న ఆచారిగారిపై ఓనర్ కుందన్‌లాల్‌కి చాలా నమ్మకం ఉంది. ప్రక్క పోర్షను ఖాళీ అవటంతోనే దానికోసం ఎవరేనా వస్తే చూపించండంటూ తాళం చెవిని ఆచారిగారి కిచ్చి వెళ్లేడతను.

ఉదయంనుంచీ ఏ పదిమందో వచ్చి వెళ్ళారా యింటికి. కొందరికి అద్దె నచ్చ లేదు. మరికొందరికి 'పగిడీ' (తిరిగి రాని అడ్వాన్సు) నచ్చలేదు. యింకా కొందరికి గదిలోని సౌకర్యాలు బావో లేవు. దాంతో ఆ మహానగరంలో చూపరులకి ఆశ్చర్యం గొలిపేలా ఆ పోర్షనలా దాదాపు ఓ పదిగంటలపాటు ఖాళీగా ఉండిపోయింది.

ఆ భవనంలో ఉన్న నూటయిరవై కుటుంబాల్లోనూ తెలుగువారివి రెండే రెండు. గ్రౌండ్‌ఫ్లోరులో సత్యనారాయణ గారనే వారొహరూ, పైన పదో అంతస్తులో ఆచారిగారూనూ, కాపరాలు చేస్తోన్నారు. ఆ రెండు కుటుంబాల్నీ రోజుకోసారేనా కలుపుతూ ఉంటుం దా భవనంలోని ఏకైక పుష్పక విమానం. చాలాకాలంగా అరమరికలు లేకుండా సాగివస్తోంది వారి మధ్యనున్న మంచి స్నేహం.

లోకాభిరామాయణం పూర్తయ్యాక దేశ్‌పాండేకి గదిని చూపించేరు ఆచారిగారు. కాని అతను పెదవిని విరవ టాన్ని గమనించే రాయన. వారికి మాత్రం తెలిసిన ఈ వ్యక్తి పొరుగున ఉంటే తమ కుటుంబాని కెంతో సహ కారంగా ఉంటుందన్న అభిప్రాయం ఏర్పడింది. దాంతో దేశ్‌పాండే సూచనని అంగీకరించేరాయన.

దేశ్‌పాండే దృష్టిలో మరెక్కడో ఓ పోర్షను ఖాళీగా ఉంటంతో అతను వెళ్ళి దాన్నికూడా చూసి ఈ రెండిట్లలో ఏదో ఒకటి నిర్ణయించుకోవటానికి కాస్త సమయం కావలసి వచ్చింది. ఆ సమయాన్ని ఆచారిగారు సమకూర్చేరు. యిహ ఆ తర్వాత ఆ పోర్షన్‌ని చూడ వచ్చిన ప్రతివ్యక్తికీ యిల్లు బుక్కయి పోయిందంటూ చెబుతూ వచ్చేరాయన.

సాయంకాలం ఏడయింది. గ్రౌండ్ ఫ్లోరునుంచి సత్యనారాయణగారు పైకి వచ్చేరు. ఆచారిగారి గదిలోకి అడుగు వేసిన వారివెంటే మరో క్రొత్తవ్యక్తి ఉంటంతో వారిని సాదరంగా ఆహ్వానిం చేరు ఆచారిగారు.

"ఆచారిగారూ! వీరు రాజుగారని. గోద్రెజ్‌లో ఫోర్‌మన్‌గా ఉంటున్నారట. మీ ప్రక్క పోర్షన్ ఖాళీగా ఉందని తెలిసి యిలా వచ్చేరు. వారి శ్రీమతి క్రింద మనింట్లోనే ఉన్నారు." సత్య నారాయణగారి పలుకుల్ని వింటూనే ఆచారిగారి కళ్ళల్లో ఆనందం తొణికిస

లాడింది. ఆ రోజుని పర్వదినంగా భావించేరాయన. తెలుగువాళ్ళకీ, తెలుగు వాతావరణానికీ మొహం వాచిపోయిన వారు ప్రక్క-పోర్షనులోకి తెలుగు వాళ్ళొచ్చే అవకాశం కనిపించగానే సంతోషపడిపోయేరు. గబగబా వెళ్ళి ఆ పోర్షన్ తలుపుని తెరిచేరాయన.

కాని గదితాళం తీస్తున్న సమయం లోనే ఆచారిగారికి దేశ్‌పాండే జ్ఞాపకం వచ్చేడు. వెంటనే వారి ముఖకవళికలు మారిపోయేయి.

"కాని సత్యంగారూ ! యిక్కడో చిక్కొచ్చిపడిందండీ ! ఈ మధ్యాహ్నమే మా కొలీగ్ ఒకతను, మరాఠీ లెండి, వచ్చి ఇల్లు చూసుకుని సాయంకాలాని కల్లా కుందన్‌లాల్‌కి ఎడ్వాన్సు యిచ్చి మరీ వస్తా నన్నాడు. కాని అతని దృష్టిలో మరో యిల్లుందనే అన్నాడు లెండి ! అయినా ఏదీ ? యింతవరకూ రాలేదు. మరి ఏంచేద్దామంటారు ?" అన్నారు ఆచారిగారు.

"వచ్చే వాడవుతే ఈపాటి కెపుడో రావాలి కదండీ ? ఆ రెండో యిల్లేదో అతని దృష్టిలో ఉందంటున్నారుగా ? దాన్నే సెటిల్ చేసుకుని ఉండచ్చు. ముందసలు రాజుగారిని యిల్లు చూడ నివ్వండీ !" అంటూ గుమ్మంలోనుంచి ప్రక్కకి తప్పుకున్నారు సత్యనారాయణ గారు.

రాజుగారు పోర్షన్‌ని చూస్తూన్న సమయంలోనే పుష్పకవిమానం కాస్తా పైకి వచ్చి ఆగిపోయింది. గది గడపలో కాలుంచిన దేశ్‌పాండేని చూడటంతో ఆచారిగారి వదనం ఆరిపోయింది. అయినా లేని నవ్వుని తెచ్చిపెట్టుకున్నారాయన.

"హలో పాండే ! ఏవయింది ? నీవు వేరే యిల్లు కుదుర్చుకున్నావా ? లేక కుందన్‌లాల్‌ని కలుసుకున్నావా ? నీకు చెప్పానుగా ? త్వరగా రమ్మనీ ! యిదో యిపుడే వీళ్లొస్తే ... " అంటూన్న ఆచారిగారిని మధ్యలోనే త్రుంచేసేడు దేశ్‌పాండే.

"ఆ వేరే యిల్లు విషయం సెటిలవ లేదు సాబ్‌జీ ! వెంటనే కుందన్‌లా లింటికి పరిగెత్తేను. కాని అతనింట్లోలేడు. ప్లీజ్ ! వాళ్ళతో చెప్పెయ్యండి ! నేనే వస్తా నీ యింట్లోకి." కంగారుగా పలికే డతను

వారిని గుమ్మంలో చూసిన సత్యనారాయణగారు కాస్తా విషయాన్ని గ్రహించి చరచరా వచ్చేరు. ఆచారి గారితో తెలుగులో పలికే రాయన.

"తను రావటానికి ఆలస్యం అయిం దనీ, ఈలోగానే రాజు గారొచ్చి యిల్లు చూసుకుని యింటతనికి డబ్బిచ్చి యిల్లు కుదుర్చుకుని వచ్చేరని చెప్పండి ! తెలుగాళ్ళకి మన మీమాత్రం చేయక పోతే ఎలాగండీ ?" అన్నారాయన.

ఆచారిగారు యిరకాటంలో పడి

పోయేరు. వారికికూడా దేశ్‌పాండేకి బదులు యిప్పుడా యింట్లోకి రాజుగారొస్తేనే బావుంటుందనే బలమైన అభిప్రాయం ఏర్పడిపోయింది. దాంతో గొంతులో వెలక్కాయ పడినట్లున్నప్పటికీ సర్దుకుని పలికేరాయన.

"సారీ పాండే! ఈయనగారు వెళ్ళి కుందన్‌లాల్‌కి అడ్వాన్సు యిచ్చే వచ్చేరట! యిల్లు కడిగించేసి రేపుదయాన్నే మారిపోయే ఆలోచనలో ఉన్నారట! నీ వనవసరంగా ఆలస్యం చేసేవు" అన్నారాయన.

దేశ్‌పాండే ఆ ముగ్గురివంకా అదోలా చూసేడు. పెదవిని విరుస్తూ వెకక్కిఆడుగువేసే డతను.

"సారీ ఫ్రెండ్స్! మీ కనవసరంగా యిబ్బందిని కలిగించేను. సో సారీ! గుడ్‌నైట్!" అంటూ లిఫ్ట్‌వంక నడిచే డతను.

అతనివంకే, చూస్తున్న ఆ ముగ్గురూ లిఫ్ట్ తలుపు మూసుకుని కనుమరుగయిపోవటంతోనే తేలిగ్గా ఊపిరి పీల్చుకోగలిగేరు.

"అయితే యింకేం సార్! యిల్లు కడిగించేద్దాం. ఈ రాత్రే మారిపోతాము. యిహ యింకా ఆ హోటల్లో ఉంటం ఎందుకు?" అంటూ సత్యనారాయణగారివంక సాభిప్రాయంగా చూసేరు రాజుగారు.

ఆచారిగారుమాత్రం క్షణం ఆలోచించేరు.

"రాజుగారూ! ముందు మీరెళ్ళి కుందన్‌లాల్‌కి అడ్వాన్సిచ్చి రాకూడదుటండీ?" అన్నారాయన సాలోచనగా.

"ఆచారిగారూ! భలేవారండీ మీరూ! మళ్ళీ ఆ దేశ్‌పాండే ఏదో చేయగలడనే భయ ఉన్నట్లుంది మీకు! మీ రెలాగూ చెప్పారుగా? అతని దృష్టిలో మరో యిల్లుందనీ, యిది కుదరలేదని తెలిసి. యిపు డక్కడికి పరిగెత్తుంటా డతను. ఫరవాలేదు, ఉదయమే వెళ్లి యింటాడికి ఎడ్వాన్సిచ్చి రావచ్చును లెండి! ముందు వీరిని యిల్లదీ శుభ్రంచేసుకోనివ్వండి!" అన్నారు సత్యనారాయణగారు.

రాజుగారు క్రిందికి వెళ్లి తమ యింటావిడతోనూ, సత్యనారాయణగారి భార్యతోనూ పైకి వచ్చేరు.

ముగ్గు రాడాళ్లూ కలిసి యిల్లంతా కడిగి శుభ్రంచేసేసరికల్లా రాత్రి తొమ్మిదయిపోయింది.

రాజుగారు కాస్త వరండాలోకి వచ్చి హోటల్ కెళ్లి తమ సామాన్లను తెచ్చుకోవటాని కుద్యుక్తులయ్యేరు.

ఈలోగా కాఫీలు తీసుకుని వెళ్ళండంటూ కేకేసేరు ఆచారిగారి సతీమణి.

అంతా ఆచారిగారి గదిలో కూచుని కాఫీలు తీసుకుంటున్న సమయంలో వాకిలిముందు కాస అలికిడి వినిపిం




చటంతో తలెత్తేరు ఆచారిగారు. గదపలో నుంచుని ఉన్న దేశ్‌పాండేని చూడటంతోనే వారి మొహం వెలవెలా బోయింది.

"చూడండి ఆచారి సాబ్ ! మీ ఫ్రెండ్ ఎలా చెప్పారో మరి ? నేను యిక్కణ్ణుంచి సరాసరి కుందన్‌లాలింటికి వెళ్ళి వాకబు చేసేను. అతను తన వద్ద కీ ఉదయంనుంచీ ఎవరూ రాలేదనీ, తన కెవరూ అడ్వాన్సు యివ్వలేదనీ చెప్పేడు. దాంతో నే నతనికి వెంటనే అడ్వాన్స్‌ని ముట్టచెప్పి యిలా వచ్చేను. దయతో గది తాళంచెవి నిస్తారా ?"

దేశ్‌పాండే పలుకుల్ని వినటంతోనే ఆచారిగారికి మతిపోయినట్లనిపించింది. రాజుగారికి మొహంలో కత్తివాటుకి నెత్తురుచుక్క లేకుండాపోయింది. సత్యనారాయణగారు నేల చూపులు చూడసాగేరు.

దేశ్‌పాండేకి సమాధానం ఏం చెప్పాలో తోచక రాజుగారివంక చూచేరు ఆచారిగారు.

రాజుగారు నిట్టూరుస్తూ శుష్కమందహాసం చేసేరు

"తాళంచెవి నతని కిచ్చేయండి సార్ ! మీరు చెప్పినమాట విని ఉంటే విషయమసలు యిందాకా వచ్చేదేకాదు. అతనికంటే ముందు నేనే అక్కడికి వెళ్ళుంటే ఈ యిబ్బంది కలిగేదే కాదు. అతను యిక్కణ్ణుంచే నేరుగా అక్కడికి వెళ్లుంటా డనేదిమాత్రం శుద్ధ అబద్ధం. ఆ రెండో యిల్లేదో కుదరని పక్షంలోనే అక్కడికి వెళ్ళుంటాడు. అతనికి సమయాన్ని మనమే ధారపోసేము. అయినా

ఏంచేస్తాం ? దేనికయినా యోగం ఉండాలి మరి ?"

ఆచారిగారు నీరసంగా లేచివెళ్లి తాళంచెవిని తెచ్చి దేశ్‌పాండేకి అందించేరు. కాని సూటిగా అతడివంక చూడలేకపోయే రాయన.

మర్నాటి సాయంకాలమే దేశ్‌పాండే కుటుంబం కాస్తా ఆ యింట్లోకి మారిపోయింది.

ఎనిమిది ప్రాంతంలో తమ వాటాలోకి అడుగువేసిన దేశ్‌పాండేని చూసి తలొంచుకున్నారు ఆచారిగారు.

"ఆచారీ సాబ్ ! యిందులో మీరు సిగ్గుపడవలసిం దేమీలేదు. మీ దోషం ఎంతమాత్రమూ లేదన్న విషయాన్ని నేను బాగా ఎరుగుదును. నేను రాగానే నన్ను మీరు మామూలుగానే పలకరించేరు. కాని ఈలోగానే ఆయ నెవరో వచ్చి మీ కేదో చెప్పటంతోనే మీ ధోరణి మారిపోయింది. నాకు మీ భాష రాకపోయినా భావంమాత్రం ఆ క్షణంలోనే బోధపడిపోయింది.

"అందుకే నేరుగా కుందన్‌లా లింటికి పరిగెత్తేను. కాని ... " ఆగిపోయేడు దేశ్‌పాండే.

వింటూన్న ఆచారిగారుమాత్రం తలని పైకెత్తలేకపోయేరు.

"కాని ఆచారి సాబ్ ! అసలు విషయాన్ని మీ కిపుడు చెబుతున్నాను. అన్యథా భావించకండి. కూటికోసం కోటి విద్యలన్నా రెవరో ! కాని నేను కొంపకోసం కోటి వేషాలంటాను. మీ ముందు నేను నటించటానికి నానా యిబ్బంది పడవలసివచ్చింది. నే నిక్కణ్ణుంచి వెళ్ళేసరికి కూడా కుందన్‌లాల్ యింకా తన యిల్లు చేరలేదు. వాడి యింట్లో వాకబుచేస్తే ఈ యింటిని గురించి ఎవరూ వచ్చి వెళ్ళలేదని తెలిసింది. దాంతో నా అనుమానం బలపడిపోయింది. తప్పనిసరిఅయిన పక్షంలో మళ్ళీ వెనక్కి తిరిగి యిక్కడికి వచ్చేను. కుందన్‌లాల్‌కి అడ్వాన్సు యిచ్చి వచ్చానని అబద్ధంచెప్పి మీ నుంచి తాళంచెవిని తీసుకున్నాను. కాని కుందన్‌లాల్‌ని కలుసుకున్నదీ, పగిడీ చెల్లించిందీ మాత్రం ఈ ఉదయమే ! మీరు కూడా నా ఎత్తుకు పైఎత్తుగా కుందన్‌లా లింటికి రాత్రే వెళ్ళుంటే నా నాటకం ఎపుడో బయటపడిపోయేది. హెన్స్, ఫర్‌గెట్ ది ఈవెంట్ ! లెట్స్ లివ్ హేపీలీ !" అంటూ ఆచారిగారి చేతి నందుకున్నాడు దేశ్‌పాండే.





# చేదు

## అదృష్టదీపక్

ఆకాశాన్ని నేలమీద పరిచినట్టుగా ఉంది సముద్రం. బీచ్‌లో కూర్చున్న మనుషుల ఆలోచనల్ని పక్కదారి పట్టించాలని రణగొణధ్వని చేస్తోంది సముద్రం. కాని ఈ హోరు నన్నేమీ చేయలేకపోతోంది.

"ఏమిటి ? ఏదో ఆలోచిస్తున్నట్టున్నావ్ !" నీలవేణి అడిగింది. ఒక్క క్షణం ఆమె తెల్లని పలువరుసలో తన అందాన్ని చూసుకొని మురిసిపోయింది వెన్నెల.

"అబ్బే - ఏం లేదు !"

నా గొంతు నాకే ఎంతో అసహజంగా అనిపించింది. గుండెలో సుళ్ళు తిరుగుతున్న నిప్పుల ఉప్పెనను మాటల్లోకి అనువదించాలని యిందాకటినుంచి ప్రయత్నిస్తున్నాను. ఇంక ఆలస్యం చెయ్యగూడదు, అడిగెయ్యాలి !

ఏడుస్తున్న పిల్లవాడి నోరు బల వంతంగా ఎవరో నొక్కేసినట్లు సముద్రం తన ఘోషను మధ్య మధ్యలో హఠాత్తుగా ఆపేస్తోంది. రెండు క్షణాల నిశ్శబ్దం అనంతరం మళ్ళీ మామూలుగా హోరు మొదలవుతుంది. దారాన్ని తెంపి నట్టుగా హోరుని మధ్యలో కట్ చేసే ఆ నిశ్శబ్దం అంటే నాకు చాలా భయం. అది తెలియకుండానే నాలో వణుకు పుట్టిస్తుంది. ఆ నిశ్శబ్దం బ్రతికేది రెండు మూడు క్షణాలే అయినా పదునైన బ్లేడులా నా ఆలోచనల్ని కోసేస్తోంది. అలాంటి నిశ్శబ్దం మనిషిరూపం ధరించి నా పక్కనే కూర్చున్నట్టుగా ఉంది నీలవేణి.

ఎలాగో కొంత సేపటికి నా గొంతు ముడి విప్పుకొన్నాను.

"నీలూ !" ఏమిటన్నట్టుగా నావైపు చూసింది.

"మన మధ్య ఉన్న ఇంటిమెసీతో ఒక విషయం అడుగుతాను. నిజం చెబుతావా ?"

"యస్ ! తప్పకుండా అడుగు."

"నువ్వు సుఖంగానే బ్రతుకు తున్నావా ?"

"అంటే ?" ఆశ్చర్యంగా చూసింది.

"అహఁ... ఏం లేదు. నువ్వూ చిట్టి బాబూ ఏ విధమైన గొడవలూ పెట్టు కోకుండా సుఖంగా సంసారం సాగిస్తు న్నారా ?" నా ప్రశ్నకు జవాబుగా పెద్దగా నవ్వడం మొదలెట్టింది నీలవేణి. ఒకదానిమీద ఒకటిగా వచ్చిపడుతున్న కెరటాల్లా చాలసేపు విరగబడి నవ్వింది.

"యిలాంటి సీరియస్ జోకులు ఎప్పుడు నేర్చావు మహానుభావా ? ఏదో గొప్ప విషయం అడుగుతావనుకున్నాను. తీరా చూస్తే యిదా ? కొంపతీసి నువ్వు కొత్తగా రాయబోయే కథలోని డైలా గులు నాకు అప్పగించడం లేదుకదా ? అసలు మా మధ్య కలతలు వస్తాయని నువ్వెలా అనుకున్నావు ? చిట్టిబాబు నన్ను ఎంతగా ప్రేమిస్తాడో నీకు తెలీదూ ?"

మళ్ళీ సముద్రం హోరు ఠక్మని ఆగింది.

నేను భరించలేని నిశ్శబ్దం నన్ను తినెయ్యడం మొదలెట్టింది. నీలవేణి చాలా అందమైన అబద్ధం చెప్పి నన్ను నమ్మించాలని చూస్తోంది.

తిరిగి హోరు మొదలయింది. నేను కొంచెం ఊపిరి పీల్చుకున్నాను.

"అయితే నువ్వు చేస్తున్న ఉద్యోగం హఠాత్తుగా ఎందుకు మానేశావ్ ?"

"అదా ! ముందు కాలక్షేపం కోస మని చేరాను. కాని దానివల్ల నాకు ఏ విధమైన తృప్తీ లభించలేదు. చిట్టిబాబు ఆఫీసునుంచి వచ్చే టైముకే సరిగ్గా నేనూ యింటికి చేరుకునేదాన్ని. వచ్చిన వెంటనే నేను వంటగదిలో ప్రవేశిం చడం ఉదయం కూడా అంతే. హడా

వుడిగా యింటిపనులు చక్కబెట్టుకుని ఎవరి ఆఫీసుకు వాళ్ళు పరుగెత్తడం ! జీవితంలో ఉండవలసిన థ్రిల్ నశించి పోతుందేమో అనిపించింది. ఇద్దరం కూడా యాంత్రికంగా తయారయ్యాం. కాస్సేపు సాయంత్రం ఏ బీచ్ వైపో రావాలన్నా, కులాసాగా కబుర్లు చెప్పుకోవాలన్నా కుదిరేది కాదు. అందుకే విసుగెత్తి నేను ఉద్యోగం మానేశాను. అదీ గాక మాకు ఆర్థిక ఇబ్బంది కూడా ఏదీ లేదు గదా ! మాకు ఇద్దరు పిల్లలు పుట్టినా చిట్టిబాబు సంపాదనతో హాయిగా బ్రతికెయ్యగలం !"

"నిజమే ననుకో ! పోనీ ఉద్యోగం మానుకునే బదులు యింటిపనికీ, వంట పనికీ ఓ పనిమనిషిని పెట్టుకుంటే సరిపోను గదా !"

"అబ్బబ్బ ! నీ ప్రశ్నలతో నన్ను చంపుతున్నా వనుకో ! అసలు నువ్వు యిన్ని కథలూ, కవిత్వమూ ఎలా రాస్తున్నావో నాకు తెలియడంలేదు. జీవితంలో కొన్ని అనుభూతులు వ్యక్తీకరించడానికి మాటలు దొరకవు. స్త్రీ జీవితంలో తను స్వయంగా వండి భర్తకు పెట్టడంద్వారా చాలా ఆనందాన్ని పొందుతుంది. అలాగే యిల్లు చక్కబెట్టుకోవడంలో కూడా ! ఈ విషయం ఇంతకంటె వివరంగానూ, అందంగానూ చెప్పడం నాకు రాదు !"

నీలవేణి చెప్పడం ఆపుజేసింది. వెన్నెల్లో ఆమె కళ్ళు మిలమిలా మెరుస్తున్నాయి. ఆమె కళ్ళలో వెలుగుతున్న ఆనందాన్ని నేను స్పష్టంగానే చదవగలుగుతున్నాను. అయినా నా బుర్ర చిక్కులుపడ్డ దారంలా తయారయింది. ఆ రోజు సుబ్బరాజు చెప్పినదంతా వట్టిదేనా ? అలా ఎందుకు చెప్పాడు ? కాదు - వాడికి అబద్ధం చెప్పవలసిన అవసరమేమిటి ? నిజమే అయి ఉంటుంది !

* * *

"నిజం గురూ ! నీలవేణి జీవితం సర్వనాశనమైపోయింది. చిట్టిబాబుగాడు వట్టి అనుమానాల పుట్టలా తయారయ్యాడట ! నీలవేణి స్వభావం నీకు తెలుసుగదా ! తన చుట్టూ ఉన్న నలుగురినీ నవ్విస్తూ, ఎప్పుడూ నవ్వుతూ తిరిగే మనిషి. తను పనిచేసే ఆఫీసులో అందరితోనూ సోషల్‌గా కలిసి మెలిసి తిరుగుతుంటే వీడు సహించలేక చాలా రకాలుగా హింసించడం ప్రారంభించాడట ! వాడి పోరుపడలేక ఉద్యోగం మానేసి యింట్లోనే కూర్చున్నా రకరకాల అనుమానాలతో ఎన్నో బాధలు పెడుతున్నాడట !"

"ఈ విషయాలన్నీ నీ కెలా తెలిశాయి ?"

సుబ్బరాజు మాటలకు మధ్యలో బ్రేక్ వేస్తూ అడిగాను.

"నీలవేణి నేటివ్ గుంటూరే కదా !

తన విషయాలన్నీ ఎప్పటికప్పుడు తెలుస్తూనే వుంటాయి. కూతురు బ్రతుకిట్లా కాలిపోయిందని వాళ్ళమ్మగారు బెంగతో మంచం పట్టేసింది. ఆవిడను చూడలేక ఈ మధ్య కనిపించడం కూడా మానేసాను. దేవతలాంటి నీలవేణిని ఆ అనుమానాల రాక్షసుడు నంజుకుని తినేస్తున్నాడు గురూ !"

సుబ్బరాజు మాటలు నా గుండెను పిండేస్తున్నాయి. ఆ క్షణంలో ఏడవడం లేదుగానీ వాడి కళ్ళల్లో ప్రపంచం లోని విషాదమంతా పేరుకుపోయిన ట్టున్నాడు. మేం ప్రయాణం చేస్తున్న రైలు పట్టాలు తప్పించుకుని నా మెదడులోంచి దూసుకుపోతున్నట్టుంది.

చదువుకునే రోజుల్లో సుబ్బరాజు నీలవేణిని విపరీతంగా ప్రేమించాడు. ఆమె చిట్టిబాబుని ప్రేమించి పెళ్ళిచేసుకుంది. చిట్టిబాబు కూడా మా క్లాస్‌మేటే! చాలా రిజర్వ్‌డ్‌గా, హుందాగా ఉండే చిట్టిబాబు పెళ్ళయ్యాక ఇంత పాశవికంగా మారాడన్నమాట ! నీలవేణి సుబ్బరాజుని చేసుకున్నా సుఖంగా బ్రతుకును. చేతులారా జీవితాన్ని నాశనం చేసుకుంది !

ఇంతలో నేను దిగవలసిన స్టేషన్‌లో ట్రైన్ ఆగింది. సుబ్బరాజుని విషాదంలో విడిచిపెట్టి నా ఆలోచనల్ని చిత్రవధ చేస్తున్న హోరుని తలనిండా నింపుకుని కిందకు దిగాను. నాకేమీ అర్థంకావడంలేదు. హోరు ! హోరు !!

* * *

"ఇక యింటికి వెడదామా? కాస్సేపు కూర్చుందామా ?" అడిగింది నీలవేణి. అప్పటివరకూ ప్రచండంగా విన్పిస్తున్న హోరు ఒక్క క్షణం ఆగి నా ఆలోచనల్ని కత్తిరించింది.

బట్టలకు అంటుకున్న ఇసుక దులుపుకుంటూ పైకి లేచాం. తలనిండా సాలెగూళ్లు పట్టినట్టుంది నాకు. టైమ్ చూశాను. ఏడయింది.

చిట్టిబాబు ఆఫీసు పనిమీద ఎక్కడికో వెళ్ళాడట ! వచ్చేవరకూ ఆగుదామంటే వినకుండా బలవంతంగా భోజనం వడ్డించింది. అతను వచ్చేటప్పటికి తొమ్మిది దాటవచ్చునంది.

వరండాలో ఈజీఛైర్‌లో కూర్చున్నాము. నీలవేణి ఎక్కడా ఆగకుండా ప్రవాహంలా మాట్లాడేస్తోంది. నేను శ్రోతగానే మిగిలాను. ఇంతలో స్కూటర్ చప్పుడు వినిపించింది. నీలవేణి ఛెంగున లేచి గేటుదగ్గరకు ఎదురు వెళ్ళింది. చిట్టిబాబు వచ్చాడు.

"ఎవరొచ్చారో చూడండి !" సెలయేరులా నీలవేణి !

"ఒరేయ్ ... యూ ... హహ్హహ్హ ...ఏమిటిరా ? ఉత్తరం అయినా రాయకుండా ఈ మెరుపేమిటి ?"




నన్ను కౌగలించుకున్నంత పనిచేశాడు చిట్టిబాబు.

ఘనీభవించిపోతున్న స్పందన తిరిగి నా నరాల్లో పరుగులు తీయ సాగింది.

"ఇక్కడ సాహిత్యదీప్తి వాళ్ళు ఏర్పాటుచేసిన గోష్ఠికి నన్ను గెస్టుగా పిలిచారు. అది పూర్తయ్యాక మిమ్మల్ని చూసిపోవచ్చునని వచ్చాను. వచ్చే ముందు లెటర్ రాద్దామనుకున్నాను కాని వీలుపడలేదు."

"అవునులే ! మీ రచయితలు టన్నులకొద్దీ సాహిత్యాన్ని ఉత్పత్తి చెయ్యగలరుగానీ, ఫ్రెండ్స్‌కి ఉత్తరాలు మాత్రం రాయలేరు ! పోనీలే- గుర్తుంచుకొని చూడ్డానికైనా వచ్చావు. అదే చాలు !" నిష్ఠూరంగా అన్నాడు. కాని అందులో ఆత్మీయత కనిపించింది నాకు.

చిట్టిబాబుకి అన్నం వడ్డించి నాకు హార్లిక్స్ కలిపి తీసుకొచ్చింది నీలవేణి.

అర్ధరాత్రివరకూ వెనకటి సంగతులు తవ్వి పోసుకుంటూ గడిపాము. మంచు పడుతుందని చెప్పినా వినకుండా నేను ఒంటరిగా డాబామీద పడుకున్నాను. మళ్ళీ తలనిండా గజిబిజిగా ఆలోచనలు. దూరంగా సముద్రపు హోరు వినపడుతోంది కాని అంత స్పష్టంగా లేదు.

తెల్లవారాక వాళ్ళు ఎంతగా బలవంత పెట్టినా వినకుండా ప్రయాణానికి సిద్ధమయ్యాను. చివరకు చిట్టిబాబు నన్ను స్కూటరుమీద వాల్తేరు స్టేషన్‌కి తీసుకొచ్చాడు.

ట్రెయిన్ బయల్దేరడానికి కొద్ది నిముషాల టైముంది. చిట్టిబాబు హఠాత్తుగా అడిగాడు——

"ఏమిట్రా ? నిన్న బీచ్‌లో ఏవో వెధవ ప్రశ్నలువేసి నీలవేణిని కంగారు పెట్టేశావట ! కొంపదీసి ఈ మధ్య నీకు ఎక్కడైనా సుబ్బరాజుగానీ తగిలా డేమిటి ?"

ఉలిక్కిపడ్డాను. అయినా సర్దు కున్నాను.

"అబ్బే అదేం లేదులే ! చాలా మామూలుగా అడిగాను– అంతే ! ఏం ? సుబ్బరాజు సంగతేమిటి ?"

"ఏమో నాకూ అర్థంకావడంలేదు. మన పాత ఫ్రెండ్స్ ఎవరు కనిపించినా నీలూకీ నాకూ మధ్య మనస్పర్థ లొచ్చా యనీ, త్వరలో మేము విడాకులు తీసు కోబోతున్నామనీ, ఏమిటేమిటో చెప్తు న్నాడట ! మొన్న కేంప్‌లో శివరావు కనిపించి ఇదంతా చెప్పాడు !"

"చాలా చిత్రంగా ఉంది కదూ ?" అన్నాను, యింకేమనాలో తోచక.

ట్రెయిన్ కదిలింది. చిట్టిబాబు వెచ్చని చేతి స్పర్శను తీసుకుని నా సీట్‌లో కూలబడ్డాను. సుబ్బరాజు నా తలలో పెద్ద ప్రశ్నార్థకంలా తయా రయ్యాడు.

* * *

కేలండర్‌లో మరో నాలుగు కాగితాలు పాతబడిపోయాయి. చాలారోజుల తర్వాత గుంటూరు రావలసి వచ్చింది. రాత్రి రెండుగంటలకు మిత్రుడు రాజా రావు పెళ్ళి. యువతరంలో సంచల నాన్ని కలిగిస్తున్న మంచి రచయిత రాజారావు. పెళ్ళికి రాకపోతే డొక్క చించేస్తానని ఉత్తరం రాసాడు. సాయంత్రం నాలుగు గంటలకే గుంటూరు చేరుకున్నాను. బేగ్ పెళ్ళి వారింట్లో పెట్టి స్నానంచేసి బయటికి వస్తుంటే, "ఎక్కడి"కన్నాడు రాజారావు.

ఓ పాత ఫ్రెండ్‌ని కలిసి వెంటనే వచ్చేస్తానని చెప్పాను.

గుంటూరు బయలుదేరినప్పటినుంచీ నా తలలో సుబ్బరాజే కదులుతున్నాడు. వాడిని తప్పకుండా కలుసుకోవాలి. రిక్షా ఎక్కి నెహ్రూనగర్‌లోని సుబ్బ రాజు యింటికి చేరుకున్నాను. నీలవేణిని ప్రేమించి విఫలుడైన సుబ్బరాజు చివరకు తన మేనమామ కూతురు సత్యవతిని పెళ్ళిచేసుకున్నాడు. మంచి ఉద్యోగం కూడా సంపాదించాడు.

నేను వెళ్లేసరికి వాతావరణం విచిత్రంగా ఉంది. సుబ్బరాజు అత్త గారు ఒళ్లో రెండేళ్ళ కుర్రాణ్ణి పెట్టుకుని అరుగుమీద కూర్చుంది. అప్పటివరకూ ఆవిడతో కబుర్లు చెబుతున్న నలుగు రైదుగురు ఆడవాళ్ళు లేచి వెళ్ళి పోయారు.

"సుబ్బరాజు ఉన్నాడాండి ?" అడిగాను.

"లేడు బాబూ ! ఎవరు మీరు ?" ఆవిడ అడిగింది. ఎందుకో అప్పటి వరకూ ఏడ్చినట్టుంది ఆమె ముఖం.

నేను వివరాలు చెప్పాను. హాల్లో నన్ను కూర్చోమని చెప్పి కూతురిని పిలిచింది.

బెడ్‌రూమ్‌లోంచి సత్యవతి వచ్చింది. అంతకుముందు రెండు మూడుసార్లు సుబ్బరాజు యింటికి వెళ్ళి ఉండడంతో ఆమె నన్ను గుర్తుపట్టి నవ్వింది.

కాని ఆ నవ్వులో ప్రాణంలేదు.

సత్యవతి రూపం చూసి చాలా ఆశ్చర్యపడ్డాను నేను.

తలంతా రేగిపోయి, కళ్ళు బాగా ఉబ్బి ఎర్రగా ఉన్నాయి.

"సుబ్బరాజు ఎన్నిగంటల కొస్తా డింటికి ?" అన్నాను.

సత్యవతి సమాధానంగా తల దించు కుంది.

ఆమె అపశ్రుతితో మధ్యలో ఆగి పోయిన పాటలా ఉంది.

పులి పంజానుంచి కొద్దిలో తప్పించు కున్న లేడిపిల్లలా ఉంది.

"ఎప్పుడొస్తాడో ఏం తెలుస్తుంది బాబూ ? ఒక అరగంటక్రితమే దానిని చావబాది బయటకుపోయాడు !"

షాక్ తిన్నాను. సత్యవతి కన్నీళ్లతో లోపలివైపు గదిలోకి వెళ్ళిపోయింది. సుబ్బరాజు అత్తగారు చెబుతోంది—

"మేనరికం గదా అని ముచ్చట పడి నా చిట్టితల్లి గొంతుకు ఉరితాడు తగిలించాము. ఓ అచ్చటా లేదు ముచ్చటా లేదు. దాన్నెవతెనో ఉంచు కుని కొత్తపేటలో వేరే కాపురం పెట్టాడు. వారానికో - పదిరోజులకో ఓసారి యిక్కడికి రావడం - దానిని నాలుగు తన్ని పోవడం ! ఒక్క సారిగా మమ్మల్నందరినీ చంపేసినా బాగుండును !"

"అదేమిటి ? సుబ్బరాజు యిలా ఎందుకు తయారయ్యాడు ?"

"ఏం చెప్పమంటావు బాబూ ? అంతా మేంచేసుకున్న ఖర్మ ! మనిషికి అన్నీ అనుమానాలు! ఓ సినిమా లేదు - షికారు లేదు - చివరకు వీధిలోకి కూడా రానిచ్చేవాడు కాదు. అది సత్యకాలపు పిల్ల గనక ఎలాగో ఓర్చుకునేది. ఎవరో బజారు ముండతో వేరే కాపురం వెలిగిస్తున్నా పల్లెత్తు మాటకూడా అన లేదు నా బిడ్డ ! అయినా యింటికి వచ్చాడంటే నానా బాధలూ పెడు తున్నాడు. చివరికి తన రక్తం పంచుకు పుట్టిన ఈ పసిబిడ్డకూడా తనకు పుట్టిన వాడుకాదని పెద్ద పెద్ద రంకెలేసి దాన్ని చితగ్గొడుతుంటాడు ! నలుగురిలోనూ తలెత్తుకుని తిరగలేకపోతున్నాం. ఈ పసిబిడ్డతో చావలేక, బతకలేక అది నరకంలో కొట్టుకుంటోంది !"

ఇంతలో సత్యవతి గ్లాసులో కాఫీ తెచ్చి నా చేతి కిచ్చింది.

ఆమె ముఖంలోకి చూడ్డానికి భయం వేసింది నాకు.

కాఫీ చేదుగా ఉంది !

# ప్రజా హృదయం

(గల్పిక)

దిబ్బపత్రిక ఎడిటరు మహా చిరచిర లాడుతున్నాడు.

"ఏమయింది ?" అన్నాను.

"ఎలెక్షను ! ... పాతప్రభుత్వమే గెలవాలని రోజూ సంపాదకీయాలు రాశాను. ఎక్కడో ఉత్తరదేశంలో పాత ప్రభుత్వం ఓడిపోయిందిట నాకు రోజూ తిట్టు ఉత్తరాలు ! నేను కిరాత కాన్నీ, నియంతృత్వాన్నీ, పైశాచిక పరిపాలననూ, ప్రజాశత్రువులనూ సమర్థించి ప్రజలకూ, ప్రజాతంత్రానికీ ద్రోహంచేశానుట ! నాకు రాజకీయ పరిజ్ఞానంలేదుట ! నా సంపాదకత్వం కింద దిబ్బపత్రిక ప్రజలను అజ్ఞానాంధ కారంలో ఉంచిందట !"

"విచారించకు. దిబ్బలో ఒక్క సీటుకూడా పోకుండా అన్నీ పాతప్రభు త్వానికే దక్కా యిగద ! ప్రజలు తమకు నియంతృత్వమూ, దౌర్జన్యమూ కావాలనీ, స్వేచ్ఛ అక్కర్లేదనీ ఎలు గెత్తి చాటి చెప్పారు. ప్రజాహృద యాన్ని నువు చాలా కరెక్టుగా ప్రతి బింబించావు !" అన్నాను.

"వాళ్ళకు రాజకీయ పరిజ్ఞానం చేసింది నేనేట !"

"తమ్ముడూ, ప్రజలకు రాజకీయ పరిజ్ఞానం కలిగించాలని రాజకీయవేత్తలే తాపత్రయపడరు. కందకు లేని దురద కత్తి పీటకా ? ఎన్నికలు వచ్చినప్పుడు ప్రజాభిప్రాయం తమపక్షాన ఉండాలని కోరటానికి మీటింగులు పెట్టి, ఏవో ప్రచారాలు చేస్తారు. ఇప్పుడు గెల్చిన పార్టీకి దక్షిణాది యావత్తూ వ్యతి రేకంగా వోటు చేసింది. వాళ్ళకేమన్నా బాధా ? కేంద్రం కోటలో పాగా వెయ్య టానికి అడ్డంరాలేదు. అందుచేత దక్షిణాది వేరే దేశమల్లే ప్రవర్తించినా వాళ్ళకి బాధలేదు. అందుచేత నువ్వు గమ్మునుండు ! నిన్ను విమర్శించిన వారితో, నాకూ, మా దిబ్బకూ పంచ మహాపాతక పరిపాలనే కావాలని చెప్పు, వాళ్ళ రోగం కుదురుతుంది !" అన్నాను.

కొడవటిగంటి కుటుంబరావు

# దోసకాయల వెల

ఒకనాడు అమీర్ ముయీన్ ఇబన్ జైద్ వేటకు పోయినప్పుడు, గాడిద మీద సవారి అయి ఎడారిగుండా వస్తున్న ఒక అరబ్బీ కనిపించాడు. ముయీన్ అతన్ని సమీపించి పలకరించి, "ఎక్కడికి ప్రయాణం, అన్నా ? ఆ మూటలో భద్రంగా తీసుకు పోతున్నావు, ఏమిటది ?" అని అడిగాడు.

"అమీర్ ముయీన్‌ను చూడబోతున్నాను. ఆయనకోసం నా పొలంలో కాసిన తొలి దోసకాయలు తీసుకు పోతున్నాను. దేశంలో ఆయనను మించిన ఉదారుడు లేడు. నా దోసకాయలకు ఆయన తగిన వెల ఇస్తాడని నా నమ్మకం," అన్నాడు అరబ్బీ.

అతను అమీర్‌ను చూసిఎరగడని స్పష్టమయింది.

"అమీర్ నీ దోసకాయలకు ఎంత ఇస్తాడనుకుంటున్నావు ?" అని అమీర్ అడిగాడు.

"కనీసం వెయ్యి బంగారు దీనార్లు."

"అమీర్ అది చాలా ఎక్కువ అంటే ?"

"అయిదు వందలే ఇయ్యమంటాను."

"అది కూడా ఎక్కువేనంటే ?"

"మూడు వందలే అడుగుతాను."

"అది కూడా ఎక్కువేనని అతనంటే ?"

"వంద !"

"అదీ ఎక్కువేనంటే ?"

"యాభై."

"అదీ ఎక్కువేనంటే ?"

"ముప్పై."

"అది కూడా ఇంకా ఎక్కువే నంటే ?"

"నా గాడిదను జనానాలోకి తోలి, పారిపోతాను."

ఈ మాటకు ముయీన్ విరగబడి నవ్వి, తన గుర్రాన్ని అదిలించి, తన అనుచరులను కలుసుకున్నాడు. అతను ఆలస్యం చెయ్యకుండా తన భవనానికి తిరిగివచ్చి, అరబ్బీవాడు దోసకాయలు తీసుకునివస్తే లోపలికి ప్రవేశపెట్టమన్నాడు.

మరొక గంటకు దోసకాయలతోసహా అరబ్బీ వచ్చి, లోపలికి ప్రవేశపెట్టబడ్డాడు. ముయీన్ చుట్టూ అధికారబలగమూ, సిబ్బందీ, ఖడ్గధారులైన రక్షకులూ, వైభవమూ చూసి, అరబ్బీ వాడు తాను కలుసుకున్న రౌతు అతనే

నని పోల్చుకోలేకపోయాడు దిగ్భ్రమలో. అతను దోసకాయల మూట చేత బట్టుకుని, పలకరిస్తే జవాబు చెప్పటానికి సిద్ధంగా నిలబడ్డాడు.

"నాకోసం ఆ మూటలో ఏం తెచ్చావు, అన్నా ?" అని ముయీన్ అతన్ని అడిగాడు.

"అమీర్‌గారి దయాగుణాన్ని నమ్ముకుని నా తోటలో కాసిన లేత దోసకాయలు తెచ్చాను," అన్నాడు అరబ్బీ.

"మంచి ఆలోచనే చేశావు. నా దయాగుణం విలువ ఎంతని అనుకుంటున్నావు ?"

"వెయ్యి దీనారాలు."

"అది చాలా ఎక్కువే."

"అయిదు వందలు."

"ఎక్కువే."

"మూడు వందలు."

"ఎక్కువే."

"వంద."

"ఎక్కువే."

"యాభై."

"అయితే, ముప్పై."

"ఇంకా ఎక్కువే."

"యా అల్లా ! ఎడారిలో ఆ దరిద్రం మొహంవాడు కనిపించాడు, నాకు కలిసి రాలేదు ! ముప్పై దీనార్లకు తక్కువైతే నా దోసకాయలు ఇయ్యను," అన్నాడు అరబ్బీ ఆవేదనతో.

అమీర్ నవ్వి ఊరుకున్నాడు గాని జవాబు చెప్పలేదు. అప్పుడు అరబ్బీ అతని ముఖాన్ని మరింత శ్రద్ధగా పరిశీలించి, తాను ఎడారిలో చూసినది ఆ మనిషినేనని గుర్తించి, "దొరా, ముప్పై దీనారాలూ ఇచ్చెయ్యి. లేకపోతే నా గాడిద వాకిలి దగ్గిరే కట్టి ఉన్నది !" అన్నాడు.

అమీర్ పగలబడి నవ్వి, కాస్త సంబాళించుకున్న మీదట తన ఖజానాదారును పిలిచి, "ఈ అన్నకు వెయ్యి దీనార్లూ, తరవాత అయిదు వందలూ, తరవాత మూడు వందలూ, తరవాత వందా, తరవాత యాభై, తరవాత ముప్పై ఎంచి ఇచ్చి, ఇతను తన గాడిదను విప్పకుండా చూడండి," అన్నాడు.

చిన్న దోసకాయల మూటకు పందొమ్మిది వందల ఎనభై బంగారు దీనార్లు లభించిన అరబ్బీ దిగ్భ్రమ చెందాడు





# కొత్త సంస్కారం

— రంగనాథశర్మ

"రేయ్, జానకిని నువ్వు పెళ్ళిచేసుకోవాలి."

రూంలోకి వస్తూనే ... మరే ఉపోద్ఘాతం లేకుండా అన్న శ్రీహరి మాటలకు నిశ్చేష్టుణ్ణయ్యాను.

అకస్మాత్తుగా ఊడిపడ్డ బంధువుల్లా వాడినోటునుంచా మాటలు వచ్చాయి... నేను తేరుకోక మునుపే మళ్ళీ రెట్టించాడు...

"నువ్వు జానకిని పెళ్ళిచేసుకోవాలి"

మొదట హాస్యానికన్నాడేమో అనుకున్నానుగాని వాడికంఠంలోని 'వాడి'ని బట్టి చాలా సీరియస్‌గా అడుగుతున్నాడనే నిశ్చయాని కొచ్చాను.

"నీకేమైనా మతిపోయిందేమిట్రా" అన్నాను. అప్పటికీ నమ్మబుద్ధి కాలేదు నాకు.

"నువ్వు కాదంటే ఖచ్చితంగా పోతుంది."

వాడి ధోరణి నాకేం అంతుపట్టలేదు. అయినా అటునుంచి నరుక్కొద్దామని ఉద్వేగంగా చెప్పసాగాను.

"ఏరా, ప్రేమంటే ఒట్టి బొమ్మలాట అనుకున్నావుట్రా. మనసివ్వటం నీవంతే తిరిగి తీసుకోవటమూ నీవంతేనా? ఆడదాని జీవితంతో ఆటలాడటం సంస్కారమున్న వ్యక్తిగా నీకు తగదురా? ఒరేయ్–అది మనసురా – రాయికాదు–అది ప్రేమరా–పాషాణంకాదు–అది జీవితంరా–చిత్తుకాగితంకాదు–కాల్చిపారేసిన సిగరెట్టు పీకా కాదురా–ఇష్టంలేకపోతే యిప్పి అవతల పారేయటానికి చొక్కా కాదురా–"

నా వాక్ప్రవాహానికి అడ్డుపడుతూ పకపక నవ్వాడు శ్రీహరి. "నువ్వు కవి వయితే –జనం నీరాజనం పడతార్రా, ప్రయత్నించకూడదూ" నవ్వాపి అన్నాడు...

"శ్రీహరీ ...నవ్వులాటకాదు.. నేను సీరియస్‌గానే అడుగుతున్నాను...నిజం చెప్పు, నీకూ జానకికీ ఏమైనా గొడవలొచ్చాయా."

"అటువంటిదేంలేదే."

"మరి? జానకిని నువ్వెందుకు పెళ్ళి చేసుకోకూడదనుకుంటున్నావ్'

"ఇష్టం లేక"

"ఫూల్ లా మాట్లాడకు."

ఫూల్ 'లా' మాట్లాడకూడదు...

"కాని యిది'లా' గురించికాదు'లా! గురించి. యింతలోనే నీకేమయింది? అలాంటి నిర్ణయాని కెందుకొచ్చావ్? చెప్పు ముందు."

"చెప్పాలా? తప్పదంటావా?"

"చెప్పితీరాలి" అన్నానుగాని వాడడిగిన తీరు...వాడి ముఖంలో ఆ క్షణంలో కదలిన నీడలు గమనించి గతుక్కుమన్నాను...కాని వెంటనే సర్దుకున్నాను.

రెండు నిముషాలు గడిచాయి. ఏదో దృఢనిశ్చయానికొచ్చిన శ్రీహరి "చెప్పను" అన్నాడు.

వాడిచేత ఎలాగైనా చెప్పించాలనే పట్టుదల నాలోనూ కల్గింది.

"చెప్పను కాదురా, చెప్పలేను అను. చెప్పే ధైర్యం లేదను. చెప్పడానికి దమ్ము లేదను" రెచ్చగొట్టాను.

"అయినా చెప్పను" శ్రీహరి మరీ మొండిగా అన్నాడు... "యే మొహం పెట్టుకుని చెప్పగలవు. ఛీ అంటానని నీకూ తెల్సు. యింకా రెచ్చగొట్టాలన్నదే నా ఉద్దేశ్యం."

"అయినా సరే చెప్పను...కాని..." ఆగిపోయాడు.

"ఏం ఆగిపోయావేం?కాని .."అందించాను.

"నేను చెప్పబోయేది నువ్వు వినకుండా ఉండడమే మంచిది"

"డొంకతిరుగుడు వద్దు. నిన్న యిదే వేళకు నాతో యేమన్నావ్?"

"జానకిని పెళ్ళిచేసుకుంటానని"

"మరి...యీ ఇరవై నాలుగ్గంటలో నీకేమొచ్చిందిరా? పోనీ జానకికేమైనా అయిందా?"

మాట్లాడలేదు వాడు

యిక చివరి అస్త్రంగా "జానకి చెడిపోయిందా" అన్నాను.

"రాజూ" బిగ్గరగా అరుస్తూనే నామీద చెయ్యెత్తి...మధ్యలో నే తక్కున ఆగిపోయాడు.

"కొడితే కోపం కొంతయినా చల్లారేది"

"సారీ రాజూ...చాలా తొందరపడి మాట జారావు...కంట్రోలు చేసుకోలేక చెయ్యెత్తాను. చెడిపోయిన జానకిని నిన్ను పెళ్ళిచేసుకోమనటానికి రేయ్ — నేను స్నేహితుణ్ణిరా. స్నేహానికున్న విలువ నాకు తెల్సు-నిజం చెబుతున్నా...అదే అదే యిప్పుడు నీ ఒంటిమీద దెబ్బపడకుండా కాపాడింది. మరొకడెవడయినా ఆ మాటనిఉంటే వాడి నాలిక చీరేసేవాణ్ణి-స్నేహానికి ప్రాణం పెడతాను నేను..."

"ఒకనాడు కన్నతండ్రి మాటనే కాదని స్నేహితుడుగా నీ మాటకే విలువిచ్చానంటే ... యివ్వగలిగానంటే... నాకు స్నేహంమీదున్న గౌరవం నీకు తెలియదనుకోను..."

వాడిమాటలకు కరిగిపోయాను... వాణ్ణి రెచ్చగొట్టి నిజం చెప్పించాలనే గాని నిజానికి జానకి జానకిమీద నాకెలాటి అపనమ్మకమూ లేదు...

అయినా వాడు మనస్ఫూర్తిగా ప్రేమించిన జానకిని నేను పెళ్ళిచేసుకోవటమేమిటి? వాడికేమైనా మతిచలించలేదుగద-ఏది ఎలా ఉన్నా అసలు విషయం తెలుసుకోవాల్సిన అవసరం నాకుంది. కాని శ్రీహరి చెబుతాడన్న నమ్మకం నాకు లేదు...

"స్నేహానికేమైనా విలువిచ్చే మనిషివైతే నే చెప్పినట్టు చెయ్యి. కారణంచెప్పి నిన్ను బాధించి ఒప్పించటం మాత్రం నాకిష్టంలేదు."

"నాకు బాధ కల్గించే కారణాన్ని నేను తెల్సుకోకూడదని ఎలా అనుకుంటున్నావు నువ్వు"

"రాజూ; రాజూ: ప్లీజ్...నన్ను నమ్ము. ఒకనాడాకారణాన్ని నువ్వు తప్పక తెల్సుకున్నాక నేను చేసిన పని మంచిదేనని నువ్వే అంటావు"

"నో... నో... ఇట్సింపాజిబుల్."

"ఇటీజ్ పాజిబుల్, రాజా— నా మాట విను...లేకపోతే జానకిలాంటి అమృతమూర్తిని ... నాలాటి స్నేహితుణ్ణి పోగొట్టుకుంటావు..."

"శపిస్తున్నావా?"

"కాదు  నిజం చెబుతున్నాను. నీ నిర్ణయం చెప్పు...'

'యిప్పుడా? యిప్పుడెనా.'

"ఔను. యీ క్షణంలోనే."

"కాదు—నన్ను ఆలోచించుకోనియ్."

"సరే—పది నిముషాల్లో నీ నిర్ణయం చెప్పు..."

"శ్రీహరీ— ఒక్క రోజు...అంటే... యిరవై నాలుగ్గంటలు టైమివ్వు నాకు...

"రాజూ! నేను ఉదయాన్నే మా ఊరెళ్ళిపోతున్నాను...మళ్ళీ యెప్పుడొస్తానో నాకేతెలియదు బహుశః..."

"శ్రీహరీ, ఊరెళ్ళిపోవాలని ఎప్పుడు నిర్ణయించుకున్నావు"

"రాత్రి—రాజూ, జానకిని చేసుకుంటానని మాటివ్వు" చెయ్యి ముందుకుచాపాడు శ్రీహరి.

అప్రయత్నంగానే నాచేయి శ్రీహరి చేతిలో వేశాను-

"థేంక్యూ...రాజూ ... థేంక్యూ" నన్ను గట్టిగా కౌగలించుకున్నాడు.

"రేయ్ శ్రీహరీ" నా భుజంమీద రాలిన కన్నీటిబొట్లు ... ఉలిక్కిపడి అరిచాను.

"నథింగ్...నథింగ్ రాజూ..." అంటూ కళ్ళొత్తుకున్నాడు...

"మరి జానకి నన్ను పెళ్ళిచేసుకోవడానికి ఒప్పుకుందా" -నా సందేహం బయటపెట్టాను.

"ఆ సంగతి నాకు వదిలెయ్" తేలిగ్గా నిట్టూర్చాడు...

"కాని శ్రీహరీ మగాడు మనస్సు చంపుకున్నంతగా ఆడది మనసుమార్చుకుంటుందని అనుకోకు—చివరకు జానకేమయినా అయితే ఆ భగవంతుడుకూడా మనల్ని క్షమించడు...ఆలోచించు..."

రాజు నా భుజంమీద చెయ్యివేసి తాపీగా అన్నాడు, "ఒకవేళ నేను పెళ్ళి చేసుకోకపోవటంవల్ల ఆమె గాయపడితే ఆమె యెక్కడుంటే ఆ బాధను మర్చిపోగల్గుతుందో నాకు బాగా తెలుసు."

"ఆల్‌రైట్...నీ ప్రయత్నం నువ్వు చెయ్యి" అన్నాను చివరకు.

"థేంక్స్ రాజూ" అంటూ నా చెయ్యి గట్టిగా నొక్కి వదిలేసాడు. "మళ్ళీ కలుస్తాను" అని వడివడిగా బయటకునడిచాడు

శ్రీహరి వెళ్ళిపోయాక నేను తొందరపడ్డానేమో నన్పించింది. ఎందుకు వాడికి మాటిచ్చానా అని కూడా అన్పించింది.

జానకి అందమైంది-తెలివైంది-చురుకైంది—జానకిని భార్యగా పొందటం నిజానికి అదృష్టమే...

కాని...కాని...

జానకి ... శ్రీహరి... ప్రేమించుకున్నారు...పెళ్ళికూడా చేసుకుందామనుకున్నారు...యింతలో శ్రీహరెందుకిలా మారిపోయాడు ??

జానకితో నా వివాహం జరిగితే...?

ప్రేమ ఒకచోట ... పెళ్ళి మరో చోట...

మనసొకచోట ... మనవు మరో చోట...

హృదయం ఒకరికి ... శరీరంపై సార్వభౌమాధికారం యింకొకరికి...

ఆ పెళ్ళి యిచ్చే ఫలితాలెలా ఉంటాయ్.

ఎక్కడో నా హృదయపు అట్టడుగు పొరల్లో 'కలుక్కు' మన్నట్టనిపించింది.

అసలు శ్రీహరి ఎందుకు జానకిని పెళ్ళిచేసుకోవడానికి విముఖుడయ్యాడు?

ఏ పరిస్థితులు ఆ నిర్ణయానికి దారి తీసాయ్?

ఆ నిర్ణయం వెనుక...?!

ఎటూ నిర్ణయించుకోలేకపోతున్నాను.

అయినా యిది జరగకపోతేనే మంచి దనిపించింది-జానకిఒప్పుకోదు.. జానకే కాదు—ఏ ఆడదీ ఒప్పుకోదు.

ఏ పరిస్థితుల్లో నేను శ్రీహరికి మాటిచ్చానో అవే పరిస్థితుల్లో జానకికూడా శ్రీహరికి మాటయిస్తే...

అది సంభవమేనా? కాకపోవచ్చు! అవనూవచ్చు...

నా ఆలోచనలు నా ఆధీనంలో ఉండటంలేదు...

మరో రెండు గంటలకల్లా 'తుఫాన్' లా దూసుకువచ్చాడు శ్రీహరి ...

వస్తూనే నన్ను కౌగలించుకున్నాడు.

"రాజా! జానకిని పెళ్ళికి ఒప్పించాను" అన్నాడు

నెమ్మదిగా వాణ్ణుంచి తప్పించుకుని– "జానకిని పెళ్ళికి ఒప్పించావా? జానకి ఒప్పుకుందా," అడిగాను, వీధిగుమ్మం లోంచి రోడ్డుమీద పోతూన్న జనాన్ని చూస్తూ...

"ఒెుడూను"

"అయితే జానకి హృదయాన్ని చిత్ర వధ చేశావన్నమాట..."

" హృదయాన్ని చేశానా ?"

"స్నేహాన్ని అడ్డువేశావ్..అదే అడ్డు లేకపోతే నేను నీకు మాటయిచ్చేవాణ్ణి కాదు–

జానకి నీతో పెళ్ళికి ఒప్పుకోవటాని క్కారణంకూడా అదేరా...

ఎందుకో నా తల వేడెక్కిపోతూంది. రేయ్ శ్రీహరీ–ఇంత త్వరగా జానకి తన నిర్ణయం మార్చుకుందా కణతలు నొక్కుకుంటూ అడిగాను.

"రాజూ" నాదగ్గరగా వచ్చాడు శ్రీహరి. "మేం యిద్దరం ప్రేమించు కున్నామని అందరికీ తెల్సు' పెళ్ళిచేసు కుంటామనీ అనుకున్నా రందరూ..."

"జానకీ నేనూ ఎంతో చనువుగా తిరిగా...అయితే అది కొన్ని హద్దుల్లో ననీ...కొంత పరిధిలో ననీ నీకు తెల్సి నంతగా మరెవ్వరికీ తెలియదు–విధి బలీయం...మా పెళ్ళి ఆగిపోయింది. అలా ఆగిపోవటంకూడా మంచిదే రాజూ

కారణంమాత్రం అడక్కు రాజూ — నీ నుంచి నేను దాచిన రహస్యంఅదొక్కటే.

జానకితో నే నెందుకలా చనువు పెంచుకుంటున్నానా అని ఆలోచించని రాత్రిలేదు...ఏ బలహీనతకు లొంగి పోయానో యేమోకాని ... గడచిన ఇరవై నాలుగ్గంటల్లో నే ననుభవించిన క్షోభ నీ ఊహకంతుపట్టదు—నా మనస్సే నా కెదురుతిరిగింది—నా ఆలోచనలే నన్ను వెక్కిరిస్తూ దోషిగా నిలబెట్టాయ్—ఆ అంపపు కోత - బాధ...ఆ క్షోభ... ఓహ్! తల్చుకుంటేనే ప్రాణంపోయే టట్టుంది. ఎలాగైతేనేం జానకిని ఒప్పించ గలిగాను...రాజూ...ఆమె సుఖపడటం నాకు కావాలి ... ఆమె దుఃఖపడితే నా గుండె ఆగిపోతుంది. జానకి కంటతడి బెడితే నా కంఠంలోంచి ప్రాణాలు ఎగిరి పోతాయ్...అన్నీ తెల్సినవాడివి నువ్వు.. నాకోసం ... పిడికెడు గుండెల్లోంచి అనంతమైన సానుభూతిని ఆమెకు పంచి యివ్వగలవాడివి నువ్వు ... అంతకు మించి సహృదయంతో ఆమెను స్వీక రించగల్గిన సంస్కారం ఉంది నీలో... రాజూ ... ఏమిటాలోచిస్తున్నావ్? నా కిచ్చిన మాట తప్పితే నేను నీకు శాశ్వ తంగా దూరమౌతాను ... నీకళ్ళముందే తల బ్రద్దలుకొట్టుకుని..."

"శ్రీహరీ" ఒక్కసారిగా శ్రీహరి వేపు తిరిగాను...శ్రీహరి ఏడుస్తున్నాడు. చిన్నపిల్లవాడిలా వెక్కి-వెక్కి యేడుస్తు న్నాడు...

వెళ్ళి శ్రీహరి భుజాలమీద రెండు చేతులూవేసి దగ్గరకు తీసుకున్నాను— "రేయ్, నీ మాట నాకు వేదంరా నీ మాట కట్టుబడే ఉంటన్నా...శ్రీహరీ...ఒక్క కోరిక తీర్చరా...నువ్వేదో మానసి కంగా కృంగిపోతున్నావ్...ఆ బాధే మిటో చెప్పరా ... స్నేహితుడిగా నీ బాధలో...బరువులో ... నన్నుకూడా పాలుపంచుకోనియ్ శ్రీహరీ..."

"రాజూ...ప్లీజ్... యిప్పుడునేనేం చెప్పలేను...నన్నేం అడగకు..."

కొద్ది నిముషాల తర్వాత "గుడ్‌బై" చెప్పి వెళ్ళిపోయాడు శ్రీహరి—

* * *

తర్వాత నెలలోనే మా తల్లిదండ్రుల అంగీకారంతో జానకితో నా పెళ్ళి జరిగిపోయింది. శ్రీహరి ఆనందాని కవధు ల్లేవు...నాకూ జానకికీకూడా విలువైన బహుమతులిచ్చాడు. అలా యిస్తూన్న ప్పుడు ఆనందబాష్పాల్తో అన్నాడు శ్రీహరి.

నేనిచ్చే బహుమతుల విలువ చాలా స్వల్పంరా రాజూ...నీ సహృదయంలో, సంస్కారంతో దీని విలువ ఎన్నో వంతు...యివాళ నాకు చాలా సంతో షంగా ఉంది.

నాలుగురోజులున్న తర్వాత స్వగ్రా మానికి వెళ్తానన్నాడు శ్రీహరి—కన్నీటితో వీడ్కోలిచ్చాం యిద్దరం.

"వాడు జీవితంలో ఓడిపోయాడు," అనేదే నా భావన-

ఆ తర్వాత జానకిని వాడెందుకు పెళ్ళిచేసుకోలేకపోయాడో జానకి ద్వారానే తెల్సుకుందామని చేసిన నా ప్రయత్నాలన్నీ వ్యర్థమయ్యాయ్.

శ్రీహరి వెళ్ళిన దగ్గర్నుంచీ · ఒక్క ఉత్తరమైనా వ్రాయలేదు.

కనీసం నేను వ్రాసిన ఉత్తరాలకైనా జవాబు వ్రాయలేదు. జానకి కోరికమీద శ్రీహరి స్వగ్రామంకూడా వెళ్ళాను— కాని వాళ్ళందరూ ఆ గ్రామంవదలి వెళ్ళిపోయారని తెల్సింది. ఎక్కడికి వెళ్ళిందీ తెలియలేదు.

యీ విషయం తెలిసిన దగ్గర్నుంచీ జానకిలో ఏదో మార్పు కనిపించింది — ఏదో చెప్పాలనీ చెప్పలేక తనలో తనే కుమిలిపోతూంది-నిలదీసి అడిగితే బావురు మనటం తప్పితే యేమీ చెప్పలేదు. రోజులు గడుస్తూనే ఉన్నాయ్... శ్రీహరి గురించి ఏమీ తెలియలేదు... స్నేహాన్ని ప్రాణప్రదంగా పెంచుకున్న దానికి ఫలితం యింత ఆశ్చర్యకరంగా ఉంటుందని నేననుకోలేదు—

జానకి పుట్టింటి కెళ్తానంది. యీ వాతావరణం మార్పుకూడా మంచిదేనని పించి జానకిని పుట్టింటికి పంపించాను.

మరో పదిరోజులకు... అనుకోకుండా శ్రీహరి దగ్గర్నుంచి టెలిగ్రాం వచ్చింది బొంబాయినుంచి...

"సేఫ్-కమింగ్ డ్యూరింగ్ ఫస్ట్ వీక్ ఆఫ్ అక్టోబర్ లెటర్ ఫాలోస్" శ్రీహరి.

ఆ టెలిగ్రాం నాలో ఆనందం కలిగించింది.

వెంటనే జానకికి తెలియపరుద్దామనుకున్నాను...కాని సరిగ్గా శ్రీహరి వచ్చే రోజునే జానకి కావిషయం తెల్పి ఆశ్చర్యంలో ముంచివేయాలనుకున్నాను.

యింకెంత? పదిరోజులు...

అక్టోబరు రెండు ఐయల్దేరి వచ్చేయమని మాత్రం ఉత్తరం వ్రాసి పోస్ట్ చేశాను-

మరిరెండు రోజులకు శ్రీహరి దగ్గర్నుంచి ఉత్తరం వచ్చింది—

హుషారుగా ఉత్తరం చదవసాగాను.

"రేయ్ రాజూ,

ఈ జీవితానికిక ఉత్తరం వ్రాయడం పడదేమోననుకున్న నేను యీరోజు యిలా వ్రాయగల్గుతున్నందుకు ఎంత సంతోషంగా ఉందో తెలుసా. యిన్నాళ్ళు ఉత్తరం వ్రాయనందుకు తిట్టుకుంటూ ఉన్నావ్కదూ—స్నేహంగురించి అంతిదిగా చెప్పిన వీడేనా యిలా ప్రవర్తించేది అని నిందించి ఉంటావు.

నా ఉత్తరాలు మిమ్మల్ని బాధించకూడదనే యింతకాలం వ్రాయలేదు... యీ ఉత్తరం కొంతలో కొంతయినా మీలో సంతోషాన్ని కల్గిస్తుందని నాకు తెల్సు—

రాజూ నేను జానకిని పెళ్ళిచేసుకోవటం యెందుకుమానేశానో ఆ రోజు చెప్పలేదు నీకు—యిప్పటికీ అదో "సస్పెన్స్"లా నీ మనస్సును దొలిచేస్తూ ఉండవచ్చు—జానకికి తెలిసినా నీకు చెప్పనని నాకు మాటిచ్చింది—నీది అసలే సున్నిత హృదయం...విషయం వింటే తట్టుకోలేవని నాకు తెలుసు—అందుకే చెప్పలేదు. అయినా నామాట మీద గౌరవంకొద్దీ...మన స్నేహాని కున్న విలువనుబట్టి...నా కోరికమేరకు జానకిని పెళ్ళిచేసుకున్నావు...

ఆ రోజు చెప్పలేని దాన్ని యీరోజు నిర్భయంగా చెప్పగలను రాజూ—నాకు 'లంగ్ కాన్సర్', చాలా మంది డాక్టర్లు చెప్పలేదు — జాగ్రత్తగా ఉండమని కొందరూ—ఆరోగ్యంగురించి చాలా శ్రద్ధతీసుకోవాలని కొందరూ చెప్పారు. పెళ్ళిని గురించి తొందరపడవద్దని ఒక డాక్టర్ నన్ను హెచ్చరించాడు. చివరికా డాక్టర్నే నిలదీసి అడిగాను, కారణం చెప్పమని. "సారీ మిస్టర్ శ్రీహరీ—మీకు లంగ్ కేన్సర్—అది "క్యూర్" కావటం 'రేర్' — దానివల్ల మీరు ఎక్కువకాలం బ్రతికే అవకాశంలేదు—డాక్టర్‌గా నేనీ విషయం చెప్పకూడదు. కాని...మీరు పెళ్ళిగురించి ఖచ్చితంగా చెప్పిన సంగతి గురించి ఆలోచించాక... ఒక ఆడదాని గొంతుకోయటం యిష్టంలేక మీకు చెప్పవల్సి వచ్చింది—...

ఉత్తరంలోని అక్షరాలు అలుక్కుపోయినట్టు కనిపిస్తూంటే అప్పుడు గమనించాను—నా కళ్ళల్లో నీళ్ళు...తువ్వాలు కళ్ళొత్తుకుని మళ్ళీ ఉత్తరంచదవసాగాను.

అందుకే రాజూ—నేను జానకిని పెళ్ళి చేసుకోవాలన్న నిర్ణయాన్ని మార్చుకుంది, నీ కా విషయం చెబితే నువ్వు తట్టుకోలేవు...

ప్రేమించానన్న స్వార్థంతో ఒక అమాయకురాలి జీవితాన్ని నాశనం చెయ్యటం యిష్టంలేకపోయింది—

ఎలాగూ నేను బ్రతకను—నేను ప్రేమించి...నన్ను ప్రేమించిన జానకి జీవితం చక్కబర్చాలి ... అదే నా ధ్యేయం...జానక్కి నిజం చెప్పేశాను . ఏడ్చింది..మొత్తుకుంది..చివరికి నేనే జయించాను...కాదు ప్రేమ...స్నేహం జయించాయి..

ముందు నిన్నడిగాను – నువ్వొప్పుకున్నావు..జానకినీ ఒప్పించాను. నా కోరిక నెరవేరింది.

నాకు యివాళ జీవితంమీద తిరిగి ఆశలు చిగురింపచేసింది డాక్టర్ స్మిత్—ఫారెనర్—నా కేసు ట్రయల్ కేసుగా తీసుకుంటానన్నాడు..నా జీవితానికి.. ప్రాణానికీ దేనికీ ఆయన బాధ్యతలేదని.. యిష్టపడి నేనే ఆపరేషన్‌కు ఒప్పుకుంటున్నాననీ వ్రాతపూర్వకంగా యిచ్చాను.. నా కేస్ "సక్సెస్" అయితే మరి కొందరభాగ్యులకు దారిచూపిన

వాణ్ణవుతాను. అమ్మానాన్నా ఏక్సి డెంట్‌తో మరణించారు నాలుగునెల్ల క్రితం ఒంటరివాణ్ణి ఎటూ బ్రతుకుమీద ఆశవదులుకున్నవాణ్ణి. అందుకే ధైర్యంగా నాకేసు నా బాధ్యతమీదే చేపట్టమని వ్రాసిచ్చాను..

ఆపరేషన్ సక్సెసయింది—అక్టోబర్ రెండున నన్ను డిశ్చార్జి చేస్తారు—నాలుగో తారీఖున మీ ముందు ఉంటాను జానకికి నా ఆశీర్వచనా లందజేయి—విషయాలు సముఖంలో—ఉంటాను. శ్రీహరి.

అక్టోబర్ నాలుగు.. శ్రీహరి వచ్చే రోజు.

నా మనస్సెందుకో ఏదో ఐపోతూంది — నా హితుడు.. స్నేహితుడు.. సన్నిహితుడు..యిన్నాళ్ళకు మృత్యువును జయించి తిరిగి వస్తున్నాడని తెల్సినప్పుడు నేను ఎందుకు హృదయపూర్వకంగా సంబరపడలేకపోతున్నానో నాకే తెలియటంలేదు.. మనస్సంతా చీకాకుగా అయిపోయింది. జానకికీ విషయం చెప్పాలా వద్దా అన్న సంశయంకూడా నాలో ఎందుకో అంకురించింది—

మనస్సు మొద్దుబారిపోతూంది - హృదయంలో అట్టడుగు పొరల్లో ఉండుండి యేదో కలుక్కుమంటూంది..

ఆవేళ అక్టోబర్ ఒకటి..

ఉదయం లేస్తూండగానే జానకికి టెలిగ్రాం యిచ్చాను రావద్దనీ.. నేనే వస్తున్నట్టుగానూ.

మూడవ తారీఖు మధ్యాహ్నం యింటికి తాళంపెట్టి జానకివద్దరకని బయల్దేరాను—

నేను శ్రీహరికి భయపడుతున్నానా? మరెందుకిలా పారిపోతున్నాను..నిజానికెంతో సంతోషించాల్సిన విషయం శ్రీహరి వస్తున్నాడంటే..కాని నేనెందుకు సంతోషించలేకపోతున్నాను..

టికెట్టు తీసుకుని బస్సులో కూర్చున్నాను.

నా మనస్సు గతంలోకి మళ్ళింది—జానకితో నా పెళ్ళి కాకపూర్వపు రోజుల్లో వెళ్ళింది..

శ్రీహరి...జానకి...

జానకి...శ్రీహరి...

వాళ్ళ నవ్వులు...చూపులు ...కేరింతలు...ఆరాధన ... ఓహ్! శ్రీహరి చూపుల్లో యేదోఅయిస్కాంతముంది——

నా ప్రశ్నకు సమాధానం బయట కొచ్చింది—

యిన్నాళ్లు నాతో కాపురంచేసిన జానకి నికొన్నాళ్ళక్రితం శ్రీహరిచూసే చూపులు...

తిరిగి యిన్నాళ్ళతర్వాత చూడగల్గితే నేను తట్టుకోగలనా? నాకళ్ళల్లో ఎర్రటి జీర!...

పదిరోజులతర్వాత యింటికొచ్చే సరికి నాకోసం యెదురుచూస్తున్న టెలిగ్రాంను వణుకుతున్న చేతుల్తో విప్పాను. అది అక్టోబర్ మూడు సాయంత్రం యిచ్చిన టెలిగ్రాం..

"శ్రీహరి ఎక్స్‌పైర్‌డ్ — డాక్టర్ స్మిత్."

# ఎన్నికల ప్రచారం

(గల్పిక)

భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చిన అనంతరం మొదటి లోకసభ ఎన్నికలకు రాజు పక్షాన దిబ్బేశ్వర్లుం గారూ, రైతుపక్షాన దిబ్బనాయుడూ నిలబడ్డారు. వీళ్ళుగాక ఇరవై తొమ్మిది మంది సొంతాన నిలబడి డిపాజిట్లు పోగొట్టుకున్నారు. వాళ్ళు సోదిలోకి కూడా రారు.

కాని దిబ్బేశ్వర్లుంగారి ఎన్నికల ప్రచారం సువర్ణాక్షరాలతో లిఖించ దగినది. అది నల్లరాసిలో కూడా అచ్చు కాకపోవటం శోచనీయం. అప్పటికీ ఇప్పటికీ దిబ్బలో ఎన్నికల ప్రచారం అట్టే మారలేదు గనక దాని వివ రాలు కొంతమందికైనా ఆసక్తికరంగా ఉండొచ్చు.

దిబ్బేశ్వర్లుంగారి మీటింగుకు నూట అయిదుగురు వచ్చారు. అందులో ఎనభై తొమ్మిదిమంది వారి ఖలగమే. శ్రీవారు మైక్ ముందుకు తప్పతాగి వచ్చాడని గొప్పగా చెప్పుకున్నారు. అదొక పెద్ద ఆకర్షణ అయింది

"మహాజనులారా !" అని మొదలు పెట్టి వారు చాలా సేపు తమ గొప్పతనం చెప్పుకున్నారు. ఆ తరవాత అకస్మా త్తుగా ఆయనకు ఎన్నికల మాట గుర్తొచ్చింది.

"మీ వోటెవరి కిస్తారు ? రావణా సురుడి కిస్తారా ? కుంభకర్ణుడి కిస్తారా ? వాళ్ళు దుర్మార్గులు, నీచులు, రాక్షసులు! నీతీ జాతీ లేనివాళ్లు ! రాముడంటే ఎంత గొప్పవాడు ! ఆ రాముడి పెళ్ళాన్ని ఎత్తుకుపోయినవాణ్ణి ఎంత బుద్ధి తక్కువ్వాడనాలి ? వాణ్ణి పగల గోసినా పాపంలేదు ! కొరతేసినా తప్పులేదు ! ఊరికే చంపెయ్యటం కాదు, అలాటి వాణ్ణి కత్తికి కండలు కోసి, ఉప్పూ, కారమూ రాయాలి..."

శ్రీవారికి ఆవేశం ఎక్కువై, నోటంట నురుగులు వచ్చి, మూర్ఛ పోయారు. ఆయన మనుషులు ఆయన చేత సీసాలో ఏదో తాగించి, స్పృహ తెప్పించినాక ఆయన, "అందుచే తేవిటంటే మీరంతా నాకే వోటు చెయ్యండి !" అని వేదిక దిగిపోయారు.

వోట్లన్నీ ఆయనకే పడ్డాయి.

***కొడవటిగంటి కుటుంబరావు***




గురుమూర్తి రిటైరయ్యాడు. భర్తతో పాటు తనూ ఇంటిపనిలో రిటైరయి పోయినట్టు అనిపించింది అనసూయమ్మకి. అతను రెస్టుతీసుకుంటుంటే తన నడుం వంగినట్టనిపించింది. అన్నాళ్ళూ అన్నేళ్ళూ సవ్యసాచిలా రెండు చేతులా కుటుంబాన్ని మెలితిప్పిన తను నీరసించి 'ఇక ఈ చాకిరి చెయ్యలేను బాబూ' అనుకుంది. అందుకని పని మనిషిని పెట్టుకోవాలని నిర్ణయించుకొంది. ఆ మాట భర్తతో చెప్పింది. అంగీకారం కోసం కాదు, కేవలం ముక్తాయింపు కోసం. అడ్మినిస్ట్రేషనంతా తనదే. "నీ యిష్టం" అన్నాడు గురుమూర్తి. ఎప్పటిలాగే.

అనసూయమ్మ చాలా నిక్కచ్చి మనిషి. ఆమె గృహనిర్వహణ గూడా పకడ్బందీగా ఉంటుంది. అందుకే కరెక్టు మనిషిని చూసుకోవాలని ప్రయత్నించింది, ఇప్పుడు తప్పని సరైగానీ పని

మనుషుల పొడగిట్టదామెకు. వాళ్ళలో స్వతహాగా దొంగలు కొందరు, పని దొంగలు కొందరు, కలహాలు రేపేవాళ్ళు కొందరు, యజమానులమీద స్వారీచేసే వాళ్ళు కొందరు- రకరకాల చికాకు మనుషు లుంటారని ఆమె అభిప్రాయం. ఆ ఉద్దేశంతోనే ఇన్నాళ్ళూ ఇష్టంలేక ఒంటి చేత్తో ఈడ్చుకొచ్చింది సంసారం.

వాళ్ళలో ఇన్ని అవలక్షణాలు సరి పెట్టుకున్నా దొంగతనం మాత్రం సహించలేదామె. దొంగబుద్ధి లేని పని మనిషిని ఎంచుకోవడం కోసం ఓ పద్ధతి పాటించింది అనసూయమ్మ.

ఆ రోజు కొత్తగా పనిమనిషి చేరింది. నలభై ఏళ్ళుంటాయి. నమ్రతగా కనిపిం చింది. ఏం చెబితే అది చకచక చేసు కొచ్చింది. అనసూయమ్మకి అన్నివిధాల నచ్చింది. అంతమాత్రాన లొంగిపోకుండా తన ప్లాను ప్రకారం రెండు రూపాయల నోటు మర్చిపోయినట్టు టేబిల్‌మీదఉంచి ఆ పనీ ఈ పనీ చూసుకోసాగింది. ఇది గనక మాయమైతే దాని పాడుబుద్ధి బైట పడుతుంది. మర్నాడు గెంటించుకుం టుంది. సాయంత్రం పనిమనిషి వెళ్ళి పోయాక చూసుకుంటే ఎరవేసిన నోటు గల్లంతయింది

"ఛీ! అనుకున్నంత పనీ అయింది. వీళ్ళ జాతే ఇంత? కోసినా బుద్ధిరాదు," అనుకుంది. భర్తతో ఈ విషయంచెప్పింది.

"పోన్లే రెండు రూపాయలతో పోయింది. ఇంకా నయం ఇంట్లో నగా నట్రా వున్నాయి,భద్రమేకదా" అన్నాడు,

"సర్లెండి. అంత తెలివి తక్కువ దాన్ని కాదు. వాటి జాగ్రత్తతో వుండే వట్టి రెండు రూపాయలు వదుల కున్నాను" అంది.

మర్నాడు పనిలోకి రాబోతూంటే దాన్ని నానామాటలు అని వెనక్కి పొమ్మంది. అంతేకాదు. గంట తిర క్కుండా మరో మనిషిని కుదుర్చుకుంది.

పదహారేళ్ళ పడుచుపిల్ల.

చెంగుచెంగు మంటూ దూకి పనులు సాగించింది.

"మొదటి రోజు ఇంతే. మంత్ర జలంలా పనులు చిటికెలో చేస్తారు. తర్వాత...ఆర్నెల్లకో గది ఊడుస్తారు. ఏడాదికో చెంబు తోముతారు. రోజుల కొద్దీ నాగాలు పెడతారు. వీలైతే మనకి నామాలు పెడ్తారు. అవన్నీ నాకెందుకు. దొంగబుద్ధి తేల్చుకోవద్దూ?" అనుకుంది అనసూయమ్మ.

మళ్ళీ మామూలే.

సాయంత్రానికి, ప్రయోగించిన రెండు రూపాయలనోటు తప్పుకుంది, మళ్ళీ గురుమూర్తికి చెప్పింది.

"పాపం ఛస్తారేంటి, దొంగతనాలు చెయ్యక! మనం ఇచ్చే పదిరూపాయలు ఏ మూల? వాళ్ళ కోణంలోంచి ఆలో చించి...ఏ పరిస్థితుల్లో అలా చేశారో కొంచెం ఆలోచించాలి," అన్నాడు.

గయ్యిమంది "నోరు ముయ్యి" అన్నంత మాట వదిలింది. "వాళ్ళకోణం లోంచి ఏం ఆలోచించాలి, సింగినాధం"

అని కసురుకుంది. గురుమూర్తి ముక్కు మీద వేలేసుకున్నాడు

మూడోరోజు.....రెండో పనిమనిషి నిష్క్రమణ, మూడో మనిషి పని ప్రవేశం, రెండ్రూపాయలనోటు అంతర్ధానం వరసగా జరిగిపోయాయి. అనసూయమ్మకి పట్టుదల సడలసాగింది. అయినా జంకలేదు ఆమె.

గురుమూర్తి ధైర్యంగా ఓ ప్రశ్న వేశాడు.

"అయితే అనసూయా! ఇలా ఎన్ని రూపాయలు పోగొట్టుకుంటావ్?"

ఆమెకి రోషం వచ్చింది. "నా కష్టం, కొన్ని వందలైనా సరే. ఇక్కడ డబ్బు ప్రధానంకాదు. సరైన పనిమనిషి దొరికే వరకూ పట్టువిడవను. ఇవాళ పోయింది చాలా తక్కువ కాని రేపు ఒళ్లంతా దోచేసి చక్కాపోతుంది. పాయింటు ఆలోచించరే?" అంది.

"సరే నీ ఇష్టం" అన్నాడు 'సరే నీ ఓపిక' అనే సాహసంలేక.

ఇలా పదిసార్లు ప్రయత్నించేసరికి అనసూయమ్మకి......రెండో ఎక్కం ప్రకారం పోగొట్టుకున్న సొమ్ము ఇరవై రూపాయలని తేలింది. అంటే రెన్నెల్ల పనిమనిషి జీతం, "హమ్మ!" అనుకుంది గుండెమీద చెయ్యేసుకుంటూ ఎందుకో నీరసం ఆవహించింది. 'ప్రపంచమంతా ఇంతేనా, దోపిడీకి? దొంగతనాలకి నిలయమా. నిజాయితీకి ఇంత కరువొచ్చిందా" అని వాపోయింది.

మేరుపర్వతంలాంటి మనిషి మంచు ముక్క అయింది- బాధ వేడికి కరిగి.

కానీ ఎక్కడా మనిషి క్రుంగినట్టు కనబడలేదు...ముఖ్యంగా భర్త దగ్గర. ఇక్కడ ఓడిపోయినా ఫర్వాలేదు, భర్తదగ్గర మాత్రం గెలవాలి. తన గెలుపు తెలియజేసి అతన్ని గెలిపేయాలి. అందుకు...నాటకం సమకూర్చుకుంది.

"ఇప్పుడేం చెబుతారు?"

"ఏమయింది?"

"చివరికి ఓడిపోయాను"

"ఈ సారి డబ్బు పోలేదా?"

"చెప్పా- చెయ్యకుండా పనిమనిషి అంటే ఇదే! మా పనిమనిషి మేనకోడలంటే పిల్లను పట్టాను...గుణానికి గుణం, పనికి పని" అంటూ అమాయకంగా కనబడుతున్న పద్దెనిమిదేళ్ళ పిల్లని మెచ్చుకోలుగా చూపించింది. నిజానికి ఈసారీ డబ్బుపోయింది. భర్తముందు తన ఓటమి కప్పిపుచ్చుకునే ప్రయత్నం యిది.

గురుమూర్తి నిట్టూర్చి బయటికి నడిచాడు. అనసూయమ్మ కేవలం భర్త ముందు గొప్ప చాటుకోవాలని దొంగ పిల్లని ఇంట్లో పెట్టుకుని గాలిలో దీపం పెట్టేంత తెలివితక్కువదికాదు. అంతా యింతేనన్న అభిప్రాయం బలపడింది. కాబట్టి...మనం జాగ్రత్తగా ఉండాలి గాని ప్రతి మనిషిమీద ప్రయోగాలు అనవసరం అనుకుంది. డబ్బా గిబ్బా లాక్

అండ్ కీ లో పెట్టుకుని 'కీ' బోర్డ్లో దోపుకుని ఎక్కడ పనిపిల్లవుంటే అక్కడ వెంటాడుతూ వెయ్యికళ్ళతో పారా కాయడం మొదలుపెట్టింది. 'కళ్ళలో ఒత్తులు వేసుకుని దానిచుట్టూ తిరగడం కంటే...తనపని తను చేసుకుంటే సుఖంలా వుంది' అని గొణుక్కున్న క్షణాలు లేకపోలేదు.

* * *

రిటైరయినా— ఫిల్టర్ సిగరెట్లు కాల్చే స్తోమత కొందరికి వుంటుంది. బీడీలు మాత్రం కాల్చుకోగలరు కొందరు.

రెండో ఉదాహరణకి చెందినవారు సర్వీసయిపోయి సొంతవూళ్ళో సెటిల్ అయిన బాల్యమిత్రులు గురుమూర్తి సుబ్బరాజు.

గురుమూర్తి లాల్చీ జేబులోంచి మూడు గుర్రాల బ్రాండు విస్కీ కాదు...బీడీకట్టతీసి...పొదిలోంచి బాణాలు లాగినట్టు రెండు తీసి తనొకటి పళ్ళమధ్యన గుచ్చుకొని సుబ్బరాజు కో టిచ్చాడు. అగ్గిపుల్ల గీసి అరచేతులు దాపుంచి బీడీలు వెలిగించాడు.

గురుమూర్తి పీల్చవలసిన దానికంటే ఎక్కువగా-అంటే వేగం అందుకునే రైలింజనులా గుప్పు గుప్పున పొగ వదుల్తుంటే సుబ్బరాజు అడిగాడు-

"అదేవిటోయ్. ఏం ఆలోచిస్తున్నావ్?"

"ఏమీలేదు."

"అబ్బే ఆలోచనకాదు. బాధలా వుందే."

"ఏం బాధలేవయ్యా. రిటైరయినాక బాధగాక ఏముంది. బతుకు కుక్కల పాలయినా బావుణ్ను. పెళ్ళాం పాలయింది."

"అంత దిగులెందుకోయ్."

"సర్వీసులో ఉన్నన్నాళ్లూ వెనకా ముందూ చూడకుండా డబ్బు తీసికెళ్ళి నమ్మకంగా ఆడదాని చేతిలో పోశా. ఇవాళ వెనక్కి తిరిగి చూసుకుంటే ఏముంది, దాని దయాదాక్షిణ్యాలమీద ఆధారపడాల్సిన గత్యంతరం తప్ప".

"నష్టం ఏమిటి? డబ్బు మీ ఆవిడ దగ్గర వుందికదా"

"ఉంటే ఎవడికి దక్కేను. పని మనిషికి నెలకి పదిరూపాయలు ఇవ్వడానికి వెనకాడదు...నా ఖర్చుదగ్గర గొడవ ?"

"ఆవిడ జాగ్రత్తగా వుంటే నువ్వు అపార్థం చేసుకోవడం బావోలేదు. రెండు పూటలా తింటున్నావ్ సుబ్బరంగా కాల్చుకోవటానికి బీడీకట్టలు దండుకుంటున్నావ్. ఇంకేం కావాలి జీవితానికి ?"

"సరి సరి. ఇది ఆఖరి బీడీ కట్ట. ఆ రకం సంపాదనకీ ఆట కట్టయింది. మా ఆవిడకి పనిమనిషి కుదిరిపోయింది."

పని మనిషి కుదరటానికీ, బీడీ డబ్బులకి సంబంధం తెలీక సుబ్బరాజు గురుమూర్తివంక ప్రశ్నార్థకంగా చూశాడు.

# మనసు లేని ప్రియురాలు

యర్రంశెట్టి సాయి



షాపింగ్ ముగించుకొని వడివడిగా ఇంటివేపు నడువసాగింది సీత. ఇంటి దగ్గర పాప తనకోసం ఎదురుచూస్తుం టుంది. తనతోపాటు వస్తానని మారాం చేసింది కానీ ఎత్తుకొని మార్కెట్టంతా తిరగడం కష్టమని తనే తీసుకురాలేదు. ప్రక్కింటి పిల్లలదగ్గర కూర్చోబెట్టి నాలుగు చాకొలెట్లు చేతికిచ్చి బయట పడింది. ఎదురుగ్గా చిన్న ఎయిర్ బాగ్ పట్టుకొని నడిచివస్తున్న వ్యక్తిని చూసి అతను... బాబూరావేనా ? మరింత దగ్గరవడంతో అతనిని ఖచ్చితంగా గుర్తించేసింది. అవును, బాబూరావే ? ఆ నడక తీరు ఏమీ మారలేదు ! ఇప్పు డేమిటి చెయ్యటం ? అతనిని పలుకరిం చాలా ? మాట్లాడకుండా తనదారిన తను పోతే ? ఊహు ! పలుకరించకుండా ఎలా ఉండగలదు ? అందుకు తన మనసు అంగీకరించడంలేదు. బాబూ రావ్ మరింత దగ్గరగా వచ్చేశాడు.

ఆశ్చర్యపోయింది సీత! అతను... కొద్దిక్షణాలు! అంతే! తనని దాటేస్తాడు! ఇప్పుడే— ఈలోగానే పిలవాలి! ఇప్పుడు అతనితో మాట్లాడే అవకాశం పోగొట్టుకుంటే, ఇంక మరెప్పటికీ ఆ అవకాశం దొరకదేమో! ఇన్నేళ్ళూ తామిద్దరూ ఎవరెక్కడున్నారో తెలీకుండానే గడిచింది. ఇప్పుడయినా కొద్దిక్షణాలు మాట్లాడుకొంటే సంతృప్తిగా ఉంటుంది.

"బాబూరావ్!" రోడ్డుపక్కనున్న షాపులవంక చూస్తూ నడుస్తోన్న బాబూరావ్‌ని పిలచింది సీత.

రోడ్డుకి అటువేపు అతను, ఇటువేపు తను! మధ్యలో హడావుడిగా నడుస్తోన్న జనం, రిక్షాలు, సైకిళ్ళు, కార్లు! బాబూరావ్ నిలబడిపోయి ఆశ్చర్యంగా పిలుపు వచ్చినవేపు చూడసాగేడు! నవ్వుతూ చేయి ఊపింది సీత! అతను రెండు క్షణాలపాటు తెల్లబోతూ చూసి, మరుక్షణంలో ఆనందాశ్చర్యాలతో ఆమె వేపు నడిచాడు త్వరత్వరగా! ఇద్దరూ ఓ పక్కకు నడిచి నిలబడ్డారు.

"నా కళ్ళని నేను నమ్మలేకపోతున్నాను..." కోలుకొంటూ అన్నాడతను.

"నిన్ను అంత దూరంనుంచీ చూస్తూనే ఉన్నాను! నువ్ షాపులవేపు చూస్తూ నడుస్తున్నావ్‌గానీ, నీ దృష్టి ఇటు ఉంటేనా?" నవ్వుతూ అంది సీత.

"మా అన్నయ్య కొడుకు బొమ్మలు తెమ్మన్నాడు. ఎక్కడ దొరుకుతాయా అని చూస్తున్నాను..." ఆమెను ఆసక్తిగా పరీక్షిస్తూ చూశాడతను.

"ఇప్పుడెక్కడ ఉండటం?" అడిగింది సీత.

"మా ఊళ్ళోనే! ఎల్.ఐ.సి.లో ఉద్యోగం చేస్తున్నాను. ఇక్కడకు ఆఫీసు పనిమీదవచ్చి రెండ్రోజులయింది. సాయంత్రం బస్‌కి తిరిగి వెళ్ళబోతూ షాపింగ్‌కి బయల్దేరాను... మీరుండటం ఇక్కడేనా?" అడిగాతతను.

"అవును! మావారికి ఇక్కడే ఉద్యోగం!..." కొంచెంగా సిగ్గుపడుతూ అంది సీత.

"నాకింకా అనుమానంగానే ఉంది. నిన్ను కలుసుకోవడం కలా, నిజమా అని..." కొద్దిక్షణాల తరువాత తిరిగి అన్నాడతను.

"చెయ్యి గిల్లమంటావా?" చిలిపిగా అతనివంక చూస్తూ అంది సీత.

బాబూరావ్ నవ్వుతూన్నపుడు ద్విగుణీకృతమయిన ఆమె అందాన్ని రెప్పలార్పకుండా చూశాడు.

"ఏమిటా చూడటం?" నవ్వాపుకొంటూ అడిగింది సీత.

"వివాహమయింతర్వాత అందరికీ అందం తగ్గిపోతుందంటారు. కాని, నీ రూపం అందుకు విరుద్ధంగా ఉందేం?"

"బావుంది! ఇద్దరం ఇలా రోడ్డు

మీద మన అందచందాలు గురించి పొగుడుకుంటుంటే జనం మూగిపోతారు."

"ఓహ్ ! సారీ ! పద, కొద్ది నిమిషాలు ఆ హోటల్‌లో కూర్చుందాం !" అన్నాడతను ఆమె ఏమంటుందో అని చూస్తూ.

"పద ! నాకూ కాసేపు మాట్లాడాలనే ఉంది, అన్ని విషయాలూ !..."

ఇద్దరూ హోటల్‌లోకి నడిచి ఫామిలీ రూమ్‌లో కూర్చున్నారు.

అతని కెదురుగ్గా కూర్చుంటే పాత స్మృతులు ఒక్కసారిగా చెలరేగినయ్ ఆమెకి. అప్పుడు... అప్పుడు కూడా ఇలాగే— చాలాసార్లు ఒకరి యెదురుగ్గా ఒకరు హోటల్లో కూర్చునేవారు. ఒకరి కళ్ళలోకి ఒకరు చూసుకొంటూ, పరవశంతో మాట్లాడుకుంటూ—

"ఇలా—మనం—మీ ఊళ్ళో హోటలో కూర్చునేవాళ్ళం గు ర్తుం దా ?" తలదించుకొని కూర్చున్నదల్లా కళ్ళు పైకెత్తి అతనివంకే చూస్తూ నెమ్మదిగా అ డి గిం ది సీత. ఇంచుమించుగా రహస్యం చెబుతున్నట్లుగా ఉందామె గొంతు. ఆమె అలా మాట్లాడేటప్పుడు ఆమె గొంతు ఎంతో శృంగారంగా, సెక్సీగా అనిపిస్తుందతనికి. ఆ సమయంలో ఆమెను కౌగిట్లో కసిగా నలిపి వేయాలనిపిస్తుంటుంది. ఆ గొంతు అతనిని ఎనిమిదేళ్ళు వెనుకకు విసిరేసింది. ఆ జ్ఞాపకాలు— అప్పటి తీయని అనుభూతులు— సంఘటనలు— అతనిని ఒక్కుమ్మడిగా చుట్టుముట్టేసినయ్ ! వాటి ఉన్నతాన్ని తట్టుకోలేక పోతున్నాడతను. మనసంతా అశాంతిగా తయారయిపోయింది

"నీ గురించి ఏమీ చెప్పవేం ?" తిరిగి అంది సీత.

"నాగురించి నీకేం కావాలి సీతా ?" పొడిపోయిన గొంతుతో అన్నాడతను.

"బావుంది ! ఏం కావాలేమిటి, డిటెక్టివ్ ప్రశ్నల్లాగా ?" నవ్విందామె.

"అబ్బ ! సీతా నవ్వకు..." లోలోపలే అనుకొన్నాడతను బాధగా ! ఆ నవ్వు తను భరించలేడు. అది కొన్ని జన్మల తామిద్దరి బాంధవ్యాన్ని బయటకు లాగుతుంది. అయినా సీత ఇంత హాయిగా ఎలా నవ్వగలుగుతోంది ! ఆమె నీ జ్ఞాపకాలు బాధించటం లేదూ ?

"నాగురించి ఏముంది చెప్పటానికి ? ఓ అమ్మాయీ, అబ్బాయీ ప్రేమించుకొన్నారు. ఇద్దరివీ శరీరాలుమాత్రమే వేరు— మిగతావన్నీ ఒక్కటే అనేంతగా కలిసిపోయారు. ఒకరిని విడిచి ఒకరు బ్రతకలేని స్థితికొచ్చారు. ఈ స్థితిలో అనుకోకుండా అవాంతరా లేర్పడ్డాయి. పెద్దలు వీరిని విడదీశారు. ఎవరెక్కడ ఎలా ఉన్నారో తెలీని పరిస్థితి ఏర్పడిపోయింది. అమ్మాయి కొంత కాలానికి ఆ షాక్‌నుండి కోలుకొని మరొకతనిని వివాహం చేసుకొంది అతను ఉద్యో

గంలో చేరి పాత స్మృతులనే వేటాడుతూ కాలం గడుపుతున్నాడు ..."

"ఇంక చాలు..." అసహనంగా అంది సీత. ఆమె కళ్ళవెంబడి నీళ్ళు తిరిగినయ్‌గాని చప్పున తుడిచేసుకొని— బలవంతంగా పెదాలమీదికి నవ్వు తెచ్చుకొంది

"సరే- ఆపేస్తాను..." బుద్ధిమంతుడిలా చేతులుకట్టుకొని కూర్చున్నాడతను "అందుకే నాగురించి నీకేం కావాలీ అనడిగాను. పిల్లా !"

ఆ సంబోధనతో చలించిపోయింది సీత. తనని అప్పుడప్పుడూ అలా పిలుస్తూండే వాడతను. తను కోపగించుకొనేది.

"పిల్లా అన్నందుకు కోపం వచ్చిందా ?" నవ్వుతూ అడిగాడు బాబూరావ్ !

ఆమె చిన్నగా మందహాసం చేసింది! ఇంతకూ అత నెందుకింకా వివాహం చేసుకోలేదు ! ఇంకా తనని మర్చిపోలేక పోతున్నాడా ? ఎలా మర్చిపోగలడు ? తామిద్దరిదీ అంత తేలికగా మరచిపోగలిగిన ప్రేమా ? భార్యా భర్తల మధ్య బాంధవ్యంకంటె పవిత్రమైన బాంధవ్యాన్ని తాము ఏర్పరచుకొన్నారు ! ఆ బాంధవ్యానికి ముగింపు లేదు అంతం లేదు. ఒకరినొకరు జీవితాంతం చూడలేకపోయినా సరే— ఇద్దరి మధ్యా ఎంత దూరమున్నా సరే— ఆ బాంధవ్యం అలాగే ఉంటుంది. ఆ స్మృతులు మనసునంటిపెట్టుకునే ఉంటాయ్ !

"సరే ! నా గొడవదేముంది కానీ, నీ గురించి ఏమీ చెప్పవేం ?" ఆమె కళ్ళ ల్లోకి చూస్తూ అడిగాడతను అప్పటికీ ఇప్పటికీ ఆమె రూపంలో చాలా మార్పులు గమనించాడతను. అప్పటి కంటె కొంచెం లావయింది. ముఖంలో చిలిపితనం గుర్తుల్లేకుండా పోయింది. మరింత అందం తీవి చోటుచేసుకొన్నయ్ ! కళ్ళలో మెరుపు కొంత తగ్గింది. కాని ఆకర్షణ పెరిగింది. బుగ్గలు నునుపెక్కినయ్ ! ఆమె గుండెలు— నడుమూ— శరీరమంతా స్త్రీ— పరిపూర్ణతని సాధించింది.

ఆ శరీరం తనది. ఆ గుండెల వెనుక హృదయం తనది. అమె సర్వస్వం తనదే ! తనకు ఆమెమీద సర్వాధికారాలున్నాయ్ ! కాని... కాని... ఆమె మరొకరిసొత్తు ! మనసొక చోట— తనువొకచోటగా చిత్రవధ అనుభవిస్తోన్న జీవితం ఆమెది. సీత చెప్పకపోయినా తనకా విషయం తెలుసు.

"నాగురించి చెప్పేంత ఏమీ లేదు. నేనూ, శ్రీవారూ— మాకో ముద్దుల పాప! పాపకి నాలుగేళ్ళు. నలుగురికి శుభ్రంగా సరిపోయేంత ఆదాయం వారికి !" నవ్వుతూ అంది సీత.

ఆమె అలా చెప్తోంటే అతని మనసంతా వికలమయిపోయింది. ఆ శ్రీవారు

తనయి ఉండాల్సింది. ఆ పాప తనకూ, సీతకూ పుట్టి ఉండాల్సింది ఆ సంసారం తనదయి ఉండాల్సింది. భగవంతు డెందుకిలా చేశాడు? తన తల్లి దండ్రులూ, ఆమె తల్లిదండ్రులూ అందరూ కూడబలుక్కొని తమనెందుకు విడదీశారు?

సీత అతనివంకే చూస్తోంది! తనకు తెలుసు! అతను ఇంకా ఆ బాధనుంచి కోలుకోలేకపోతున్నాడు. ఆ ఆలోచనలు, ఆ జ్ఞాపకాలు అవన్నీ అతని గుండెల్లో ఇంకా పదిలంగానే ఉన్నయ్! అందుకే అతనింకా వివాహం చేసుకోలేదు. అందుకే అతనింకా మామూలు మనిషి కాలేదు. అతని గుండెల్లో ఇంకా సీత పదిలంగానే ఉంది. భగవంతుడా— అతనికి కావలసిన అమ్మాయిని దూరం చేశావ్. కాని ఆ స్మృతులనుంచి ఎందుకు దూరం చేయలేదు? నీ మనసు కూడా రాతిదేనా?

"మా ఇంటికెళ్దాం రా బాబూరావ్! మా పాపని, మా శ్రీవారినీ చూసి వెళ్ళవూ?" అలా అంటూంటే ఆమె కళ్ళవెంబడి నీళ్ళు తిరిగాయ్.

"తప్పకుండా వస్తా సీతా! నువ్వు కోరిందేదయినా కాదన్నానా?"

"అలాగయితే పద! ఇంక ఆలస్యం దేనికి? ఇంటిదగ్గర పాపకూడా నాకోసం ఎదురుచూస్తుంటుంది!" అంది లేచి నిలబడుతూ.

ఇద్దరూ హోటల్లోనుంచి బయటికొచ్చారు.

ప్రక్కగా ఉన్న రిక్షాని పిలిచింది సీత. ఇద్దరూ రిక్షాలో కూర్చున్నారు. అయిదునిమిషాల్లో ఆమె ఇంటిముందు ఆపాడు రిక్షా.

"రా!" అతన్నుద్దేశించి అని తలుపు తాళం తీసింది సీత. ఆమె వెనుకే ఇంట్లోకి అడుగుబెట్టాడతను.

"ఆయన ఆఫీస్ కెళ్ళారు. సాయంత్రానికిగాని రారు. ఇలా కూర్చో. ఇప్పుడే పాపని తీసుకొస్తాను..." అంటూ బయటకెళ్ళి రెండునిముషాల్లో ఓ పాప చేయి పట్టుకొని నడిపించుకొంటూ లోపలికి తీసుకొచ్చింది. అచ్చం సీతపోలికే పాప! ముఖ్యంగా కళ్ళు— నోరూ— పాపని తన చేతుల్లోకి తీసుకొని ఎత్తుకోబోయాడతను. ఒక్కసారిగా కంగారుపడి బిగ్గరగా ఏడ్చేయసాగింది పాప!

"కొత్తకదూ! ఇప్పుడప్పుడే రాదు నీ దగ్గరకు..." తిరిగి తన చేతుల్లోకి తీసుకొని ఎత్తుకొంటూ అంది సీత.

బాబూరావ్ మాట్లాడలేదు. పాప ఇంకా ఏడుస్తోనే ఉంది.

"ఉండు! ఇప్పుడే తీసుకెళ్ళి ప్రక్కింట్లో వదిలేసివస్తాను! ఆ పిల్లలతో బాగా ఆటలాడటం నేర్చుకుంది ఎప్పుడూ అక్కడే ఉంటుంది..." అంది సీత. రెండునిమిషాల్లో ఒంటరిగా

తిరిగి వచ్చింది సీత. తలుపులు దగ్గరగా మూసి టేబుల్‌దగ్గర గోడకానుకోని నిలబడిందామె.

''ఎలావుంది మా ఇల్లు ?''

"ఏదీ, ఈగది ఒక్కటేగా నేను చూసింది ?"

"రా ! లోపలకు వెళ్దాం—" అంటూ అతనోపాటుగా పక్కగదిలోకి నడిచింది.

"ఇది పడగ్గది—" అంది గోడవేపు చూస్తూ.

రెండు అందమైన డెకొలామ్ మంచాలూ, పరుపులూ, అందమైన కర్టెన్లూ, దుప్పట్లూ టేబుల్‌మీద ఖరీదయిన రేడియో, గోడకు రాధాకృష్ణుల కౌగిలింతలబొమ్మలూ – ఆ దృశ్యాన్ని సహించలేకపోతున్నాడు బాబూరావ్. ఈ మంచంమీదే సీత ఆమె భర్త కౌగిట్లో నలిగిపోతుంది. మనసులో తనూ— ప్రక్కలో భర్తా— కళ్ళు మూసుకొంటే తనూ, తెరిస్తే ఆమెభర్తా— సీతా! సీతా! సీతా— నీ పరిస్థితి నేను చూడలేను !

"ఈ రెండు కాక పక్కన వంటిల్లూ— వెనుక చిన్న ఖాళీస్థలం ! అందులోనే నేను పూలమొక్కలు పెట్టేశాను..." గది బయటికొస్తూ అంది సీత.

ఆమె వెనుకే పెరట్లోకి నడిచాడతను.

గులాబి అంట్లూ— ఓ పక్కగా సన్న జాజి పందిరీ మరేవో పూలమొక్కలూ ఉన్నయ్ !

తిరిగి ముందుగదిలోకి నడిచి సోఫాలో కూర్చున్నాడతను. అతని కెదురుగ్గా కుర్చీలో కూర్చుంది సీత. పడక్కుర్చీ తన దగ్గరవేసిన బ్లూరంగు గుడ్డమీద 'ఐ లవ్ యూ' అన్న అక్షరాలు కనిపించినయ్ !

సీత ఆలోచిస్తోంది ! అతని భవిష్యత్తేమిటి ? ఇలా తనని తలుచుకొంటూ కాలం గడిపడమేనా ? అతనిని మార్చడం ఎలా ? మామూలు లోకంలోకి తేవడం ఎలా ?

"ఇంకా పెళ్ళెప్పుడు చేసుకొంటావ్?" చటుక్కున అడిగింది సీత.

"పెళ్ళా ?" విస్మయంగా ఆమెవంక చూశాడతను.

"అవును ! ఏం ? పెళ్ళిలేకుండా బ్రహ్మచారిగానే ఉండిపోతావా ?" కిలకిల నవ్వేస్తూ అంది సీత. జారిపోతున్న ఆమె పైటను తిరిగి సర్దుకొంది.

"శాస్త్రయుక్తంగా కాలేదేమోకాని, మన వివాహం ఏనాడో అయిపోయింది!" నవ్వుతూ అన్నాడు బాబూరావ్.

సీత ఉక్కిరిబిక్కిరయింది.

"ఓ పెళ్ళయిన అమ్మాయితో అలా మాట్లాడొచ్చా ?" నవ్వుతెచ్చుకొంటూ తేలిగ్గా అనడానికి ప్రయత్నించింది.

ఆ తరువాత ఏం మాట్లాడాలో ఎవ్వరికీ తెలీలేదు. సీత నిశ్శబ్దాన్ని భరించలేక పడగ్గదిలోకెళ్ళి రేడియో ఆన్ చేసింది.

"ఆఖరిపాట వాగ్దానం చిత్రంలో-" అంది ఓ గొంతు.

దాని వెనుకే పాట "నా కంటిపాపలో నిలిచిపోరా, నీ వెంట లోకాల గెలవ నీరా..." ఉలిక్కిపడి బాబూరావ్ వంక చూసింది సీత. ఆ పాట తమిద్దరికీ సంబంధించినది. మొదటిసారి తామిద్దరూ ప్రేమలేఖలద్వారా పెంచుకొన్న అనుబంధాన్ని మాటల్లో తెలుపుకుంది ఆ సినిమాలోనే! ఆ చీకట్లో అతని స్పర్శను మొదటిసారి చవిచూసింది తను. సినిమాలో ప్రేమ దృశ్యం వచ్చినప్పుడు తన భుజం చుట్టూ చేయివేసి తన ముఖాన్ని అతని వేపుకి తిప్పుకొని తన పెదాలపై చుంబించింది కూడా ఆ సినిమాలోనే. అంచేతే ఆ పాట వింటూంటే తీయని ముధ శరీరమంతా ప్రవహిస్తుంది.

బాబూరావ్ ఆమెకు అతి సమీపంగా నిలబడటం ఆమెకు తెలీలేదు. పాట ఆగకుండా మార్మోగుతోనే ఉంది.

"సీతా!" ఆమె ముఖంమీద అతని ఊపిరి వేడిగా తగులుతోంది. తనని తను సంబాళించుకోలేక పోతోందామె.

"ఊ!" అతికష్టంమీద అంది నెమ్మదిగా, బాబూరావ్ భరించలేకపోతున్నాడు. ఆ రోజు వర్షంలో- ఆ సినిమాచూసి ఇద్దరూ తడుస్తూ- రిక్షాలో ఇల్లు చేరుకోవడం- అక్కడ సీతవాళ్ళింటి ఆరుబయట- ఒకరినొకరు హత్తుకుపోయి- ఒకరిలో ఒకరు లీనమయిపోయి- ఎంత సేపు? ఎంత మధురమైన సమయం అది?

సీత విస్తుపోతూ అతని ముఖంలోకి చూసింది. పాట ఇంకా వినబడుతోనే ఉంది.

అతని చేతులు ఆమెచుట్టూ బిగుసుకుపోయినయ్! ఆమెని బలంగా తన గుండెల్లోకి హత్తుకొంటున్నాడతను. ఆమె ముఖమంతా అతని పెదాలు రుద్దుకొంటున్నయ్!

సీతా! సీతా! సీతా!

అబ్బ! ఎన్నియుగాల విరహం? ఎన్ని సంవత్సరాల నిరీక్షణ.

అతని కౌగిలిలో అదే ఉధృతం! అతని కళ్ళల్లో అదే కోరిక! సీత ప్రతిఘటించలేకపోతోంది. ఆమె మనసు తీవ్ర సంక్షోభానికి గురయింది. ఇదేమిటిలాజరుగుతోంది? తనతనిని అలాంటి ఉద్దేశ్యంతో ఆహ్వానించలేదే! ఈ సుఖం కోసం అతనిని పలుకరించలేదే? ఇలాంటిది జరుగుతుందనయినా ఊహించలేదే!

"నీకోసం పిచ్చివాడినయి పోయాను సీతా అనుక్షణం నువ్వే నా కళ్ళల్లో ఉంటావ్! ఎందుకో తెలీదుకాని నాకు గట్టి నమ్మకం ఏర్పడిపోయింది ఏనాటికయినా మనం తిరిగి కలుసుకొంటాము. అప్పుడు మనం కలయికని ఏ దేవతలూ అడ్డలేరు సీతా! నన్ను తలచుకొంటూ

నువ్వెంత చిత్రవధ అనుభవిస్తున్నావో అన్న బాధ నన్ను మరింత కృంగ దీసేది. కాని ఏంచేసేది. ఆ రోజు నువ్వు... హఠాత్తుగా మాయమయి పోయావ్ ! అర్ధరాత్రి నిన్ను మీ తల్లి దండ్రులు వచ్చి తీసుకెళ్ళిపోయినట్లు నాకు తెలిసింది. ఆ రోజునుంచీ నిన్నెలా కలుసుకోవాలా అనేదే నా ఆలోచన అయిపోయింది... కాని... కాని..."

"ఇంక వదులు..." అతని కౌగిలి నుండి విడివడడానికి ప్రయత్నిస్తూ అంది సీత.

"ఎలా సీతా ! నాకు మనశ్శాంతి లభించేది కేవలం నీ సాన్నిధ్యంలోనే."

"బావుంది... నేనింకా అదివరకటి సీతనే అనుకొంటున్నావా, ఏమిటి ?" నవ్వేస్తూ అంది సీత.

"నాకెప్పుడూ నువ్వు అదివరకటి సీతవే సీతా ! నీ మనసుకీ తెలు సీ సంగతి !"

"దయచేసి నన్నొదులు ! పాప ఏ క్షణంలోనయినా లోపలికి రావచ్చు." దీనంగా అంది సీత.

బాబూరావ్ ఆమెను మరింత కోరికతో గుండెలకు హత్తుకొన్నాడు.

"బాబూరావ్ ! నిన్ను బ్రతిమాలుకొంటున్నాను. వదులు ! ఈ శరీరం స్పర్శ నీకు కొత్తదా ? ఎందుకిలా బలవంతపెడతావ్ ! ఇదిగో ! ఈ మంగళ సూత్రం, ఇది తప్పని చాటటంలేదూ?"

రేడియోలో పాట ఆగిపోయింది.

తక్కున ఆమెను వదిలేశాడు బాబూరావ్. ఆయాసంతో గోడకు జేరబడి కళ్ళుమూసుకొంది సీత. బాబూరావ్‌కి ఆమె తలమీదుగా ఆమె భర్తతోపాటు దిగిన ఫోటో కనిపించింది. నెమ్మదిగా వెనక్కునడిచి కుర్చీలో కూలబడి పోయాడు. సీత చాలా సేపటికి గాని కోలుకోలేకపోయింది. అతని పెదాలు చుంబించిన తన చెక్కిళ్ళూ, తన పెదాలూ మండిపోతున్న ట్లనిపించ సాగిందామెకి.

ఎంత ప్రమాదపరిస్థితినుంచి బయట పడింది తను ! జీవితాంతం మరో సమస్యతో నలిగిపోయేది.

పాప తలుపులు తీసుకొని లోపలి కొచ్చింది. అమాంతం పాపనెత్తుకొని అక్కడినుంచి వంటింటివేపున నడిచింది సీత

కొద్దిసేపటి తర్వాత పాపను గదిలో నిద్రపుచ్చి, రెండుకప్పుల్లో 'టీ' తీసుకొచ్చి ఓ కప్పు అతనికందించింది సీత.

"సీతా ! మీ శ్రీవారు నిన్ను ప్రేమగా చూస్తారా ?" అడిగాడు బాబూరావ్.

"ఓ ! మరీ పిచ్చిప్రేమ ! ఒక్క క్షణంకూడా నన్నొదిలి ఉండలేరనుకో ? ఆఫీసునుంచి వచ్చారంటే చాలు ! నా కొంగుపట్టుకొనే తిరుగుతారు ఇంట్లో !



ఒకోసారి నాకు చిరాకుకూడా కలుగుతుంది !" అంది సీత.

"నేనెప్పుడయినా నీకు గుర్తుకొస్తానా ?" జవాబు తెలిసీ అడిగాడు బాబూరావ్.

"నువ్వా! భలేవాడివే! ఎందుకుగుర్తుకి రావు ! ఈ ఆరేళ్ళ సంసార జీవితంలోనూ రెండుమూడుసార్లు గుర్తుకొచ్చావ్ ! అయినా అంతగా ఆలోచించే తీరికేది నాకు ? చెప్పానుగా మా ఆయన సంగతి ! ఆయనో చిన్న పాపాయి అనుకో ! అంటే ఇద్దరు పాపల్ని చూసుకోవాలన్నమాట నేను...ఎంత కష్టమో నీకు తెలుసుకదా, ఇద్దరు పాపల్ని చూడటమంటే !" ఇంకా నవ్వుతూనే అందామె.

షాక్‌తిన్నట్లయింది బాబూరావ్‌కి. సీతకి ఇన్నేళ్ళలోనూ తను గుర్తుకొచ్చింది ఏ రెండు మూడుసార్లోనా ? ఇదెలా సాధ్యం ! తనకి అనుక్షణం ఆమె గుర్తుకొస్తూనే ఉందే ! ఒకవేళ ఇదంతా ఆమె భర్త ప్రభావమా ? అతని సాంగత్యంవల్ల పూర్తిగా మారిపోయిందేమో! ఊహు నమ్మడానికి వీల్లేని నిజం ఇది !

"నువ్వింకా పెళ్ళెందుకు చేసుకో

లేమ ?" అడిగింది సీత. "త్వరగా చేసే సుక్తో ! నేనూ మొదట్లో 'పెళ్ళి' అంటే భయపడ్డాను తెలుసా ? నిన్ను ప్రేమించి మరొకరిని పెళ్ళాడ్డం ఎలాగా అని సత మతమయిపోయాను కాని తీరా వివాహ మయింతర్వాత తెలిసింది, మనిషికి వివాహం ఎంత అవసరమో ! అందు నా ముఖ్యంగా మనలాంటి దురదృష్ట ప్రేమికులకి ! వివాహమయిన రెండో రోజునుంచే ఆయన నాకు ఎన్నో రోజు ల్నుంచీ పరిచయమున్న వ్యక్తిలా అని పించసాగారు. మా ఇద్దరిమధ్యా అపా ర్థాలు- అలగడాలవంటి వేమీలేవు. నే నెలా చెప్తే అలా చేస్తారాయన. ఇంక ఇంత అన్యోన్యంగా ఉంటూంటే వేరే ఊహలు— పాత జ్ఞాపకాలు ఎలా చోటు చేసుకొంటయ్ !" ఇంకా నవ్వుతూనే ఉందామె !

బాబూరావ్ సహించలేకపోతున్నాడు. ఏమిటి సీత ఇలా మాట్లాడుతోంది ! జీవితాంతం ఆమెకీ తనకీ కూడా మన శ్శాంతి ఉండదనీ —— ఒకరినొకరు ఎప్పుడూ తలచుకొంటూనే గడుపుతారనీ అనుకొన్నాడు. కానీ ఇక్కడ సీత ఎంత తేలిగ్గా, సునాయాసంగా పాత జీవితం మరిచిపోయి కొత్తజీవితం ప్రారంభించింది. ఎంతో సుఖంగా, అన్యోనంగా కాపరం చేసుకొంటోంది. ఆడవాళ్ళు ఇంత తేలిగ్గా మార్పులు చెందుతారా ! సీతమీద మొదటిసారిగా కోపం వచ్చింది అతనికి.

"ఒకసారి— ఇలాగే మార్కెట్ కెళ్ళాను. ఇంటికి తిరిగొచ్చేసరికి సాయంత్రం ఆరయిపోయింది. అప్పటికే ఆయన ఆఫీసునుంచి వచ్చి ఇంటిదగ్గ రున్నారు. ఆఫీసునుంచి వచ్చేసరికి నేను ఇంటిదగ్గర కనిపించలేదని ఎంత కోపం వచ్చిందో తెలుసా ? నాతో మాట్లాడ లేదు చాలాసేపటివరకూ ! ఆయన మాట్లాడకపోతే నాకు ఏడుపొచ్చే సింది. ఊహ తెలిసింతర్వాత మొదటి సారి ఏడ్చాను. మనిద్దర్నీ మనవాళ్ళు విడదీసినప్పుడు కూడా నాకంత దుఃఖం రాలేదు. నా ఏడుపుచూసి ఆయన గాభరాపడిపోయారు. దగ్గరకు తీసుకొని ఎంతోసేపు సముదాయిస్తేగాని నేను ఊరుకోలేదు. అప్పటినుంచీ నన్నో చిన్నపిల్లలా చూసుకొంటారాయన..." నవ్వుతూ అంది సీత.

బాబూరావ్ భరించలేకపోతున్నాడు.

"ఏమిటి! తనిక్కడికొచ్చింది-సీతా- ఆమె భర్తా ఆడుకొనే ప్రణయకలహాలు- కలాపాలు గురించి తెలుసుకోడానికా ? ఆమె ఉంటున్న ఇల్లు చూడడానికే? ఆమె కన్న పాపని ముద్దుపెట్టుకోడానికా ! ఈ సీత తనూహించుకొంటున్న సీత కాదు. ఈ సీతకు మనసులేదు. ఈ సీత క్కావలసింది ప్రస్తుతం, గతం ఈమె గుర్తుంచుకోదు. గతాన్ని అక్కడే వది లేయడం ఈమె హాబీ ! వివాహానికి

యన




ముందు జరిగిన కథంతా ఈమె దృష్టిలో అతి స్వల్పమైన ప్రాముఖ్యతగలది.

"ఇక నేను వెళ్తాను సీతా !" లేచి నుంచుంటూ అన్నాడు బాబూరావ్.

"అప్పుడేనా ? ఆయనొచ్చేవరకూ ఉండకూడదూ ! ఇంకో అరగంటలో వచ్చేస్తారు..."

ఎందుకూ ? బహుశా ఆయనని తనకి పరిచయం చేస్తుంది కాబోలు— ఇతను నా పాత ప్రేమికుడు— 'వీరు నా భర్త, ప్రస్తుతం నేను ప్రేమిస్తోంది ఈయననే' అని.

"ఊహూ ! బస్సుకి టైమయింది సీతా! ముందే రిజర్వేషన్ చేసుకొన్నాను. వస్తానుమరి... నాకు సంతోషంగా ఉంది ! నువ్వు ఇంత సుఖంగా ఉన్నందుకు !—"

బయటివరకూ అతని వెనుకేవచ్చి ఆగిపోయింది సీత.

"ఈ ఊరెప్పుడయినా వచ్చినప్పుడు— ఇక్కడికి తప్పక వస్తూంటావు కదూ!"

"ప్రయత్నిస్తాను..." వడివడిగా నడిచాడతను. అతనికి మనసు పూర్తిగా పాడయిపోయింది. సీత హాయిగా భర్తతో సంసారం చేసుకొంటోంది. అతన్ని ప్రేమిస్తోంది. అతను మాట్లాడకపోతే ఏడుస్తోంది. అతను దగ్గరకు తీసుకొంటే పొంగిపోతోంది. అతనికో పాపని కని ఇచ్చింది. మరో బాబుని కంటుంది. వాళ్ళను పెంచుతుంది. పెద్దవారినిచేస్తుంది. అతనే ఆమెకు

సర్వస్వం, తన సంసారమే ఆమెకు స్వర్గం

అలాంటి సీతను తలుచుకొంటూ ఆమెతో గడిపినరోజులే మనసులో ఉంచుకొని— ఆనాటి ప్రణయమే కళ్ళల్లో నిలుపుకొని— పెళ్ళే వద్దంటూ, తననే చేసుకొంటానని పట్టుబట్టిన మావయ్యా కూతురు రాధికని కాదని— నిర్లిప్తంగా, నిర్లిప్తంగా జీవితం గడుపుతున్నాడు తను. ఎందుకిలా? ఎవరికోసం? ఏం సాధించాలని?

ఊహూ! తను మారాలి! తన ఆలోచన మారాలి! తనూ గతాన్ని మర్చిపోవాలి! క్రొత్త జీవితాన్ని ప్రారంభించాలి—

వడివడిగా నడవసాగాడు బాబూరావ్.

అతనినే ఎంతో దూరంవరకూ చూస్తూ నిలబడిపోయిన సీత కళ్ళ వెంబడి నీళ్ళు తిరిగినయ్! దుఃఖం ఆపుకోలేక ఇంట్లోకి పరుగెత్తి తన పెట్లోంచి అడుగున పడివున్న బాబూరావ్ ఫోటో పైకితీసింది. అతని రూపది చూస్తూంటే. అతని నవ్వు చూస్తూంటే, గుండెలు పిండేస్తున్నట్లు బాధ. వెక్కి-వెక్కి- ఏడ్చేయసాగిందామె.

"నిన్నెలా మర్చిపోను- ఎలా మరచిపోగలను? నేను నరకం అనుభవిస్తున్నాను బాబూరావ్! ప్రతిక్షణం నీ స్మృతులే నన్ను చిత్రవధ చేస్తుంటయ్! కేవలం నా శరీరమే ఇక్కడుంది. ఇవన్నీ నీకు చెప్తే- నిన్ను మరింత కృంగదీసిన దాన్నవుతాను. నీ జీవితం శాశ్వతంగా నరకంచేసిన దాన్నవుతాను! అందుకే— అబద్ధాలు చెప్పాను! నేను సుఖంగా ఉన్నాననీ, మాది అన్యోన్యంగా సాగుతోన్న సంసారమనీ— ఆయన నన్ను పువ్వుల్లోఉంచి పూజిస్తున్నారనీ, అసలు నీ విషయమే నాకు గుర్తుండదనీ— అంతా అబద్ధం. ఇవన్నీ విని నువ్వు మనసు కష్టపెట్టుకొంటావని తెలుసు. నన్ను ద్వేషిస్తావని తెలుసు. నాక్కావలసింది కూడా అదే- నామీద కోపంతోనయినా, నువ్ మామూలు మనిషివయి— పెళ్ళిచేసుకొని— నన్ను మర్చిపోడానికి ప్రయత్నించాలి...అంతకంటె మనం చేయగలిగిందేముంది..."

కన్నీళ్ళు ప్రవహిస్తోండగానే తలుపు చప్పుడయింది.

"సీతా!..." భర్తగొంతు వినిపించింది బయటినుంచి. చటుక్కున లేచి ఫోటో పెట్లో దాచేసి, కన్నీళ్ళు తుడుచుకొని! పెదాలమీదకు చిరునవ్వు తెచ్చుకొని తలుపు తెరవడానికి వెళ్ళింది సీత.






“మీ హేండ్‌బేగ్ బావుంది. ఎక్కడ కొన్నారు?” అడిగాడు గంగాధర్ ఆమెని, సికింద్రాబాద్ స్టేషన్ లోంచి-బయటికి నడుస్తూ.

“ఎగ్జిబిషన్‌లో.” చెప్పిందామె నవ్వి.

“చాలా బావుంది. మంచి టేస్ట్ మీది.”

“థాంక్స్.”

"ఏ స్టాల్‌లో ?"

చెప్పిందామె.

కొండచిలువ చర్మంతో చేసిన హేండ్‌బేగ్ అది. చూపరులను ఇట్టే ఆకర్షిస్తుం దా బేగ్, పసుపు పచ్చ రంగులో నిగనిగలాడుతూ.

గంగాధర్ ఆమెని చాలాకాలంనుంచి చూస్తున్నాడు. ఇద్దరూ ప్రతి ఉదయం బొల్లారం స్టేషన్‌లో లోకల్ ఎక్కి సికింద్రాబాద్ రైల్వే స్టేషన్‌లో దిగుతారు. గంగాధర్ నలభై నంబర్ బస్ ఎక్కుతాడు. ఆమె ముప్పై మూడో నంబర్ బస్ ఎక్కడం చాలాసార్లు గమనించాడు. ఒకోసారి సాయంత్రం లోకల్ ట్రెయిన్‌లో కూడా తారసపడుతుందాఅమ్మాయి గంగాధర్‌కి. ఉద్యోగం చేస్తోందనుకున్నాడు.

అందమైన ఆ హేండ్‌బాగ్‌తో ఆమె కనబడగానే, చూపులతో ఏర్పడ్డ పరిచయాన్ని పురస్కరించుకుని ఆ బేగ్ దొరికేచోటు, దాని ఖరీదు, ఇంకా ఆ అమ్మాయి గురించి అనేక విషయాలు తెలుసుకున్నాడు.

మర్నాడు బొల్లారంలో ఇద్దరూ ఒకే కంపార్ట్‌మెంట్‌లో ఎక్కారు.

"మీ రెక్కడ పనిచేస్తున్నారు ?" అడిగాడు.

"సనత్‌నగర్‌లో."

తను పనిచేసే కంపెనీ పేరు చెప్పింది.

"మీరు ?"

"నాంపల్లిలో."

తను పనిచేసే ఆఫీస్ పేరు చెప్పాడు.

"చాలా దూరం."

"మీదీ చాలా దూరమే. రోజుకి నాలుగుగంటలు వెళ్ళి రావడానికే సరిపోతుంది "

వారం తర్వాత గంగాధర్ చెప్పాడు.

"నిన్న ఎగ్జిబిషన్‌లో కొన్నాను అచ్చం మీ చేతిలో ఉన్నలాంటి హేండ్ బేగ్."

"మీ ఆవిడని తీసుకురండి ఎప్పుడైనా. మా ఇంటి ఎడ్రస్ చెప్పాగా."

"తప్పకుండా ... మీ బస్‌కి ఇంకా పదినిముషాలు టైం వుందిగా. కాఫీ తాగుదాం వస్తారా ?"

"పదండి. మీరు హేండ్‌బేగ్ కొన్న సందర్భంగానా ?" అన్నది ఆ అమ్మాయి నవ్వి.

మరో వారం గడిచాక ఇద్దరిమధ్యా పరిచయం బలపడింది బొల్లారంనుంచి సికింద్రాబాద్ స్టేషన్ చేరుకునేదాకా ఇద్దరూ అనేక విషయాలు – స్వంత విషయాలు కూడా – మాట్లాడుకోవటం పరిపాటి అయిపోయింది వారిద్దరికీ.

* * *

గంగాధర్ సికింద్రాబాద్ స్టేషన్‌దగ్గర వున్న బొల్లారం వెళ్ళే బస్‌స్టాప్‌దగ్గరికి చేరుకున్నాడు శనివారం. సికింద్రా

బాడ్ స్టేషన్ దగ్గరవున్న ఓ హాల్లో సినిమా చూడటానికి మేట్నీకి వచ్చింది గంగాధర్ భార్య.

ఇద్దరూ సాయంత్రం బస్‌స్టాప్ దగ్గర కలుసుకుని, అక్కడినుంచి ఇంటికి బస్‌లోనో, లోకల్ లోనో వెళ్ళాలని ఉదయమే నిర్ణయించుకున్నారు. అందుకని గంగాధర్ ఆఫీసు వదలగానే సరాసరి సికింద్రాబాద్ స్టేషన్ చేరుకున్నాడు త్వరగా భార్య ఎదురు చూస్తూంటుందని.

దూరంనుంచే చూసాడు భార్యని.

ఒక్కతే వుంది. పక్కన నిలబడ్డ పాతికేళ్ళ యువకుడితో ఏదో చెప్తోంది. అతను మళ్ళీ ఏదో అంటున్నాడు. టెరీకాటన్ బట్టల్లో హుందాగా వున్నాడతను.

గంగాధర్ భార్యదగ్గరికి వెళ్ళి, లోకల్ కుద్దామని పిలుచుకు వెళ్ళాడు స్టేషన్‌లోకి ఆదరాబాదరాగా.

లోకల్ సరిగ్గా టైముకి వచ్చింది. అక్కడ అడిగాడు గంగాధర్ బస్‌స్టాప్ లోని ఆ వ్యక్తి ఎవరని.

"ఏమో, నాకే తెలియదు."

"మరయితే ఏం మాట్లాడుకుంటున్నారు మీరు ?"

"నా హేండ్‌బేగ్ చూసి పలకరించాడు. బావుందని, ఎంతకు కొన్నారనీ, ఎక్కడ కొన్నారనీ అడిగాడు. చెప్పాను. తన పేరు, ఉద్యోగం ఇలా ఏవో చెప్తూంటే, ఇంతలో మీ రొచ్చారు."

రైలు దిగి ఇంటికి వెళ్ళాక గంగాధర్, తన భార్య హేండ్‌బేగ్‌లోని వస్తువులను టేబిల్‌మీద కుమ్మరించి, దాన్ని బీరువాలో వుంచాడు ఓసారి దానివంక చూసాడు. కొండచిలువ చర్మంతో తయారుచేయబడ్డ ఆ బేగ్ ఏదో జ్ఞానోదయం కలిగించినట్లుగా నవ్వుతున్నాడు మృదువుగా. తలుపు మూసి, టేబిల్‌మీద వస్తువులను తన భార్య పాత హేండ్‌బేగ్‌లోకి మార్చాడు.

సనత్‌నగర్‌లో పనిచేసే "ఆ అమ్మాయి"తో మర్నాడు అనుకున్న విధంగా ఫస్ట్‌షో సినిమాకి వెళ్ళాడు కూడా.

గంగాధర్, భార్యకి ఆ 'కొండచిలువ చర్మం హేండ్‌బేగ్' మళ్ళీ వాడే అవకాశం ఎన్నడూ రానివ్వలేదు. గంగాధర్ 'ఆ అమ్మాయి'తో సినిమాలకి నెల కోసారి వెళ్తూనే వున్నాడు.






నగర శివార్లలో—

ఎత్తయిన ప్రహరీ గోడతో- లోపల వున్న విశాలమైన ఆవరణనిండా, అక్కడక్కడా శాఖోపశాఖలతో గుబురుగా పెరిగిన చెట్లతో, గోడలకి సున్నం వేసి చాలా రోజులు అయినట్టుగా చెట్ల కొమ్మల నుండి వర్షపునీళ్ళు జారి పాకుడుతో, అక్కడక్కడా చారికలు కట్టి,

బాచ్ స్టేషన్ దగ్గరం.

ఎలాంటి సంశయి లా . స్టెకోక సుమిత్రకు సహాయంచేస్తూండండి. అటువంటి స్త్రీ ప్రపంచమంతా గాలించినా దొరకదు," అన్నాడు డాక్టరు.

అపూర్వబాబు తలవంచుకుని ఆలోచిస్తూ నడవసాగాడు అతడికి డాక్టరు ధోరణి అర్థంకావటంలేదు. తను అడిగిన ప్రశ్నలు వేటికీ స్పష్టమైన జవాబు రావటంలేదు.

"అపూర్వబాబు, ఏమిటాలోచిస్తున్నారు? బయలుదేరినచోటకే వచ్చేశాం. భారతీ!" అంటూ గట్టిగా పిల్చాడు డాక్టరుబాబు.

భారతి కిటికీదగ్గిరకువచ్చి, "విజయబాబు కనిపించాడా, డాక్టర్ బాబూ? మీ కోసం అంటూ బయలుదేరాడే!" అన్నది.

"మీ ప్రెసిడెంటే పంపిందా, యింతరాత్రివేళ! సరే ఎవర్ని వెంటబెట్టుకు వచ్చానోచూడు!" అన్నాడు డాక్టరుబాబు.

భారతి కొంచెం పరికించిచూసి, అపూర్వబాబును గుర్తుపట్టి, "మళ్ళీవెంట బెట్టుకురావటం బాగాలేదు. మీరు తొందరగా వెళ్ళాలి, నరహరి బాగాతాగివచ్చి భార్యను గడ్డపారతో కొట్టాడు. చావుబతుకులమీద వున్నదట. సుమిత్ర అక్కయ్య అక్కడికే వెళ్ళింది," అన్నది.

"చస్తే చావనీ...మర్చిపోయాను. నేను వెంటతెచ్చిన అతిథి మాటేమిటి?" అన్నాడు డాక్టరుబాబు.

"ఆడవాళ్ళంటే మీ కెంతజాలి! అదే నరహరి అయితే పరుగులమీద వెళ్ళే వారు," అన్నది భారతి నిష్ఠూరంగా.

"సరే, పరిగెత్తబోతున్నాను—అతిథి సంగతేమిటి?"

భారతి లాంతరుతీసుకుని తలుపుతెరిచి, "మీ అతిథి క్రీష్టియన్ల ఆతిథ్యం అంగీకరిస్తాడా?" అన్నది.

డాక్టరు కొంచెం విసుక్కుని, "అయితే యీయన్ని ఎక్కడ వదిలి వెళ్ళేది, భారతీ? ఆ దెబ్బలుతగిలినావిణ్ణి ఆస్పత్రికి పంపకపోయారా?" అన్నాడు.

"ఆ చెయ్యవలసిందేదో మీ చేతిమీదుగానే చెయ్యండి. ఈ అతిథి సంగతి నేను చూసుకుంటాను," అన్నది భారతి చిరుకోపంగా.

డాక్టరుబాబు మారుమాటాడకుండా వెనుదిరిగి చీకట్లో అదృశ్యుడైపోయాడు. అపూర్వబాబు మౌనంగా భారతివెంట మెట్లెక్కి ఇంటి పైభాగానికి వెళ్ళేడు.

(ఇంకా వుంది)

బోస్ విశాలమయిన డ్రాయింగ్ రూమ్‌లో ప్రవేశించి అణకువగా ఒక పక్కన నుంచున్నాడు. టీ ముగించి మెత్తని సోఫాలో మునిగిపోయి ఓ బి.సి. రేడియో ప్రసారం వింటున్న పేట్‌రావ్ "ఏం కావాలి?" అన్నట్టు అతనివైపు చూశాడు. ఆక్స్‌ఫర్డ్‌లో చదువుకునే రోజుల్లో స్నేహితులు ప్రతాపరావుని 'పేట్' అని ఇంగ్లీషు సంప్రదాయంలో




## సి. రామచంద్రరావు

పిలిచేవారు. ఇండియా వచ్చిం తరవాత పేట్‌రావు అయింది.

"మాష్టర్, బాత్ రెడీ" అన్నాడు బోస్. పడకగదికి ఆన్చికట్టిన స్నానాల గదికి వెళ్ళడానికి పేట్‌రావ్ లేచాడు. అప్పుడే ఇస్త్రీ చేసిన డిన్నర్ జాకెట్ పక్కమీద పరిచివుంది. డ్రెస్సింగ్ టేబిల్ పక్కనున్న సోఫాకి ముందు పాలిష్‌చేసిన నల్లజోళ్ళు, వాటిమీద నలుపురంగు సాక్సు వున్నాయి. సోఫా

చేతిమీద డ్రెస్‌సూటుతో వేసుకునే చొక్కా చేతులకి బంగారపు కఫ్ లింక్స్ తగిలించి వేళ్ళాడుతూంది. టేబిల్‌మీద నల్లటి 'బౌటై' వుంది.

"బోస్!" రౌద్రంగా అరిచాడు పేట్‌రావ్.

బోస్ పరుగెత్తుకు వచ్చాడు.

"తెల్ల షార్క్‌స్కిన్ కోటు ఎందుకు తీశావ్?" అన్నాడు పేట్‌రావ్.

ఒక్క నిముషం బోస్ తటపటాయించాడు.

"మాస్టర్ పోయినసారి నల్ల డి.జె. వేసుకున్నారు" అన్నాడు.

"పరవాలేదు. ఇప్పుడూ అదే వేసుకుంటాను" పేట్‌రావ్ అన్నాడు.

"నిజానికి బోస్ తప్పుకాదు" అనుకున్నాడు మనసులో. ఒక పార్టీకి నల్ల డిన్నర్ జాకెట్ వేసుకుంటే, తరవాత దానికి తెల్ల డి. జె. తీసి ఉంచమని తనే ఆదేశించాడు. అయితే ఈ పార్టీ ప్రత్యేకమైంది. బోస్‌కి చెప్పడం మర్చిపోయాడు. అయినా అప్పుడప్పుడు ఆ మాత్రం కోప్పడ్డంలో తప్పులేదు. లేకపోతే వాడు మితిమీరిపోతాడు.

బోస్‌కీ, పేట్‌రావ్‌కీ మధ్యవున్న అనుబంధాన్ని నిర్వచించడం కష్టం. పేట్‌రావ్‌కి బోస్ అంటే అపరిమితమైన అభిమానం. బోస్ తెలుగువాడే; పేరు లోవరాజు. ఎన్నో ఏళ్ళు దొరలకింద పనిచేసి బోస్ అన్న పేరు గడించుకున్నాడు. పదిహేనేళ్ళ క్రితం హంటర్ దొర రిటైరై ఇండియానుంచి ఇంగ్లండు వెళ్ళిపోతూ పేట్‌రావ్‌కి బోస్‌ని సిఫార్సుచేశాడు.

"పరవాలేదు. పనికొస్తాడు. ఇంగ్లీషు బాగా అర్థంఅవుతుంది. కొంచెం మాట్లాడగలడు కూడా. అయితే, నీ విస్కీ ఒక కంట కనిపెట్టుకో పేట్!" అని నవ్వాడు హంటర్.

ఇంగ్లీషు మాట్లాడగలిగి విస్కీమీద మక్కువఉండి దొరల ప్రశంస పొందగలిగిన బోస్‌కి వెంటనే ఉద్యోగం ఇవ్వడానికి నిశ్చయించుకున్నాడు పేట్‌రావ్. తను చూపించిన ఆదరణకీ, నమ్మకానికీ, అనుగుణంగా బోస్ ప్రతి విషయంలోనూ సమర్థుడనిపించుకున్నాడు. మాస్టర్ పొద్దున మేడమ్‌గది విడిచి, తన గదిలోకి వచ్చినప్పటినుంచీ ఆఫీసుకు పోయేవరకూ అన్ని అవసరాలు బోస్ చూస్తాడు. మాస్టరు నైట్‌గౌన్, పైజామాలు విప్పడం దగ్గరనుంచి, తలకి నూనె, ఆఫీసు బట్టలు వేసుకోవడం వరకూ, ప్రతివిషయంలోనూ సాయపడతాడు. మాస్టర్ బ్రేక్‌ఫాస్ట్‌కి ఏం తింటాడో వంటవాడికి చెబుతాడు. మాస్టర్‌కి ఎన్నిగంటలకి కారు తయారుగా వుండాలో డ్రైవరికి చెబుతాడు. బోస్ లేకుండా ఒక్కరోజుకూడా తనకి గడవదేమోననిపిస్తుంది పేట్‌రావ్‌కి, అప్పుడప్పుడు. కాని ఆ తలపుని అట్టేసేప

నిలవనిచ్చేవాడు కాదు. లేక ఏమైపో తాడు? తనేం లోటుచేస్తున్నాడనీ? ఎప్పు డైనా పరుషంగా మాట్లాడినా, మనసులో కోపం వుండదు. పైకి కఠినంగా కన పించకపోతే చనువు తీసుకోవడానికి ప్రయత్నిస్తాడు.

బోస్‌కి కూడా మాస్టరు అంటే భయమూ, భక్తీ. ఇంకా దొరలకింద పని చేస్తున్నట్టే అనిపిస్తుంది అంటాడు స్నేహితుల్తో. మాస్టరుకి దొరల అలవా ట్లన్నీ వున్నాయి. డబ్బుకి వెనకా ముందూ చూసుకోడు. అడపాతడపా కసురుతూ ఉంటాడు. కసరకుండా మాస్ట రేమిటి? కోపంలేని మాస్టరుకి తీవి, ఈ వీ కూడా ఉండదనే వాడు మెకెంజీ దొర దగ్గిర పనిచేసిన బేరరు. మెకెంజీ దొరది మెత్తని స్వభావం. పల్లెత్తుమాట ఎవర్నీ అనడు. అన్నీ లెక్కప్రకారంచూసుకునే వాడు. పనివాళ్ళకి పైన ఏమీ దొరికేది కాదు. తక్కిన దొరల్లాగ ఈయనకూడా తాగి రెండు చీవాట్లుపెట్టి తరువాత రెండు బుడ్లూ, డబ్బూ పారెయ్యరాదా అని తన దగ్గిర వాపోయేవాడు ఆయన బేరరు.

"నేనుతప్ప ఈవాళ పార్టీకి ఒచ్చే వాళ్ళంతా తెల్లవాళ్ళే."

నల్ల డి. జె. వేసుకోడానికి ప్రత్యేక కారణం వివరించడానికి ప్రయత్నించాడు పేట్‌రావ్. ఇటువంటి విషయాలు చెప్పే టప్పుడు బోస్ ఎంతో సన్నిహితు డని పించేది. పేరుపెట్టి పిలవాలనిపించేది. ఏళ్ళ తరబడి అలవాటుపడ్డ సంస్కారం, ఇండియాలో పనిచేసిన ఇంగ్లీషువాళ్ళ సంస్కారం అడ్డువచ్చేది. అప్పుడు 'బోస్' అని పిలిచినా, గొంతు మెత్త బడేది. మార్దవం ఆవరించేది

"ఇప్పుడిప్పుడు కొందరు తెల్లకోటూ నల్లలాగూ వేసుకుని డాన్సులకీ, ఈవి నింగ్ పార్టీలకి వెడుతున్నారు. కాని, స్వచ్ఛమైన బ్రిటిషర్ దాన్ని డి.జె. కింద లెక్కకట్టడు" అన్నాడు.

బోస్ ముగ్ధుడై వింటున్నాడు. ఇది కొత్త విజ్ఞానం. రేపు స్నేహితుల్తో కబుర్లలో దొర్లించవచ్చు.

"ఇక్కడ ఉక్క భరించడానికి కొంత తేలిగ్గా ఉంటుందనీ, ఇండియన్ పార్టీలకి వేసుకుని వెళ్ళినా పరవాలేదనీ తెల్లదికూడా కుట్టించాను," తప్పును సమ ర్ధించుకొంటున్న వాడిలాగా చెప్పాడు పేట్‌రావ్.

బోస్ షార్క్‌స్కిన్ కోటుతీసి వార్డ్ రోబ్‌లో తగిలించి వికూనా గుడ్డతో కుట్టిన నల్ల డి. జె. కోటు బయటకు తీశాడు. దాని బరువుకింద ఈ వేసంగిలో నాలుగయిదు గంటలు మగ్గవలసిందే. మనసుని అదుపులో పెట్టుకొని పేట్‌రావ్ స్నానానికి వెళ్ళాడు.

తొట్టిలో మూడువంతులు వేడినీళ్ళు పట్టివుంచాడు బోస్. నీళ్ళలో చెయ్యి ముంచి వేడిచూసుకొని తృప్తిగా తొట్టి లోకి దిగాడు పేట్‌రావ్. కాళ్ళ కదలిక




వల్ల నీళ్ళు చేసే చిన్న శబ్దంతప్ప అంతా ప్రశాంతంగా వుంది. లేత ఆకు పచ్చ చలువరాయితో కట్టిన స్నానాల గది తెల్లని నీళ్ళతొట్టిలో మనోహరంగా ప్రతిబింబిస్తూంది. సబ్బూ, స్పాంజ్ పెట్టడానికి ఒక చివర తొట్టికే అడ్డంగా వేసిన బల్లమీదనుంచి సిగరెట్ తీసుకుని వెలిగించాడు. శరీరం బయటా, లోపలా వెచ్చగా, సుఖంగా వుంది. అతని ఆలో చనలు రాత్రి కాక్‌టైల్ పార్టీమీదికి పోయాయి.

మిస్టర్ అండ్ మిసెస్ స్టూవర్ట్, రగ్గర్ ఫుట్‌బాల్ పోటీలో గెలిచిన క్లబ్బు జట్టుకి రాత్రి ఏడూ, ఎనిమిదిన్నర గంటలమధ్య క్లబ్ బ్రిడ్జిరూమ్‌లో కాక్‌టైల్ పార్టీ ఇస్తున్నారు. అతిథుల్లో తనొక్కడే ఇండియన్. రగ్గర్ జట్టులో ఇండియన్ లేనేలేడు క్లబ్బులో ఇండియన్ మెంబర్లకి ఇది అసంతృప్తి కలిగించింది. తెల్లవాళ్ళంతా కలిసి ఇండియన్లకి చోటులేకుండా చేసేరన్నారు. "చేత కాని కబుర్లు" అనుకున్నాడు పేట్‌రావ్. ఈమధ్య వ్యాపారంలోపడి తను రగ్గర్ విషయం అట్టే పట్టించుకోపోవడంవల్ల ఇందులో నిజానిజాలు చెప్పలేడు. కాని, పదిహేనేళ్ళ క్రితం క్లబ్బులో నలుగురైదుగురు ఇండియన్ మెంబర్లకి నిజంగా వ్యక్తిత్వంలేని రోజుల్లో తను రగ్గర్ జట్టులో వున్నాడు. అప్పటికీ ఇప్పటికీ తెల్లవాళ్ళు మనతో మంచిగా ఉండడానికి

ఎంతైనా ప్రయత్నిస్తున్నారు. ఆదే సత్తువ లేకుండా సెలక్షను కమిటీ అంతా బ్రిటిషర్ల పుట్ట అని నిందించడం దేనికి?

"వాళ్ళంటే మనకి అసూయ" అనుకున్నాడు అతను.

వాళ్ళతో మనం తూగలేం. ఎంత అనుకరించినా మనకీ వాళ్ళకీ సామాన్య అభిరుచులు లేవు. పూర్వం తనకాలంలో, బ్రిటిష్ పరిపాలనలో, విస్కీబుడ్డి దగ్గరయినా బ్రిటిషరూ, ఇండియనూ ప్రాణమిత్రులయ్యే అవకాశం వుండేది. ప్రొహిబిషన్ తరువాత అదికూడా లేదు. అయినా, బ్రిటిషర్ మనల్ని దూరంగా ఉంచాలని చూడటం నిజంకాదు. సమాజంలో సరయిన స్థానం వున్న ఇండియన్‌కి బ్రిటిషర్ ప్రాణం పెట్టగలడు. వచ్చిన చిక్కల్లా సంస్కారం సరిపోకుండా పెద్ద ఎత్తులమీద మనసు పెట్టుకుని కూచున్నవాళ్ళకే. అదృష్టవశాత్తూ మంచి ఉద్యోగం సంపాదించి క్లబ్బు మెంబరై కూచున్న ప్రతివాడితోనూ తెల్లవాళ్ళ భుజాలు రాసుకుని తిరగాలనడం అన్యాయం.

పేట్‌రావ్ సిగరెట్టు అయిపోయి పెదిమలు చుర్రుమన్నాయి. మిగిలిన ముక్కని తొట్టిపక్క గోడలో అతికి వున్న ఏష్‌ట్రేలో పడేసి, ఎదురుగా కప్‌బోర్డులో వున్న హైంపీస్ వైపు చూశాడు. గుడ్‌లార్డ్! ఏడు అవుతూంది. తొట్టిలో నీళ్ళు బయటికి వదిలి, పైన వున్న షవర్ విప్పి తొందరగా ఒళ్ళు తడుపుకుని బయటపడ్డాడు.

పేట్‌రావ్ డిన్నర్ జాకెట్ వేసుకుని, నిలువుటద్దంలో చూసుకుని మురిసిపోయాడు. కోటుఫేసింగ్ తళతళ మెరుస్తూంది. పాంట్ బ్రైడింగ్ సున్నితంగా వుంది. షర్టు కాలరూ, బౌటై, తీర్చిదిద్దినట్టు అమరాయి. జోళ్ళు ఎలక్ట్రిక్ దీపం వెలుగులో జిగేల్ మంటున్నాయి. తక్కువయిందల్లా, కోటుకాలరుకున్న బటన్ హోల్‌లో కార్నేషన్ పువ్వు. ఈ వేడి దేశంలో కార్నేషన్ మొక్కలు మొలవవు. ఏం చెయ్యడం? దానికి బదులు ఎర్ర గులాబీని అలంకరించుకున్నాడు పేట్‌రావ్. ఇంకొకసారి అద్దంలో చూసుకుని, తృప్తిగా నవ్వుకుని, పోర్చిలోకి దారితీశాడు. యూనిఫారంలో డ్రైవరు, జాగ్‌వార్ కారు వెనకతలుపు తీసి పక్కగా నుంచున్నాడు. పేట్‌రావ్ లోపలికి ఎక్కి కూచుని "పోదాం" అన్నాడు. డ్రైవరు తలుపులుమూసి తన సీటులో కూచున్నాడు. నల్లని, విలువైన జాగ్‌వార్ మార్క్ VII తళతళ మెరుస్తూ నిశ్శబ్దంగా చీకటిలోకి జారిపోయింది.

* * *

పేట్‌రావ్ వెళ్ళేసరికే బ్రిడ్జిరూమ్ జనంతో కిటకిటలాడుతూ వుంది. చాలా మంది డిన్నర్ జాకెట్లలో వున్నారు. అయితే పేట్‌రావ్ అనుకున్నట్టు అంతా

నల్లకోట్లలో లేరు. నల్లపాంట్ మీద తెల్లజాకెట్లు గదిలో ఇక్కడా అక్కడా కనిపిస్తూనే వున్నాయి. లౌంజ్ సూట్లలో వచ్చినవాళ్ళూ, సాదాకోటూ పేంటుల వాళ్ళూ కూడా వున్నారు. పేట్ రావ్‌కి ఆశ్చర్యంవేసింది. మిస్టర్ స్టూవర్ట్ అతన్ని సాదరంగా ఆహ్వానించి పార్టీ కోసం అమర్చిన బార్ దగ్గిరకి తీసుకు వెళ్ళాడు.

"నీ డ్రింక్ ఏమిటి పేట్?" అన్నాడు మిస్టర్ స్టూవర్ట్.

"విస్కీ అండ్ సోడా"

మిస్టర్ స్టూవర్ట్ విస్కీ సోడా గ్లాసులో కలిపి పేట్ రావ్‌కి అందిచ్చాడు. ఇద్దరూ చేతుల్లో గ్లాసుల్ని పైకి ఎత్తి "చీయర్స్" చెప్పి తాగడానికి ఉపక్రమించారు.

"పేట్! నువ్వు మెక్ ఫర్ సన్సుని కలుసుకోవాలి. మిస్టర్, మిసెస్ కూడా ఆక్స్‌ఫర్డ్ తయారీయే." మిస్టర్ స్టూవర్ట్ పేట్ రావుని ఎనమండుగురి గుంపులోకి తీసుకువెళ్ళి పరిచయం చేశాడు. వాళ్ళు ఏదో మాట్లాడుకుంటున్నారు. పేట్ రావ్ రాక ఒక్క క్షణం కబుర్లని ఆపింది. తిరిగి మాటల్లో పడిపోయారు. అతనికి వాళ్ళ కబుర్లు అంతుపట్టలేదు. కొంత సేపు ఆ గుంపులోనే నుంచుని తనకి తెలిసిన వాళ్ళకోసం గదంతా కలయచూశాడు. గదిలో ఆరుగుంపుల మనుషులైనా వున్నారు. ఒక్కొక్క గుంపులో నలుగురు నుంచి ఆరుగురుదాకా వుంటారు. అంతా తెల్లవాళ్ళే. వాళ్ళందరితోనూ తనొక్కడే ఇండియన్ వుండడం పేట్ రావ్‌కి ఎంతో సంతృప్తి నిచ్చింది. గుంపులో ఇద్దరు ముగ్గురైనా తనకి బాగా తెలిసినవాళ్ళున్నారు. తనని గుర్తించి నందుకు చిహ్నంగా కొంచెం నవ్వి, తల పంకించారు. వెళ్ళి ఎవరితోనైనా చేరడానికి అతను సందేహించాడు. వాళ్ళు స్వంతవిషయాలు మాట్లాడు కుంటూ వుండవచ్చు. అటువంటప్పుడు పలకరించడం మర్యాద కాదు.

పేట్ రావ్ చేతిలో విస్కీ అయి పోయింది. ఆకాశంనుంచి ఊడి పడట్టు మిస్టర్ స్టూవర్ట్ వచ్చి అన్నాడు :

"పేట్, గ్లాసు యిలా ఇయ్యి నింపి తెస్తాను"

కృతజ్ఞత పూర్వకంగా పేట్ రావ్ నవ్వాడు.

"విస్కీ తెమ్మంటావా, కాక్‌టైల్ రుచి చూస్తావా?" అన్నాడు మిస్టర్ స్టూవర్ట్.

"విస్కీ, ప్లీజ్!"

విస్కీ గ్లాసు పేట్ రావ్‌కి అందిచ్చి, మిస్టర్ స్టూవర్ట్ జనంలో మాయమై పోయాడు. పేట్ రావు దృష్టి గది గోడ మీద అతికిన నోటీసుమీదికి పోయింది. "గదిలో పర్మిట్ వున్నవాళ్ళు మాత్రమే తాగవచ్చు." అతనికి నవ్వొచ్చింది. పర్మిట్ లేకుండా ఎందరు ఇక్కడ రోజూ తాగడంలేదు? తనకిమాత్రం

పర్మిట్ వుందా ? అడ్డుచెప్పేవాళ్ళెవరో? క్లబ్బులో బ్రిటిష్ మెంబర్లందరూ ఒకసారి తనిచ్చిన పార్టీల్లో తాగినవాళ్ళే. గవర్నమెంటు లోకంలో తనకి కావలసినంత పరపతి వుంది. అసలు తనకి పర్మిట్ లేనిసంగతి ఏ కొద్దిమందికోకాని తెలియదు. తెలిసిన నలుగురిమధ్యా అది నవ్వులాట అయిపోయింది. ఆ ప్రసక్తి వచ్చినప్పుడు "పేట్ ని పర్మిట్ అడిగితే ప్రొహిబిషనే ఎత్తించేస్తాడు" అని నవ్వుతారు. తన డాక్టరు మొండిపట్టువల్ల కాని పర్మిట్ సంపాదించడం ఏమంత కష్టంకాదు. తనకి గుండెజబ్బు. "ఎక్కువగా తాగడం ప్రారంభిస్తే రెండేళ్ళలో చచ్చిపోతావు" అని చెప్పేడు డాక్టరు. పోన్లే. రెండేళ్ళయినా ఆనందంగా బ్రతుకుతాను. ఇలాగ వందేళ్ళగడిపి ఏం లాభం ?" అని నవ్వాడు తను. "ఈ ఆటలేం కుదరవు. నీకు నేను సర్టిఫికేటు యివ్వను. ఇంకే డాక్టరూ ఇవ్వకుండా చూస్తాను" అని ప్రతిజ్ఞ పట్టేడు డాక్టరు. డాక్టరుకి తనమీదవున్న అభిమానానికి అతనిమనస్సు కృతజ్ఞతతో నిండింది. పేట్ రావ్ కి విస్కీ, బీయర్లమీద విపరీతమైన మమకారం లేదు. నలుగుర్లో వున్నప్పుడు రుచిచూశాడు. అందుకే పర్మిట్ గురించి డాక్టరుతో రాద్ధాంతం చెయ్యలేదు. పర్మిట్ వున్నా నాలుగయిదు యూనిట్లు ఎన్నాళ్ళకి సరిపోతుంది? ఒక్క పార్టీ ఇవ్వడానికి కూడా రాదు. తనకి పర్మిట్ అక్కర్లేదు "ఇంతమందిలో ఒంటరిగా ఆలోచనల్లో కాలం వెళ్ళబుచ్చేమన్నానే" అనిపించింది. రీటా ఢిల్లీలో ఏంచేస్తుందో? అక్కతో తెల్లవాళ్ళ గురించి వాదిస్తూ వుంటుంది. రీటా, సుశీ కూడా రెండేళ్ళు తండ్రితో ఇంగ్లండులో గడిపి వచ్చారు. ఇద్దరూ పెళ్ళయేవరకూ ఒకే సమాజంలో పెరిగారు. అయినా ఇద్దరి మనఃప్రవృత్తులలోనూ ఎంత భేదం ! రీటాకి ఇంగ్లీషు అలవాట్లంటే అభిమానం. సుశీకి గిట్టదు. 'రీటా ఇక్కడ వుంటే బాగుండేది' అనుకున్నాడు. రీటా అంటే బ్రిటిష్ కమ్యూనిటీకి ఎంతో ఆదరం. అందరికీ ఎంతో సహాయంగా వుంటుంది. ఈవాళ పార్టీలో రీటా వుంటే అక్కడి వాళ్ళంతా తమ చుట్టూ వుండే వారు. రీటా పంపించిన పచ్చళ్ళకి అభివందనాలు చెప్పేవారూ, ఇండియన్ ఫలహారాలు చేసి పంపమని కోరేవారూ, ఎంబ్రాయిడరీ డిజైన్లు అడిగేవారూ, ఏదో రోజు సాయంత్రం టెన్నిస్ ఆడడానికి ఇంటికి వస్తామని చెప్పేవారూ. వీటిలో తనకున్న ప్రజ్ఞ ప్రదర్శించడం రీటాకి సరదా. వెర్రి అంటుంది సుశీ. "తెల్లవాళ్ళకి ఇన్ని సమర్పించు కుంటున్నావుకదా నువ్వు, వాళ్ళు తిరిగి నీకు ఒక్కటయినా ఇచ్చారా?" అని అడుగుతోంది. ఇవ్వకేం, ఇచ్చారు. కాని రీటా అంత ధారాళంగా కాదు. వాళ్ళకి మన



వంటలూ, వస్తువులూ అయితే కొత్త గాని, మనకి వాళ్ళవి కొత్తకాదుగా. ఇవ్వటానికి ఏమంత వుంటుంది ? పైగా స్వదేశంనుంచి ఆరువేల మైళ్ళ పైగా ప్రయాణంచేసి, ఇటువంటి దేశంలో పనిచెయ్యడానికి ఒప్పుకున్నది ఆర్జించే డబ్బు దుబారాచెయ్యడానికి కాదు. ఇక్కడి తెల్లవాళ్ళు జాగ్రత్తగా డబ్బు కూడబెట్టుకుని, కొంతకాలానికి శాశ్వతంగా ఇగ్లండు వెళ్ళిపోడానికి తహతహలాడతారు, దాంట్లో తప్పేముంది?

ఒంటరిగా నుంచోడంవల్ల పేట్‌రావ్ తలలో అన్ని విధాలైన తలపులూ తిరుగాడుతున్నాయి. ఒకమూల కుర్రకారు, రగ్గర్ ఆటగాళ్ళు గుమిగూడి కేరింతలు కొడుతూ అల్లరి చేస్తున్నారు. వాళ్ళంతా రీటా చుట్టూ తిరుగాడుతూ వుండవలసింది. "ఈ ఆకతాయి వెధవలంతా హక్కు వున్నట్టు నీతో డాన్సు చెయ్యడానికి, తగవులాడుకుంటుంటే నవ్వుతూ ఊరుకుంటారేం ?" అని రీటాని అడిగింది సుశీ ఒకసారి క్లబ్బులో డాన్సుకి వచ్చినప్పుడు, ఆనాటి సుశీ ప్రశ్న తరచు అతని స్మృతిపథంలో చిన్న తుఫాను లేవదీస్తుంది. పెళ్ళికాని ఇంగ్లీషు కుర్రకారుకి సరదాగావుండే ఆడవాళ్ళని చూస్తే మతిపోయేమాట నిజమే. వాళ్ళకి ఈ ప్రాంతాల్లోకబుర్లాడుకోడానికి కూడా ఆడపిల్లలు దొరకరు. ఇంక రీటా వంటి అందమైంది, చమత్కారమైంది తటస్థపడితే చెప్పాలా ? అయితే రీటా తెలివైంది.

వాళ్ళందరినీ అదుపులో పెట్టగల సమర్థు రాలు. "బ్రిటిష్ కమ్యూనిటీలో నాకున్న స్థానం రీటావల్ల కాదుగదా?" భయంకరమైన తలపు వచ్చిందతనికి. వెంటనే మరిచిపోడానికి ప్రయత్నించాడు. ఇంటికి వెళ్ళిపోవాలనిపించింది. కాని ఇంకా ఒక్కరూ కదలడం ప్రారంభించలేదు. నీరసంగా ఒకమూలచేరి కొంచెం, కొంచెం విస్కీ చప్పరించడం మొదలు పెట్టాడు.

పార్టీ శ్రుతి నిముషనిముషానికీ హెచ్చుతూంది. కొంత సేపటిక్రితం సుందర స్థాయిలో సాగుతున్న కబుర్లు, నవ్వులోకీ దిగాయి. బల్లమీద సీసాల్లో విస్కీ, బీయర్, రమ్, షెర్రారీ అతివేగంగా హరించుకు పోతున్నాయి. కుర్రకారు కోలాహలం గరిష్ఠప్రమాణం అందుకుంది. పాటలు పాడేవాళ్ళు, ఆటలు ఆడేవాళ్ళు, చిలిపికజ్జాలు పెట్టుకునేవాళ్ళు, గ్లాసులు బద్దలుకొట్టేవాళ్ళు, యుక్తాయుక్త విచక్షణజ్ఞానం అంతరించినట్టు ప్రవర్తించేవాళ్ళు. పార్టీలో కొందరు పెద్దలు ఏవగించుకున్నారు. కాని చెయ్యగలిగిందేమీ లేకపోయింది. ఇక్కడ వున్న బ్రిటిష్ వాళ్ళని వేళ్ళమీద లెక్కపెట్టవచ్చు. వాళ్ళల్లో ఈ కుర్రకారుని మినహాయించి వేస్తే మిగిలేదెవరు? పార్టీలో, ఉత్సాహం కావాలంటే ఉన్న నలుగురూ కూడవలసిందే. ఈ చర్యల్ని చూసీచూడనట్టు మసలవలసిందే. మరీ ఏవగించుకున్న కొందరు—భార్యలతో వచ్చిన వాళ్ళు ఏదో సాకుచెప్పి ముందు వెళ్ళిపోయారు. తక్కిన పెద్దలు ఆ పెద్దబ్రిడ్జి రూమ్‌లో ఒకమూల ఒత్తిగిల్లి కబుర్లలో పడిపోయారు.

ఇంకొక ప్రక్కన బ్రిటిష్ యువకులు లేని ఆనందం అనుభవిస్తున్నామని తమని తాము నమ్మించుకోడానికి, ఒకళ్ళనొకళ్ళు ప్రోత్సహించుకుంటున్నారు. ఎవరు ఎక్కువ విస్కీ తాగగలరో పందెం కడుతున్నారు. ఒక్కగుటకలో గ్లాసుడు పానీయం ఖాళీ చెయ్యగలిగినవాడిని ముందుకు రమ్మంటున్నారు. విస్కీ, బీయర్ కలిపి తాగగల మొనగాడు వున్నాడా అని సవాల్ చేస్తున్నారు. ఈ పరీక్షల్లో గెలిచిన వాళ్ళని భుజాల మీద కెక్కించుకుని విజయగీతా లాలపిస్తున్నారు. ఆనాటి సాయంత్రం రగ్గర్ ఫుట్‌బాల్ పోటీలలో అగ్రస్థాయి ఆట ఆడిన డంకన్‌హార్వీని తమాషాగా దుయ్యబడుతున్నారు. "ఇన్ని ఫ్రీకిక్స్‌ని గోలులోకి తన్నేవే, ఈ విస్కీబుడ్డిని తన్నగలవా?" అని అతన్ని రెచ్చగొట్టారు. "ఓ. తప్పకుండా" మత్తులో అర మూసుకు పోతున్న కళ్ళు నులుముకుంటూ తల ఎగరేశాడు డంకన్. 'దటీస్ ది స్టఫ్, డంకన్' అందరూ చప్పట్లు కొట్టారు. డంకన్ హార్వీ విస్కీబుడ్డిని కాలిజోడుతో గోడకితన్ని ముక్కముక్కలుగా చేసేశాడు. దూరంగా వున్న

పెద్దలు మెడలు రిక్కించి ఏమిటా శబ్దం అన్నట్టు చూశారు. గుంపులో ఏం జరిగిందీ అంతుపట్టలేదు. మళ్ళీ విస్కీ గ్లాసుల్లో లీనమైపోయారు.

అకస్మాత్తుగా ఒకయువకుడికి ఇంత గోల పనికిరా దనిపించింది.

"మనం అనాగరికంగా ప్రవర్తిస్తున్నాం" అన్నాడు.

"షటప్" అని గుంపు అరిచింది.

ఆ యువకుడు ఊరుకోలేదు పక్కనున్న బల్లమీద ఎక్కి అరిచాడు,

"లేడీస్ అండ్ జెంటిల్‌మన్——"

"లేడీస్ లేరు" అని తక్కినవాళ్ళు గోలచేశారు.

"లేడీస్ కావాలి, లేడీస్ కావాలి" అందరూ అందుకున్నారు. ఒక నిముషం ఊరుకొని మళ్ళీ ఆ యువకుడు మొదలు పెట్టాడు :

"మనం చెప్పలేనంత అనాగరికంగా ప్రవర్తిస్తున్నాం ——"

"బూ(...బూ(..." అని గొంతులు హేళనచేశాయి. యువకుడు మళ్ళీ అందుకున్నాడు.

"ఈ అల్లరిమాని మనం ప్రపంచ నాగరికతలో ప్రముఖస్థానం వహించిన బ్రిటిష్ యువకుల్లాగా ప్రవర్తించాలి"

ప్రముఖస్థానం కాదు, అగ్రస్థానం" అతని మాటల్ని వాళ్ళు సరిదిద్దారు.

"సరే అగ్రస్థానం. ఇప్పుడు మీరు చెయ్యవలసిందేమిటంటే బల్లలచుట్టూవున్న కుర్చీలమీద అల్లరి చెయ్యకుండా కూచోండి"

బల్లలేవు, కుర్చీల్లేవు

ఆ యువకుడు నవ్వేశాడు. అందరూ నవ్వేశారు.

"లేకపోవడం ఏమిటి? ఇది శవాయ్ హోటలు. అర్థం అయిందా. ప్రపంచంలో కెల్లా గొప్ప హోటలు"

"ఊఁ !" అన్నారు అందరూ.

"అంతా బల్లలచుట్టూ కూచోండి. ఇలాగ" అతను బల్లమీదనుంచి కిందికి దూకి, అక్కడ కుర్చీలూ, బల్లలూ ఊహించి గాలిలో కూర్చునాడు

"బాగుంది, బాగుంది" అన్నారు అంతా.

"నేను బేరర్‌ని, శవాయ్‌లో బేరరంటే మాటలుకాదు, ఏమనుకున్నారో! అక్కడ టేబిల్ దొరకటమే కష్టం; కుదురుగా కూచోకపోతే పంపించేస్తాను"

"సరే."

"ఎర్ర తివాసీలతో నిండిన లౌంజ్, దానిమీద ఖరీదైన తోలుతో కుర్చీలు, సరంబీలో అతుక్కుపోయిన లైట్లనుంచి వచ్చే మెత్తని వెల్తురు, సన్నని సంగీతం——"

"ఉబ్బెత్తు వక్షాలని ఊపుతూ నాట్యంచేసే పిల్లలమీద ఏమిటి ?" అని ఒక గొంతు అరిచింది.

"పిచ్చివాగుడు వాగకు. శవాయ్ మొహం ఎప్పుడైనా చూశావా నువ్వు ?

చీప్ నైట్ క్లబ్బనుకుంటున్నావా? ఇక్కడ అటువంటి వేషాలేవీ పనికిరావు"

"నా కదంతా తెలియదు. పెద్ద రొమ్ములూ, సన్నటి నడుమూ, బ్లాండ్ జుట్టూ వున్న అందగత్తె నాట్యం కావాలి' అనిలేచిందా గొంతు.

అందరూ గొల్లుమని నవ్వారు. ఒకతను లేచి "సరే, నేను నాట్యంచేస్తాను" అన్నాడు. నాకు రొమ్ములు లేవు. ఈ రెండు సీసాలని చొక్కాకింద పెట్టుకుంటే సరిపోతుందా ?" అని కోటువిప్పి దూరంగా పారేశాడు. అందరూ సంతోషంగా అరిచారు.

"ఇది లాభంలేదు. బర్లెస్క్ కావాలి" అన్నాడు ఇంకొకడు.

"ఔను !" అందరూ ఒప్పుకున్నారు.

ఇంగ్లండు విడిచిపెట్టి ఎన్నో ఏళ్ళుగా ఇండియాలోనే వుండిపోయిన బ్రిటిష్ యువకులందరికీ ఒక్కసారి ఇంటిమీదకి మనసు పోయింది. మూగబాధ వాళ్ళని క్రుంగదీసింది. లండన్, హైడ్‌పార్క్, బిగ్‌బెన్, నెంబర్ టెన్‌డౌనింగ్ స్ట్రీట్. నైట్‌క్లబ్బ్, బర్లెస్క్, పబ్స్, సినిమాలు, ఆడపిల్లలు, చక్కటి ఆడపిల్లలు శనివారం సాయంత్రం ఆ ఫీసులు మూసేసిన తరవాత సినిమాలకీ, నాటకాలకీ, పార్కులకీ, ఎక్కడికి పడితే అక్కడికి తమ కూడా విలాసాలకి వచ్చే ఆడపిల్లలు ! తరువాత ఇల్లు, తల్లీ, తండ్రీ, అక్కలు, చెల్లెళ్ళు. ఆ అనుభవాల ఊహల్లో తియ్యని బాధ వాళ్ళని కోలాహలంలో మాతృదేశం మీద మత, వాళ్ళ ఉత్సాహంలో దీనత్వం, వాళ్ళ నవ్వుల్లో శోకపుఛాయలు మిళితమై వున్నాయి.

"సరే, అదంతా తర్వాత. ముందు మీరంతా కూర్చోండి. నేను షాంపైన్‌తో మీ గ్లాసులు నింపుతాను" అన్నాడు మొదటి యువకుడు.

"నేను కూడా నీకు సహాయం చేస్తాను" అని డంకన్ హార్వీ లేచాడు.

ఇద్దరూ జేబురుమాళ్ళు పైకితీసి, బల్లమీద వున్న వైన్ బుడ్లకి చుట్టి ఊహా కుర్చీల్లో కూర్చున్న యువకులకి ఉత్తుత్తి షాంపైన్ కొంచెం కొంచెం విదులుస్తున్నారు, అకస్మాత్తుగా డంకన్ హార్వీ కళ్ళు ఎడంగా కూర్చున్న పేట్ రావ్ మీదకి పోయాయి.

"ఇక్కడికి నల్లవా డెలావచ్చాడు ?" అని అరిచాడు. అందరి మొహాలూ పేట్ రావ్ వైపు తిరిగాయి. అతనికి ఏం చెయ్యాలో తెలియలేదు. డంకన్ హార్వీ బుడ్డి చేతులో పట్టుకుని అసహ్యం వుట్టిపడే కళ్ళతో పేట్‌రావ్‌ని సమీపించాడు.

"ఎవరు నువ్వు? ఎలా లోపలికి చొరబడ్డావ్ ?" అని గద్దించాడు.

"డంకన్..." పేట్‌రావ్ మాటలు తడబడ్డాయి. పరిస్థితి విషమించిందని, అక్కడి వాళ్ళంతా తాగి వున్నారని



గ్రహించాడతను. ఒక్కక్షణంలో యువకులంతా పేట్‌రావ్ చుట్టూ మూగారు.

"ఇక్కణ్ణుంచి పో, ఈ హోటల్లో నల్లవాళ్ళకి తావులేదు" రెట్టించాడు డంకన్ హార్వీ.

"డంకన్, శవాయ్‌లో అటువంటి ఆంక్ష లేదుకదా!" పేట్‌రావ్ తేలిగ్గా నవ్వేయ్యడానికి ప్రయత్నించాడు.

"శవాయ్ సంగతి నాకు తెలియదు. నిజానికి నే నా హోటల్లో ఒక్కసారయినా అడుగు పెట్టలేదు. కాని నిన్నిక్కడ ఒక్క నిముషమైనా వుండనివ్వను, పో!" అన్నాడు హార్వీ.

అక్కడ వాళ్ళలో ఒక్కడయినా శవాయ్ మొహం చూసి ఉంటాడనన్న అనుమానం పేట్‌రావ్‌కి లేదు. తను ఎన్నో పార్టీలకి ఆ హోటలుకి వెళ్ళాడు. అప్రయత్నంగా అతనిలో గర్వం పొడసూపింది.

"నేనిక్కడికి ఆహ్వానంమీద వొచ్చాను" అన్నాడు.

"ఏదీ ఆహ్వానం?"

అతను తీసుకురాలేదు, స్టూవర్ట్‌ని అడగమన్నాడు.

"మేం ఎవర్నీ అడగం. నీకు తాగడానికి పర్మిట్ వుందా?"

ఒక గొంతు ప్రశ్నించింది.

పేట్‌రావ్ చిక్కుల్లోబడ్డాడు. తాగుడు మగతలోకూడా ఎవరికో కొంత మెలకువ వున్నట్టుంది. తాగి వుండబట్టికాని లేక

పోతే వాళ్ళెవ్వరూ ఇటువంటి అఘాయి త్యానికి పూనుకోరని అతనికి తెలుసును. అయినా అతనికి కోపం ఆగలేదు.

"నాకు పర్మిట్ అక్కర్లేదు" అన్నాడు.

"ఊరికే పేలకు" అని పేట్‌రావ్ రెక్క పట్టుకుని ఈడ్చడం ప్రారంభిం చాడు డంకన్ హార్వీ. పేట్‌రావ్ కొంత గింజుకున్నాడు. నలుగురూ సాయంపట్టి అతన్ని గది బయటకు నెట్టి తలుపు మూసేశారు.

ఈ విషయం విని మిస్టర్ స్టూవర్ట్ రెచ్చిపోయాడు. "బ్రిటిష్ యువకులంతా మృగాల్లాగా ప్రవర్తించారు" అన్నాడు. "నా అతిథిని అవమానపరచడానికి డంకన్‌కి ఏం అధికారం వుంది ?" అని గర్జించాడు. "అంతా వెళ్ళి పేట్‌కి క్షమా పణ చెప్పుకోండి" అన్నాడు.

డంకన్ హార్వీ ముందుకువచ్చి నిల బడ్డాడు.

"మేం చెప్పం" అన్నాడు. "నల్ల తోలుకి క్షమాపన చెప్పుకోవలసిన అగత్యం మాకు లేదు."

"నల్లతోలైతేనేం? పేట్ మీ అందరి కన్నా లక్షరెట్లు మెరుగు. అతని అంతస్తు తెలిసే మాట్లాడుతున్నావా?" మిస్టర్ స్టూవర్ట్ ఉద్రేకంలో ఊగిపోతు న్నాడు.

"నీ దేశంలో నువ్వు కనీ వినీ ఎర గని సౌకర్యాలు పేట్ అక్కడ అను భవించాడు. నా దేశంలో నువ్వు మాట్లా డడానికి తాహతులేని మనుషులతో అత నికి స్నేహం వుంది. పేట్ ఆక్స్‌ఫర్డ్‌లో చదువుకున్నాడు. నువ్వెప్పుడయినా ఆక్స్‌ఫర్డ్ పేరు విన్నావా?" వ్యంగ్యంగా నవ్వాడు మిస్టర్ స్టూవర్ట్.

డంకన్ హార్వీ మరీ బిడిదేరి పోయాడు.

"అదంతా నా కనవసరం. తాగడా నికి పర్మిట్ లేనివాణ్ని నువ్వు ఎలా కాక్‌టైల్స్‌కి పిలిచావు ?" అని ప్రశ్నిం చాడు.

పేట్‌రావ్ ఇంట్లో తెగతాగే డంకన్ హార్వీయేనా మాట్లాడుతున్నది! మిస్టర్ స్టూవర్ట్ తెల్లబోయాడు. తక్కిన యువ కులు హార్వీ ప్రశ్నని రెట్టించారు. మిసెస్ స్టూవర్ట్ పరిస్థితి గ్రహించింది.

జాన్ అలిసిపోయి వున్నాడు. అతన్ని బాధపెట్టకండి. కొంచెంవిశ్రాంతి తీసుకోనివ్వండి" అని మొగుణ్ని బయ టకు తీసుకుపోయింది.

"ఉన్న తెల్లవాళ్ళం నలుగురం. నలుగుర్లోనూ పోట్లాట" అన్నారు వెనక కొందరు.

"జరిగింది తప్పేననుకో. అయితే మటుకు నల్లవాణ్ని వెనకేసుకు వస్తూ తెల్లవాళ్ళమీద విరుచుకు పడతాడా ?" అన్నారు ఇంకొందరు.

"మనలో మనం ఎంత కొట్లాడు కున్నా నల్లవాడి విషయం వచ్చినప్పు




డయినా కలిసికట్టుగా వుండాలి మరి" అన్నారు ఇంకా కొందరు

మిసెస్ స్టూవర్ట్ మొగుణ్ణిలాంజ్ లో ఒక మూల కూర్చోపెట్టి హితబోధ చేసింది.

"ఈ విషయం మరిచిపోవడం ఉత్తమం" అంది.

"పేట్ మన అతిథి మేరీ!" అన్నాడు మిస్టర్ స్టూవర్ట్ కష్టంగా.

"నీ బాధ నాకు తెలుసు. కాని చెయ్యగలిగిందేమీ లేదు"

"లేకపోవడ మేమిటి ?" కోపంగా లేచాడు మిస్టర్ స్టూవర్ట్.

"ఈ దున్నపోతులంతా పేట్ కి క్షమాపణ చెప్పితేకాని ఊరుకోను."

"కుదరదు జాన్" అంది ఆవిడ.

"ఏం ?"

"డంకన్ ఎంత ఆవేశంలో వున్నాడో చూశావా ?"

"వాడికి బుద్ధి చెబుతాను."

"జాన్, నీ ఆదర్శాలు కట్టిపెట్టు. నీకు డంకన్ ముఖ్యమా ? పేట్ ముఖ్యమా ? పేట్ మంచి స్నేహితుడు, నేనూ ఒప్పుకుంటాను. కాని ఈ పరిస్థితుల్లో..."

మిస్టర్ స్టూవర్ట్ ఏమీ మాట్లాడలేదు. మళ్ళీ ఆవిడ అంది.

"డంకన్ తాగుడుమైకంలో ఏదో చేశాడు, తప్పే. దానికింత రాద్ధాంతం దేనికి? డంకన్ కీ, అతని రగ్గర్ కీ మన వాళ్ళల్లోవున్న స్థానం నీకు తెలుసుగదా! అతనితో విరోధం పెట్టుకోడం ఇక్కడ బ్రిటిష్ కమ్యూనిటీతో పెట్టుకోడం"

"రగ్గర్, డంకన్, రగ్గర్! ఇంత

కంటే జీవితంలో కావలసింది లేదా ?" మిస్టర్ స్టూవర్ట్ అరిచాడు.

"ఇంకొక విషయం జాన్. పేమిలా కోసమైనా నువ్వీ మొండిపట్టు మానె య్యాలి."

మిస్టర్ స్టూవర్ట్‌కి అర్థమయింది. పేమిలా వాళ్ళ కూతురు. డంకన్ హార్వీ మీద మనసు పెట్టుకుని కూచుంది. హార్వీకి ఇంకా పాతికేళ్ళు నిండలేదు. మంచి కంపెనీలో పెద్ద ఉద్యోగం. అందం వుంది. రగ్గర్ ఆట మూలంగా బ్రిటిష్ కమ్యూనిటీలో పేరు ప్రఖ్యాతు లున్నాయి. డంకన్‌హార్వీ వంటి అల్లుడి కంటే ఇక్కడి బ్రిటిష్ దంపతులు కోర దగిన మంచి సంబంధం లేదు.

మిస్టర్ స్టూవర్ట్ గొంతు మూగ పోయింది. తల వంచుకుని చేతిలోని విస్కీవైపు దృష్టి ప్రసరించాడు. గ్లాసు ఎత్తి ఒక్క గుటకలో నోట్లో పోసేసు కొని జేబురుమాలుతో మూతి తుడుచు కున్నాడు.

మిసెస్ స్టూవర్ట్ కళ్ళలో చిరునవ్వు విజయసూచనగా తళుక్కుమంది. సోఫాలో నుంచి లేచి, ప్రేమతోనూ, సానుభూతితోనూ మిస్టర్ స్టూవర్ట్ భుజం తట్టి బుగ్గమీద అంటీ అంటనట్టు చిన్న ముద్దు పెట్టింది. తరవాత బ్రిడ్జిరూమ్‌లో యువకుల దగ్గిరకి వెళ్ళి అంది :

"జాన్‌కి కొంచెం తలనొప్పిగావుండి, ఇక్కడికి రాలేనందుకు క్షమాపణ చెప్ప మన్నాడు. మిమ్మల్ని మిగిలిన డ్రింక్ తాగేసి మజాచేసుకోమన్నాడు"

అందరికీ సందేశం అర్థమయింది. వాళ్ళ మొహాలు కళకళ లాడాయి.

"టు ది హెల్త్ ఆఫ్ మిస్టర్ అండ్ మిసెస్ స్టూవర్ట్ ?"

తృప్తిగా గ్లాసులు నింపుకుని అరి చారు.

ఎవరో గొంతెత్తి పాట ప్రారంభిం చారు.

"హి యీజ్ ఎ జోలీ గుడ్ ఫె... లో, హి యీజ్ ఎ జోలీ గుడ్ ఫే... లో..."

అందరూ అందుకున్నారు.

బయట క్లబ్బు ఆవరణలో కారు కోసం వెతుక్కుంటున్న పేట్‌రావ్‌ని దూరంగా వినిపిస్తున్న పాట కలత పెట్టింది. తన ఇంట్లో పార్టీలు ఇచ్చి నప్పుడు ఇవే గొంతుకలు, ఇదే పాట తనగురించి ఎన్నోసార్లు పాడాయి. గబ గబా అడుగులు వేసుకుంటూ సాగిపో యాడు. ఎప్పటిస్థానంలో నిలబడివున్న నల్లటి విలువైన జాగ్‌వార్ కారు చిక్కని చీకట్లో సరిగ్గా కనిపించలేదు. దానిమీద పడి చేతికి చిన్నగాయం తగి లించుకున్నాడు. చీకటినీ, కారు రంగునీ, ముందు సీటులో గాఢంగా నిద్రపోతున్న డ్రైవర్నీ తిట్టుకుంటూ కార్లో ఎక్కి హారన్ వాయించాడు. డ్రైవర్ తుళ్ళి పడి లేచి, సీటులోపడి నలిగివున్న టోపీ తలకి తగిలించుకుని, కారు పోనిచ్చాడు.




మందిలో పుట్టి మందిలో పెరిగి రంధి లేకుండా బ్రతకటం కష్టమైందే కాని, ఒంటిగా పుట్టి ఒంటిగా పెరిగి వందలాది మందిచేత ఎన్నబడి బ్రతకడం అంతకంటే కష్టమైంది. తరిణమ్మ జీవితం తలపోస్తే ఈ భావం స్ఫురించకపోదు.

తెల్లవారిలేస్తే ఒకరి కవ్వంకింద చల్లా, కత్తిపీటక్రింద కూరా ఆశించి బ్రతికినప్పటికీ బ్రతికినంతకాలం తరిణమ్మ ఘనంగానే బ్రతికింది.

తలలుదువ్వే తరిణమ్మ చచ్చిపోయింది. కోడలు కాంతమ్మ దుఃఖపడుతోంది. కల్లబొల్లి దుఃఖమూ కాదూ; కాకిశోకమూ కాదు. వన్నెచిన్నెలతోనూ, వరాపనలోను పయిటచెంగు పటమారేటట్టుగా ముఖానికి చెయ్యడ్డంపెట్టుకుని

దుఃఖపడుతోంది. వూరూ వాడా ఏక మవకపోయినా వూర్లోఉన్న ఇష్టులూ, మిత్రులూ, బంధువులూ పదిమంది పోగ యేరు.

మనిషీ మనిషీ కలిస్తేనే మాటంటూ పుడ్తుందికదా! మంది చేరినచోట రంధి లేకుండా ఉంటుందా ?

కాంతమ్మ శోకాలు వింతగా చూస్తూ విచిత్రంగా ఆలకించేవాళ్లు కొందరైతే, తరిణమ్మ ఘనతని కొనియాడేవాళ్లు కొందరు.

"తరిణమ్మ కూర తరిగిందంటే ఆ శంబరాసురుడి కొలువులో రతీదేవికూడా ఎందుకు పనికొస్తుంది" అని ఒకరు.

"తలదువ్వి జడలువెయ్యడం సుధేష్ణ కొలువులోవున్న సైరంధ్రి కూడా మన తరిణమ్మదగ్గర నేర్చుకోవలసిందే" అని ఒకరు.

ఇలా తలొకరూ తలొక మాటగా తరిణమ్మ ఘనత చెప్పుకుంటూ వుంటే చావుకూడా పెళ్లంత ఘనంగా వుంది.

బారులుతీర్చి, మూకమూగివున్న ఆడా మగా అందరూ తరిణమ్మ చావుతో 'చెయ్యి విరిగినట్టుగావుం' దని, 'కుడి చెయ్యి పడిపోయినట్టుగా వుం' దని, రక రకాలుగా చెప్పుకుంటూ తమకి, తమ కుటుంబానికి వెలితి అన్నట్టుగా మాట్లాడు కుంటూ వుంటే తరిణమ్మ జీవితం ఒక్క సారి కళ్లముందు కదలాడుతున్నట్టుగా కవిపించకపోదు.

తరిణమ్మ కలవారిపిల్ల కాదు సరికదా తల్లీదండ్రీ కూడా లేరు. తనైనవాళ్లు చేరదీసి గొప్పింటిసంబంధం కాకపోయినా తగినవాళ్లలోనే తలకి తలా కొల్చి పెళ్ళి చేసేరు. కాని,

మూడు పువ్వులు ఆరుకాయలుగా వుండవలసిన కాలంలో, కాపురం ఆరు మూడయింది. అవి సత్యకాలపు రోజులు కనుక తరిణమ్మ విశేషం చదువుకోలేదు. చిన్నప్పు డేదో చదువుకుందనుకున్నా అదేదో అప్పుడే మర్చిపోవడాన్ని ఇప్పు డించుమించుగా నిశానీదారురాలేనని చెప్పాలి.

తరిణమ్మకి తమ్మయ్య అని ఒక తమ్ముడున్నాడు; ఒక్కి అక్షరంరాని పక్షి, నిరక్షరకుక్షి; చిన్ననాడు గుంట ఓనమాలు దిద్దేరోజుల్లోనే చదువుకి పంటపెట్టి గంట వాయించేడు. అంచేత ఆ తమ్మయ్య అప్ప గారిని ఏవిధంగా ఆదుకోగలుగుతాడు.

మూడేళ్ళనాడే మూలచేరిన తరిణమ్మకి ముక్కుపచ్చలారని మూడేళ్ళ కొడుకు కాళ్లసంకెళ్లలాగా లేకపోతే, ఆనాడే ఏ అఘాయిత్యమో తలపెట్టేదేమో కాని కండ కొండ కాగలదన్న ఆశతో ఆ కొడుకుని చూసుకొని అలాంటిదేమీ చెయ్యలేదు.

పుట్టి పెరిగిన వూరు కనుక, పల్లె టూరిపద్ధతి ప్రకారం తరిణమ్మ వెంటనే పైకి మసలడానికి వీల్లేదు కనుక, బంధువులేకాకుండా వూళ్లోవున్నకాపులూ,

కరణాలు కూడా తృణమో కణమో సాయంచేస్తూ వుండేవారు. కాని ఎవరేనా ఎంతకాలం చెయ్యగలరు.

ఆర్నెల్లు గడిచేసరికి తరిణమ్మకి ఘన మైపోయింది. ఏం చెయ్యడమా అని ఆలోచించి చివరికి బస్తీకి వెళ్ళడానికి నిశ్చయించింది. బస్తీలో మాత్రం ఎలా గడుస్తుందని ఒకరిద్దరు సానుభూతిపరులు అనుమానించినా పన్నెండామళ్ళ పట్నంలో బతకడానికి దారే కనిపించదా అంటూ కొడుకునీ తమ్ముణ్ణీ వెంటబెట్టుకొని బస్తీకి బయలుదేరింది తరిణమ్మ.

తరిణమ్మ తమ్ముడు తమ్మయ్య నిశానీదారుడే అయినప్పటికీ ఆమడ దూరంలో బ్రాహ్మడు లేకపోతే యజ్ఞం చేయించగల తెలివిగలవాడు. బస్తీ కాపరం వచ్చిన దగ్గర్నుంచీ తమ్మయ్య ఒక్తి శ్రాద్ధాలగద్ధగా తయారయేడు శవాల మోత, పిండాలమేత రోజూ ఎంతో కొంత తెచ్చి అప్పగారిచేతిలో పోస్తూ వుండేవాడు. ఇలా వుంటూవుండగానే "కర్రాయి స్వాహా కంపాయి స్వాహా పుల్లాయిస్వాహా పుడకాయిస్వాహా — పిల్లి బ్రాహ్మడుపీట ముత్తైదు — అమ్మా తలంబ్రాలు పట్రండి—వాయించండ్రా — మాంగళ్య తంతునానేన నీ జీవానికిపడి నే నేడ్తునా" అంటూ కళ్ళమూసి జెల కొట్టినట్టుగా అప్పుడప్పుడు ఒకటీ రెండు పేదవారి పెళ్ళిళ్లు కూడా చేయించేవాడు.

దానా దీనా కాలక్షేపం చేస్తున్నా పొట్టగడిచిందికీ, పొద్దుగడిచిందికీ ఎన్ని పాట్లు పడకుండా అవుతుంది. ఇక ఇలా లాభంలేదనుకుని తరిణమ్మ అడ్డాకులు కుట్టి విస్తరాకుల వ్యాపారం మొదలు పెట్టింది విస్తరాకులతోబాటు అప్పడాలూ ఆవకాయకూడా అమ్ముతూ అప్పు డప్పుడు వంటా వార్పూచేస్తూ క్రమంగా కొన్నాళ్ళకు తలదువ్వి జడలు వెయ్యటం మొదలుపెట్టింది.

తలలు దువ్వి జడలు వెయ్యడం మొదలు పెట్టడంతోనే తరిణమ్మకి పలుకుపడి హెచ్చయింది. ఏ వీధిలో చూసినా తరిణమ్మకి ఆహ్వానాలే; ఏ ఇంటచూసినా తరిణమ్మని పిలిచేవాళ్ళే.

లక్షాధికారులూ, కోటీశ్వరులూ వేల సంపన్నులూ అయిన పేరుపడ్డ పెద్ద వ్యాపారస్తుల ఇళ్ళనుంచి తరిణమ్మకి పిలుపు లొచ్చేవి. ఆ ఇళ్ళలో, సమష్టి కుటుంబా లవడంవల్లా, పదిపన్నెండుగురు ఆడవాళ్ళుండడం, వాళ్ళందరికీ బట్టతల లవడంవల్ల తరిణమ్మచేత జడ వేయించు కొని తలకి నెలకి రెండో మూడో జీతం నిర్ణయించి ఇస్తూవుండేవారు.

జడలు వెయ్యడం మొదలుపెట్టడం తోనే సూర్యోదయంనుంచి సూర్యా స్తమయంవరకూ తరిణమ్మ కెక్కడా తీరిక ఉండేదికాదు.

బట్టతలమీద కాటిక రాసి, నేర్పుగా పాపిడ తీసి, కుదుళ్ళలోంచీ సవరం పెట్టి రకరకాలుగా జడల్లి ముడిచుట్టి

పువ్వులు ముడిచేది తరిణమ్మ. అందులో, అందులోనే వీలుచూసి నాగరంపెట్టి జడగంటలుతో జడవెయ్యడం, నాగరం చేమంతిపువ్వ పెట్టడం ఇలాంటి చమక్కులుకూడా చేస్తూవుండేది. "కురూపికేనా కురులే సొగసు" అన్నారు. అలా రకరకాల జడలువేసి తమకి తల కట్టు కూర్చినందుకు వాళ్ళంతా ఎంతో మెచ్చుకుంటూ తరిణమ్మని చూసేసరికి ప్రాణం పెట్టేవాళ్ళు.

"పాపిడ వంపైతే బ్రతుకంతా వంపే" అని, "కోటీశ్వర్లకేనా కొప్పే గొప్ప" అని, "సిగచుట్టు లోనే వగలొలక బొయ్యాలి" అని ఈ మోస్తరుగా తరిణమ్మ చెప్పేమాటలకి వాళ్ళంతా మంత్రముగ్ధులయి ఇంకా అలాంటి కబుర్లు వినడంకోసం పదేపదే తరిణమ్మని కవ్వించి మాట్లాడిస్తూ వుండేవారు.

ఇలా ఆ షాహూకార్ల ఇళ్ళలోనే కాకుండా సాటివాళ్ళఇళ్ళలో కూడా అవ్వానికి కవ్వానికి ఆదుకూంటూ ఓ చెయ్యి సాయంచేస్తూ వుండడాన్ని వూర్లో అందరికీ తరిణమ్మ తలలో నాలుకైంది.

వూసూ పలుకూ ఆడి ఒప్పించి, మాటా మంతీచెప్పి మెప్పించి ఆ షాహూకార్ల ఇళ్ళలో తరిణమ్మ ఆత్మీయురాలై కూరా నారా, పప్పూ ఉప్పూ, చల్ల చినుకు, నేతిబొట్టూ ఇలా ఏదో ఒకటి తెచ్చుకుంటూ వుండేది.

ఒకళ్ళిచ్చారు కదా అని ఈసుకొద్దీ ఒకరు, వాళ్ళింతే ఇచ్చారా అని ఊ సెట్టుకుంటూ మరొకరూ, ఇలా పది మంది ఇళ్ళలోనూ ఉప్పుతో తొమ్మిది, పప్పుతో పదీ ఇచ్చేసరికల్లా తరిణమ్మ దేనికీ ఇబ్బందిపడక్కర్లేకుండా కాలం గడుపుకొస్తోంది.

ఇప్పుడంటే అప్పూ సప్పూ లేకుండానే కాలం గడుపుతున్నా, అదిలో మాత్రం తరిణమ్మ ఆ షాహూకార్ల ఇళ్ళలో పదీ పాతికా అప్పుచేయకుండా వుండకపోలేదు.

ఎప్పుడేనా మించి మీదపడే తలకి తగని ఇబ్బందివస్తే ఎవళ్ళింటికేనావెళ్ళి నాలుగు కబుర్లు చెప్పినమీదట;

"చూడు సీతప్పా! లోగడ పది ఇవ్వాలిగాని మరొక్క ఐదు సర్దుబాటు చేద్దూ పదిహేను అవుతుంది" అని అడిగేది.

"ఏంటి తరిణమ్మగారూ! ఇదేమేనా సెట్టా ? గనా ? అడిగినప్పుడల్లా వుండడానికి. సెట్టంటేది పట్టుకు వూపితేనేగాని పండాకేనా రాలదు. గనంటేది పారా పలుగూ లేందే బయట పడదు" అని ఆ యిల్లాలన్న మాటకి "అలా అనకు సీతప్పా! నీ అంతఃకరణే పార, నీమాటే పలుగూ; ఈ రెండూ కలిస్తే గనివంటేది బయటపడ కేంచేస్తుంది. ఈసారికి సాయంచేస్తివా నీ మేలెన్నటికీ మర్చిపోను. నెమ్మదిమీద తీర్చుకుంటానుగాని



నీ ఋణం వుంచుకోను. చర్మం ఒలిచి చెప్పులుకుట్టిస్తాను, తల్లీ తల్లీ, ఎలాగేనా చూసి ఇద్దూ."

"అదేంటి తరిణమ్మగారూ, మేం బాగుండటం మీకిష్టంలేదా? పది కాలాల పాటు మీలాంటోరు సల్లగా వుంటేనేకదా మీ దీవన్లువల్ల మేం పచ్చగా వుండేది? బేమ్మల్లయ్యుండి సెర్మం సెప్పులు కుట్టిత్తామంటారా? ఐదుకాకపోతే పదట్టు కెళ్లండిగాని అలాంటి మాటలుమాత్రం అనమోకండి" అంటూ ఆ యిల్లాలు నవ్వుతూ పది రూపాయలిచ్చి పంపేది.

తరిణమ్మ, కాపరానికివచ్చినకొత్తలో, ఓసారి అప్పడం నిప్పులమీద వేసి కాల్చిన తర్వాత తిరిగెయ్యవచ్చు ననుకొని ఏదో పని చక్కబెట్టుకుందికి వెళ్ళిందట. అలా ఆదిలో అప్పడం కాల్చడమేనా తెలీని తరిణమ్మ ఇప్పుడిలా అన్ని విధాలా విగ్గుదేరిన నిధీ, ఆరిదేరిన ఆరిందా అయిందంటే ఆశ్చర్యపడాల్సిం దేమీ లేదు. తల్లీ తండ్రీ, తనైనవాళ్ళూ పలుకు బడే మప్పుతారుకాని బతుకులోని గతుకులు గడవాలంటే సుళువులూ

మెళుకులూ లోకంవల్ల నేర్చుకో వల్సిందే కదా!

తరిణమ్మకి రాని వంటా, తెలియని వైద్యం, ఎరగని విషయం అంటూ లేదు. పాటలు పద్యాలూ చెప్పేఅక్కర్లేదు మేలుకొలుపులూ, మంగళహారతులూ, సుమతీ వేమన శతకాలు, భగవద్గీత, దండకాలూ స్తోత్రాలూ, అష్టకాలు ఒక టేమిటి అన్నీ తరిణమ్మకి కంఠతా వచ్చును. ఒక్కమాటలో చెప్పాలంటే తరిణమ్మ అజ్ఞానులపాలిట విజ్ఞాన సర్వస్వం అని చెప్పాలి.

ఇలాంటి తరిణమ్మ సంరక్షణలో ఆ మూ డేళ్ళ కొడుకూ జీవగండాలన్నీ గడచి పెరిగి పెద్దవాడయేడని వేరే చెప్పాలా !

"మీ నగరంవాళ్ళ (కోమట్ల) చలవ చేత ఆ వేరంత మొలక చెయ్యెత్తు చెట్ట యిందని చెప్పాలి. ఇక ఆయిల్లు వెయ్యేళ్ళ మొదలుగా వాడొక ఇంటివాడయితే నేను వేరే కోరతగ్గదీ, చెయ్య తగ్గదీ అంటూ వుండదు" అని చెప్తూ ఆ షాహు కార్ల ధర్మమా అని మొత్తానికి తరిణమ్మ కొడుకుపెళ్ళి కూడా చేయించేసింది.

కాలికీ చేతికీ అవుతుందనీ, మప్పి తిప్పుకుంటే చెప్పినట్టూ వింటుందని పల్లెటూరిపిల్లనే కోడలుగా తెచ్చు కుంది. కాని కాపరానికొచ్చిన కొత్తల్లో అచిన్నది బస్తీమోజులకి మురిసిపోతూ వేసిన వేషాలూ, పెటిన ఖర్చూ లెక్కాజమా లేకుండా వుండేది.

కాని తరిణమ్మ వాటి నెన్నడూ పట్టించుకోనూ లేదు, ఒద్దననూ లేదు; సరి కదా, "ఏదో అజ్ఞానం, పసితనం; కాలం కలిసివస్తే వాళ్ళే దారికొస్తారు. ముళ్లకి వాడి ఎవరు తీర్చేరు" అనే తలం పుతో మాట్లాడకుండా వూరుకునేది. అలా వూరుకోవడంవలనే కొడుకూ కోడలూ వేరింటి కాపరం కూడా పెట్టేరు. అయితేమాత్రం ఏం లాభం? కష్టం సుఖం చెప్పక్కర్లేదు, ఖర్చూ వెచ్చం అడగక్కర్లేదు అన్న ట్టుగా అంతవరకూ నిమ్మకి నీరెత్తి నట్టుగా వుంటున్న కొడుకూ కోడలూ వేరేకాపరం పెట్టేసరికి సంసారం చెయ్యడంలో గల లగువు బిగువులు తెలీక మూడు నెలలు తిరిగేసరికి మళ్ళీ తరిణమ్మదగ్గరికి వచ్చేశారు.

"నూకల్లో బియ్యాన్ని కూడా మాడ్చుకుంటామా" అన్న భావంతో కనువిప్పయిన కొడుకునీ కోడల్నీ కంటి తోనే మందలిస్తూ కడుపులో పెట్టుకుంది తరిణమ్మ

ఈనాడు నెలతిరిగేసరికల్లా కొడుకు శతమానం గణించి చేతిలో పోస్తున్నం దుకు "ఏ రాజు యేభూమేలుతున్నా డన్న ట్టుగా వుండవలసిన తరిణమ్మ ఎప్పుడూ తనేపరిస్థితిలో జీవితం ప్రారంభించిందీ తలపోస్తూనేవుంటుంది.

అందుకే 'ఎమ్మెల్లోసొమ్మూ ఎముకల్లోపాటూ' ధారపోసి పెంచిన కొడుకు. తాను హరీ అన్న తర్వాత ఎక్కడ దే ఇబ్బంది పడిపోతాడో అని తపించిన తరిణమ్మ కాసుగవ్వలా ఖర్చుపెడ్తూ, గవ్వ కాసులా దాచుతూ, ఓ కానీ కోకాని చేరుస్తూఉండేది.

షావుకార్ల ఇళ్ళల్లో మసలుతున్నందుకు 'నూటికి నన్ను పెంచితే కోటికి నిన్ను పెంచుతానని లక్ష్మి అంటుంది' అనే షావుకార్ల భావన తరిణమ్మలో కూడా జీర్ణించిపోయింది. అందుచేతనే రెండో కంటివాడికి తెలీకుండా ఈ నాడు తరిణమ్మ పదివేలరూపాయలు పోగు చేయగలిగింది.

కానీ ఈ సంగతి ఎవరికీ తెలీకపోవడంవల్ల తరిణమ్మ చచ్చిపోయిందని తెలిసేసరికి షావుకార్లందరి ఇళ్ళనుంచి ఉప్పూ పప్పూ మొదలు, బియ్యంవరకూ సకల సంబారాలూ కూరగాయలతో సహా పంపడమే కాకుండా తలొక పాతికా పరకా డబ్బు కూడా పంపగా అవన్నీ వచ్చిపడ్డాయి. షావుకార్లే కాకుండా తరిణమ్మలేనిలోటు తలచుకున్న సానుభూతిపరులందరూ కొద్దో గొప్పో ఇచ్చి సాయపడ్డారు.

ఇలా వచ్చినవన్నీ పోగుచేసి సందుగ నిండిన సొమ్మూ చావడినిండిన సరకులూ చూసేసరికల్లా కోడలు కాంతమ్మకి తరిణమ్మ ఘనత, పలుకుబడీ వూహించడానికి శక్యంకాకపోయింది.

'జుట్టంటూ వుంటే కొప్పెన్ని రకాలేనా ముడవ్వచ్చు' నంటారు, కాని జుట్టు లేకపోయినా కొప్పు ముడవగలగడమే తరిణమ్మ ఘనత.

అందుకే 'అత్త చచ్చింది కోడలుకి దుఃఖ మొచ్చింది' అని అందరూ అనుకొనేట్టు కాకుండా ఇకను ఆ పలుకుబడీ పేరు, ఇవన్నీ మనకి ఎలాగూ రావు, కాని అంతటి పేరు ప్రతిష్ఠలుగల పెన్నిధి లేకపోయిందే అనేభావం తోచేసరికల్లా కాంతమ్మ దుఃఖం కట్టలుతెంచుకుంది.






"ఏమండీ! ఏమండీ! లేవండి, త్వరగా!" తల మీద చేయివేసి అటూఇటూ కుదుపుతూ లేపుతోంది కమల.

నిద్రమత్తులో కళ్ళువిప్పి ఏమిట న్నట్టుగా చూసి, అప్రయత్నంగా మళ్ళీ మూసుకోబోయాను.

"ఏ, మంచి కల చెదిరిపోయిందా? ...నేననుకొంటూనే వున్నా, మీరి టువంటి మనుష్యులేనని! నా ఖర్మ!... ఆగండి, కళ్ళుమూసుకోకండి!...ముందు నా ప్రశ్నకు సమాధానం చెప్పి, తర్వాత తీరిగ్గా నిద్రపోదురుగాని." గట్టిగా అరు స్తోంది కమల.

విసుగ్గా లేచికూర్చున్నాను. సైడ్ టేబిల్ మీది గడియారం రెండయినట్టుగా చూపుతోంది.

"అర్ధరాత్రి అంకమ్మశివాలన్నట్టు, ఏమిటి నీ వెధవ ప్రశ్న, ఇంత రాత్ర ప్పుడు?" నిద్రలోనుంచి అప్పుడే లేవ డం మూలానా ముద్దముద్దగా వచ్చాయి మాటలు.

"అంకమ్మశివాలే? అలానేవుంటుంది తమకు ... మీకేం నాశనమయ్యేది నేనేగా?" కంటిలో నీరొచ్చిందో లేదో సరిగ్గా గమనించలేదు నేను.

"వెధవ సణుగుడు ఆపి, నీ పాడు

ప్రశ్నేవిటో అడక్కూడదంటే?" విసుగ్గా అరిచాను.

"అడుగుతాను; మరి అడగనూ?అడ దంటే అంత లోకువే మీకు? కట్టుకున్న పెళ్లాం పక్కన పడుకొని అరగంట నుంచి 'సుజాతా! సుజాతా!' అని కలవ రిస్తుంటే అడగను మరీ?"

నిద్రమత్తంతా దెబ్బకు ఎగిరి పోయింది. నావంకే తీక్షణంగాచూస్తున్న కమల, కత్తి చేత్తోపట్టుకున్న ఝాన్సీ లక్ష్మీబాయిలా కనిపించింది. నోరూ, కళ్లూ అలానే తెరచి నా బెటర్ హాఫ్ వంక చూస్తున్నాను.

"ఎవరీ సుజాత? దానికీ మీకూ ఎన్నాళ్ళనుంచి సంబంధం? నన్నేంచేద్దా మని దానివెంటబడి తిరుగుతున్నారు?" నేరవిచారణ జరగకుండానే నన్నో అప రాధిలా నిర్ణయించిన కమల మంచం చుట్టూ తిరుగుతూ, చూపుడువేలు నా మొహంమీదకల్లా పెట్టి అడుగుతోంది. అదేదో ఇంగ్లీషు సినిమాలో విలను ఇలాగే ఒక అమాయకుడ్నిపట్టుకొని "నిధి సంగతి చెప్తావా? లేదా?" అంటూ కత్తి గొంతుమీదకు పెట్టి అడుగుతుంటాడు. ఆ కుర్రాడు కత్తినిచూసి భయపడి, అది ఎక్కడ తగులుతుందోనని వెనక్కు వంగి తప్పించుకోవడానికి ప్రయత్నిస్తూ టేబుల్ తగిలి కిందపడతాడు. అలానే ప్రశ్నలవర్షం కురిపిస్తూ, ప్రతి ప్రశ్న తరువాత నా మొహంమీదకల్లా పెట్టే చూపుడువేలు కంటికి తగులుతుందేమో నని తల వెనకకు జరపడంతో మంచం కోడుకు తగిలి బొప్పికట్టింది.

"మొట్టమొదటిసారిగా ఎక్కడ, ఎప్పుడు, ఎలా కలుసుకున్నారు?...పెళ్ళి కాకముందు నుంచి ఈ భాగోతం జరుగు తోందా?" కోర్టుహాలు దద్దరిల్లేలా అడిగే పబ్లిక్ప్రాసిక్యూటర్లా గర్జిస్తోంది కమల.

పక్కగదిలో పడుకొన్న మా బావ మరిది వర్మకు ఈ అరుపులు వినిపిస్తా యేమోనని భయపడసాగాను. అతగాడు చెల్లెలిని చూసిపోదామని నిన్ననే తగల బడ్డాడు.

"మెల్లిగా మాట్లాడకూడదూ? మీ అన్నయ్య వింటే బాగోదు." సాధ్యమై నంత తక్కువస్థాయిలో అంటున్న నన్ను మాట్లాడనివ్వకుండా గొంతుపెంచి అరవసాగింది.

"అవును మరి! అయ్యగారు చేసే పనులు ఎవరూ చూడకూడదూ...ఇంతకీ అసలు సంగతి చెప్పలేదు. ఎవరీసుజాత? నా పీకమీదకు గండకత్తెర వచ్చి పడింది. నాకు సుజాత అనే పేరుగల అమ్మాయి ఎవరూ తెలియదని, తనతో తప్ప మరో ఆడదానితో నా కెటువంటి శారీరక, మానసిక సంబంధం లేదని మొత్తుకున్నా కమల నమ్మలేదు. యూని వర్శిటీలో చదువుతున్నప్పుడు మా ప్రొఫెసర్ ఇచ్చిన కాండక్టు సర్టిఫికెట్

చూపుదామా అనుకున్నాను. కానీ ఎదురుగా వున్న నా మాటలే నమ్మని అడది, ఎక్కడో దూరానున్న ప్రొఫెసరు రాసిచ్చిన కాగితం నమ్ముతుందా అనే అనుమానంతో ఆ పని చేయడానికి సాహసించలేకపోయాను.

"సుజాత అనే అమ్మాయే నాకు తెలియనప్పుడు 'నన్ను వదిలివెళ్ళకు సుజాత !' అని కలవరించాల్సిన అవసరమేమిటి ?"

కథ మళ్ళీ మొదటికొచ్చింది. ఎలా నచ్చచెప్పాలో నా కర్థం కావడంలేదు... అయినా ఈ ఆడవాళ్ళు అర్థరాత్రప్పుడు నిద్రపోకుండా మొగుడు ఎప్పుడు ఏవని కలవరిస్తాడా నని వినడమేమిటి? ...అత్త కొట్టినందుకు కాదు కానీ, తోటికోడలు నవ్వినందుకన్నట్టు, పక్కగదిలో వున్న వర్మ వింటాడేమోనని భయం వేయసాగింది. వాడు గనుక వింటేనా, అమ్మబాబోయ్,...నా కిహ పుట్టగతులుండవు. ఏ మగాడు తన తోబుట్టువు మొగుడు మంచివాడనుకోడు ?

పాలవాడు వచ్చేవరకూ కమల సణుగుతూనే వుంది. మధ్యమధ్యలో నా వంక డర్టీలుక్స్ పారేస్తూ వీలైనంత అమాయకుడి పోజుపెట్టి చూస్తున్న నా వంక గురిచూసి వదిలిన, 'ఎందుకీ వెధవ చూపు ? నీ సంగతి నాకు తెలుసు; నన్ను మోసపుచ్చలేవు' అన్న భావం స్పష్టంగా కనిపిస్తున్న చూపును భరించలేక గోడ ప్రక్కగా జరిగి, మొహం అటుపక్కగా పెట్టుకొని గోడమీద పాకుతున్న బల్లి నోటిలోని పురుగును చూస్తున్నాను.

పాలవాడి పుణ్యమా అని చెవిపక్కన గొడవ ఆణిగింది. ప్రత్యామ్నాయంగా వంటి టిలోంచి అతి భీకరమైన శబ్దాలు బయల్దేరాయి. ఇహ ఆ పూటకు కాఫీ, టిఫిన్ మీద ఆశ వదలుకొని యూనివర్సిటీకి బయల్దేరాను

అదృష్టవశాత్తు ఈ రోజు ఒకటే పిరియడు అవటంతో పని ముగించుకొని స్టాఫ్‌రూమ్‌లో కూర్చుని, సిగరెట్టు పీలుస్తూ ఆలోచిస్తున్నాను. భోజనానికి ఇంటికి వెళ్దామా వద్దా అనే గొప్ప సందిగ్ధంలో పడ్డాను

అయిపోయిన సిగరెట్టు పారేసి, మరోటి వెలిగించాను.

సరిగ్గా మూడేళ్ళ క్రితం......

* * *

నా కుద్యోగం వచ్చి ఆరునెలలయింది. ఆంధ్రాయూనివర్సిటీలో పి. హెచ్. డి. తీసుకొని, మద్రాసు యూనివర్సిటీలో లెక్చరరుగా చేరాను.

ఒకాదివారం, ఆనందలో 'షాట్ ఇన్ ది డార్క్' సినిమా చూడ్డానికి బయల్దేరాను. మండుటెండలో బస్సుప్రయాణం చేసి ఆట మొదలవటానికి గంట ముందుగానే థియేటర్ చేరుకున్నాను టికెట్టు తీసుకొని బాల్కనీలోని బొమ్మలు చూస్తూ నిలబడ్డాను.



'నే నింతస్వల్పకాలంలోనే ఇంత పెద్దతార కాగలిగినానంటే అందుకు కారణం మీబోటివాళ్లే మాష్టారూ!!

సరిగ్గా. ఆ సమయంలోనే ఒక చిన్నది అటువైపుగా వచ్చి కూల్ డ్రింక్స్ కౌంటర్ దగ్గర కోకా-కోలా అతి నాజూకుగా తాగుతోంది. ఆవిడవంక కళ్ళప్పగించి చూడసాగాను...గుండ్రటి మొహం ... సన్నగా పొడుగ్గా వున్న ముక్కు...నున్నటి శరీరం...కుడిబుగ్గ మీదున్న చిన్న మొటిమ ఆవిడ అందాన్ని ద్విగుణీకృతం చేసిందేకాని, అసహ్యంగా లేదు. ఆవిడ చూడటానికి చాలా సింపుల్‌గా వుంది. మెడలో ముత్యాల దండ తప్ప మరేంలేదు. ఎఱ్ఱంచు పసుపచ్చని జరీచీర ఆవిడ వంటిరంగుకు బాగా నప్పింది. చీరరంగు వంటిరంగుతో కలసిపోవడంమూలాన, దూరంనుంచి చూసేవాళ్ళకు ఆవిడ వొంటిమీద చీర వుందా, లేదా అనే అనుమానం రావడం మన్నించదగినది.

హఠాత్తుగా ఆవిడ నావంకే చూడటంతో, చూపులు పక్కకు పక్కకు తిప్పుకున్నాను తడబడుతూ ... వెధవది... తినేసేలా, అలా ఆడదాన్ని చూడటం తప్పని తెలిసినా, ఈ వెధవకళ్ళురెండూ అటువేపే పరుగులు తీస్తాయి. 'నా గురించేవన్నా చెడ్డగా అనుకుంటుందేమో!' నా గురించి ఎవరు, ఏవన్నా

భరిస్తాను కానీ, అందమైన ఆడపిల్ల తన మనసులో నా గురించేమన్నా చెడుగా అనుకుంటే భరించలేను.

ఓ రెండు నిముషాల తర్వాత అనుకోకుండా ఆవిడవేపే చూశాను. ఆవిడ చూపులు ఇంకా నామీదే వున్నాయి. అలా ఓ రెండుసార్లు జరిగాక ఆవిడ నన్ను పరీక్షగా చూస్తోందన్న సంగతి అర్థమయింది. వెంటనే టాయిలెట్ రూమువేపు పరుగెత్తాను. అక్కడున్న అద్దంలో మొహం, బట్టలు అన్నీ పరీక్షగా చూశాను. అంతా సరిగ్గానే వున్నట్లనిపించింది. 'మరి, ఆవిడ నాకేసి అలా చూస్తుందే(విటి?...'

గర్వంగా ఛాతీ విరుచుకుని, ఠీవిగా నిలబడి అద్దంలోకి మరోసారి చూశాను. చెంపల క్రిందుదాకా వున్న సైడ్ బర్న్స్ ఎంతో అందంగా కనిపించాయి. ఇంట్లో వున్నంతకాలం నాన్న సతాయించేవారు– "గొంగళి పురుగుల్లాగా ఏ(విటా వెధవ జుట్టు. రే(పొద్దున్నే మంగలాడి దగ్గర కెళ్ళి అదంతా తీసెయ్!"–అంటూ. హోరాహోరిగా పోట్లాడి, వాటిని మంగలాడి బారినుండి తప్పించినందుకు ఈ నాటికి నా అదృష్టం బైటపడింది. అ(ప్రయత్నంగా కుడిచెంపమీది జుట్టును మునివేళ్ళతో సవరించాను.

బస్సు (ప్రయాణం మూలంగా నను కుంటాను, తల కాస్త చెదిరింది. జేబులో దువ్వెన పెట్టుకుని, మాటిమాటికి తల దువ్వుకునేవాళ్ళందరూ జులాయి కోర్లని నా నిశ్చితాభి(ప్రాయం. కానీ, ఈక్షణంలో నా దగ్గర ఒక చిన్న దువ్వెన గానీ, లేక అధమపక్షంలో విరిగిన ముక్కైనా లేకపోవడం బాధాకరంగా పరిణమించింది. సరే, ఇహ చేసేదేమీలేక, అలా చెదిరిన జుట్టులోనుంచి ఓ రెండు పరకలు పట్టుకొని నుదిటిమీదకు పడేటట్టుగా సరిచేశాను. సినిమా హీరోలా ఉంగరాలు తిరిగిన జుట్టు కొద్దిగా మొహంమీదకు పడి ఇప్పుడు బాగుంది.

వంటిమీదనున్న గురూషర్టు వంక చూసుకున్నాను. మెడదగ్గర కాలర్ చుట్టూ భుజాలచుట్టూ చక్కటి ఎం(బ్రాయిడరీ.. మెడను గట్టిగా పట్టుకుపోయిన కాలర్.. లేత గులాబిరంగు షర్టును చూస్తుంటే నాకే ముద్దొచ్చింది.... ఈవేషంలో వున్న మొగాడు ( అంటే అందరూ కాదు, నా లాటి మొగాడని అర్థం ) ఆడదాన్ని సులువుగా ఆకర్షించగలడు.

ఈ సారి ఆత్మవిశ్వాసంతో కూల్ (డింక్స్ కౌంటర్‌కు ఎదురుగా వున్న కుర్చీలో అలవోకగా కూర్చున్నాను. బంగారుబొమ్మ (డింక్ (తాగడం ముగించి డబ్బులిస్తూ నావంక మరో రెండుసార్లు చూసింది. ఆవిడను చూస్తున్న నాకు, నా వేషంలో ఏదో లోపమున్నట్టుగా తోచి, వెంటనే సిగరెట్టు వెలిగించాను.

అక్కడున్న బొమ్మలవంక చూస్తూ అటూ ఇటూ తిరుగుతున్న ఆవిడవంక

ధైర్యంగా, పరీక్షగా చూడసాగాను. రొమ్ములమీదకు వేసుకొన్న పొడవాటి నల్లటిజడ, నడుస్తుంటే తొడలకు తగులు తోంది. ఆ నడకలో ఒక విధమైన రాజసం తొణికిసలాడుతోంది. ఈవిడ గారు తప్పకుండా హైక్లాస్ సొసైటీకి చెందిన మనిషనుకున్నాను.

కాసేపటికి, ఏదో దృఢనిశ్చయం చేసుకున్నదానిలా గబగబ నా పక్కకు వచ్చి కూర్చుంది.

"ఎక్స్‌క్యూజ్ మీ! నాపేరు సుజాత! మీ పేరేమిటో నేను తెలుసుకోన వచ్చునా?" కోకిలలా పలుకుతూ, ఇంగ్లీషులో అడిగింది.

ఒక్కసారిగా మనం ఏనాడూ ఆశించనిది జరిగితే ఎలా స్థంభించిపోతామో అలా అయింది నాపని. గబగబ కొండవీడు చేంతాడంతటి నా పెధవ పేరు గొణిగాను. అంత ఖంగారులోనూ, నా పేరుకు ముందు 'డాక్టర్' అని తగిలించడం మరిచిపోలేదు.

"ఓ! ఐసీ! మీరు డాక్టరన్నమాట! వెరీగుడ్. నేను స్టెల్లాలో బి.ఏ. ఫైనల్ ఇయర్ చదువుతున్నాను." ఒకవిధమైన ఆనందం తొణికిసలాడింది ఆవిడ మొహంలో.

"సారీ! నేను మెడికల్ డాక్టరును కాను. డాక్టరేటుని మాత్రమే!"

"ఓ! అలాగా!" ఈసారి ఆవిడ గొంతుకలోనూ, కళ్లలోనూ నిరాశ కనిపించింది. ఆ క్షణంలో నాకు నామీద, మానాన్నమీద విపరీతమైన కోపం వచ్చింది... మొదట్లో నేను మెడిసన్ చదువుతుందామనుకున్నాను. కాని నాన్న, "అంత పెద్దచదువు చెప్పించలేను. బి.ఏ. లో చేరరా పెధవా సరిపోతుంది" అన్నారు. ఆ తర్వాత స్కాలర్‌షిప్ పుణ్యమా అని ఎం.ఏ., పిహెచ్.డి. చేశాను. హాయిగా ఎం.బి.బి.యస్. చదివుంటే యిలా ఈ చిన్నదాన్ని, పువ్వులాటి సుజాతను నిరాశపరచవలసిన క్షణం నా జీవితంలో ఎదురయ్యేది కాదు గదా! డాక్టరును కానందుకు, ఆవిడతో పాటు నేనూ సిగ్గుపడ్డాను.

ప్రపంచంలోని చైతన్యమంతా మూర్తీభవించిన ప్రవంతిలా మాట్లాడుతోంది సుజాత. సినిమాకు వెళ్దాం రమ్మంటే వాళ్ళన్నయ్య రానన్నాడట! (మంచిపనే జరిగింది. లేకపోతే నీతో మాట్లాడగలిగే అవకాశం నాకు దొరికేదా సుజాతా!). కంపెనీ లేకుండా ఒంటరిగా సినిమా చూడటం తన కలవాటులేదట! (అది నా అదృష్టం, సుజా!) అందుకని బుకింగ్ దగ్గరకు వెళ్ళి తన పక్కసీటు నంబరు అలాట్ చేయించుకు రమ్మంది. వెంటనే ప్రపంచాన్నంతా జయించిన వీరుడిలా వెళ్ళి సీటునంబరు మార్పించుకొచ్చాను, సినిమా మొదలవడానికి పదిహేను నిమిషాలుంటుంది.

మా యిద్దరి సంభాషణలో మాట్లాడే

భాగం సుజాత పుచ్చుకుంది. మిగిలిన వినే సగభాగం నాది. మాటలసందర్భంలో వాళ్ళ నాన్న పేరు చెప్పగానే అదిరి పడ్డాను. అంత పెద్దవాడి కూతురు వలచి వళ్ళోవాలింది... "మా యింటి అడ్రస్సు యిస్తాను. వీలున్నప్పుడు రండి! మా డాడీకి కూడా మిమ్మల్ని పరిచయం చేస్తాను." అని సుజాత అంటున్నప్పుడు ఆనందంతో ఏదో ఇంగ్లిషు ట్యూన్ ఈలవేయబోయాను. కానీ, సమయానికి అది గుర్తుకువచ్చి చావలేదు.

నేను వేసుకున్న బట్టలు నచ్చాయంది. నా హేర్‌స్టైల్ అతి అందంగా వుంద న్నది. ఆ తర్వాత, "మీరు వాడుతున్న కొలాన్ మంచి వాసనవేస్తుంది. ఎలాగైనా, మీరు మంచి అభిరుచులున్న వారు" అంటుంటే, స్వర్గానికి బెత్తెడు దూరంలో వున్నట్టే ఫీలయ్యాను.

బెజవాడలోనేగాక, వాల్తేరులోగాని, నేను కనీసం 'ఆఫ్టర్ షేవ్ లోషన్' మొహమన్నా చూడలేదు. గడ్డం గీసుకున్న తరువాత సబ్బుతో కడుక్కునే వాడిని. మద్రాసు వచ్చిన తర్వాత 'ఆఫ్టర్ షేవ్ లోషన్' కొందామని బజారుకు వెళ్లాను. నా స్నేహితుడు ముందుగానే చెప్పాడు 'ఓల్డ్‌స్పైస్' కొనమని. కొట్టువాడికి ఇంగ్లీషురాదు. నాకు అరవం రాదు. అందుకని టాయిలెట్ సామానువున్న బీరువావంక పరీక్షగా చూసి 'ఓల్డ్‌స్పైస్' అని కనిపిస్తున్న అట్ట పెట్టె తీయమన్నాను. ఇంటికి వచ్చి చూద్దునుకదా దానిమీద 'కొలాన్ ఫర్ మెన్' అనుంది. చేసేదిలేక దాన్నే గడ్డానికి వాడసాగాను. అలా, ఏది ఏదో తెలియకచేసిన పొరపాటుకూడా మంచిగానే పరిణమించింది ... మరి వూరికే అన్నారా మన పెద్దలు— 'అంతా మన మంచికే'— అని.

అనర్గళంగా సుజాత చెప్పే విషయాలు చాలావరకూ నా బుర్రలో దూరడంలేదు. మాట్లాడుతున్నంత సేపూ, ఆవిడ కాలూ, చేయి ఓపక్కన ఉండటం లేదు. చేతుల్తో పాటు, చక్రాల్లాంటి గుండ్రటి కళ్లుకూడా తిప్పుతోంది. అప్పుడప్పుడూ, తను చెప్పేవిషయానికి బలాన్నివ్వడానికన్నట్టు వాక్యం చివర కుడి చేత్తో చిటికెలు వేస్తోంది.

"అప్పుడు నేను అది అలాగే చేయడానికి వీలులేదన్నాను (చిటికె). మా డాడీ వెంటనే ఒప్పుకున్నాడు (కుడిచేయి గాలిలో నాట్యమాడింది). మమ్మీమాత్రం తల్ వీల్లేదంది (కాలు నేలమీద తొక్కిపట్టి, కుర్చీలో వెనక్కు జారగిలబడింది) ఆఖరకు నామాటే నెగ్గిందిలెండి (మళ్లీ చిటికె)."

ఇంతలో 'సినిమా మొదలవుతోంది, రండొహో' అన్నట్టుగా మోగిన బెల్లు విని హాలులోపలికి వెళ్లాం. ఆ సినిమాకు




చివరిరోజులవటంమూలాన జనం చాలా పల్చగా అక్కడక్కడా వున్నారు.

"పీటర్ సెల్లర్ బలే ఆక్టుచేశాడండి! అతగాడికున్న పర్సనాలిటీ మరెవ్వరికీ లేదనుకోండి."

అమాంతం నాకు పీటర్ సెల్లర్స్ మీద కోపం ముంచుకువచ్చింది. కానీ, అతగాడిని కలుసుకొనే అవకాశం సుజాతకు లేదుకాబట్టి, వెంటనే ఆ పాపిని క్షమించేశాను. ఇంకా అతగాడి గురించి ఏవిఁటేవిటో చెప్తోంది. అవేవీ తలకెక్కడంలేదు....

సినిమా అయింతర్వాత బీచికెల్దామంటుంది. ఆ తర్వాత వాళ్లనాన్నతో పరిచయం... మెల్లి మెల్లిగా యిద్దరి మధ్యా ప్రణయం... ఒక శుభముహూర్తాన చి॥ వీరవెంకట రామాంజనేయ వరప్రసాద్‌కు, చి॥ సౌ॥ సుజాతను ఇచ్చి... మంగళ వాయిద్యాలు—

ఉద్యోగంలో చేరిన రెండోరోజు నుంచి ఇంటిదగ్గరనుండి రోజుకో ఉత్తరం వచ్చేది– 'ఫలానా అమ్మాయిని చూశాం. బంగారు ప్రతిమలావుంది. నువ్వు ఒప్పుకుంటే వచ్చే నెలలో ముహూర్తాలున్నాయి'. అంటూ. ఎలాగో ఈ ఆరు నెలలూ ససేమిరా అంటూ గడిపాను. అమ్మో... నాన్న మాట వినుంటే, ఇంతటి అదృష్టం అమాంతం చేయిజారిపోయేది కదా!... ఎల్లప్పుడూ ఆలస్యం అమృతం, విషం కాదు...

ఇంటర్వెల్ అయింది. హాలులో లైట్లు వెలిగాయి. ఐస్‌క్రీం తింటూ నిలబడ్డాం.

"ఎంత సేపూ నేమా మాట్లడవేకానీ,

మీరు మాట్లాడరేః ఇదేనా కంపెనీ ఇవ్వ డం అంటే ? ... ఇంతకీ మీరేం చేస్తు న్నారో చెప్పనేలేదు."

"యూనివర్సిటీలో లెక్చరరుగా పని చేస్తున్నాను" అని మళ్ళీ వెంటనే "రెండు మూడేళ్ళలో రీడర్‌గా ప్రమోషన్ వస్తుంది" అంటూ కలిపాను.

"మరి మీనాన్నగా రేంచేస్తుంటారు?"

"ఓః చిన్న ప్రైవేటు కంపెనీలో కాషియర్‌గా వుంటున్నారు," కొంచెం సిగ్గుపడుతూ అన్నాను. అలా ఎందుకు సిగ్గుపడవలసి వచ్చిందనేది, ఏనాటికీ నాకు అర్థంకాని అనేకవిషయాల్లో ఒకటి. బహుశా ఇన్‌ఫీరియారిటీ కాంప్లెక్స్ కావచ్చు!

హఠాత్తుగా మా యిద్దరిమధ్య సంభా షణ ఆగిపోయింది. హాల్లోకి తిరిగివచ్చి కూర్చున్న రెండునిముషాలకే సుజాత లేచి నిలబడింది.

"నాకు కాస్త తలనొప్పిగా వుంది. అదీ కాకుండా, ఇక్కడినుంచి సినిమా సరిగ్గా కనిపించడం కూడా లేదు. ఆ ముందువరసలో కూర్చుంటాను, ఇఫ్ యూ డోంట్ మైండ్" అంటూ, నా సమాధానంకోసం ఎదురు చూడకుండా వెళ్ళిపోయి ముందువరసలో కూర్చుంది.

ఆవిడ అలా ప్రవర్తించడానికి కారణ మేమిటో నా కర్థంకాలేదు. "పాపం! నిజంగానే తలనొప్పి వచ్చినట్టుంది. వెధవ సినిమాకు వస్తే అంతే!" ఆ క్షణంలో నాదగ్గర అమృతాంజనం గాని, తలనొప్పి మాత్రగాని లేకపోవడంతో నాకోపం అంతా హాలువాళ్ళమీదకు మళ్ళింది. అన్నిరకాల డ్రింక్స్, తిను బండారాలు అమ్మేవాళ్ళు తలనొప్పి మాత్రలు మాత్రం ఎందుకమ్మరు? తల నొప్పికి ఫలానా మందు వాడండి అని చూపగానే సరిపోతుందా ?.

మథనపడుతూనే సినిమా చూశాను. జనగణమన అవగానే చూస్తే ఆవిడ కనిపించలేదు. వెంటనే బైటకువచ్చిన నాకు మెట్లుదిగి వెళ్ళిపోతూ మెరుపులా మెరిసింది సుజాత. ఆవిడ వెనకే వెళ్లాను కారుడోరు తెరచి కూర్చుంది.

"మీ నాన్నగారికి నన్ను పరిచయం చేస్తామన్నారు. రేపు సాయంకాలం నాకు పనిలేదు. మీ యింటి అడ్రసు ఇస్తే వస్తాను." అన్నాను నవ్వుతూ.

"ఇంటిదాకా ఎందుకు లెండి, అప్పు అప్పుడప్పుడూ ఇలాగే మనం సినిమా హాలుల్లో కలుసుకుందాం!" అంటూ కారు స్టార్టుచేసి వెళ్ళిపోయింది.

గూబ అదిరేటట్లు ఎవరో చాచి లెంపకాయ కొట్టినట్టయింది. రూముకు వెళ్లానన్న మాటేగాని, సుజాత గురించి ఆలోచించడం మానలేకపోయాను, ఆ రోజంతా.

సైడ్‌బర్న్స్, గురూషర్టు చూసి నేను కూడా, పనీపాటాలేకుండా హిప్పీలను అనుకరిస్తూ తిరిగే పైఅంతస్తుకు




చెందినవాడి ననుకొండి. కానీ, నేను మామూలు మధ్యతరగతి వాడినని, మా నాన్న ఒక చిన్న ఉద్యోగని తెలియగానే తనతో మాట్లాడానికి కూడా అర్హత లేని శలభంలా కనిపించాను సుజాతకళ్ళకు.

వెంటనే మరుసటిరోజు చెంపలమీద జుట్టు తీసేసి, నాన్నకు ఉత్తరం రాశాను. 'మీకు నచ్చిన అమ్మాయిని పెళ్ళి చేసుకోవడం సమ్మతమే' నని. మెల్లిగా సుజాత సంగతి పూర్తిగా మరచిపోయాను.

బాధగా కణతలు నొక్కుకున్నాను. మూడేళ్ళ క్రితం సినిమా హాలులో కనుపించి నా అహంమీద దెబ్బతీసింది సుజాత. మళ్ళీ ఇన్నాళ్ళకు ఆవిడ గారి పేరు ఇంటిలో కాఫీ, టిఫిన్ లేకుండా చేసింది.

సినిమాహాలు సంఘటన తర్వాత ఆవిడ నాకు మళ్ళీ మొన్నటి వరకూ కనిపించలేదు. నిన్న మెరినా బీచిదగ్గర నాతోపాటు యూనివర్సిటిలో చదువుకున్న మూర్తి కనిపించాడు. పక్కనే వున్న సుజాతను తన భార్యగా పరిచయం చేశాడు వాడు. ఆవిడ నన్ను గుర్తుపట్టిందో లేదో గాని, నేను మాత్రం వెంటనే ఆనమాలు పట్టాను. మనిషి ఏమంత పెదగా మారలేదు. కాస్త

మనుష్యతేలింది తన వర్చం, దర్పా అంతా కళ్ళల్లో చూపిస్తోంది.

రాత్రి పడుకోబోయేముందు, ఆవిడ గురించే ఆలోచించడంమూలాన సుజాత పేరు కలవరించివుంటాను. ఇప్పుడేది దారి?..ఇంటికెళ్ళి కమలకుఅంతా చెప్పేద్దామనుకున్నాను. 'అయితే, అబ్బాయి గారికి సినిమాహాలు పరియాలు చాలా వున్నాయన్నమాట!' అంటే ఏమిటి చేయ్యడం?

జాగ్రత్తగా ఆలోచించి ఒక చిన్న కథఅల్లాను. నా చిన్నతనంలో, అంటే నా పదేళ్ళ వయస్సులో మా యింటి పక్కన సుజాత అనే పదహారేళ్ళ అమ్మాయుండేది. ఆ అమ్మాయి ఎవడి తోనో లేచిపోయింది. అలా లేపుకు పోయినవారు వదిలేస్తే పాపం, ఆ అమ్మాయి అన్న నిన్న కనిపించి చెప్పాడు. ఆపిల్ల దీనస్థితి తలచుకుంటూ పడుకోవడం మూలాన, నిద్రలో 'సుజాతా!' అని కలవరించి వుంటాను.

ఎన్ని విధాల చూసినా, ఈ కథలో ఎక్కడా లోపమున్నట్టు కనిపించలేదు. హుషారుగా ఈల వేసుకుంటూ బయల్దేరాను.

యింట్లో అడుగుపెట్టగా నేను, 'నిజంగా మీ ఆయనకు సుజాత అనే అమ్మాయితో సంబంధం వుందంటావా? మీరిద్దరూరాత్రి ఘర్షణ పడుతుంటే విన్నాను'. వరత్మ అడగటం వినిపించడంతో, అక్కడే ఆగిపోయాను.

అబ్బే. ఆయన కలవరించాలేదూ, పాడూలేదు! నేను వూరికే అల్లరిచేశాను. మొగాళ్ళకు పెళ్ళయిన రెండుమూడేళ్ళలో పెళ్ళాంమీది భ్రాంతిపోయి పరాయి ఆడాళ్ళవంక చూస్తారట. అందుకని అప్పుడప్పుడూ యిలాటిషాక్ థెరపీ ఇస్తే, అదుపులో వుంటారని నా స్నేహితురాలు పద్మ చెప్పింది." పగలబడి నవ్వుతోంది కమల.

గిర్రున తిరుగుతున్న తలను రెండు చేతులతోనూ పట్టుకొని కుర్చీలో కూలబడ్డాను.





నలభై మైళ్ళ దూరంలోవున్న నాగలాపురం బ్రాంచి పోష్టాఫీసును మూడో తారీఖు లోపల తనిఖీచేసితీరాలి. లేక పోతే అనవసరంగా సంజాయిషీ యిచ్చుకోవాలి పై అధికారికి.

నాలోవున్న సుగుణం, సులభంగా చేరుకోగలిగిన వూళ్ళని తొందరగా తనిఖీ చేసి, మార్గం సుగమం గాని వూళ్ళనీ, దూరంగా వున్న వూళ్ళనీ అలానే వుంచేసి అనవసరంగా సంజాయిషీలు యిచ్చుకుని, పై అధికారుల కలాలకు పనికల్పించి వార్నింగులు పుచ్చుకోడం రివాజు

నేను ఛార్జీపుచ్చుకుని అప్పటికి ఓ నెలదినాలే అయ్యింది. బొత్తిగా పరిచయంలేని ప్రాంతం. ఏ పల్లె యెక్కడ వుందో సరిగ్గా తెలియదు. నాకు ముందు వుండిన ఇన్స్పెక్టరు నాలానే బద్ధకం రాయుడిలా అవుపించాడు. దూరంగా వున్నవీ. చేరుకోడానికి కష్టమైనవీ తనిఖీ చేయకుండా నా కొరకు అట్టేపెట్టి వుంచాడు పోనీ ఆర్డర్లీని వెంబడి పిలుచుకుపోదామా అనుకుంటే పై ఆఫీసరు పర్మిషన్ కావాలి

నాగలాపురం ఎల్లలూ. తదాదీ తెలుకుని తొమ్మిది గంటలకు స్కూటర్లో బయలుదేరాను. ఇటీవలే ప్రభుత్వం దగ్గర అప్పుతీసుకుని కొన్నా. అపురూపమైన ఆ వాహనాన్ని.

సీతయ్య

తారురోడ్డు దిగి మరీ అయిదుమైళ్ళు మామూలు బాటమీద వెళ్ళాలి నాగలాపురం చేరుకోవానికి. గతుకులు అయి తరిగా వున్న ఆ మట్టిరోడ్డుమీద స్కూటరుపడిన అవస్థచూసి నాకు కళ్ళు నీళ్ళొచ్చాయి. కొత్తగా కొన్నదాయె. ఎలాగో అవస్థపడి పదకొండు గంటలకు ఆవూరు చేరుకున్నాను.

బట్టతలవాడు సూర్యకిరణాల తాకిడికి తట్టుకోలేక తాడిచెట్టు క్రింద చేరిన చందమయింది నాపని. ఇంత కష్టపడి నే నావూరుచేరుకుంటే ఆ ప్రబుద్ధుడు తపాలాసంచిని నిర్ణీత కాలానికంటె ముందుగాకట్టి తనపని అయ్యిందని పించుకుని తన సొంతపనిమీద పొరుగూరు వెళ్ళిపోయాడు

ఈలాంటి ప్రతిబంధకాలు ఈ వుద్యోగానికి చాలవరకు మామూలే. ఆపెద్ద మనిషి తన పనిని సావకాశంగా ముగించుకుని సాయంత్రం అయిదు గంటలకు వచ్చేడు. అప్పటివరకూ ఎవళ్ళూ నన్ను పలకరించిన పాపాన పోలేదు. రాద్ధాంతం చేద్దామనుకుంటే, ఈ వుద్యోగానికి పైన వున్న పలుకుబడి చాల తక్కువ. ఆఫీసర్లు ఏ మాత్రం సహిద్ధించరు, పైగా అనవసరంగా డైరీలపైన ఏవో అభూత కల్పనలని దట్టించి, లేని రిమార్కుల్ని సృష్టించి, బాధ్యతని విస్మరించి నడచుకుంటున్న ఉద్యోగిలా రికార్డుల్లో నమోదు చేసి తలమీద మిరియాలు నూరడానికే ప్రయత్నిస్తారు

"ఇలా చేసినందుకు తన్ను మన్నించమనీ, తని పెద్దకుమార్తె పెళ్ళిమాటల సందర్భంగా పొరుగూరు అవసరంగా వెళ్ళవలసివచ్చిందనీ" ప్రాధేయపడుతూ చెప్పేడు బ్రాంచి పోస్టుమాస్టరు గరుడయ్య. నాకూ వున్నారు నలుగురు ఆడపిల్లలు. అనవసరంగా అలిగి తిరుగుముఖం పట్టివుంటే మరీ అవూరు చేరుకోడానికి భగీరథప్రయత్నం చేయాలి.

ఎలాగో ఆరింటికి యిన స్పెక్షను అయిందనిపించాను తప్పులని కొకొల్లలుగా చూపెట్టేను లోపల మరిగిపోతూన్న కోపాన్ని అప్పుడప్పుడూ వెళ్ళగక్కుతూ.

ఇనస్పెక్షను పూర్తవగానే బయలుదేరేను. గరుడయ్య ఆ రాత్రికి అక్కడే వుండిపొమ్మని చెప్పేడు పాపం ప్రాధేయపడుతూ. ఆ రాత్రికి ఎల్లాగైనా హెడ్ క్వార్టర్సు చేరుకోవాలి. తెల్లారే ఓ ఎంక్వయిరీ కేసు తగలడివుంది నెత్తిమీద కుంపటిలా.

కనీసం రాత్రి తొమ్మిదింటికయినా యిల్లు చేరుకోగలననే ధీమా వుంది. కొత్తగా కొన్న వికీ వుందిగా మరి.

మట్టిరోడ్డు దాటి తారురోడ్డుమీద పరుగెడుతూంది స్కూటర్. అప్పటికి ఏడు గంటలు దాటే వుంటుంది. శరద్రాత్రి. నిండుపున్నమి. గగన సౌధాంగణంలో

దేవతాస్త్రీలు దీపాలని పొందికగా తీర్చి దిద్దుతున్నారు పైకెగబ్రాకుతున్న శృంగారసరసి అయిన జాబిల్లి వారిని చూసి నవ్వులొలికిస్తున్నాడు. దేవతాస్త్రీలు సిగ్గుపడుతూ ఆ దీపాల్ని అలానే వదిలి వెళ్ళిపోతున్నారు.

"ఒకవేళ యీ స్కూటర్ మార్గ మధ్యంలో చెడిపోయి ప్రయాణానికి అంతరాయం కలిగితే ఎలా...?" అనవసరంగా కలిగిన ఈ శంకకు నాకే నవ్వు వచ్చింది. స్కూటరు చెడిపోవడమే! అలా జరగడానికి వీల్లేదు. కొంచంస్పీడు ఎక్కించాను. అప్పటికే యిరవై మైళ్ళ ప్రయాణం సాగించాను. వాచీలో చూసుకున్నాను వెన్నెల వెలుగులో, ఎనిమిది కావస్తోంది.

విపరీతమయిన ఆకలి. పేగులు గట్టిగా అరుస్తున్నాయి బయటికి వినబడేట్లు. మొహమాటానికిపోయి గరుడయ్య దగ్గర పచ్చిమంచినీళ్ళుకూడ ముట్టుకోలేదు. ఏవేవో ఆలోచనలు నా మెదడు చుట్టూ ప్రదక్షిణాలు చేస్తున్నాయి.

నా మనసెక్కడోవుంది. ఓ టర్నింగు తారసిల్లింది. చెట్లవెనకాల ఏదో శబ్దమయ్యింది ఎక్కడో విహారంచేస్తున్న నా మెదడు ఎదురుగావున్న చెట్టును గమనించలేకపోయింది. స్కూటరు వెళ్ళి ఆ చెట్టును ముద్దెట్టుకుంది. బ్రేక్ కంట్రోల్‌లో వుంది. అప్లైచేసినా తొందరలో చెట్లును గుద్దుకోక తప్పిందిగాదు. స్కూటరుకు పెద్ద డామేజికాలేదు. ముందు చక్రానికి మడ్‌గార్డు గట్టిగా అతుక్కుపోయివుంది వూడు ఎలాగైన చేరుకోవాలనే తాపత్రయంతో స్పానర్ సహాయంతో దాన్ని ఎలాగో వేరుచేసేను. ఒంటిలో నీరసంగావున్నా. ఎంత ప్రయత్నించినా స్టార్టు కాలేదు. మరీ మరీ ప్రయత్నించి ఇక ప్రయోజనం లేదని మానుకున్నాను నీరసం ఎక్కువైంది. మెకానిజం తెలుసుకోకుండా స్కూటర్లో ప్రయాణంచేయడం ఎంత తెలివితక్కువ తనమో అప్పుడు అర్థం అయ్యింది.

ఆ రాత్రంతా నేనా నడిరోడ్డుమీద జాగరణచేయాలి. కడుపులో పేగులు గట్టిగా అరుస్తున్నాయి. ఆ దారిలో బస్సుల రాకపోకలు చాలతక్కువగా వున్నట్టుంది. ఒకవేళ వచ్చినా విక్కని ఎక్కించుకోరు. ఏదైనా లారీ వస్తుందేమోనని రోడ్డు మీదనే కనీసం ఓ గంటసేపు కూర్చున్నాను,

ఎక్కడో దూరంగా మంగళ వాద్య శబ్దం కర్ణపేయంగా వినబడుతోంది. వాతావరణం ప్రశాంతంగా వుంది. చాల స్పష్టంగా వినిపిస్తోంది మంద్రస్థాయిలో అక్కడికి కనీసం అరమైలు దూరం నుండి ఆ శబ్దం వినిపిస్తున్నట్లనిపించింది. ఈ నిశీధిలో వంటరిగా జాగరణ చేయకుండా వుండేందుకే దేవుడు నాకీ దారి చూపించి వుంటాడనుకున్నాను. ఆ శబ్దం వచ్చేచోటులో ఏదో ఒకపల్లెవుండవచ్చు.

కాసిని మంచినీళ్ళయినా తాగి ఒకింత సేపు విశ్రమించితేగాని బడలిక తీరదు. ఆ శబ్దంవచ్చేవయిపు నడిచాను స్కూటర్ని నడిపించుకుంటూ.

వెన్నెలవెలుగులో నక్షత్రాలు మినుకు మినుకు మంటున్నాయి. చిన్న చిన్న చెట్లు గాలికి వూగుతూ దయ్యాల్లా అవుపిస్తు న్నాయి. "వెన్నెలలో భయంకలిగించే దృశ్యాలు కూడ యింత అందంగా వుంటాయా" అనుకుంటూ రోడ్డుకు తూర్పువైపుగానున్న చిన్న బాటమీద నడవడం ప్రారంభించేను. ఆ బాటమీద యిదివరకెన్నడూ జనసంచారమే లేన ట్టుంది. చిన్న చిన్న రాళ్ళు బాటమధ్యలో చిందరవందరగా పడివున్నాయి. దూరంగా వెలుతురు కనిపించింది స్కూటరును నడిపించడం కష్టమయ్యింది. స్టాండువేసి బాట మీదనే దాన్ని నిలబెట్టి అటువైపు తొందరగా నడిచాను. పది హేను నిమిషాల్లో నేనొక రెండంతస్తుల మేడ ముందు నిలిచేను. మేడలోపలి నుండి చాల శ్రావ్యంగా వినవస్తోంది గంభీరంగా మంగళ వాద్య శబ్దం. లోపల ఏదో శుభకార్యం జరుగుతున్నట్టు గ్రహించాను.

ఏదో పాతకాలంనాటి భవంతి అయినా చాల అందగావుంది, అలనాటి వైభవాన్ని వ్యక్తంచేస్తూ. ఈలాంటి ప్రాంతంలో అంతటి రమ్యమైన భవనాన్ని ఏ మహాను భావుడు నిర్మించి వుంటాడు? అతడు ఏ మనస్తత్వ శాస్త్రవేత్తో అయివుంటా డనుకుంటూ ముందుకు నడిచాను.

సన్నని గులకరాళ్ళమీద నడవ డంవల్ల నా బూట్లశబ్దం నాకే భయంక రంగా వినిపించడంతో వంటరివాణ్ణవడం మూలాన, ఒళ్ళు జలదరించింది. ఎవరో నా వెనకాల నడిచినట్లు ఫీలయి వెనుదిరిగి చూశాను. ఎవళ్ళూ కనిపించలేదు. నా భ్రాంతికి నాకే నవ్వువచ్చింది. భయపడ్డం మూలాన నొసలుమీద పట్టిన చిరుచెమ టని జేబురుమాలుతో తుడుచుకుంటూ ముందుకు నడిచాను.

లోపల ఎవరో నవ్వుతున్నారు. హడా విడిగా తిరుగుతున్నారు. మంగళ వాద్యాల శబ్దంలో ఆ రొదలు కలిసిపోయి నాకు స్పష్టంగా వినిపించలేదు. సింహద్వారం దగ్గర ఒకింత సేపు నిలబడ్డాను. "క్రాంతి కుంజం" అని, తెలుగులోనూ, ఇంగ్లీషు లోనూ ద్వారానికిరువైపులా తెల్లని పాల రాతి మీద లిఖింపబడివుంది. తటపటా యిస్తూ లోపల ప్రవేశించాను.

ఓ పొడవాటి స్ఫురద్రూపి నా కెదు రుగా వచ్చి లోనికి ఆహ్వానించాడు. చాలా అప్యాయంగా. అతడు నన్ను వరుని తాలూకు బంధువుననుకుని వుండవచ్చు. బహుశః. ఖాళీ కుర్చీలో కూర్చుని వివాహమండపంవైపు తిలకిస్తున్నాను. ఐదు నిమిషాల తరువాత కాఫీ తెచ్చి యిచ్చాడు యిందాకా నన్నాహ్వానించిన ఆ పెద్దమనిషి. కాఫీ త్రాగగానే నాలో




వున్న నీరసం పూర్తిగాపోయి ప్రాణం కుదుటపడింది

పెట్రోమాక్సులైట్ల కాంతిలో పెళ్ళి మంటపం జిగేల్‌మంటోంది. బ్రహ్మాండమయిన హాలుమధ్యలో పెళ్ళిమంటపం చాల ఆధునికంగా, అందంగా, రత్నాల వేదికలా అలంకరింపబడివుంది. రంగు రంగుల పూలతోరణాలు మంటపం నిండుగా పొందికగా అమర్చబడి వున్నాయి. ఏదో ధనవంతుల యింటి వివాహంలా వుంది. స్త్రీలు ధరించిన ఆభరణాలు కళ్ళు జిగేల్‌మనేట్టు ధగధగ మెరుస్తున్నాయి. వారు ధరించిన పట్టు చీరల గరగరల శబ్దం మంగళతూర్యాలు రావానికి తాళం వేస్తున్నట్టు అనిపించింది నాకు. ఆడవాళ్ళు నవ్వుతూ అక్కడికీ యిక్కడికీ తిరుగుతున్నారు. పెళ్ళి సంబరమంతా వాళ్ళదేగా మరి. కొందరు ఏవో గుసగుసలు మాట్లాడుకుంటున్నారు. పసిపిల్లలు నిద్రలేదుకాబోలు ఏడుస్తున్నారు. వాళ్ళ ఏడుపుల్ని మాన్పించేందుకు రొమ్ముల్ని వాళ్ళనోళ్ళకి అందిస్తున్నారు తల్లులు, కసురుకుంటూ.

మాంగల్యధారణ అయిపోయింది. పురోహితుడు వధూవరుల్ని ఒకవరసలో కూర్చోబెట్టేడు. వారిద్దరూ నాకెదురుగా వున్నారు, రవివర్మ చిత్రించిన సీతారాముల్లా. వరుడు నన్నెందుకో నిశితంగా పరీక్షించినట్లు చూస్తున్నాడు

అందరూ కానుకలు చదివిస్తున్నారు. వింతవింత వస్తువులతోనూ, కరెన్సీ నోటతోనూ నిండిపోయి వారికెదురుగా

వున్న వెండిపళ్ళేలు, పెళ్ళికుమారుని తండ్రికాబోలు తీరికగా చుట్ట ముట్టించు కొని మీసాలు మెలిపెడ్తూ ఓ కుర్చీలో కూర్చున్నాడు. నోట్లకట్టలని నిర్లక్ష్యంగా ప్రక్కనే వుంచుకుని.

పెళ్ళికుమార్తెకు ఎడాపెడా చిలిపి అమ్మాయిలుచేరి ఆవిణ్ణి వుడికిస్తున్నారు. పెళ్ళికుమారుడు ఠీవిగా కూర్చుని ఓర కంటితో తన అర్ధాంగిని తిలకిస్తున్నాడు. పాపం ఆ అమ్మాయి సిగ్గుతో తలవాల్చు కుంది. నిశిరాత్రి ముహూర్తం కావున పురోహితుడు విసుక్కుంటూనే సంభా వనలని కచ్చితంగా పుచ్చుకుంటున్నాడు.

నలుగురైదుగురు యువకులు ఆహూ తులకు నారికేళతాంబూలాలు అందిస్తు న్నారు. నేనూ పుచ్చుకొని నా ప్రక్కనే పెట్టుకున్నాను.

హాలులోపలినుండి మేడమీది కెళ్ళేం దుకు విశాలంగా తాపలున్నాయి. మేడ మీది బాల్కనీలో అయిదారుగురు అమ్మా యిలు నిలబడి క్రిందివైపు తిలకిస్తూ ఏదో మాట్లాడుతూ నవ్వుకుంటున్నారు.

వధూవరులు ఇక లోపలికి వెళ్ళవచ్చు నని పురోహితుడు ఆజ్ఞాపించేడు. ఇద్దరు సుందరీమణులు పాటపాడుతూ హారతి పట్టారు. పెళ్ళికుమారుని తండ్రి ఆ పళ్ళెంలో సంచీతో రూపాయల్ని కుమ్మ రించేడు.

ఫోటోగ్రాఫరు చక చక తిరుగుతూ ఫ్లాష్ కెమెరాని అన్నివైపులా తిప్పి ఫోటోలు తీస్తున్నాడు. వధూవరులిద్దరూ నిలబడిన తరువాత వివిధ భంగిమల్లో తాను నిలబడి ఫోటోలుతీయడం మొదలు పెట్టేడు. పాపం! వాళ్ళని అలా నిలబడ మని, ఇలా నిలబడమని కసరత్తు చేయిస్తు న్నాడు. అతని హడావిడి అంతాయింతా కాదు. ఇక అక్కడ నిలబడ్డానికి నాకు మనస్కరించలేదు. అప్పటికే ఆ ఫొటో గ్రాఫరు కనీసం మూడుసార్లయినా తీసి వుంటాడు. నాఫోటోని. మరీ యిటువైపు తిరిగే ప్రయత్నంలో వున్నాడు చకచకా తాపలమీదుగా మేడపైకివెళ్ళి సిగరెట్ వెలిగించుకుని బాల్కనీలో నిలబడ్డాను. నేను పైకివెళ్ళడంతో అక్కడ నిలబడి వున్న అమ్మాయిలందరూ నవ్వుకుంటూ క్రిందికి దిగిపొయ్యేరు. వాళ్ళ సంభాషణకి అంతరాయం కలిగించినందుకు నొచ్చు కున్నాను. అప్పటికే ఒంటిగంట దాటింది. ఈదురుగాలి నా చెవి మెలిపెట్టుతోంది. బాల్కనీ మీదుగా తూర్పువైపు నడిచి వెళ్ళేను వెన్నెల వెలుగులో. పెళ్ళి హడా విడి కనిపించడంలేదు అక్కడికి.

అయిదారు నిమిషాల తరువాత హాల్లోంచి పెద్దపెద్ద కేకలు వినబడ్డంతో పరుగెడుతూ వచ్చేను తాపలదగ్గరకు. ఇంకేముంది, హాలంతా పొగతోనూ, మంటలతోనూ నిండివుంది కుర్చీలూ, స్తంభాలూ అంటుకొని మండిపోతు న్నాయి. ఆడవాళ్ళ హాహాకారాలతో ఆ హాలంతా ప్రతిధ్వనిస్తోంది. అందరి

చీరలు అంటుకుని వున్నాయి నేలమీద పడి దొర్లుతున్నారు. కొన్ని స్తంభాలు బాగా కాలి మండుతూ అటూయిటూ పరుగెత్తేవాళ్ళమీదపడ తో గిలగిల కొట్టుకుని ప్రాణాలు వదిలేస్తున్నారు. పిల్లలు ఏడుస్తూ శలభాల్లా మండిపోతున్నారు. నిస్సహాయంగా నిలబడి పోయాను. నేనున్న బాల్కనీవైపు తప్ప అన్నివైపులా మంటలు విజృంభించి వున్నాయి. మంటల్ని ఆర్పాలని ప్రయత్నం చేస్తున్న కొందరు యువకులు పాపం ఆ మంటలకే ఆహుతి అవుతున్నారు. భవన ముఖద్వారం కూడ అంటుకొని మండిపోతూ వుంది.

కాలిపోతున్న మనుషులమాంసం ఒక విధంగా కంపుకొడుతోంది. నా కడుపులో నుండి పేగులు బయటికివచ్చేంత వాసన. ఏమిచేయడానికి పాలుపోలేదు. చూస్తూ నిలబడ్డంతప్ప ఇంకొంచంసేపు అక్కడే నిలబడితే ఆ మంటల్లోపడి కాలిపోవడం ఖాయం అనుకుని వెనకవైపుగా పరుగెత్తేను. ఈలాంటిదారుణకాండ ఎప్పుడూ చూడని కారణంగా నా తల తిరిగిపోయింది.

అంతలో పాపం ఓ స్త్రీ ఆమంటల్లో నుండి ఎలాగో తప్పించుకుని తూలుతూ నావైపు పరుగెత్తుతోంది. మంటలు విజృంభించేటప్పటికి బహుశః తావలమీదికి వచ్చివుండవచ్చు ఆవిడ. మెళ్ళో గులాబీల దండ అవుపించడంతో ఆవిడే పెళ్ళికుమార్తె అనుకుని అటువైపు పరుగెత్తేను. ఆ దేహంలేదు ఆవిడ పెళ్ళికూతురే నా దగ్గరగా వచ్చి మూర్ఛపోయినట్లు నేలమీద పడిపోయింది. ఇక ఆలస్యం చేస్తే మంటలు విజృంభించవచ్చు. ఆ అమ్మాయిని భుజంమీద వేసుకుని వెనుకవైపుగా నడిచేను. ఆ భీభత్స దృశ్యం చూచి ఆవిడ మనసు వికలమై వుండవచ్చు. ఆవిడ ఉచ్ఛ్వాస నిశ్వాసాలు నా మెడను తాకుతున్నాయి వేడిగా.

బాల్కనీ నుండి క్రిందికి చూశాను. పెద్ద పునీరు క్రిందికివెళ్ళేందుకు అమర్చిన వైపు లీలమాత్రంగా నా కళ్ళకి కనిపించిడంతో ఒకచేత్తో ఆవిణ్ణి పొదివి పట్టుకొని దానివెంబడి జారేను ప్రక్కనే వున్న ఏదో ఒకతీగ ఆధారంతో. అది ముళ్ళతీగ కావడంమూలాన నా అరచేయి చీక్కుపోయి రక్తం స్రవించడం మొదలెట్టింది. ఆమెనీఅలానే భుజంమీద వేసుకుని ఒకింతదూరంపరుగెట్టాను ఆవిడలో కొద్దిగా చలనం కలగడంతో నాకు ధైర్యం కలిగింది.

ఆవిడ వక్షోభాగం నా భుజంమీద వుంది. నన్ను గట్టిగా తన రెండు చేతులతోనూ కౌగలించుకునివుంది భయంతో. పరాయిస్త్రీ. అందునా నవయవ్వని. ఆవిడ వంపుల లావణ్యం నా మనోవీధిలో మెదలగానే కర్తవ్యం మరచిపోయాను. మళ్ళీ ఎక్కడో దాగివున్న మానవత్వం కొరడాతో ఝుళిపించగానే

అవిణ్ణి ఎలాగైనా ఆవిడవూరు చేర్చిగాని యింటికి పోగూడ దనుకున్నాను. ఆవిడ కొంచం తేరుకోవడంతో భుజంమీది నుంచి క్రిందికి దించాను. ఆవిడ మరీ ఆ కాలిపోతున్న భవనంవైపు చూచి గట్టిగా కేకవేసి మరీ కళ్ళు మూసుకుంది.

భవనం బయట ఏ ఒక్క మానవాకారం కనిపించక పోవడంతో అందరూ ఆ కరాళాగ్నికి ఆహుతి అయ్యారని నిర్ధారణ చేసుకున్నాను. ఈ మాటే ఆవిడతో అంటే పాపం ఆవిడ సున్నిత హృదయం దెబ్బతినవచ్చు. కాళ్ళపారాణి ఆరిపోకముందే ఆవిడకు ఈ దారుణం కలిగించినందుకు దేవుణ్ణి నిందించాను.

ఆవిడకు దాహంకాబోలు ! పెదిమలు తడుపుకుంటోంది. నాకా ప్రాంతం పూర్తిగా కొత్త. "దగ్గర్లో సహాయం చేయగలవారెవరయినా వున్నారా ?" అని ఆవిణ్ణి ప్రశ్నించాను, ఆ ప్రాంతం పరిచయం కాబోలనుకుని. ముందు తనకు తెలియదని తల ఆడించింది. తరువాత "ఇక్కడో మఠం వుండాలి. అయిదు నిమిషాలు నడిస్తే మనం అక్కడికి చేరుకోవచ్చు" పాపం ఆవిడ మాటలు నూతిలోనుంచి వచ్చినట్లు వినబడుతున్నాయి.

చెయ్యి పుచ్చుకొని నడిపించుకుంటూ ఆవిడ చేయిచూపించినవైపు నడిచేను. ఆవిడ చెప్పినట్లుగా అక్కడ రెండు పూరిపాకలు మసకమసకగా అవుపిస్తున్నాయి. అందులోని ఓ పెద్దపాకలో దీపం వెలుగుతోంది.

"మీరు లోపలికెళ్ళి తొందరగా కాసిని మంచినీళ్ళు తెండి నాలిక పిడచ గట్టుకుపోతోంది. నేనిక్కడే కూర్చుంటాను" అంటూ ఆవిడ నేలమీద కూలబడి పోయింది నీరసంగా. ఇంకొంచెం సేపట్లో మంచినీళ్ళివ్వకపోతే ఆవిడ మూర్ఛపోవచ్చు.

ఆ పాకవైపు పరుగెత్తేను. రాలిపోయిన ఆకులమీద తొందర తొందరగా అడుగులుపడ్డంతో పెద్ద చప్పుడయ్యింది. పాకలోనుండి "ఎవరక్కడ" అనే కేక వినబడ్డంతో నా వంటిమీది రోమాలన్నీ నిక్కబొడుచుకున్నాయి. భయం అంటే ఏమిటో నా కప్పుడు తెలియవచ్చింది. ప్రళయసమయంలో పర్జన్యుడు చేసే గర్జనలావుంది అతని కంఠం.

నా నోటినుండి మాటలు పెకలి రాలేదు. అయినా లేని ధైర్యాన్ని కూడ గట్టుకుని వాకిలి తీయమని అభ్యర్థిస్తూ, వాకిలి దగ్గర నిలబడ్డమే తడవుగా వాకిలి తెరుచుకుంది. నాకెదురుగా కనీసం ఓ డెబ్భయ్యేళ్ళ ముదుసలి నిలబడి వున్నాడు, ఏపుగా పెరిగిన గడ్డాన్ని ఒక చేత్తో సవరించుకుంటూ. కరుణ వుట్టిపడే చూపులు నా పైన ప్రసరింపబడగానే నాలో కొంత ధైర్యం కలిగింది.

ఇంత రాత్రిలో పాపం ఆయనకు నిద్రాభంగం కలిగించినందుకు క్షమాపణ




చెప్పుకుని ఒక గ్లాసు మంచినీళ్లు కావాలని అడిగేను. బయట ఆ అమ్మాయి వున్నట్లు ఆయనకు వెల్లడించడంలో అతడేమాత్రం ఆలస్యం చేయకుండా ఎదురుగావున్న కూజాలోంచి ఓ గ్లాసు నిండా నీళ్ళు వంచి నా కందించేడు. అతని చేతినుండి బలవంతంగా లాక్కున్నట్లుగా గ్లాసు తీసుకుని ఆ యువతి వున్నవేపు పరుగెత్తేను పెద్ద పెద్ద అంగల్లో.

ఆవిడ అక్కడలేదు. మూర్ఛపడిపోయి ఏ పల్లప్రాంతానికో దొర్లి వుంటుందేమోనని నలువైపులా వెతికేను. ఆవిడ కనిపించలేదు. పాపం ఆ ముదుసలి లాంతరు తీసుకుని మెల్లగా నడుస్తూ నావైపు వచ్చేడు. "నే నిందాకా యిక్కడ వదలివచ్చిన ఆ అమ్మాయి కనిపించడంలేద"ని అతనితో చెప్పేను వణకుతున్న కంఠంతో.

"నిజంగా నీవా అమ్మాయిని ఇక్కడే కూర్చోబెట్టేవా?" అంటూ ఎదురు ప్రశ్న వేసేడు. తనూ ఆ పరిసరాలన్నీ వెదికేడు.

"పోనీ...ఆ అమ్మాయి ఎవరో నీకు తెలుసునా?" అని మరీ ప్రశ్నించేడు.

మేడవున్నవేపు చేయి చూపిస్తూ కాలిపోతున్న ఆ మేడనుండి ఆ అమ్మాయిని రక్షించిన వైనం వివరిస్తూ అందరూ యీపాటికి పూర్తిగా కాలి నుసి అయి

వుంటారని గట్టిగా నిట్టూర్చేను. తొందర పాటులో నేనేం మాట్లాడుతున్నదీ నాకే సరిగ్గా అర్థంకావడంలేదు.

"ఎక్కడయ్యా ఆ మేడ ! యీ ప్రాంతంలో అసలు మేడలే లేవే ! ఈ మఠం తాలూకు పూరిపాకలు తప్ప. పోనీ కొంచం సేదదీర్చుకుని తరువాత చెబుదువుగాని రా" అంటూ నన్ను లోనికి ఆహ్వానించేడు.

ముభావంగా అతణ్ణి అనుసరించేను పాకలోపలికి. తన చేతనున్న లాంతర్ని టేబిల్‌మీదపెట్టి తను ఒక కుర్చీలో కూర్చుని నాకో విరిగిపోయిన కుర్చీని చూపెట్టేడు. మాటలు తడబడగా జరిగిన భీభత్సాన్నిగూర్చి క్లుప్తంగా వివరించేను.

అతని కళ్ళనుండి కారుతున్న అశ్రు బిందువులు పొడవాటి గడ్డంమీదుగా క్రిందికి జారుతున్నాయి. అతనెందుకు దుఃఖిస్తున్నదీ నా కంతుపట్టలేదు.

"నీవు చెప్పిన కథ ఈనాటిది గాదు నాయనా ! ఇది జరిగి ఇప్పటికి సుమారు ముప్ఫయ్యేళ్ళయివుంటుంది. రావు బహద్దరు రామనాధంగారు గొప్ప జమీం దారు కాకపోయినా పెద్ద ధనవంతుడు. ఆ భవనం వారి ఎండాకాలపు నివాసం తనే దగ్గరవుండి చాల బాగా కట్టించాడు ఆ భవనాన్ని. పట్టణానికి దూరంగా వున్నా అన్ని సౌకర్యాలూ అమర్చాడు. ఒక్కగా నొక్క తన కుమార్తె వివాహం ఆ భవనం పూర్తి కాగానే చేయ సంకల్పించాడు కూడా. ఊరికి చాలా ఎడంగావున్నా ఆహూతులకు ఏలోట్లూ రాకుండా అన్ని ఏర్పాట్లూ మహాఘనంగా చేయించాడు. చెప్పుకోడానికి నాకు కంఠం రావడంలేదు" అంటూ నిట్టూర్చి ఒకింత సేపు ఆపి కళ్ళతుడుచుకున్నాడు.

"ఆ ఘోరం జరగడానికి నేనే ప్రధానకారకుణ్ణి. రామనాధం గారంటే నాకు చెప్పలేనంతటి గౌరవం. వారు చాల దయాస్వభావులు. ఫోటో స్టూడియో పెట్టుకోడానికి నాకు ధనసహాయం వారే చేశారు. నేనెవర్నీ యాచించనక్కర లేకుండా వధూవరుల ఫోటోల్ని కనీసం నాలుగయిదు రీళ్ళయినా తీసి వుంటాను. కాని నేను తీసిన ఫోటోల్లో ఏ ఒక్క దాన్లోనూ నాకు తృప్తి కలగలా. పెట్రో మాక్సులైటును ఇంకొంచెం పైకెత్త మని ఓ నౌకరును ఆజ్ఞాపించి వ్యూఫైం డరు ద్వారా వారి చిత్తరువులను తిల కిస్తున్నాను. సీతారాముల్లా కనిపిస్తున్నారు నాకు వధూవరులిద్దరూ క్లిక్ నొక్కుదా మనుకునే లోగానే దారుణం జరిగిపో యింది. పెట్రోమాక్సులైటు వేడికి రంగు కాగితాల తోరణం అంటుకుని మండటం మొదలెట్టింది. దాంతో ఆ నౌకరు భయ పడి చిందులు త్రొక్కడంతో పెట్రో మాక్సులోనుండి మంటలు లేచాయి. దాంతో పెళ్ళిమంటపం అంటుకుంది. ఈదురుగాలి ఆ మంటలకు సహాయం చేయడంతో క్షణంలో విషనాల్కలుసాచి

నలువైపులా క్రమ్ముకున్నాయి. తత్తరి పడుతూ బయటికి పరుగెత్తేను నేను. పది నిమిషాల్లో భవనమంతా మంటలు అలుముకుని అందరూ ఆ దావాగ్నికి ఆహుతి అయ్యేరు. ఎవళ్ళూ మిగల్లేదు. వధూవరులతో సహా అందరూ మసి అయ్యారు. నీవు చూసింది ఆనాడు కాలి పోయిన వారి ప్రేతాత్మల్ని. నేను మాత్రం జీవచ్ఛవంలా యిలా మిగిలి వున్నాను అంటూ కళ్ళనీళ్ళ పెట్టు కున్నాడు

"అయితే నేను చూసింది దయ్యా లన్నమాట." నానోటినుండివచ్చే మాటలే నాకు వికృతంగా వినవస్తున్నాయి. పాపం ఆ అమ్మాయి రూపం నా మనోవీధిలో మెదలగానే కళ్ళుమూసుకున్నాను. ఆ యువతి ఆకారం ఓ పెద్ద భూతంగా మారి నావైపు వస్తున్నట్లు ఫీలయి ఉలిక్కిపడ్డాను. అయినా ఆవిడస్పర్శలో కలిగిన మాధుర్యాన్ని మరువలేక పోయాను.

ముసలాయన కుర్చీలోంచి లేచి ఎదు రుగా వున్న ఓ పెట్టెవైపు నడిచేడు. అందులోనుండి ఏదో ఒక నల్లని పుస్త కాన్ని బయటికితీసి నావైపు నడిచేడు. నేను మరీ భయపడ్డాను. కొంపదీసి ఆతడూ ఒక దయ్యం కాబోలు ననుకుని కుర్చీలోంచి లేవబోయాను. అయినా లేవలేకపోయాను. అతడు ఒక స్టూలును నా దగ్గరగాలాగి లాంతరును దానిపైన వుంచి తనూ కుర్చీని దగ్గరగా లాక్కొని అదురో కూర్చుని ఆ నల్లని పుస్తకం ఆటని ఎడంచేతో తెరిచేడు. అది ఫోటో ఆల్బం. మొదటి పేజీలో అందంగా అతికించబడ్డ ఆ వధూవరుల ఫోటో చూసి ఉలిక్కిపడ్డాను. అవే ముఖాలు; ఏ మాత్రం మార్పులేదు. గంట క్రితం నేను చూసిన ఆకారాలే. రెండోపేజీ తిప్పేడు. నా రక్తం గడ్డ కట్టుకుపోయింది. వెన్నెముక మీద ఎవరో చరచినట్లయింది. ముఖమంతా చెమటలు పట్టేయి. కళ్ళుమూసుకుని మళ్ళీ తెరిచాను. నా ఫోటో ఆ పేజీలో అందంగా అతికించబడి వుంది. కాళ్ళ వణకడం ప్రారంభించేయి. ఎవరో నన్ను కత్తితో వీపున బలంగా పొడిచినట్లు ఫీలయ్యేను.

ముసలాడు వెక్కి వెక్కి ఏడుస్తూ ఆల్బంమూసి పెట్టెలోపెట్టేందుకు వెళ్తూ ఏదో కాలికి తట్టుకోగా పడిపోయేడు. ఫోటో ఆల్బం దూరంగా పడిపోయింది చెల్లాచెదరుగా. అతడి శరీరాన్నిగాని, ఆ ఫోటో ఆల్బంగాని ముట్టుకునేందుకు సాహసించలేక పోయ్యాను అతణ్ణి అలానే వదలి నాలుగు అంగల్లో బయ టికి పరుగు దీశాను, స్కూటర్ని వెతు క్కుంటూ.

జులై నెల

# భావపరిచయ పోటీ



బహుమతి పొందిన వ్యాఖ్యలు

చేయిచూచి చెప్పు చెడుగేమి యున్నను
కడుపుకొరకు చివర కరము చాపు
నెత్తిమీదికొచ్చు మిత్తి నెవ్వడెరుంగు
శకున మిచ్చు బల్లి చావు గనదె

— రావూరు జనార్దనరావు, కోట

చెట్టుక్రింద జేరి చెప్పేవు జోస్యము
ముందు జరుగ బోవుమాట లెన్నొ
నీకు జరుగ నున్న కీడు నీవెఱుగవు
కాలజ్ఞాని వయ్య కాశినాథ!

ఎం. పద్మావతి, గుంటూరు



రించకండి. అబ్బాయి ఆరోగ్యం చక్కబడితే అంతేచాలు" సానుభూతివాక్యాలు పలికాడతను. జయంతి తలకి అగ్ని సంస్కారం చెయ్యబోతూన్న అతని చెయ్యి వణికింది. తన దగ్గర ఉన్న రోజులలో ఓ రోజు పచ్చగులాబి పువ్వు చేతిలో పట్టుకు తనగదిలో కొచ్చింది జయంతి.

"మన గార్డెన్‌లో ఎంత అందమైన పువ్వు పూసింది? బాగుంది కదూ!"

"ఆ, బాగుంది" తన జవాబు పువ్వ వైపు చూడకుండా

"నాకు పువ్వులంటే చాలా ఇష్టం."

"అయితే ముడుచుకో..."

"మల్లెలమాల మధ్య పువ్వు ముడుచుకోవాలి."

"అలానే చెయ్యి..."

"నాకు చాతకాదు."

ఆమె ఉద్దేశ్యం, తాను ఆమె తలలో పువ్వు తురుమాలని. చిరాకేసి.ది. కోపం వచ్చింది. విసురుగా అవతలికెళ్ళిపోయాడు. ఈనాడు..ఈనాడు ఈ ఎఱ్ఱని... ప్రజ్వరిల్లేపువ్వుల్లాటి అగ్నికణాలు ఆమె శిరస్సున గుమ్మరించాడు. అతని హృదయం పశ్చాత్తాప భారంతో కృంగిపోయింది. జాలితో కకావికలై పోయింది. తువ్వాలుతో మొహం కప్పుకు వెనుదిరిగాడు. "నన్ను క్షమించి, బాబు నాశీర్వదించు జయంతీ" హృదయ పూర్వకంగా నమస్కరించాడు మౌళి.

(సశేషం)



ఎండ చాలా తీక్షణంగా ఉంది.

ఉండుండి వేడిగాలి విసురుగా వీస్తోంది.

అప్పుడప్పుడూ ఓ రిక్షా అటుగాని ఇటుగానీ నీరసంగా పోవడం తప్పిస్తే రోడ్డంతా ఇంచుమించుగా నిర్మానుష్యంగా ఉంది.

లక్ష్మణరావు నెత్తిమీద ఎండ పడకుండా పుస్తకాలుపైకెత్తిపట్టుకొని, త్వరత్వరగా నడిచి, రావిచెట్టుక్రిందకు చేరుకొన్నాడు. పుస్తకాలు చెట్టుమొదట్లో ఉంచి జేబులోనుంచి కర్చీఫ్ తీసి మొఖం తుడుచుకొన్నాడు. మొఖంమీదకు పడుతోన్న జుత్తుని జాగ్రత్తగా వెనక్కి సర్దుకొన్నాడు. ఎదురుగ్గా కనపడుతున్న కాన్వెంట్ వంక ఓసారి చూశాడు. వదిలే టైమవుతోంది. ఇంకొద్దిసేపట్లో పిల్లలందరూ ఆరోడ్డుమీద నుంచే ఇంటికి వెళ్తారు. ఒకేరంగు గౌను లేసుకొని జట్లుజట్లుగా, కబుర్లు చెప్పుకుంటూ, నవ్వుకుంటూ—అందరూ వెళ్ళిపోయాక, ఆ పిల్ల ఒఖ్ఖర్తే వస్తుంది. వారంరోజుల్నించీ ఆ అమ్మాయినే చూస్తున్నాడు లక్ష్మణరావు. మొదటిరోజు ఎదురుపడినప్పుడు ఆ అమ్మాయిరూపం తనని విపరీతంగా ఆకర్షించింది. అందంగా అమిరిన ఫ్రాకూ — వయసుతెస్తోన్న మార్పులూ—అందమయిన కాటుకకళ్ళూ అదే మొదటిసారి —ఏ ఆడపిల్లనయినా వివరంగా, ఆతృతగా చూడటం— ఆ రోజు తన కళ్ళలోకి అదోలాచూసిన

ఆ పిల్లని, ఆ తరువాత చూడకుండా ఉండటం తనవల్ల కావడంలేదు. వాళ్ళ కాన్వెంట్ తమ స్కూల్‌కంటె ముందు వదిలేస్తారని రోజూ ఆఖరి పిరీడ్ ఎగ్గొట్టి వచ్చేస్తున్నాడు.

కాన్వెంట్ గంట మ్రోగింది.

పిల్లలందరూ బిలబిలమంటూ బయటికొచ్చేశారు.

అయిదు నిమిషాల్లో రోడ్డంతా మళ్ళీ ఖాళీ అయిపోయింది.

సరిగ్గా అప్పుడే ఆపిల్ల స్కూల్లోంచి బయటికొచ్చింది. కొద్ది సెకండ్లలోనే అతనిదగ్గరగా వచ్చేసింది. లక్ష్మణరావు ఆమెవంక చూసి చిన్నగా నవ్వాడు. నవ్వాడేగాని గుండెలు వేగంగా కొట్టుకొన్నాయ్ ఆక్షణంలో. ఆ పిల్ల సిగ్గుపడింది. తల దించేసుకొంది. పారిపోతున్న ధైర్యాన్ని తిరిగి తెచ్చుకొన్నాడు లక్ష్మణరావు. రోడ్డుమీద ఎవ్వరూ లేరు.

"ఏయ్! కాన్వెంట్ పిల్లా" అన్నాడు నెమ్మదిగా.

ఆ అమ్మాయి ఠక్కున ఆగిపోయింది. అతనివంక తలెత్తి చిరునవ్వుతో చూసింది. "ఏమిటి?" అంది వినీ విన బడనట్లు. తరువాత ఏంమాట్లాడాలో తెలీదు లక్ష్మణరావుకి. సరిగ్గా అప్పుడే ఓసైకిల్ దూరంగా కనిపించింది. ఆ అమ్మాయి అది గమనించి ముందుకి నడిచింది. లక్ష్మణరావు ఇంటికి పరుగెత్తాడు. అతనికి సంతోషం ఉప్పెనలా పొంగుతోంది. కాన్వెంట్ పిల్లకూడా తనంటే ఇదే! తను పిలిచేసరికి ఆగిపోయింది. ఇంటిమెట్లన్నీ ఒక్క అంగలో ఎక్కేశాడతను.

"ఏమిటా తొందర? మెల్లగా నడవ లేవూ?" అమ్మమ్మ కోప్పడింది.

"నువ్వు అమ్మమ్మవి. నీకేం తెలీదు! నువ్వారుకో..." అనుకున్నాడు లక్ష్మణ రావు. పరుగుతోనే పెరట్లోకెళ్ళి మొఖం కాళ్ళూ కడుక్కొచ్చి కంచం ముందు కూర్చున్నాడు. నాలుగు ముద్దలు తినేసరికి కడుపు పూర్తిగా నిండిపోయినట్లని పించింది.

"నాకు తినబుద్ధి కావటం లేదే అమ్మమ్మా!" అనేసి చెయ్యికడిగి తన గదిలోకి పరుగెత్తేడు.

మంచంమీద వెల్లకిలాపడి 'కాన్వెంట్ పిల్ల పేరేమిటో' అని ఆలోచించాడు.

సీత— సుబ్బులక్ష్మి— రాధ— కృష్ణ కుమారి..."

"ఛీ! ఇవేమీ అయుండవు! అన్నీ పాతపేర్లు..."

సరిత... సబిత... ఊహూఁ ఇంకా అందమయినపేరు ఏమిటబ్బా!

రేపు ఆ పిల్లనే అడిగేస్తేసరి...

తప్పకుండా చెప్తుందా అమ్మాయి.

ఆరాత్రి లక్ష్మణరావుకి సరిగా నిద్ర పట్టలేదు. ఒకటి రెండుసార్లు కొంచెం పట్టబోతుండగా కాన్వెంట్ పిల్లొచ్చి

"లేలే" అంటూ లేపేసింది. మర్నాడు మళ్ళీ ఆఖరి పిరీడ్ ఎగ్గొట్టేసి రావిచెట్టు క్రిందకు చేరుకొన్నాడు. కాన్వెంట్ పిల్ల ఆ రోజు ఒంటరిగా రాలేదు ఓపాతిక మంది ఆడపిల్లల జట్టుతో కలసివచ్చింది. ఎవ్వరూ గమనించకుండా తనవంక ఓరగా చూసి, చిన్నగా నవ్వి వెళ్ళిపోయింది. ఆవేళ లక్ష్మణరావు వాళ్ళింటి కున్న నాలుగుమెట్లు పన్నెండు అంగల్లో ఎక్కాడు. కోపమొచ్చి పెట్టిన అన్న మంతా తినేశాడు. తన మంచంమీద పడుకొని కాసేపు కాన్వెంట్ పిల్ల పేరు గురించి ఆలోచించి నిద్రపోయాడు.

వారంరోజులు గడిచిపోయినయి. ఈ వారంరోజుల్లోనూ లక్ష్మణరావుకి ఆఖరి పిరీడ్ ఎగ్గొట్టేసికి వీల్లేకపోయింది. రోజూ అతగాడు తనక్లాస్ ఎగ్గొట్టేసున్న సంగతి చారులద్వారా తెల్సుకొని ఆఖరి పిరీడు మాష్టారు ఆఖర్లో అటండెన్స్ వేసుకోసాగాడు. ఇక లాభంలేదిలా అని ఆలోచించి మొత్తం స్కూల్ ఎగ్గొట్టేసి రావిచెట్టుకిందే గడిపాడు లక్ష్మణరావు. చెట్టుక్రింద కూచుని పుల్లలతో చిన్న ఇల్లు కట్టాడు. తనకీ, కాన్వెంట్ పిల్లకీ దానిమీద ఓమేడ వేస్తుండగా మొత్తం ఇల్లంతా కూలిపోయింది. ఆ తరువాత చెట్టెక్కి చిటారుకొమ్మమీద కెళ్ళి కాన్వెంట్ లోపలికి చూశాడు. చాలా మంది ఆడపిల్లలు కనిపించారుగానీ, కాన్వెంట్ పిల్ల కనిపించలేదు. స్కూల్ వదిలేశారుగానీ కాన్వెంట్ పిల్ల బయటకు రాలేదు. చాలా సేపు అక్కడే నుంచుని బహుశా ఇవాళ స్కూల్ ఎగ్గొట్టేసి సుంటుందని అనుకొని ఈసురోమంటూ ఇల్లుచేరుకొన్నాడు.

"ఏరోయ్! వెన్నెల్లాగుందేవిటి ఎండ ?" అంటూ పలుకరించాడు ప్రక్కింటాయన.

లక్ష్మణరావు ఏడుస్తున్నట్లు నవ్వేసి 'మరే' అని వేగంగా వెళ్ళిపోయాడు అక్కడినుంచి

ఆ తరువాత అతనికి కాన్వెంట్ పిల్ల కనిపించలేదు. పరీక్షలొచ్చేసినయి. పరీక్షలువ్రాసి బుద్ధిమంతుడిలా పుట్టింటికెళ్ళిపోయాడు. కాన్వెంట్ పిల్లని కొంచె మయినా మర్చిపోడానికి సెలవులు సరిపోలేదు. తిరిగి చదవటానికి ఆవూరెళ్ళి నప్పుడు ఆపిల్ల కనిపించలేదు. పదిహేనురోజులు రావిచెట్టు క్రింద ఆపిల్లకోసం ఎదురుచూసి చూసి, తననిచూసి తనే జాలిపడి ఎదురుచూట్టం మానేశాడు.

మానుకొన్నాగాని అపిల్లని గుండెల మీద నుంచి చెరిపేయడానికి సంవత్సరం పట్టింది.

నాలుగేళ్ళు దీపావళి విష్ణుచక్రాల్లా గిర్రున తిరిగినయి.

బందర్లో రూం తీసుకొని ఫైనలియర్ డిగ్రీకోర్స్ వెలిగిస్తున్నాడు లక్ష్మణరావు. ఓ అర్ధరాత్రి అర్జంటుగా పురజనుల కోరికపై మినర్వా టాకీస్‌లో హిందీ




సిన్మా చూసి రూమ్‌చేరుకొనేసరికి, మెట్ల మీద ఓ అకారం రూపంలో బాబాయి కూచుని కన్పించాడు.

"తెలీకడుగుతాను! సినిమాలు చూడ్డానికా, చదవడానికా ఇక్కడికొచ్చింది?" అన్నాడు బాబాయి.

"సినిమాకు కాదు బాబాయ్! సీతా రామాంజనేయ యుద్ధం డ్రామా ... పీసపాటి, అబ్బూరి..."

"నోర్మూసుకో! రామాంజనేయ యుద్ధం... అను..."

"అదే బాబాయ్! ఎంత అద్భుతంగా పాడారనీ..."

"నాకు తెలుసురా!" అంటూ తెల్లవారే వరకూ బాబాయి నాటకాలగురించి మాట్లాడాడు. వెళ్ళేప్పుడుమాత్రం "వచ్చే యువ బుధవారం అమ్మాయి పెళ్ళి ... నువ్వు నాల్రోజులు సెలవుపెట్టివచ్చి వస్లస్ని చూసుకోవాలి" అన్నాడు. లక్ష్మణరావు ఆ నాల్రోజులూ సెలవుపెట్టి మోపుదేవి చేరుకున్నాడు.

పెళ్ళిరోజు ఉదయం పెళ్ళివాళ్ళు బస్సులోనుంచి కలకలమంటూ దిగిపోయారు. అందులో దీపంలా వెలిగిపోతున్న పిల్లనుచూసి లక్ష్మణరావు బొమ్మలా నుంచుండిపోయాడు. ఆ పిల్ల కూడా లక్ష్మణరావు వంక కళ్ళప్పగించేసి చూడసాగింది. వీళ్ళిద్దరినీ బాబాయి చూశాడు కళ్ళజోడు పెట్టుకొని.

"ఏమిట్రాకథ?" అన్నాడు నవ్వుతూ.

లక్ష్మణరావు తెగసిగ్గుపడిపోయాడు.

" 'కాన్వెంట్ పిల్ల' బాబాయ్" అన్నాడు.

ఆ పిల్ల మరీ సిగ్గుపడిపోయి అక్కడి నుంచి హంసలా నడిచి వెళ్ళిపోయింది.

"మనం వీళ్ళకు కాఫీ ఏర్పాట్లు చూడొద్దూ?" అన్నాడు లక్ష్మణరావు బాబాయితో! టాపిక్‌ని ట్రాఫిక్ కాని స్టేబుల్లా మార్చేస్తూ.

బాబాయి గుంభనగా నవ్వుకొని అక్కడినుంచి వెళ్ళిపోయాడు.

అంతవరకూ పందిట్లోనే ఆరిందాలా తిరిగిన కాన్వెంట్ పిల్ల, తీరా లగ్నం సమయం వచ్చేసరికి ఎక్కడా కనిపించ లేదు లక్ష్మణరావుకి. వెంటనే విడిదింటి వైపు నడిచాడు. బయట అరుగుమీద వెన్నెల్లో కూచుని, చందమామ ఇంత చల్లగా ఎందుకుంటాడా అని ఆలోచిస్తున్న ఆపిల్ల "ఏయ్ కాన్వెంట్ పిలా!" అన్న గొంతువిని ఛటుక్కున లేచినుంచుంది. ఇంత పొడుగున ఎదిగిపోయిన ఆ పిల్లను చూసి లక్ష్మణరావుకి నోట మాటరాలేదు. కాన్వెంట్ పిల్ల అదివరకటి పిల్లకాదు. సంపూర్ణ యవ్వనంతో మెరిసిపోతున్న దేవత.

"ఏం కావాలి?" అందామె బెరుగ్గా.

"హబ్బే...ఏమీ లేదు...మీకు నేను గుర్తున్నానా?..."

సిగ్గుపడిందా అమ్మాయి.

"బావుంది! ఎందుకు గుర్తుండరు?"

"ఆఖర్లో... అప్పాళ్ళే మీకోసం చాలారోజులు ఎదుర్చూశాను ..." నవ్వుతూ అన్నాడు లక్ష్మణరావు.

"ఎందుకు!" చిన్నగా అడిగిందామె.

"మీపేరు అడుగుదామనీ..."

కిలకిల నవ్వేసింది కాన్వెంట్ పిల్ల.

"అంతేనా...?"

లక్ష్మణరావు సిగ్గుపడ్డాడు. తనా అమ్మాయిముందు చిత్తయిపోతున్నాడు.

"ఇనాళ్ళూ ఎక్కడదాక్కున్నారూ?"

"బెజవాడ దగ్గర మాఊళ్ళో..."

పెళ్ళిబాజాలు గుండెలదిరేలా మ్రోగసాగినయి. పురోహితుల గొంతు వాటికంటె గట్టిగా మ్రోగుతోంది.

"పెళ్ళికొడుకు.మీ కేమవుతాడూ?"

"మా అక్కయ్య తరపున... మరి పెళ్ళికూతురు మీ కేమవుతుంది?"

"మా బాబాయి కూతురు..."

"పందిట్లో ఉండకుండా ఇక్కడి కొచ్చేశారేం?"

"ఇక్కడ ఎవరో ఒకళ్ళు కాపలా ఉండాలిగా..." నవ్వుతూ అందామె.

ఎవరివో దూరంగా మాటలు విని పించినయి.

ఆమె గాభరాగా అటూ ఇటూ చూసింది.

"ఇక్కడ మనిద్దరనీ... ఎవరైనా చూస్తే...?"

అంతే సగంలోనే ఆగిపోయింది.

"అవును! ఎవరో వస్తున్నట్టున్నారు. వీలుచూసుకొని మళ్ళీ కలుస్తాను..." అంటూ అక్కడినుంచి నడిచాడు లక్ష్మణరావు.

ఈ రోజుల్లో ఏ అమ్మాయినైనా ప్రేమించాలంటే కాస్త మోడ్రన్ గ, అందంగ అగుపించాలిరా నాన్నా!!



ఆ తరువాత ఎంత ప్రయత్నించినా ఆ అమ్మాయితో మాట్లాడటం కుదరలేదు.

మర్నాడు సాయంత్రమే పెళ్ళి వారందరూ వెళ్ళిపోయారు.

ఆ అమ్మాయి పేరు తెలుసుకోలేక పోయినందుకు తనని తనే పదకొండు సెకండ్లు తిట్టుకొన్నాడు లక్ష్మణరావు.

రెండ్రోజుల తర్వాత బందరు బయల్దేరాడు లక్ష్మణరావు.

బాబాయి, బస్‌స్టాప్ వరకూ వచ్చాడు.

"ఆ పిల్ల గురించి అన్నీ కనుక్కొన్నారా. లాభం లేదు! మన అంతస్తుతో సరితూగలేరు..." అన్నాడు బాబాయి.

లక్ష్మణరావు ఉలిక్కిపడ్డాడు.

"ఏ పిల్ల బాబాయ్?" అనడిగాడు తడబడుతూ.

"అదేనోయ్! కాన్వెంట్ పిల్ల..."

బస్ వచ్చింది.

ఎక్కి సీట్లో కూలబడ్డాడు లక్ష్మణరావు. రూముకి చేరుకొని డైరీతీసి మధ్య పేజీల్లో 'కాన్వెంట్ పిల్ల' అని పెద్ద పెద్ద అక్షరాల్తో వ్రాశాడు.

చాలారోజులవరకూ ఆ పిల్ల ఏదో మూలో గుర్తుకొస్తూనేఉంది.

డిగ్రీతీసుకొని హైద్రాబాద్ లో ఓఫిలిం కంపెనీ ఉద్యోగంలోచేరాడు లక్ష్మణరావు. పది సంవత్సరాలు అతిత్వరగా గడిచి పోయినట్లనిపించిందతనికి. ఈ లోగా వివాహం — పిల్లలు — అన్నీ జరిగినయి. కంపెనీ పనిమీద భద్రాచలంవెళ్ళి, తిరగి వస్తూ, డోర్నకల్‌లో రైలెక్కాడు లక్ష్మణరావు. అతికష్టం మీద

స్లీపర్ కోచ్‌లో బెర్త్ దొరికింది. అలిసి పోయిఉండటం మూలాన అతిత్వరగా నిద్రపట్టేసిందతనికి. మెలకువ వచ్చేసరికి రైలు ఘటకేసర్ దాటేస్తోంది. ఎదుటి బెర్త్ మీద స్త్రీ లేచి పిల్లలిద్దరికీ తల దువ్వుతోంది. ఆమె నెక్కడో చూచినట్లు అనిపించిం దతనికి. లేచి కూర్చుని సిగరెట్ వెలిగించి తదేకంగా ఆమె మొఖంలోకి చూడసాగాడు ఏమాత్రం గుర్తుకిరావటంలేదతనికి. పిల్లలిద్దరూ కిటికీదగ్గర చేరి బయటకు చూడసాగారు. అతన్ని ఓసారి యదాలాపంగాచూసి మళ్ళీ అతనివంకే చూడసాగిందామె. ఆమెకూడా ఆలోచనలో పడినట్లు గ్రహించాడతను. మరోసిగరెట్ వెలి గించాడు.

రైలు మౌలాలీ దాటుతోంది

"మీరు... మిమ్మల్నెక్కడో చూసి నట్లుంది...." అన్నాడు ధైర్యంచేసి.

"అవును...నేనూ అదే ఆలోచిస్తు న్నాను..." అందామె.

"మీదేవూరు?"

"బెజవాడ దగ్గర..."

హఠాత్తుగా గుర్తుకొచ్చింది లక్ష్మణ రావుకి.

"హాయ్! కాన్వెంట్ పిల్లా!..." అన్నాడు పొంగుకొస్తున్న సంతోషం అణుచుకొంటూ.

ఆమె అదిరిపడింది.

"మీరా?" అంది సంభ్రమంగా.

సికింద్రాబాద్ చేరుకొంది రైలు.

"అమ్మా! అరుగో నాన్నారు..." ప్లాట్‌ఫారంవేపుచూస్తూ అన్నారుపిల్లలు. ఆమె లేచినుంచుని పరిచిఉన్న బెడ్డింగ్ చుట్టేసింది.

"మళ్ళీ మిమ్మల్ని కలుసుకుంటా ననుకోలేదు..." అన్నాడు లక్ష్మణరావు.

"అవును!" అందామె నెమ్మదిగా.

చిన్న కుదుపుతో ఆగింది రైలు.

"ఒఖ విషయం చెప్తారా?" లేచి నుంచుని అడిగాడు లక్ష్మణరావు.

"ఏమిటది?"

"మీ పేరేమిటి?"

"కాన్వెంట్ పిల్ల..." అందంగా నవ్విందామె

ఆమె భర్త లోపలికొచ్చాడు.

సామాన్లుకూలీవాడికందించి, పిల్లల్ని తీసుకొని బయటకు నడిచాడతను.

అతని వెనుకే నడిచిందామె.

లక్ష్మణరావు ఆమెవెనుకే నడిచాడు.

క్రిందకు దిగబోతూ వెనక్కుతిరిగి 'గుడ్‌బై' అందామె నవ్వి.

తరువాత జనప్రవాహంలో మళ్ళీ కనిపించలేదు వాళ్ళు.

లక్ష్మణరావు జనమంతా ఖాళీ అయే వరకూ అలాగేనుంచుని తర్వాత మెల్లగా బయటకు నడిచాడు. అతని మనసు ఓవిధమైన తీయని బాధతో నిండి పోయింది. 'కాన్వెంట్ పిల్ల' కంటె మంచిపేరు మరొకటి కనిపించలేదతనికి.




నాలుగు రోడ్లు కలిసేచోట – మునిసిపల్ ఆఫీసు గోడదగ్గర గుంపు పోగయింది. గుంపు మధ్యనుంచి ఎవరిదో ఏడుపు. ఆ శోకాలలో ఉండుండి—రామ శబ్దమూ, కృష్ణ శబ్దమూ చోటు చేసుకుంటున్నాయి.

ఏ అభాగ్యుడు ఆ క్సి డెం టు పాల య్యాడో! కుతూహలం శ్రుతిమించగా సభ్యత నవతలికి నెట్టి సందుచేసుకుని తొంగిచూశాను.

ఆశ్చర్యం అవధులు మీరింది. ఇటు వంటి సంఘటన చూడటం నా కిదే మొదటిసారి. అక్కడ చచ్చి పడున్నది మనిషికాదు, ఎద్దు!

మనుషులు—మనుషుల కోసమే ఏడు స్తారనుకొనేవాడినిన్నాళ్ళూ. మనుషులు-పశువులకోసం కూడా విలపిస్తారన్న కొత్త నిజం తెలిసింది.

ఆ మనిషి—ఏడుస్తున్నమనిషి—నాకు తెలుసు. మా వీధి పరిశుభ్రత కోసం పాటుపడే వెంకయ్య వాడు. ఆ యెద్దునీ నాకు తెలుసు. అది మున్సిపాలిటీ ఎద్దు. చెత్తబండిలాగే ఎద్దు. ఎద్దుని నడిపించే డ్రయివరు వెంకయ్య. ఆ ఎద్దు వెంకయ్య స్వంత ఎద్దు కాదు. అది మునిసిపాలిటి వారి ఎద్దు. మునిసిపల్ ఎద్దులలో ఒక విచిత్రలక్షణం ఉంటుంది. మునిసిపల్ ఎద్దుల నిట్టే పోల్చెయ్యవచ్చు. విపరీత ముగా బలిసి ఆబోతుల్లా కనిపిస్తాయవి. అయితే-విసురూ, పొగరూ ఉండవు, వాటికి. కేవలం మునిసిపల్ ఎద్దులే ఎందు కలా తెగ బలుస్తాయో. వాటికిపొగరెందు కుండదో — కారణాలు నా కనూహ్యం. ఈ కథలో మూడవపాత్రనైన నాగురించి కూడా కొంచం ఓపిగ్గా వినండి. నేను కొంచం జాలి మనిషిని. కథలురాయడం ప్రారంభించాక అప్రయత్నంగానే సంఘ టనలకోసం అన్వేషించడం అలవాటయి పోయింది నాకు. సంఘటనలను—నా ఫిలా సఫీ కోణంలోంచి చూసి — కొంచెం రంగులుపూసి-కథచేసి—పాఠకులకు చెప్పే య్యాలనే తపన నాలో కొంచెం ఎక్కువే. అదీకాక మానవత్వం అనేది నా అభి మాన విషయం. అందుకే——

వెంకయ్య ఎద్దుకోసం పెడుతున్న రాగాలు -- ప్రపంచంలో మనుషులింకా మిగిలే ఉన్నారనీ, మానవత్వం పూర్తిగా మంటకలిసిపోలేదనీ చాటుతున్న వచన గీతికల్లా వినిపించసాగాయి నా వీనులకు. పూర్వకాలపు మనిషిని కనుక వెంకయ్య జీవకారుణ్యానికి మనసులో మురుసు కుంటున్నాను. ప్రేమే దైవం. ఆ ప్రేమ మనుషులపట్ల అయినాసరే, పశువుల పట్ల అయినా సరే.

• • •

సాయంత్రం చల్లబడినవేళ. అంద ముగా అలంకరించబడిన బండి. బండి మీద ఎద్దు కళేబరం. దానిమీద పూల మాలలు, పూలగుత్తుల్లో ఆరిపోయిన అగరవత్తులు, హారతులూ యిచ్చే వుంటారు. ఎద్దుకళేబరం ఘనంగా ఊరే గించబడుతోంది. ఓడలు, బళ్ళూ, బళ్ళు ఓడలూ అవుతాయన్నందుకు తార్కా ణంగా, అన్నాళ్ళూ ఎద్దులాగిన చెత్త బండీయే యీనాడు ఎద్దును లాగుతోంది! బండి పక్కగా చెయిర్మనూ, కొంత

మంది కౌన్సిలర్లూ విషణ్ణవదనాలతో నడుస్తున్నారు. వాళ్ళ వెనుక ముఖం వేలాడేసుకుని విచారంగా అడుగులు వేస్తున్న వెంకయ్య.

ఎద్దూ, నీ జన్మ చరితార్థక మైందను కున్నాను నాలో నేను. ఎద్దూ, మొద్దూ అని మనం యీసడింపుగా అంటాం కాని నిజంగా ఎద్దు ఘనమైనదే. అందుకే అది కాంగ్రెస్ గుర్తు అయింది. వృషభం శ్రేష్ఠతనుతెలిపే అర్థంలో కూడా ప్రయోగించబడుతూ వచ్చింది. గొప్పది కాక పోతే—యీ తతంగానికి ముందు-చనిపోయిన ఎద్దుకోసం మునిసిపల్ ఆఫీసులో సంతాప సభ జరిగిందట! అది మామూలుగా కాదు. ఫారిన్ లిక్కర్ల నిషాలలో మరీ సంతాపం ప్రకటించారు(ట). చచ్చిపోయిన ఎద్దుకి ఘనంగా అంత్యక్రియలు జరగాలని తీర్మానించారు(ట).

ఇదంతా తెరవెనుక కథ. ఎవరో చెప్పగా నేను విన్నది.

• • •

చీకటి పడ్డాక ఇల్లు చేరుకున్నాను.

వరండాముందు మెట్ల పక్క ఎవరో ముడుచుకు కూర్చున్నారు. దగ్గరగా వెళ్ళి చూసేసరికి—వాడు ఏడుస్తున్నట్లు తెలిసింది. వాడు వెంకయ్య. ఉదయం చచ్చిపోయిన ఎద్దుకోసం—చీకటి పడేవరకూ కూడా దుఃఖిస్తున్న వాడిపట్ల నా సానుభూతి తెగపెరిగిపోయింది. వాడి మనసులోని మమతలెంత చిక్కనః మనిషంటే వాడే అనిపించింది! వాడి మనసు కల్తీ లేని వెన్నపూస. కాకపోతే యీ కలికాలంలో తనదికాని ఒక జీవం కొరకు యింత విలపిస్తాడా ?

నన్ను చూసేసరికి వాడి దుఃఖం ఒక్కుమ్మడి జలపాతంలా పంటంలోంచీ కన్నీళ్లలోంచీ ఉబికింది. భోరుమంటూ ఏడ్చాడు.

"కంటికి రెప్పలా పెంచుకొచ్చాను బాబూ నా రామకృష్ణని."

"ఏంచెయ్యగలంరా మనం? మానవమాత్రులం. మృత్యువు మన చెప్పుచేతలలో ఉండదు. మనిషి బ్రతుకే అశాశ్వతం." విషాదానికి వేదాంతాన్ని మించిన ఔషధం మరొకటుండదు. ఎంత విచారాన్నయినా వైరాగ్యంతో నెట్టుకువచ్చెయ్యొచ్చునని ఫిలాసఫీ పాఠం చెప్పింది నాకు. అదే ప్రయోగించాను వెంకన్నమీద. "పోయిన మనిషినే తిరిగి తెచ్చుకోలేము. పోయిన ఎద్దుని బ్రతికించుకో గలమా ?

"అలాగనకండి బాబూ! చేసిందంతా మనుషులే. చెయిర్మన్‌బాబే ఎద్దుని చంపేశాడు—"

ఆశ్చర్యంకలిగింది నాకు. ఛెయిర్మన్ గురించి కర్ణాకర్ణిగా నేను విన్నాను. అతను మనుషులని చంపించాడని చెప్పు కోడం కద్దు. ఎద్దులనిచంపించే అలవాటతనికుందంటే నేను నమ్మలేకపోతున్నాను. అయినా ఛెయిర్మన్‌కి ఎద్దులని

చంపించవలసిన అగత్యం ఏముంటుంది? మన దేశంలో ఎద్దులకి ఓటింగ్ హక్కు లేదుకదా!

"ఏమిటి వెంకయ్యా నువ్వనేది? ఛైర్మన్ నీ ఎద్దుని చంపించాడా?"

"కాకపోతే మరేమిటిబాబూ? ఎద్దుకి పుండుపుట్టి నాలుగు నెలలయింది. మందే యిచ్చమంటే శాంక్షనులేదు పొమ్మన్నాడు. చివరకి మమ్మల్నీ, మిమ్మల్నీ అడుక్కుని నేనే గచ్చాకూ, పుచ్చాకూ వైద్యం చేయించాను. తగ్గుముఖం పట్టే సరికి మునలం తెచ్చిపెట్టాడు. తనేమో బంగళా కట్టించుకుంటున్నాడట! రాతిమోతకీ యిటుకలచేరవేతకీ ఎద్దుని పంప మన్నాడు. నెత్తీనోరూ కొట్టుకున్నాను — చెత్తబండీలాగే ఎద్దు రాతిమోతకి పనికి రాదని, జబ్బుచేసిన ఎద్దుని పీడించొద్దని పాదాలుపట్టుకు బ్రతిమలాడాను. విన్నాడా ససేమిరా ఎద్దుని పంపవలసిందే అని ఆర్డరేసేశాడు. పగలల్లా చెత్తబండి, రాత్రిళ్లు రాళ్లబండి. దెబ్బతిన్న ఎద్దు ఏమౌతుంది చావక? పగపట్టినట్లు పని చేయించాడు నోరులేని పశువుచేత—"

నిట్టూర్పు విడిచాను. "ఛైర్మనుకి మాత్రం యిలా జరుగుతుందని తెలిసి ఉంటుందా? ఏదో అంతా అలా అయి పోయింది. చావుకి కారణం ఉండాలా? భ్రమకొద్దీ మనం ఏదో అనుకుంటాం కాని..."

ఎద్దు చచ్చిపోయి — నా కడుపు కొట్టింది!" వెంకయ్య బావురుమన్నాడు మళ్లీ ఓసారి. ఆ దుఃఖంలో బ్రతుకుభయం స్పష్టమైంది.

"అదేమిటి?" అడిగాను.

"ఎద్దుని కొనడానికెంత లేదన్నా అయిదారు వందలౌతుందికదా? మునిసిపాలిటీకి డబ్బులేదట ఎద్దుని కొనడానికి. అందుకని — ఎద్దులేనిదే బండీ ఎందుకన్నారు. బండీ లేకుండా బండివాడిని ఉంచడం దేనికని తీసెయ్యడానికి తీర్మానంచేసేశారు నా ఉద్యోగం ఊడి పోయింది. ఇక నేను బ్రతకడంఎలా."

వెంకయ్య దుఃఖపు లోతు అర్థమైంది. వాడిమీద జాలివేసింది. బ్రతుకు మహాభారంగా పరిణమించిన యీ రోజులలో— ఉద్యోగం ఊడటం ఉరిశిక్ష అంతటిదే. అదీగాక వెంకయ్యది మొదటినుంచీ పేదబ్రతుకే. తిండికే చాలని జీతంలో వెనకేసుకోడం ఎలా సాధ్యం?

"మరి—ముందేం చెయ్యదల్చుకున్నావ్?"

"ఏదో...మీలాటి ధర్మాత్ములు నలుగురూ తలోపాతిక సర్దితే..."

వాడుచేసిన సేవకి ఓ పదిరూపాయలివ్వడం పెద్ద ఎక్కువేమీకాదు. మూడు అయిదులు చేతబెట్టి — పంపించాను.

* * *

ఒక నెల గడిచింది.

కనుచీకటి వేళ. రోడ్డుమీద నడుస్తున్నాను

'బాబూ...!"




రెండోసారి చూస్తేతప్ప వాడిని పోల్చుకోలేకపోయాను. చింకి గుడ్డల వెంకయ్య–సిల్కు బట్టలలో ఉన్నాడు. చెత్తనెత్తుకున్నవాడు–సెంటు వాసనలతో తేలుతున్నాడు. నెల్లాళ్ళకే వాడి బ్రతుకులో యింత మార్పెలావచ్చిందా అని మెదడు మధనపడటం ప్రారంభించింది.

"చీటీ కడతారా బాబూ ?"

"ఏం చీటీ ?"

"బ్రాకెట్ బాబూ.. లక్కీ నంబర్లు తగిలితే..."

వాడి బ్రతుకు బాట తెలిసిపోయింది. పట్టరాని అసహ్యం వేసింది.

"ఛీ–" అనేశాను.

"అదేమిటి బాబూ! పెద్దపెద్దోళ్ళందరూ ఆడుతున్నారు మీరిచ్చినడబ్బుతోనే కంపెనీ పెట్టాను. పాతికరూపాయలతో మొదలుపెట్టిన కంపెనీ — వేలవరకూ వచ్చింది. రోజూ అధమపక్షం పాతికో యాభయ్యో మిగులుతున్నాయి–ఖర్చులుపోనే ఇవంతా మీచలవే బాబూ" విజేతలా చెప్తున్నాడు వాడు. "ఆ నాడు యెద్దు చచ్చిపోయి – ఉద్యోగం పోక పోతే..."

వినిపించుకోకుండా విదిలించుకొని బయటపడ్డాను. అదృష్టం అందలమెక్కించనూ గలదు; అధఃపాతాళానికి అణగ ద్రొక్కనూ గలదు అవినీతి బ్రతుకు ఆఖరికి యిచ్చేది చేదుఫలాలే. నీతిగా చేసుకొనే ఉద్యోగం ఊడితే–నలుగురూ సానుభూతీ సహాయమూ చూపుతారు, కాని — యీ అవినీతి వ్యాపారం అకస్మాత్తుగా దెబ్బతింటే–వాడి బ్రతుక్కి ఏంగతి పడుతుంది ?

పూర్వకాలపు మనిషి కనుక అలా ఆకోచించడంలో తృప్తిలభించింది. అవినీతికి శిక్ష పడుతుందనుకుంటే అదొక ఆనందం. 'జాలి' మనిషినేతప్ప 'జాలీ' మనిషినికాను కనుక నా ఆలోచనలలో ఆత్మవంచనఉందని నా కనిపించలేదు.

అగష్టు నెల

# భావపరిచయ పోటీ

బహుమానం రూ. 10-00



ఈ కార్టూనుకు హాస్యయుత వ్యాఖ్య (Caption) కావాలి.

వ్యాఖ్య వచనంగా గానీ, పద్యంగా గానీ వుండవచ్చు. వచనంగా అయితే ఒక్క వాక్యంలోనూ, పద్యంగా అయితే నాలుగు పాదాల లోపుగాను వుండాలి.

వ్యాఖ్య కార్డుపైననే వ్రాసిపంపాలి. కవరులో పంపినవి అంగీకరింపబడవు.

మాకుచేరిన వ్యాఖ్యలలోకెల్లా ఉత్తమంగా వున్నదానికే బహుమానమివ్వబడును. బహుమతి నిర్ణయంలో సంపాదకునిదే తుదినిర్ణయం. ఉత్తరప్రత్యుత్తరాలు లేవు.

వ్యాఖ్యలు మాకు జూలై 5వ తేదీలోగా చేరాలి. యువ పాఠకులందరూ ఈ పోటీలో పాల్గొనవచ్చును. ప్రవేశరుసుము లేదు.

నిలువుబొట్టుకుమల్లే వెలుగుతున్న దీపానికి కొడికట్టింది. కాంతి తగ్గింది. కొడి రాలుద్దామని ఆమె దీపం దగ్గరకు వెళ్ళింది కాని తీరా దగ్గరకు వెళ్ళేటప్పటికి ఆమెకు భయంవేసింది. చితిలో కూర్చున్న సీతమ్మవారికి మల్లే కూర్చుని వుంది. కొడి రాలిస్తే దీపం బాగా వెలుగుతుంది. నిజమే కాని కొడిని రాల్చేప్రయత్నంలో దీపానికే మోసంరావచ్చు. దురాశ దుఃఖానికి చేటు. ఆమె కొడిని రాల్చలేకపోయింది. తనెవరు కొడి రాల్చడానికి? కొడి అవసరం దీపానిది. ఆ పని దీపమే చూచుకుంటుంది. విడిపోవటమే మంచిదనుకున్నప్పుడు కొడి తనంతట తానే విడిపోతుంది. ఆ పాపాన్ని తనెందుకు వొడికట్టాలి వున్నవి చాలక?

గీసిన అగ్గిపుల్లకోసం వెతికింది. గీసివేసిన అగ్గిపుల్లతో వొత్తి పెద్దది చేసింది. పెరిగిన తోటకూరకాడకుమల్లే వొత్తి వాలిపోయింది. కోపగించినట్లు దీపం చిటపట చిటపటమంది. ఆరిపోయిందే అనిపించింది. ఆమె గుండె గుభేలు మన్నది. ఆవురు ఆవురుమంటూ పసివాడిదగ్గరకు వెళ్ళింది. వాడికి రెండో నెల. గుండెజబ్బు. మూసినకన్ను తెరవటంలేదు వేసిన చెయ్యి కదల్చటం లేదు. చాచిన కాలు ముడవటంలేదు.

దీపం ఆరలేదు. వాడు కదల్లేదు.

ఆమె కళ్ళు చెమ్మగిల్లినై. జీవితం పామే తరుముతూ వుంది ఆమెని.




ఆమె భర్త మరణించాడు. ఈ పసివాడు కడుపున పడటం—ఆమె భర్త మరణించటం ఒకేసారి జరిగినై. అప్పుడే తను ఆత్మహత్య చేసుకుందాం అనుకుంది. కాని తనకడుపులో కదిలే ప్రాణాన్ని వొదిలిపెట్టలేకపోయింది. తను ఆత్మహత్య చేసుకుందాం అనుకున్నప్పుడల్లా కడుపులో వూపిరి సలప

నట్లు తన్నుకునేవాడు. తనకు జాలి వేసింది. ఆ ప్రయత్నం మానుకుంది. వీడికోసమే తను బ్రతికింది.

"అమ్మా"—మంచంమీద ఆమెకు ఎదురుగా కూర్చున్న కూతురు పలక రించింది. ఆమెకు భయంవేసింది. పలక లేకపోయింది

"అమ్మా"—కూతురు మళ్ళీ పలక రించింది. ఆ పిల్లకు ఆరో ఏడు. పట్టిన పట్టు విడవదు. ఆమె మాట పెకిలించింది "ఏం తల్లీ?"

"చిట్టిబాబుకి జబ్బు కదూ?"... అడిగింది కూతురు.

"అవునమ్మా" అని, కూతురు ఇంకేమి అడుగుతుందో అని ప్రాణాలు బిగపట్టుకొని కూర్చుంది.

"నయం అవుతుందిలే అమ్మా. విచారం పెట్టుకోకు" అంది కూతురు.

ఆమెకు ప్రాణం లేచివచ్చింది. "నయం అవుతుందా అమ్మా?"

"తప్పకుండా నయం అవుతుంది"

"మా అమ్మే" అని పిల్లని ఒళ్ళోకి తీసుకుంది; గట్టిగా కావిలించుకుంది. ఆమె వొళ్ళు గగుర్పొడిచింది. పాలు చేపుకు వచ్చినై. కళ్ళ నీళ్ళు కమ్మినై. రవిక తడిసింది. కన్నీళ్ళు వొలికనై.

"తప్పకుండా నయం అవుతుందా అమ్మా?" ఆతురతగా అడిగింది కూతుర్ని.

"ఓ"

"మా అమ్మే?" పరవశత్వంతో కళ్లు మూసుకుంది. హద్దులు సురిగినై. అంచులు కరిగినై. కనుకొలుకులనిండా కన్నీరు లోకమంతా జలమయం. ఆ మయంలో మర్రిఆకు. ఆ ఆకుమీద పసి పాప కళ్ళుతెరిచేటప్పటికి మంచంలో పసివాడు శేషతల్పశాయిలా కనుపించాడు.

చలిగాలి వేసింది. గాలి తగలకుండా పసివాడికి గుడ్డ కప్పింది. బొట్టు బొట్టుగా మందు పోసింది. చంటివాడు చప్ప రించాడు.

"చూశావటే అమ్మా, చిట్టిబాబు వేషాలు? ఏమీ ఎరగనట్టు కళ్ళు మూసు కొని గుటుక్కున తాగివేశాడు" అన్నది కూతురు.

ఆమె చిరునవ్వు నవ్వింది. కూతురు తల నిమిరింది.

గోడనున్న గడియారం టంగుటంగున గంటలు కొట్టింది.

ఆ గడియారం తను కొత్తగా కాపు రానికి వొచ్చినప్పుడు కొన్నది. ఎంత కాలం గడిచింది. ఎన్ని మార్పులు వొచ్చినై! కాని అది మాత్రం ఒకే రకంగా తిరుగుతూంది. ఉదయం ఆరు గంటలనుంచి సాయంత్రం ఆరుగంటలు, సాయంత్రం ఆరుగంటలు మొదలుకొని మళ్ళీ ఉదయం ఆరుగంటలు ఈ విధంగా తిరుగుతూనే వుంది. మార్పులేదు. అలవాటై అనుకోటమేగానీ, జీవితంలో మార్పుకీ కాలానికీ ఏమి సంబంధం?

కాలం గడవటం అని అవసరంకొద్దీ అనుకుంటాం గాని కాలానికి గడవటం అనేది ఎక్కడుంది? ఉన్నవేదో వుంది. అసలు కాలం అనేదే లేదు.

తన భర్తకు ఆ గడియారం అంటే చాలా యిష్టం, నమ్మకం. దాన్నిబట్టే నడిచారు, జీవితం అంతా. ఆయన బ్రతికి వున్నంతకాలం అదికూడా ఆయన కోసమే ఆడుతున్నట్టు ఆడేది. ఇప్పుడు తనకోసమే తను ఆడుతున్నట్టు నటిస్తూంది. ఎంత వంచన! ఇతరులను ఇంత వంచించి బ్రతక్కపోతే ఏమో! అది గంటలు కొట్టినప్పుడల్లా "నాకోసమే నేనుఆడుతున్నాను. నా కోసమే నేను ఆడుతున్నా" అంటున్నట్లు వినిపిస్తుంది. తనకి తన భర్తను జ్ఞాపకం చేస్తుంది. ఆయన వొట్టి అమాయకుడు. అందర్నీ ఇట్లాగే నమ్మేవాడు. అందరికోసం తను పని చేస్తూ వుండబట్టి ఇప్పుడు ఏమనుకొని ఏమి ప్రయోజనం?

"ఏమిటమ్మా ఆలోచిస్తున్నావు?" అని అడిగింది కూతురు.

అందరూ తనకోసమే పనిచేస్తూన్నారు అనుకునేవాడు. ఇంత మోసం వుంటుందని ఆయనకేం తెలుసు అయినా.

"ఏమీ లేదమ్మా" అని చెప్పింది ఆమె. కాని కూతురు ఆమె మాటలు నమ్మినట్టులేదు.

"నువ్వు కాసేపు పడుకో అమ్మా" అంది.

"నా పడక్కి ఏమొచ్చిందిలే తల్లీ!"

"నిన్నకూడా నిద్దర లేదు."

"పరవాలేదులే అమ్మా"

"నీకు జబ్బుచేస్తే నువ్వు చూస్తావు. "నీకు జబ్బుచేస్తే ఎవరు చూస్తారమ్మా!"

"భగవంతుడు" అనబోయింది. కాని కూతురు "నిన్ను చూసే భగవంతుడు నన్ను మాత్రం చూడదటే" అంటుందేమోనని, ఆపుకొని "నువ్వు పడుకో అమ్మా" అన్నది. ఈ జవాబు కూతురికి నచ్చలేదు. "చిట్టిబాబుని నేను చూస్తాగా నువ్వు పడుకో అమ్మా" అన్నది. వొద్దుగాని నువ్వు వెళ్ళి పడుకో"

"అబ్బ! నాకు నిద్దర రావటంలేదే" అంది కూతురు. అని మెదలకుండా కూర్చుంది. ఈలోగా ఏమి ఆలోచించిందో, కాసేపయిన తరవాత మళ్ళీ అందుకుంది.

"చూడమ్మా, చిట్టిబాబుకి ఇంత జబ్బు చేసిందా? మనం కాబట్టి సరిపోయింది. నాన్నగారేవుంటే—ఎంత గందరగోళ పడేవారో" అన్నది.

ఆమె మాట్లాడలేదు. ఒక పెద్ద నిట్టూర్పు విడిచింది. కూతురు చెప్పింది నిజం. పిల్లలకు కొంచెం జబ్బుచేస్తే ఆయన మనిషిలా వుండేవారుకాదు. తను కంగారు పడేవారు. తనని కంగారు పెట్టే వారు. ఇల్లంతా కంగారు కంగారు చేసే వారు.

గడియ గడియకి "నయం అవు

తుందా? అని తనని అడిగేవారు బిక్క-మొహం పెట్టుకుని దీనంగా అడిగేవారు. ఆయన్ని చూస్తే తనకు జాలివేసేది. లాలించబుద్ధయ్యేది.

"నయం అవుతుంది" అని చెప్పేది తను.

"తప్పకుండా నయం అవుతుందంటావా?" అని అడిగేవారు. కాస్త అనుమానంగా చెపితే యేమైపోతారో అని తనకు భయంవేసేది. "తప్పకుండా నయం అవుతుంది" అని చెప్పేది.

"నిజం చెప్పు" అని అడిగేవారు.

తను నిజం చెప్పాలట!

"నిజమేనండి. తప్పకుండా నయమవుతుంది. నామాట అబద్ధమేమో తెల్లవారేటప్పటికి చూడండి. తగ్గకపోతే అప్పుడు అడగండి" అని తనతో చెప్పించుకొనిగాని వొదిలేవారు కారు.

తనకు యీ యిద్దరు బిడ్డల సందునా ఒక కొడుకుపుట్టి పోయాడు. ఆ రోజుల్లో ఆయన ఎంత బాధపడ్డాడు. తనకు ఆస్పత్రిలో జేరటం యిష్టంలేదు. వాళ్లకు కాన్పుచెయ్యటం తెలుసుగాని పసికూనల్ని పెంచటం తెలియదు. ఆముదం పెట్టనివ్వరు. ఎంత చలిగాలి వీస్తున్నా సరే, తలుపులన్నీ బార్లగా తీసి వుంచుతారు. అందుకని తనకు ఆస్పత్రికి వెళ్ళటం ఇష్టంలేదు ఆయనకు ఆస్పత్రి అంటే నమ్మకం. డాక్టరు అంటే నమ్మకం. ఆయనకోసం చేరింది. ఆ కాన్పు చాలా కష్టం అయింది.

ఆస్పత్రిలో చేరటమే మంచిగయింది అనిపించింది తనకు. కాని ఆరో రోజు పిల్లవాడు పోయాడు. ఆయన దుఃఖం ఏం చెప్పను? ఆస్పత్రి ఆవరణలో ఆ పెద్దచెట్టుక్రింద ఒంటరిగా దిగాలుపడి నుంచున్న ఆయన్ను చూస్తే కడుపు తరుక్కు-పోయింది. తను ధైర్యంచెప్పి యింటికి తీసుకురావలసి వచ్చింది.

"ఆస్పత్రికి వెళ్ళకుండా వుంటే బ్రతికేవాడేమో" అన్నారు. వెళ్ళటమే మంచిదయిందని తాను యెంతో సర్ది చెప్పింది. కాని ఆయన మనస్సుకి కలిగిన గాయం మాన్పలేకపోయింది.

"ఇటువంటివన్నీ మనకే జరుగుతయ్యెందుకనో!" అన్నారు.

"మనకే ఎందుకు జరుగుతయ్యిలెండి. మన కష్టాలు గనక మనకు తెలుస్తున్నయి" అన్నది తను. తన ప్రవర్తన ఆయనకి ఆశ్చర్యం కలిగించింది. ఇంత మొండి మనస్సేమో అనుకున్నారో ఏమో. పాపం ఆయనకేం తెలుసు తన బాధ. మనస్సులో తను పడిన బాధ ఆయన చూచి వుంటేనా?

* * *

దీపం వెలుగుతూవుంది. కొడి పెరుగుతూవుంది. దీపం తన్ను తాను హరించుకొంటూ లోకానికి వెలుగునిస్తూ వుంది. కొడి తాను పెరుగుతూ కాంతిని




తగ్గిస్తూవుంది. కొడి స్వభావం దీపానికి తెలుసు. కాని దాన్ని సృష్టించుకోకుండా ఊరుకోదు; ఆ సృష్టివల్ల తనకు ప్రాణాపాయం కలిగినా సరే యెనుగూ బొదుగూ లేకుండా చిరకాలం బ్రతికిందానికంటే కదులుతూ వెలుగుతూ ఆనందంగా ఒక క్షణం బ్రతికినా చాలు. అందుకు తన్ను తాను కాల్చుకుంటుంది. కొడి కట్టించుకుంటుంది. ప్రాణం మీదకు తెచ్చుకొంటుంది జీవితం క్షణభంగురం చేసుకుంటుంది.

దీపం కుంకుమబొట్టు అంది. వొత్తికి నూనె అందటంలేదు అనుకుంది ఆమె. లేచి పాదుల్లో నీళ్ళుపోసినట్లు ప్రమిదెలో నూనె పోసింది. మెదలకుండా వెళ్లి పసివాడిదగ్గర కూర్చుంది వాళ్ళో మార్పు కనిపించింది. కదిలాడు. ఒక్క కదలటమేనా? గుప్పెట మూస్తున్నాడు. తెరుస్తున్నాడు. ఆమె చూసింది. "చూశావా అమ్మా, బాబు యేం చేస్తున్నాడో," అన్నది కూతురుతో సంతోషం పట్టలేక.

"ఆడుకుంటున్నాడే" అన్నది కూతురు.

తల్లి పసివానిచెయ్యి నిమురుతూ కూర్చుంది. ఆమె చూపుడువేలు తన గుప్పెట్లో పట్టుకున్నాడు పసివాడు. వొదలడు. ఆమెకు వొదిలించుకోవాలని లేదు. అలాగే కూర్చుంది.

పసివాడు వున్నట్లుండి కళ్ళు తెరిచాడు. ఎంత తెలివిగా చూశాడని! తల్లిని గుర్తు

పట్టినట్టే చూశాడు. యుగయుగాలనుంచీ ఆమెకోసం వెతుకుతున్నట్టూ, నేటికి వాడి కోర్కె తీరినట్లు చూశాడు తనకళ్లు తెరిచింది ఆమెని చూట్టానికి అన్నట్లు చూశాడు. ఆమె కింటపడగానే వాడికళ్ళు మిలమిలా మెరిసినై. తమలో తాము నవ్వుకున్నై.

"ఏరా నా తండ్రీ? ఏమిట్రా? దేన్ని చూచుకొనిరా ఈ మురిపెం?" అని అడిగింది ఆమె.

"అమ్మరా" అని జ్ఞాపకం చేసింది వాడి అక్క. వాడు కులికాడు. వాడి ఆకులుకులో అమ్మచెయ్యి వొదిలాడు. గుప్పెట మొహానికేసి రుద్దుకున్నాడు.

"ఛీ. ఛీ, ఛీ, ఛీ" అని వాణ్ణి నవ్వించడానికి ప్రయత్నించింది వాళ్ళ అక్క.

నిజంగా వాడు నవ్వాడు. ఆ నవ్వుకి ధ్వనిలేదు. వాడు బయటికి నవ్వలేదు లోపలే నవ్వుకున్నాడు. మబ్బుపట్టి ఉరవ కుండా తేలిపోయినట్టువుంది వాడి నవ్వు. లోపల నవ్వుకున్న ఆ నవ్వుకి వాడి వొళ్ళంతా నవ్వింది. డొక్కలు ఎగర వేశాడు. వుండేలుబద్దకుమల్లే పైకిలేచాడు 'ఊ' అంటూ.

"ఊరుకోరా తండ్రీ, పడుకో" అని బ్రతిమాలింది తల్లి.

"చూశావా అమ్మా నామాట నమ్మక పోతివే" అంది కూతురు.

"ఏమిటి తల్లీ?"

"బాబుకి నయం అయింది."

ఆమె వొళ్లు ఝల్లుమన్నది. నిరాకారంగా ఒళ్ళంతా వ్యాపించివున్న ఆమె భయపడటానికి ఆకారం ఏర్పడింది.

"నయం అవుతుందా తల్లీ?" గద్గద స్వరంతో అడిగింది,

"ఓ" అన్నది కూతురు.

"తప్పకుండా నయం అవుతుందా?"

"తప్పకుండా నయం అవుతుందే."

"నిజంగానా!" అని అడగబోయింది. మాట నోటిదాకా వచ్చింది. భర్త జ్ఞాపకం వొచ్చాడు. అయన తన్నీవిధంగానే అడిగేవారు. ఆమెకు లజ్జ కలిగింది. శరీరం రసవాహినిగా మారింది.

భర్త కనిపించాడు.

ఆమె కొత్త పెళ్ళికూతురైంది.

"కులాసాగా వున్నావా?" అని అడిగారు.

"మీకు తెలియదూ?"

"తెలుసు."

"అవిటి బ్రతుకైనది అన్నిటికీ."

"అలా అనుకోకు."

"దేనిమీద ఆశపెట్టుకొని అనుకోకుండా వుండేది?"

"నేను చెప్పింది మరచిపోయావా?"

"ఏమిటి?"

"కష్టమనీ, సుఖమనీ, చావు అనీ, బ్రతుకనీ—ఇవన్నీ పెట్టుకోకూడదు. ఈ ప్రపంచంలో ఒక మనిషి కష్టపడటం, సుఖపడటం, పుట్టడం, చావడం యివేవీ




చెప్పుకోతగ్గ విషయాలు కాదు. అంటీ అంటకుండా బ్రతకటమే జీవితాన్ని జయించటం"

"అవును."

"ఏమిటి అవును?"

"జ్ఞాపకం వుంది."

"జ్ఞాపకం వుందంటే చాలదు. నీవు జ్ఞాపకం ఉంచుకునే దానివి. అదీ జ్ఞాపకం వుండేదీ — ఈ భేదం ఉన్నంతకాలం చిక్కే. నీవే జ్ఞాపకం. జ్ఞాపకమే నువ్వు కావాలి."

"నేనే జ్ఞాపకం. జ్ఞాపకం నేను."

అతడు అంతర్థానం అయ్యాడు. రస వాహిని శరీరంగా మారింది. దీపం గుప్పుమంది. కాని ఆరలేదు. కొడి పెరిగింది కాని విరగలేదు. ఆమె చూచింది. కాని దృష్టి నిలవలేదు. అదొక దీపం, దానికొక వొత్తి, వొత్తికొక కొడి. ఇదొక మంచం, దానిమీద గుడ్డలు, గుడ్డల్లో పసివాడు, వాడికి జబ్బు, ఎదురుగా కూతురు, కూతురికి ఎదురుగా తను, ఇల్లా దేనికి దాన్ని చూడలేకపోయింది. ఇవన్నీ కలిస్తే యేమవుతుందో అదే జీవితం అనిపించింది. అదేదో ఒకటి ఉందనిపించింది.

కూతురు కునుకుతూవుంది.

"తల్లీ!" తల్లి లేపింది.

కూతురు బరువుగా రెప్పలు తెరిచింది.

"పడుకో అమ్మా, నిద్దర కాయలేవు"

కూతురు కళ్ళు నులుపుకొని 'కాస్తానే' అంది.

"వినమ్మా, జబ్బు చేస్తుంది."

"మరి నీకో?"

"నేను పెద్దదాన్ని."

"నేను మాత్రం పెద్దదాన్ని కాదటే. చూడు, బాబుకంటే ఎంత పెద్దదాన్నో." అని మంచంమీద నుంచి లేచినుంచుంది.

"పెద్దతనం అంటే అదికాదు తల్లీ."

"మరింకేమిటి?"

"నువ్వు నిజంగా పెద్దదానివైతే అప్పుడు తెలుస్తుంది."

కూతురు మాట మార్చింది "బాబు ఎంచక్కా నిద్దరపోతున్నాడే" అన్నది.

"వాడికి వాళ్ళనాన్న గుణం వచ్చింది."

"నాకో?"

"అమ్మగుణం."

కూతురికి పడుకోబుద్ధయింది.

తల్లికి అర్థం అయింది.

తనలో తాను నవ్వుకుంది. నా తల్లీ దీ వాళ్ళనాన్న గుణమే అనుకుంది.

కూతురు పడుకుంది. శాలువా కప్పుకుంది. మధ్యలో యేమి జ్ఞాపకం వచ్చిందో "నేను అన్నట్టు అయింది. చిట్టిబాబుకి నయం అవుతుంది అన్నాను. అయింది. రేపు నా బాబుకి నేనే నీళ్ళు పోస్తా కాళ్ళమీద పడుకోబెట్టుకొని. రేపు నాకు సున్నివుండలు చేసిపెట్టవటే?"

మాట్లాడుతూ మాట్లాడుతూనే నిద్ర పోయింది. పిల్లలపని అంతే.

ఆమె పసివాడికి కప్పినగుడ్డ సర్దింది. వొంటిమీద చెయ్యివేసి చూచింది. బుగ్గలు నిమిరింది. ఆలోచనలో పడింది. తన తండ్రి... తన తల్లి ... తన అన్నలు. అన్నల పెళ్ళిళ్ళయి తన పెళ్ళి కాకముందే తండ్రి మరణించాడు. తండ్రి గతించగానే అన్నలు వేర్లు పడ్డారు. వాళ్ళ జీవితాలు వేరైనై. తల్లినీ, తననీ పరాయివాళ్ళను చూచినట్లు చూసేవారు. తన తల్లి తనమీద ఆశపెట్టుకొని జీవించింది. తనని ఒకాయన చేతుల్లోపెట్టి తప్పుకుంటా ననేది. తనకు వివాహం అయింది – అప్పటినుంచీ తనకడుపున కాయపడితే చూడాలని ఆశపడేది. అంతకంటే ఏ కోరికా లేదనేది. తనకు కూతురు కలిగింది. మలిచూలు మగబిడ్డ అని ఆశపడేది. మనమరాలి పెళ్ళి చూడాలని ఆశపడేది. అంతకంటే ఏ కోరికా లేదనేది. కాని అప్పటిదాకావుంటే ముని మనమణ్ణి చూడాలని తప్పకుండా ఆశ పడేది. ఆశకు అంతులేదు. జీవితానికి పునాదే ఆశ. జీవించటం అంటేనే ఆశ పడటం. ఆశాజ్యోతి సర్వకాల సర్వావస్థలయందూ వెలుగుతోనే ఉంటుంది. తన భర్త అంటూ వుండేవాడు, "దేని కోసం బ్రతకటం అనే ప్రశ్న అర్థంలేని ప్రశ్న. బ్రతకటమే ఆనందం."

కొడి రాలింది. దీపం మెరిసింది. మెరవటంలో కొలనులోని కలువపువ్వులా మెరిసింది. భళ్లున-తెల్లవారింది.



మా ఎదురింటి సుందర్రామయ్య చాలా పెద్దమనిషి.

అనుకోకుండా వచ్చిన ట్రాన్స్ఫరులో నేను ఎండుటాకులా కొట్టుకొచ్చాను. కొత్త వూరు. ఇక్కడ సుందర్రామయ్య లాంటి పెద్దదిక్కు దొరకడం నా అదృష్టం. మనిషన్న తర్వాత జబ్బంటూ ఒకటి రాకపోదు. మా ఇంట్లో ఎవరికైనా ఒళ్ళు నలతగావుందని తెలిస్తే నాలుగురకాల ఔషధాలు సూచించి, నలుగురు డాక్టర్ల దగ్గరికి తీసుకెళ్ళి ఆ జబ్బు నయమయ్యేదాకా సుందర్రామయ్య నిద్రపోడు. ఏ ఆపద్బాంధవుడైనా ఇంత కన్నా ఏం చేస్తాడు? "మార్కెట్లో మంచి కూరగాయలొచ్చాయట? అయినా తెచ్చిపెట్టేవాళ్ళు కావద్దూ," అంటూ మా ఆవిడ నన్ను ఎద్దేవా చేసేసమయానికి సరిగ్గా సుందర్రామయ్య ప్రత్యక్షం. రిటయిరై పించను పుచ్చుకుంటున్న వాణ్ణి నేనొకణ్ణి వున్నాను గదమ్మా ఈ మాత్రం పని నేను చేసిపెట్టలేనా" అంటూ సంచీ పుచ్చుకుని ఆయన మార్కెట్టుకు సిద్ధం. అందువల్ల ఆయన నాకు సమయసంజీవిలా కనిపించాడన్నది వట్టి సహజోక్తి.

ఆయన మాటపైన నాకు చెప్పరానంత గురి.

సాయంకాలానికి వాన వస్తుందంటాడు. తప్పకుండా వస్తుంది. జడివానగా మారిపోయినా నాలుగు ఉబ్బచినుకులైనా పడాల్సిందే!

"వాతావరణంలో మార్పు వచ్చింది ఫ్లూజ్వరాలు ముంచుకొచ్చేస్తే ఆశ్చర్య పడవలసింది లేదంటాడు. సుగ్రీవాజ్ఞ! దేశమంతా ఫ్లూజ్వరాలతో తీసుకోవలసిందే.

ఈ సంవత్సరం వాన లెక్కువై పోయాయి. వాన లెక్కువైతే చెట్టు బలుస్తుంది గానీ పూత బట్టదు. కందిపప్పు రేటు పెరుగుతుందంటారు. ఏడాదికి సరిపడే కందిపప్పు కొని స్టాకుపెట్టేసుకునే దాకా నా ధ్యాస యింకొక విషయంపైకి పోదు.

సుందరామయ్య అనుభవజ్ఞుడు. నేను నేలపైనబడి క్యారుక్యారుమని ఏడుస్తూ లోకాన్ని పలకరించిన నాటికి ఆయనకు బహుశా ఇప్పుడు నాకున్నంత వయసుండి వుంటుంది. నాకన్నా ముప్ఫై ఏళ్ల ముందుగాపుట్టి, అనుభవపూర్వకంగా ఆయన సంపాదించి పెట్టుకున్న జ్ఞానమంతా కొంగులోని బంగారంలా, నేల తంగేడుచెట్టులోని తేనెపట్టులా అశ్రమంగా, అయాచితంగా నాకు కైవశమై పోయింది. ఇంక నాకు దౌర్లెందుకు? ఆలోచ నెందుకు? సుందరామయ్య నాకు నాడీజాతకంలా, చిలకజోస్యంలా, పెద్ద రెఫరన్సు పుస్తకంలా దొరికాడు. సర్వం దైవాధీనమని పెద్ద లన్నట్టుగా సర్వం సుందరామయ్య అధీనమని భావించి నేను నిష్పూచీ, నిష్పేచీలవాణ్ణిగా వుండి పోవడానికి అలవాటు పడసాగాను.

అసలింతకూ సుందరామయ్య అనే బోధివృక్షం నీడక్రింద నాకు జ్ఞానోదయం కలిగిందెప్పుడో చెప్పాలి.

కొత్తవూరికి వెళ్ళిన కొత్తలో గోడ గడియారం కొన్నాను. గోడకు తగిలించి దానికి ప్రారంభోత్సవం చెయ్యడంకోసం సుందరామయ్యనే ఆహ్వానించాను. ఆయన దాన్ని ఏడెనిమిది దృక్కోణాల నుంచీ పరిశీలించి చూచారు. ఎదురుగా నిలబడి అనుమానంగా పెండులంవైపు చూచాడు. తరువాత పెదవి విరిచి, "ఏదీ సవ్వడి బొత్తిగా వినిపించడంలేదే!" అన్నారు

"ఇంతకంటే బలంగా వినిపించాలంటారా?" అన్నాను.

"మాతాతయ్యగారియింట్లో ఒక గోడ గడియారం వుండేది. అది పెద్ద చుట్టు భవంతి యిల్లులే! నడవలో ఎక్కడో వుండేది గడియారం. ఐతేనేం? అది యింటికంతా గుండెకాయే ననుకో! అంత పెద్దయింట్లో అది టిక్కుటిక్కుమనే శబ్దం ఏ మూలలో వున్నా వినిపిస్తుండేది. ఆ పనితన మిప్పుడెక్కడ పేడ్చింది? కాలం చెడిపోయింది లేవయ్యా శేఖరం!"

కాలమే చెడిపోయినప్పుడు కాలమానిని చెడిపోవడం అబ్బురమా! నాకు

ముఖాన చింతనీళ్ళు చల్లినట్టయింది. అలాగని పైసా వాపాచూపించిందని నా గడియారంపైన నేను అపనింద మోపలేను. కీ యివ్వడంలో కొంత ఆలస్యం జరిగినా అది బుద్ధిగా తన పనేదో తాను చేసుకుపోతుండేది. ఐనా సుందర్రామయ్య తాతగారింట్లో వెలసివుడిన గోడ గడియారంలా యిది కొట్టుకోడంలేదు గదా! వందాయాభై రూపాయలుపోసి కొన్నందుకు యిదేనా యీ బోడి గడియారం నాకు చేయాల్సిన సత్కారం! నాకా గడియారంపైన మోజు తగ్గింది.

దాన్ని చూచినప్పుడల్లా కాలం చెడిపోయిందన్న సుందర్రామయ్య మాటే జ్ఞప్తికి వస్తుండేది.

ఆలోగా కాలానికి బాగా జబ్బుచేసిందనడానికి తార్కాణంగా సుందర్రామయ్య క్రమంగా రోజుకొకటి రెండు దాఖలాలు చూపుతూనే వచ్చాడు.

"అంతెందుకు శేఖరం! నా చిన్నతనంలో మా అమ్మ కూరలకు తిరగమోత పెడుతుండేది. ఆ సువాసన నేనింకా మరచిపోలేకుండా వున్నాననుకో! ఎక్కడో పెరటిదగ్గర వంటగదిలో తిరగమోత పెడితే, ఆ వాసన హాలుదాటి నడవదాటి, వీధివసారాలోకి, యింకా మాట్లాడితే వీధిలోకి గూడా వచ్చేసేది. ఇప్పుడేదీ? నేనూ పొంచివుండి గమనిస్తున్నాను గదా! తిరగమోత వాసన చస్తే రాదే! ఇప్పుడు చెప్పు. దీన్నేమంటావు మరి?"

కావచ్చు కావచ్చు ననుకున్నాను. ఆ మధ్య నాకుగూడా యింట్లోగానీ, ఆఫీసులోగానీ తిరగమోత వాసన పసిగట్టినట్టు జ్ఞాపకం లేదు.

"ఇంకొకటి చెప్పమంటారా శేఖరం!" అన్నాడు సుందర్రామయ్య "ఏవిటో చెప్పండి" అన్నాను ఆసక్తిగా. ఇప్పుడు మార్కెట్టు కన్ని కూరగాయలొచ్చిపడుతున్నాయి గదా? ఏం లాభం చెప్పు. చవీసారం వుండి ఏడ్చేది ఒక్కటైనా వుందా వీటిలో? నా చిన్నతనంలో మా అమ్మ యిన్ని పచ్చిమిరపకాయలు, ఉల్లిపాయలు తరిగిపోసి కాస్తంత కొత్తిమేర ఆకుతో మిళాయించి చింతపండు వూరుబిండి నూరిపెడితే రెండు కంచాల నిండుకూడు తిని లేచేవాళ్ళం. ఇప్పుడు నువ్వు పనిగట్టుకుని ఒక విందుకు వెళ్ళి చూడు. మందు తిన్నట్టు లేచిరావల్సిందే!"

సుందర్రామయ్య మొదట మొదట చాలా చిన్నచిన్న ఉదాహరణలే చెబుతూ వచ్చాడు. నాలో గ్రాహ్యశక్తి తగినంతగా పెరిగినట్టు నమ్మకం కలగగానే మహత్తర విషయంలోకి చొచ్చుకుని వచ్చేశాడు, ఉండుండీ ఒకనాడు "ఈనాటి సాహిత్యం మాత్రం?" అన్నాడు. "దానికి ఏమొచ్చిందండీ? అన్నాను. "మా రోజుల్లో విడివిడిగా అయితే

పావలా కాక నవల దొరుకుతుండేది. రూపాయకైతే అయిదు నవలలు వచ్చేవి. చదువుతుంటే ఏ లోకంలో వున్నామో తెలిసేదికాదు. పొట్టచెక్కలయ్యేటట్టుగా నవ్వు కూడావచ్చే దనుకో! ఇప్పు డెక్కడ? ఇన్ని పత్రిక లొస్తున్నాయి గదా! వందల లెక్కలో పుస్తకాలు తయారుచేసి, అచ్చేసిన అంబోతుల్లా వదలిపెడుతున్నారు గదా! ఆస్వారస్యం వీటిలో కాగడావేసి వెదికినా కనిపించదే!"

"అవు న్నిజమేనండి! మీమాటలు విన్నాక జ్ఞాపకానికొచ్చింది. మాఅమ్మమ్మ చెబుతుండేది. ఆనాటి సినిమాలు చూడా చాలా బాగుండేవిట!" అన్నాను.

తన కింత ఆదర్శప్రాయుడైన గొప్ప శిష్యపరమాణువు దొరికినందుకు సుందరరామయ్య అమందానందకలిత వదనారవిందుడై పోయాడు—"మెల్లగా చెబుతున్నావా శేఖరం! ఆమాట! ఆరోజుల్లో వాటినిబయస్కోపులనేవాళ్ళు. ఒకతను తెరముందు నిలబడి కథ చెబుతుండేవాడు. నెమ్మదిగా, సాంగో పాంగంగా, నిమ్మకు నీరెత్తినట్టుగా సాగిపోతుండేది కథ. టాకీరావడ మల్లా నాకు పెళ్ళయిన సంవత్సరమే! కావలిస్తే మీ పిన్నినడుగు. మావూరి భారతం మిట్టపైనవేసిన దేరాలో నేనూ ఆవిడా కలసి, అదేదో జయప్రదాదేవి చరిత్రమనుకుంటాను— పదిసార్లయినా చూచివుంటాం......"

కామందకుడి నీతి శాస్త్రంలా శుక్రా చార్యుడి నీతిలా సుందరరామయ్య ఉప దేశం ఒంటబట్టేసరికి జీవితంపట్ల నాకొక వినూత్న దృక్పథం ఏర్పడి పోయింది. క్రొత్తకంటేరోత మరొకటి లేదనీ, పాతదంతా బంగారమేననీ నేనను కోసాగాను. కూరిగానివ్వండి, చారుగాని వ్వండి, ఎంతపాతదైతే అంతప్రియంగా నేను అన్నంలో వడ్డించుకోవడం మొదలెట్టాను. "అయ్యో, అది పాసి పోయిందండీ, అంటూ మా ఆవిడ నెత్తిమొత్తుకునేది. నీకు తెలియదులే! వూరుకోమంటూ సందలించేవాణ్ణి. "ఐనా యిదేంపనండీ! పిచ్చితో బాబూ! మీరీ రోజుల్లో వుండాల్సిన మనిషిలా లేరు" అంటూ ఆవిడ ఖిన్నురాలై నిల్చుండేది. ఐనా నేను ఖాతరు చేసే వాణ్ణిగాను. "నిజమే రాజ్యం! బంగారం లాంటి కాలమంతా ముప్పైనలభై యేళ్ళకు ముందే వెళ్ళిపోయింది. మనం మన దురదృష్టంకొద్దీ ఈ రోజుల్లో పుట్టి పెరుగుతున్నాం" అనే వాణ్ణి.

ఇలా నేను పురాతన వైభవాల తల పోతలో తన్మయత్వాన్ని భజిస్తూవుండగా మంచి సంగీతంలో అపశ్రుతిలా వూడి పడ్డాడు లక్ష్మీనారాయణ. ఎవరోకాదు, అతడు సుందరరామయ్యగారి మేనల్లుడు చాలనిదానికి కూతురు మొగుడు కూడా!

"చూడండి శేఖరంగారూ! కొన్ని

గ్రహాల్లో కాలం వెనక్కి నడుస్తుందట, ఆ గ్రహాలెంతవరకు నిజమోగానీ మన భూప్రపంచంలోనే కొందరు గతించి పోయిన కాలంలో జీవిస్తున్నమాట నిజం! వాళ్ళు బ్రతికున్నా బ్రతికినట్టే లెక్క! అలాంటి వాళ్ళల్లో మా మామయ్య ఒకడని నాకు చాలా కాలంనుంచీ తెలుసు. ఇప్పుడాయన శంకరుతో దేనందుకు మాత్రం నాకు చాలా విచారంగా వుంది." అన్నాడు ఏడుపు మొగం పెట్టి.

"ఏమిటండీ లక్ష్మీనారాయణగారూ! ఏమంటున్నారు మీరు?" అన్నాను విస్తుపోతూ.

"కాలం ముందుకు పరుగెడుతుంది, అది దాని స్వభావం. కొందరు కాలంతో బాటు సాగిపోలేక ఒకచోట చతికిలబడి పోతారు. అక్కడితో మానసికంగా వాళ్ళ జీవితం ఆఖరు! వాళ్ళకింక మిగిలే వన్నీ జ్ఞాపకాలే! అనుభూతుల్ని నెమరు వేసుకుంటూ, వాళ్ళ అనుభవాలను కాల దన్నుకుంటారు. పిప్పిని నములుతూ చెరకుగడను నిందిస్తారు. మనిషికి ముసలితనం రావచ్చు. కానీ మనసుకు ముసలితనం రావడం ఘోరం! మా మామయ్య నాకు బుద్ధితెలిసినప్పటినుంచీ ముసలివాడుగానే వున్నాడు. నా బుద్ధి నాకొచ్చాక నే నాయనకు దాపురించిన అకాల వార్ధక్యానికీ కారణ మేమై వుంటుందా అని ఆలోచించి చూచాను. మా మామయ్య పనిచేసే ఆఫీసు ఖార్ఖానాలకు మధ్యగా వుండేది. అందువల్ల ఆయన కర్ణభేరి సున్నితమైన శబ్దాలను స్వీకరించడం మానేసింది. ఒకప్పుడాయన అదే పనిగా కొన్నేళ్ళపాటు ముక్కుకు నశ్యందట్టిస్తూ వచ్చారు. ఘ్రాణశక్తి శూన్యమైపోయింది. నశ్యం మానేయక పోతే చూపుగూడా మందగించవచ్చునని డాక్టరు సలహాయిచ్చారు. అందుకని ఆయన తాంబూలం వాడుక చేసి చూశాడు. మహాపాపాలు తాంబూల చర్వి అందు బాటులో వుండవలసిందే! అందువల్ల నాలుక మందమైపోయింది. షడ్రసోపేతమైన భోజనమైనా చెత్తలాగే తోస్తూవచ్చింది. కానీ దోషమంతా తనలో వుందని ఆయన అనుకోడు. రంగు, రుచీ వాసన ఏదీలేని కాలానికి దోషం అంటగట్టి ఆయన కాలదోషానికి గురై పోతున్నాడు. విన్నారుగదూ! అదీ సంగతి!"

నా ఆత్మాభిమానానికి దెబ్బతగిలే వుండొచ్చు. లావా ద్రవంగదా! పెల్లుబికి వచ్చినప్పుడు పరిసరప్రాంతాలకు హాని జరగనే జరుగుతుంది. కానీ అది చల్లారి పోయాక భూమి చాలా సారవంత మౌతుందిట! అంతపనీ జరిగినతర్వాత పంటలు బాగాపండే అవకాశం ఉంటుందని గూడా వినివున్నాను! ప్రస్తుత పరిస్థితుల్లో అదే నాకున్న ఆశాలేశం!




అనంతం కుర్చీలో కూచుని తీవ్రంగా ఆలోచన సాగిస్తున్నాడు. తన జీవితంలో ప్రతిక్షణం ఆరాటం కలిగించేదే! ప్రతిక్షణం విలువైనదే; ఒక్కనాడు కూడా నిశ్చింతగా గడిపాడన్న మాటలేదు. ఏదో ఒక ఆలోచన. ఏదో ఒక ఆరాటం, ఏదో ఒక ఆవేదన... నీడలా వెన్నంటుతూనే వున్నయ్. ఇంక యీ ధోరణిలో ఎన్నాళ్ళు జీవితం గడపాలో అతనికి అనూహ్యంగా వుంది.

లోపల్నించి సులోచన వచ్చింది, చీరచెంగుతో చేతులు తుడుచుకుంటూ.

చూడ్డానికి ఆమె ముప్ఫయిఅయిదేళ్ళ వయస్సున్న మనిషిలా అగుపిస్తూందిగా? నిజానికి నల భైయేళ్ళు దాటాయి. ఆమె శరీరతత్వమే అంతగావొచ్చు, అనంతం ప్రక్కన ఆమె నిల్చుంటే, వీళ్ళిద్దరికీ బాగా వయస్సులో వ్యత్యాసమున్నట్టుగా కనిపిస్తుంది. అలాగని అనంతం వయస్సులో బాగా పెద్దవాడని కాదు. అతని మానసిక ఆందోళనలే అతణ్ణి అట్లా మార్చేసినయ్. "ఏవిఁటండీ, అట్లా ఆలోచిస్తూ కూచున్నారు?" వస్తూనే అంది సులోచన.

"ఆఁ...ఏంలేదులే!" పరధ్యానంగా అనేశాడు అనంతం.

"ఏదో ఆలోచిస్తూన్నారు...లేక పోవడ మేమిటండీ?"

అనంతం పొడిగా నవ్వుకున్నాడు. ఔను! తను ఆలోచిస్తున్నాడు. అలోచిస్తున్న దేఁవిటో చెప్పడానికి—అదీ తన జీవిత భాగస్వామిని సులోచనికి చెప్పడానికి సందేహమేమిటి. ఇంతకీ అలోచిస్తున్నది యేవీఁరహస్య విషయం కాదు నిరంతరం తనకి అంటిపెట్టుకుని వున్న ఆలోచనే.

"నిజమే సులోచనా, ఆలోచిస్తు న్నాను..."

"అంత తీవ్రంగా ఆలోచిస్తున్నా రంటే, యేదో విశేషం వుండి వుండాలి. ఏమిటండీ అది?"

"నే నాలోచించడానికి ఇంకే ముంటుంది? నా జీవితం గురించే ఆలోచిస్తున్నాను. జీవిత పథంలో నడుస్తూ, చాలా అలసిపోయాను సులోచనా. అడుగడుగునా యేదో సమస్య ఎదురవుతూ నన్ను కృంగదీస్తోంది." బ్రతుకు భారాన్ని భరించలేక, నీర సించిపోయినట్టుగ అన్నాడు.

"సమస్యల్లేని మానవుడు ఎవడున్నా డండీ యీ ప్రపంచంలో? ఆలోచిస్తూ కూచుంటే, వున్న సమస్యలు పరిష్కార మౌతాయా చెప్పండి? ఎప్పటికైనా మంచిరోజులు రాకపోతాయా? వున్న ఆశల్ని పెంచుకుని జీవితాన్ని సాగిం చడమే మన వంతు.." ధైర్యం చెప్పిఁది సులోచన.

అనంతం ఓ నిట్టూర్పు విడిచాడు. "ఆశలు పెంచుకున్నంత మాత్రాన, ఆనందంగా, సుఖంగా, నిశ్చింతగా జీవితాన్ని గడపగలమని అనుకోవడం శుద్ధపొరపాటు సులోచనా! నేనూ ఆశా వాదినే! ఆశల్ని పెంచుకోవాలని నేనూ అంటాను. ఆశావాదిని కానిపక్షంలో ఇన్నాళ్ళూ నిస్పృహ కలిగించే నా జీవితాన్ని సాగనివ్వకపోదును."

"ఈరోజువరకూ యీడ్చుకొచ్చిన జీవితం గురించి ఇప్పుడే ఎందుకు ఆలోచిస్తున్నావో, నాకు అర్థం కావడంలేదు."

"అర్థంకావడంలేదనకు. అర్థంచేసు కోడానికి ప్రయత్నించడం లేదు

నువ్వు. ఇన్నాళ్ళూ నేను ఎదుర్కొన్న సమస్యలన్నీ ఒక యెత్తు. ఇప్పుడు ఎదుర్కోబోయే సమస్య ఒక్కటీ ఒక యెత్తూను."

"అంటే...?" సులోచనకి యేమీ అర్థంగాక తెల్లమొహంవేస్తూ అంది.

"అందుకే అన్నాను, నువ్వు అర్థంచేసుకోడానికి ప్రయత్నించడం లేదని..."

"అదేమిటో విడమర్చి చెప్ప రాదుటండీ! ఇందులోకూడా రహస్య మేనా?"

"రహస్యమేంకాదు. నీకు తెలిసిన విషయమే. మా తమ్ముడు రాసిన వుత్తరం నువ్వూ చూశావుగా! ప్రస్తుతం వాడు చేస్తున్న వుద్యోగం వాడికి నచ్చ లేదట. ఇక్కడేదో వుద్యోగం చూడ మంటున్నాడు...ఇక్కడికి వచ్చేస్తా నంటున్నాడు. ఏం జాబురాయడమో నాకే బోధపటంలేదు."

సులోచన మూతి విరిచింది. "ఇదో పెద్ద జీవన సమస్యలా చెబుతున్నా రేమిటండీ? దీని గురించేనా మీరింతగా ఆలోచిస్తూ, బుర్ర పాడుచేసుకుంటు న్నారు?"

"ఔను సులోచనా. వాడు రాసేశాడు గాని, ఇక్కడ మాత్రం యేంవుద్యో గాలు దొరుకుతున్నాయని? వాడొక్కడూ కాదు...పెళ్ళాం, పిల్లలతో వస్తే, మనం మాత్రం యెన్నాళ్ళని వాళ్ళని భరించ గలం?"

"ఔనా మరి! అవన్నీ దృష్టిలోపెట్టు కునే మీరో నిర్ణయానికి రావాలండీ! మనవాళ్ళని మనం ఆదుకోవడం అవ సరమే. కాదనను. అయితే, ఎవరి బరువును వాళ్ళే మోసుకోడానికి ప్రయ త్నించాలిగాని, మరొకరి నెత్తినిపెట్టాలని ప్రయత్నించడం, అతితెలివే అవుతుంది. తమ్ముడిగారికి వుద్యోగం లేదా, కనిక రించి ఆదరించడానికి? ఏ చిన్న వుద్యోగం చెయ్యడానికి సిద్ధంగా వున్న పట్టభద్రులే నిరుద్యోగులుగా తిరుగుతున్న యీరోజుల్లో, చేస్తున్న వుద్యోగం నచ్చడంలేదని అంటున్న వ్యక్తిని మీ తమ్ముణ్ణే చూస్తున్నామండీ! ఒకసారి వొదులుకున్న వుద్యోగం, మరి కావా లంటే దొరకదు కదా! అప్పుడు మనం శాశ్వతంగా భరించాల్సిందే! అంత్య నిష్ఠూరంకంటె, ఆదినిష్ఠూరమే మంచి దంటారు పెద్దలు. ఇటువంటి సమ యాల్లోనే మీరు మీలోవున్న అతిసోదర ప్రేమను, కాస్త ప్రక్కకు నెట్టాలి. నిర్మొహమాటంగా వ్యవహరించాలి. లేక పోతే మనల్ని మనం అన్యాయం చేసు కున్నట్టే కాకుండా, మన పిల్లల్ని మనం అన్యాయం చేసినట్టు అవుతుంది." తన అసమ్మతిని తెలియజేస్తూ, చిన్న ఉప న్యాసాన్నిచ్చింది.

అనంతం క్షణంసేపు ఆలోచనల్లో

పడ్డాడు. సులోచనికి తనవాళ్ళంటే యే మంత అభిమానాదరణలు లేకపోవచ్చు కాని, యిప్పుడు చెప్పిన మాటల్లో మాత్రం, నూటికి నూరుపాళ్ళు సత్యం వుందనిపించింది అతనికి. ఏ ఒక్కరికి తనకి నచ్చిన వుద్యోగం దొరకదు. ఏదో అసంతృప్తి అందరికీ వుంటోంది. అలాగని ఉద్యోగం వదిలేసి మరొకరి పంచన చేరుతున్నారా? లేదే!

"అదే నేనూ అనుకుంటున్నాను సులోచనా, వాడు నా తమ్ముడే కావచ్చు. వాడిపట్ల నాకు వాత్సల్యం వుండొచ్చు. అలాగని, ఉన్న వుద్యోగం వదిలి వచ్చేస్తానని వాడంటే, వాడి అభిప్రాయాన్ని నేను సమర్థిస్తానా? పరిస్థితులతో రాజీపడ్డం ప్రతివ్యక్తికీ నేర్చుకోవాలి, లేకుంటే జీవితాన్ని గడపలేడు. వాడికో వుత్తరం రాసి పడేస్తాను." అన్నాడు అనంతం. "వెంటనే రాసి పడేయండి. అటువంటి తెలివితక్కువ పని యెప్పుడూ చెయ్యొద్దని నాలుగు చివాట్లుపెడుతూ మరీ రాయండి. ఇప్పటికైనా ఆలోచనలు తగ్గించండి." అంటూ లోపలికి వెళ్ళిపోయింది సులోచన.

అనంతం బరువుగా ఓ నిట్టూర్పు విడిచి అక్కణ్ణించి లేస్తూ, టేబులు దగ్గిరికి వెళ్ళాడు. లెటర్‌పాడ్ తీసి, తమ్ముడికి వుత్తరం రాయడానికి వుపక్రమించాడు.

* * *

అన్నయ్య రాసిన వుత్తరం చదువుకున్న వాసుదేవరావు యెంతో బాధపడ్డాడు, అంత నిష్కర్షగా అన్నయ్య వుత్తరం రాస్తాడా? అతనెప్పుడూ వూహించలేదు. స్వతహాగా అన్నయ్య తీసుకున్న నిర్ణయంకాదని, యిందులో వదిన సలహా వుందని భావించాడు. ఏది ఏమైనా, తను వుత్తరం రాయడమే పెద్ద పొరపాటనిపించింది. అభిమానం దెబ్బతింది. ఆవేశం మొలకెత్తింది. అన్నయ్యను, వదినను నిందిస్తూ ఓ పెద్ద వుత్తరం రాశాడు. అంతటితోగాని అతని ఆవేశం చల్లారలేదు.

తమ్ముడి వుత్తరం చదువుకున్న అనంతం అంతగా బాధపడలేదు. చిన్నవాడు, ఆవేశంతో రాసివుంటాడనుకుని వూరుకున్నాడు.

* * *

రోజులు గడిచిపోతున్నాయి. హాఠాత్తుగా తమ్ముడి దగ్గర్నించి వుత్తరం రావడం, అనంతంని ఆరాటంలో ముంచింది. ఆతృతతో ఆ కవరుచించి వుత్తరాన్ని చదివాడు. తృప్తిగా ఓ నిట్టూర్పు విడిచాడు.

"సులోచనా, ఓసారి యిలారా!" కేకేశాడు,

సులోచన యేవిటోననుకుని ఆదరాబాదరాగా వచ్చింది.

"ఏమయ్యిందండీ?"

"కంగారుపడే విషయం కాదులే. మా తమ్ముడి దగ్గర్నించి వుత్తరంవచ్చింది."

"మళ్ళీ యేవిటేవిటో నిందిస్తూ రాశాడా ?"

అనంతం మెల్లగా మందహాసం చేశాడు.

"అబ్బే! అటువంటిదేం కాదు. ఈ సారి మనల్ని అభినందిస్తూ రాశాడు. చదువుతా విను " అంటూ ఆ వుత్తరాన్ని చదవడం ప్రారంభించాడు.

"మహారాజశ్రీ అన్నయ్యగారికి,

నమస్కారములు.

ఇంతకు ముందో వుత్తరం రాశాను. అందులోని విషయాలు మీ మనస్సుని నొప్పించివుంటాయి, అప్పటి ఆవేశంలో, తొందరపడి ఏదో రాసేశాను. నా తొందరపాటుకి మీ యిరువురి దగ్గర క్షమాపణ కోరుకుంటున్నాను. చిన్నవాణ్ణి... మీరు క్షమిస్తారనే విశ్వసిస్తున్నాను. మొన్ననే నాకు ప్రమోషన్ దొరికింది. ఇంత త్వరలో ప్రమోషనొస్తుందని నేనెప్పుడూ వూహించలేదు. ఆనాడు మీరు నా అభిప్రాయాన్ని బలపర్చి వచ్చేయమనివుంటే యీరోజు నాకీ ప్రమోషను వచ్చేది కాదు. దేనికైనా 'ఓర్పు' వుండాలని మీరు రాశారు. అది అక్షరాలా నిజం. నా జీవితంలో యీ మాట మర్చిపోలేను. అందరం క్షేమమే. మీరంతా క్షేమంగా వున్నారని భావిస్తాను. వదినకి మా ఇరువురి నమస్కారాలందజేయండి. పిల్లలకు మా ముద్దులు. నన్ను మీ ఇరువురూ క్షమించారని తెలియజేసే మీ వుత్తరం తిరుగుటపాలో వస్తుందని, ఆసక్తితో ఎదురుచూస్తుంటాను.

మీ తమ్ముడు,

వాసు."

"పోనీలెండి. ఇదీ మంచిదే అయ్యింది. ఇప్పుడీ ప్రమోషను వచ్చి వుండకపోతే, మనల్ని నిందిస్తూ వుండేవాడు." అంది సులోచన ఓ నిటూర్పు విడుస్తూ. "ఏం జరిగినా మనమంచికే జరుగుతుందిలే. ఈ సమస్య ఇట్లా పరిష్కారం కావడం, నాకో పెద్ద రిలీఫ్ అనుకో," అన్నాడు అనంతం.

"ఇకనైనా నిశ్చింతగా వుంటారనుకుంటాను."అనేసి అక్కణ్ణించి వెళ్ళిపోయింది సులోచన.

అనంతం ముసిముసిగా నవ్వుకున్నాడు.






డియర్ సూరీ,

... ఇక్కడకొచ్చి నెలరోజులైంది. రెండు వారాలనుంచీ హాస్పటల్లో బెడ్ మీద చావుతో కుస్తీపడుతున్నా. మరణం ఖాయమని డాక్టర్లు ఏక వాక్యతగా నిర్ణయించారు. ఎర్రదీపం ఆరడానికి అట్టేకాలం లేదు. ఆఖరు క్షణాలు. 'నా' అనేవాళ్లు ఎవ్వరూ లేకపోయినా, దిక్కుమాలిన కుక్క చావు చావడం నా కిష్టంలేదు సూరీ. నువ్వు అయినా ఒకసారి వచ్చి, చూపు అందుకోమని ప్రార్థిస్తున్నా. ఆఖరి కోరిక ఒకటుంది. అందరిలాగే పుట్టాను. కాని పిచ్చిమొక్కలా బ్రతికాను. అయితే, పిచ్చిమొక్కలా చావడానికి నా మనస్సు ఒప్పుకోవడం లేదు సూరీ! సామాన్య మానవుడు చనిపోయేటప్పుడు ఏర్పాటుచేసే అంత్యక్రియల తతంగం నాకుకూడా ఏర్పాటుచేయాలని ఆఖరు కోరికగా అర్థిస్తున్నాను. నీకు ఏ మాత్రం టైము ఉండదని నాకు తెలుసు. అయినా జీవయాత్ర ముగిస్తున్న చిన్ననాటి మిత్రుని కోరిక తప్పకుండా మన్నించి వస్తావుకదూ! జారిపోతూన్న ప్రాణాన్ని కళ్లల్లో నిల్పుకొంటూ ఎదురుచూస్తుంటాను.

— నారాయణమూర్తి.

ఆ ఉత్తరం ఆరోజు సాయంకాలం టపాలో వచ్చింది.

మధ్యాహ్నం ఫ్యాక్టరీనుంచి ఒంటి గంటకు వచ్చాడు సూర్యప్రకాశం. బ్లాక్ లేబుల్ బీరు పుచ్చుకుని, భోజనంచేసి, ఎయిర్ కండిషన్డ్ గదిలో పడుకొన్నాడు. గాఢంగా నిద్రపోయి, సాయంత్రం అయిదు గంటలకు లేచేసరికి టీపాయ్ మీద ఆ ఉత్తరం ప్రత్యక్షమైంది.

బద్ధకంగా వొళ్లు విరుచుకుంటూ, 'ఎక్కడనుంచి వొచ్చిందబ్బా ఆ ఉత్తరం?' అనుకొన్నాడు సూర్యప్రకాశం, అంతలోనే ఫోన్ మోగింది, ఫోన్ ఎత్తాడు. ఒక బిజినెస్ ఫ్రెండ్. పది నిముషాలసేపు ఫుల్‌స్టాప్ లేకుండా అవతలవ్యక్తి మాట్లాడాడు. అన్నింటికీ 'ఉఁ' 'ఆఁ' అంటూనే ఇంటరెస్టుగా విన్నాడు సూర్యప్రకాశం. రాత్రికి 'క్వాలిటీ' లో డిన్నరుకు రమ్మనమని ఆహ్వానించాడు ఆ ఫ్రెండ్; ఒక బిజినెస్ మ్యాగ్నెట్‌కు పెద్దఎత్తున డిన్నరిస్తున్నాడట. కంపెనీకోసం రమ్మనమని పట్టుబట్టాడు. 'సరే' అన్నాడు సూర్యప్రకాశం.

ఫోన్ కిందబెట్టి, ఆఉత్తరాన్ని అందుకొంటుండగానే, నాయర్ టీ పట్టుకొచ్చాడు. టీ త్రాగాక, సిగరెట్టు ముట్టించి, తాపీగా ఉత్తరం చించాడు. అంతలో మళ్లీ ఫోను మోగింది. అవతల ఫ్యాక్టరీ మేనేజరు. ఫ్యాక్టరీ గొడవలు ఏకరువుపెట్టసాగాడు. సాయంత్రం మూడు గంటలకు కార్మికనాయకులు బేరానికి వచ్చారట. చట్ట ప్రకారం బోనస్ డిక్లేర్ చేయలేదనీ, మరో అయిదుశాతం కార్మికులకు రావలసి ఉంటుందనీ, అది ఇవ్వకపోతే ప్రత్యక్షచర్యకు దిగవలసి వస్తుందనీ బెదిరించారట. ఈ సంవత్సరం లాభాలు ఆశించినట్టుగా రాలేదనీ, అయినా ఇంకో మూడుశాతం పెంచడానికి తాను ప్రయత్నిస్తాననీ నచ్చజెప్పి పంపించినట్టు మేనేజరు చెప్పుకు రాసాగాడు. ఫోన్‌లో ఆ సంభాషణ పావుగంటదాకా సాగింది.

ఫోన్ కిందబెట్టి, ఉత్తరంకేసి దృష్టి మళ్లించేటప్పటికి, రెండో కొడుకు చంద్రం వచ్చి, 'డాడీ? మీకోసం ఎవరో వచ్చారు; కింద కూర్చున్నారు' అన్నాడు. సూర్యప్రకాశం వెంటనే లేచి, మేడదిగి కిందకు వచ్చాడు. బంజారాహిల్స్‌లో ఒక పెద్ద బిల్డింగ్ అమ్మకం విషయంలో వ్యవహారాలు పరిష్కారం చేసుకోడానికి ముగ్గురు మనుష్యులు వచ్చారు. వాళ్లతో ఓ గంటసేపు మాట్లాడాడు సూర్యప్రకాశం. వ్యవహారాన్ని మాటలతో పరిష్కారం చేసుకొని వాళ్లు వెళ్లిపోయారు. అప్పుడు మళ్లీ ఉత్తరం సంగతి జ్ఞాపకంవచ్చి, మేడమీదకు వెళ్లాడు సూర్యప్రకాశం.

మళ్లీ ఫోను పిలిచింది. ప్రభుత్వ పరిశ్రమల శాఖలో ఉన్నతోద్యోగంలో ఉన్న ఒకాయన అర్జంటుగా వెయ్యి రూపాయలు కావాలని ఫోనుచేశాడు.

దానిదేముంది, అట్లాగే పంపిస్తానని చెప్పాడు సూర్యప్రకాశం.

ఆరున్నరైంది బాగా చీకటిపడింది. ఏడు గంటలకు చాంబర్ ఆఫ్ కామర్స్‌లో మీటింగ్ ఉంది దానికి తప్పకుండా వెళ్లాలి కొన్ని వ్యాపార విధానాలపై ముఖ్యమైన నిర్ణయాలుతీసుకొనే సమావేశము. పట్టణంలోని వ్యాపార ప్రముఖులంతా వస్తారు. ఆ తర్వాత 'క్వాలిటీ' లో డిన్నర్, పది గంటలకు డిన్నర్ ముగించుకొని పెందలాడే పడుకోవాలి, తెల్లవారుఝామున నాలిగింటికే లేచి ఎయిర్‌పోర్టుకు వెళ్లాలి. ఆరుగంటల ప్లేన్‌లో కలకత్తా వెళ్లి, పన్నెండు గంటలకు ఒక బిజినెస్ కాన్ఫరెన్స్‌లో పాల్గొనాలి. అది చాలాముఖ్యం. తనకు అందుబాటులోఉన్న కాలానికీ, నిర్వహించవలసిన వ్యవహారాల ఒత్తిడికీ లంగరిందుతుందా? అనుకొంటూ ఆ ఉత్తరం చదివాడు సూర్యప్రకాశం.

మనస్సు చివుక్కుమంది ముల్లు గుచ్చుకొన్నట్టుగా. క్షణంలో సగంసేపు ఊపిరాడలేదు. జాలితో కూడుకున్న ఆవేశం ఉప్పొంగింది. 'అయ్యో!... పాపం! నారాయణమూర్తి!' అనుకొన్నాడు సూర్యప్రకాశం.

... ఏడాది క్రితమే ఓసారి తన దగ్గరకు వచ్చాడు నారాయణమూర్తి. బక్కచిక్కి, బిక్కమొహంతో, చింపిరి జుత్తుతో, చిరిగిన చొక్కాతో, పీక్కుపోయిన కళ్లతో, వ్యాధిగ్రస్తునిలా వీధి గుమ్మంలో ప్రత్యక్షమయ్యాడు. తను మొదట్లో నిజంగా గుర్తుపట్టలేదు. అడుక్కోవడానికి వచ్చిన అభాగ్యుడేమో అనుకొన్నాడు. నికృష్టదారిద్ర్యం నాట్యమాడుతూన్న మొహంలోకి బలవంతాన నిట్టూర్పులాంటి నవ్వుతెప్పించి, 'నేను.. నారాయణమూర్తిని... నీ చిన్ననాటి మిత్రుణ్ణి' అన్నాడు.అప్పటికిగానీ గుర్తు రాలేదు. ఆర్థిక స్థితిగతుల హెచ్చుతగ్గులు మనుషుల రూపురేఖల్నే మార్చివేస్తుంటాయి. అమాంతంగా కావిలించుకొని, ఇంట్లోకి తీసుకొచ్చి, సోఫామీద కూర్చోబెట్టి,ఆప్యాయంగా తను పరామర్శించాడు. అంతకాలంగా ఓ ప్రైవేటు కంపెనీలో గుమాస్తాగా పనిచేస్తున్నాడట. వ్యాపారం దెబ్బతినడంతో, కంపెనీ మూసివేశారట ఉద్యోగం పోయిందట. మళ్లీ ఉద్యోగంకోసం వీధికొళాయిల్లో నీళ్లుత్రాగుతూ, ఆరికాళ్లు బొబ్బలెక్కేట్టు తిరుగుతూ, బోర్డుచూసి వచ్చాడట. ఏదైనా చిన్న ఉద్యోగం ఇప్పించవలసిందిగా ప్రాధేయపడ్డాడు. తనకు ముమ్మరంగా జాలివేసింది. తప్పకుండా చూస్తానని మాటయిచ్చాడు తను. అప్పటివరకూ తనఇంట్లోనే ఉండమన్నాడు. కాని ఉండటానికి ఒప్పుకోలేదు. ఆత్మాభిమానం మెండుగాఉన్న వ్యక్తి. కొంతమందికి ఆత్మాభిమానమే ఆస్తి. దాన్ని కాపాడుకోడానికి జీవితకాలాన్నంతా

వెచ్చిస్తారు. మళ్ళీ కలుసుకుంటానన్నాడు నారాయణమూర్తి. కాని కలుస్కోలేదు. తను ఉద్యోగం చూడనూలేదు. వ్యాపార వ్యవహారాల్లోబడి అతన్ని గురించి దాదాపు పూర్తిగా తను మర్చిపోయాడు. పాపం... ఏంజబ్బో! పెళ్లి చేసుకోలేదు. తల్లిదండ్రులు చిన్నతనంలోనే పోయారు. మొదటినుంచీ జీవిత శకటాన్ని స్వహస్తాలతో నెట్టుకోవాల్సిన దుర్గతిపట్టిన నష్టజాతకుడు. మేనమామ ఇంట్లో పెరిగాడు. స్కూలుఫైనలుదాకా చదువుకున్నాడు. స్వేచ్ఛగా బ్రతకాలనే ఆశయంగలవాడు. కాని దారిద్ర్యం నీడలా వెంటాడుతున్నప్పుడు స్వేచ్ఛను వాంఛించిమటుకు ప్రయోజనమేముంది? 'పెళ్లి ఎందుకు చేసుకోలేవు?' అనే ప్రశ్నకు, జీవితంలో ఆర్థికంగా స్థిరపడితేనేగానీ. అట్లాంటి విశ్వాసం గట్టిగా కలిగితేగానీ చేసుకోనని చెప్పాడు. పూర్ ఫెలో!... ఒక్కొక్కళ్ల జీవితం ఆలోచనకు అందనంతగా మలుపులు తిరుగుతూ, చీకటి అనే గమ్యస్థానం వైపుకు ప్రయాణంచేస్తూ ఉంటుంది అనుకున్నాడు సూర్యప్రకాశం.

ఆరూ ముప్పావు అయింది.

వెంటనే లేచాడు సూర్యప్రకాశం ఆలోచనలకు సడన్ బ్రేకు వేసి నిమిషాల మీద డ్రస్సు చేసుకున్నాడు. మేడదిగి వచ్చేసరికి డ్రైవరు కారు సిద్ధంచేశాడు. ముందు చాంబర్ ఆఫ్ కామర్స్ మీటింగుకు వెళ్లి, ఆ తర్వాత హాస్పటల్‌కు పోయి, నారాయణమూర్తిని చూద్దామనుకొన్నాడు. అతని మనస్సులో నారాయణమూర్తి మెదులుతూనే ఉన్నాడు. ఆ మీటింగ్ లేకపోతే, అది అంత ముఖ్యమైంది కాకపోతే, ముందుగానే హాస్పటల్‌కు వెళ్లి ఉండేవాడు. కాని మీటింగుకు వెళ్లకతప్పదు. ఒక్కొక్కప్పుడు పరిస్థితులు మనస్సును, పోకడలను కండిషన్‌లో పెడతాయి.

చాంబర్ ఆఫ్ కామర్స్ మీటింగ్ అయ్యేసరికి ఎనిమిది గంటలైంది. ఇంకా మినిట్స్ వ్రాయకముందే బయటికొచ్చాడు సూర్యప్రకాశం. అతని మనస్సులో నారాయణమూర్తి మృత్యుముఖమే భయంకరంగా కదులాడుతోంది. మీటింగ్‌లో ప్రధానమైన విషయాలచర్చ జరుగుతూన్నప్పుడుకూడా నోరు విప్పలేక పోయాడు. అన్నింటికీ తలాడించి వూరుకున్నాడు. ధ్యాసంతా నారాయణమూర్తి మీదే ఉంది. తను అసలు నేరుగా హాస్పటల్‌కు వెళ్లి ఉంటే బావుండేదేమో! వ్యాపారవ్యవహారాల సాంద్రతలో తను మానవత్వాన్ని కోల్పోతున్నాడేమో! మానవజీవితపు విలువల్ని, మానవీయ సమస్యల్ని మర్చిపోతున్నాడేమో!

ఆదుర్దాగా కారులోకి వచ్చి కూర్చున్నాడు సూర్యప్రకాశం. మస్తిష్కమంతా మబ్బుపట్టి ఉంది. ఫలానా హాస్పటల్‌కు జల్దీగా వెళ్లమని డ్రైవర్ని ఆదేశించాడు.




నారాయణమూర్తి దైన్యావస్థను ఆలోచించుకుంటూ బెన్‌సన్ సిగిరెట్టు ముట్టించాడు.

అయిదు నిమిషాల్లో కారును హాస్పటల్ అవరణలో ప్రవేశపెట్టాడు డ్రైవరు. ఎంక్వయిరీ చేయగా నారాయణమూర్తి బెడ్ జనరల్‌వార్డులో ఉన్నదని చెప్పారు. అంగలూ పంగలూ వేసుకొంటూ అక్కడికి వెళ్లాడు సూర్యప్రకాశం.

నెత్తురు ఎండిపోయిన నల్లిలా బెడ్‌కు అంటుకుపోయి ఉన్నాడు నారాయణమూర్తి. మొహంలో చావుకళ పడింది. చైతన్యం ఏమాత్రంలేదు. కళ్ళు బాగా లోతుకు పీక్కుపోయాయి. కాళ్ళూ, చేతులూ చల్లబడిపోయి. కట్టెల్లా బిగ్రబిగుసుకున్నాయి. శరీరంలో ఏకోశానా జీవమున్నట్టులేదు. నిలువు గుడ్లు పడ్డాయి. తలకింద దీపం పెట్టడమే తరువాయి.

నారాయణమూర్తిని చూడగానే సూర్యప్రకాశానికి హఠాత్తుగా బ్లడ్ ప్రెషర్ పెరిగినట్లయింది. ఉద్వేగ పూరితమైన జాలితో గుండెదడ హెచ్చింది. కొన్నిక్షణాలపాటు పెదవి విప్పకుండా, రెప్పవాల్చకుండా, ఊపిరి పీల్చకుండా దిగాలుపడి చూస్తూ నిలబడ్డాడు.

అంతకుముందు ఇంజక్షన్ ఇచ్చిన నర్సుకూడా రోగి పరిస్థితికి జాలిపడుతూ

చూడసాగింది. జీవంలేని కట్టెకు నీరు పోసినటుకు లాభమేముంది?

"మూర్తీ!...మూర్తీ!..." అన్నాడు సూర్యప్రకాశం కట్టలు తెంచుకున్న

నారాయణమూర్తి చూపు రవ్వంత కదిలి, సూర్యప్రకాశం వైపుకు మళ్లింది. కొవ్వొత్తి అంతిమకాంతి ప్యూర్ వైట్ కాంతికేసి ఏపాటి చూడగలదు? అంతే. ఆపైన అతని పెదవులు విచ్చుకోలేదు.

"ఇంతకుముందే మాట పడిపోయింది సార్" అన్నది నర్సు.

అంతలో డాక్టరు వచ్చాడు.

"డాక్టర్ సాబ్! ఈ రోగి పరిస్థితేమిటి? బ్రతుకుతాడా?" అన్నాడు సూర్యప్రకాశం.

"ఆఖరిక్షణం వరకూ రోగి బ్రతకడని చెప్పడం మా ధర్మంకాదు. నా ఊహ ప్రకారం మరణం నిముషాల్లోనే ఉంది. ఆపైన భగవంతుని అనుగ్రహం, ఆగ్రహం..." అంటూ నాడి పట్టుకు చూశాడు డాక్టరు. వాడిన పువ్వులా నిట్టూర్పు విడిచాడు.

"అంతేనంటారా?" అన్నాడు సూర్యప్రకాశం.

"అవును. ఈశ్వరేచ్ఛను డాక్టర్లు పసిగట్టగలరా? ఈ స్థితిలో రోగి బ్రతకడమనేది నా ఇరవయ్యేళ్ళ సర్వీసులో చూడలేదు...మీకు బంధువా?" అన్నాడు డాక్టరు.

"స్నేహితుడు..." అన్నాడు సూర్యప్రకాశం.

"మీకోసమే కామోసు మాట పడిపోయే దాకా తెగకలవరించాడు సార్" అన్నది నర్సు.

సూర్యప్రకాశం కడుపులో తుప్పు కత్తులతో కెలికినట్లయింది. తప్పు చేసినవాడిలా తలవంచుకున్నాడు. ఛి, ఛీ. తను మానవత్వాన్ని కోల్పోయి-వ్యాపార మృగంగా మారిపోయాడు అనుకొంటూ తిట్టుకున్నాడు.

"శవాన్ని నాకు అప్పగిస్తారా? అంత్యక్రియలు చేయిస్తాను" అన్నాడు సూర్యప్రకాశం మిత్రుని ఆఖరికోరికను మన్నించడంద్వారా అతని ఆత్మకు శాంతిచేకూర్చడానికి.

"ఓ, యస్, అట్లాగే" కాసేపు ఆగండి అన్నాడు డాక్టరు మరోవార్డుకు వెళుతూ.

పది నిముషాలు అక్కడే నిలబడ్డాడు సూర్యప్రకాశం నిశ్శబ్దంగా. మరణిస్తూన్న వ్యక్తి చుట్టూ ఆవరించే నిశ్శబ్దమే అక్కడకూడా నెలకొని ఉంది. ఇంకా రోగికి చూపు సాంతం పడిపోలేదు; గుండెలో ఎర్రదీపం పూర్తిగా ఆరిపోలేదు.

'క్వాలిటీ' లో డిన్నర్ సంగతి జ్ఞాపకం వచ్చింది సూర్యప్రకాశానికి. తనకోసం వాళ్ళంతా ఎదురు చూస్తూ ఉంటారు. అప్పటికి అరగంట ఆలస్యమైంది. ఏంచేయడమా అని తీవ్రంగా

ఆలోచించాడు సూర్యప్రకాశం. డిన్నర్లకూ, పార్టీలకూ తూ. చ. తప్పకుండా హాజరుకావడం వ్యాపారస్తుని జీవితంలో ఒకభాగం. వ్యాపారాభివృద్ధికీ, వ్యాపారపు హోదాకూ ఎంతైనా ముఖ్యం. ఒక ఆలోచన తట్టింది. వ్యాపారపు నిర్ణయాలు తీసుకోవడంలో, వాటిని సత్వరం అమలుపర్చడంలో సూర్యప్రకాశం ఆరితేరిన ఘటం. డెసిషన్-మేకింగ్ టెక్నిక్ ద్వారానే ఆరు సంవత్సరాల వ్యాపారంలో అరవై లక్షల రూపాయల లాభాన్ని కళ్ళజూశాడు.

వెంటనే హాస్పటల్లో ఫోన్ రూమ్‌కు వచ్చాడు. ఫ్యాక్టరీ హెడ్ గుమాస్తాను పిల్చాడు.

"కామేశం!...ఇక్కడ హాస్పటల్లో నా ఓల్డు ఫ్రెండ్ ఒకాయన ఒక అరగంటలో చనిపోయేట్టు ఉన్నాడు. దిక్కూ-దివాణం లేనివాడు. మన అంత్యక్రియలు జరిపించి, ఆత్మశాంతిని చేకూర్చాలి. నాకు టైంలేదు. ఒక డిన్నర్‌కు వెళ్ళాలి. తెల్లవారుఝామున ప్లేన్‌లో కలకత్తా వెళ్ళాలి. కాబట్టి ఈ వ్యవహారమంతా నా తరపున నువ్వే స్వయంగా చూడాలి. డెలిగేషన్ ఆఫ్ అథారిటీ, రెస్పాన్సిబిలిటీ అనుకో. అందుచేత, నువ్వు వెంటనే స్మశానానికి వెళ్ళి. అక్కడ వెట్టివానితో మాట్లాడి. శవాన్ని పూడ్చిపెట్టడానికి. ఇతర తతంగాలకూ ఏర్పాట్లన్నీ చేయి. అతనికి పదో, పదిహేనో ఇచ్చి, రాత్రి ఎప్పుడు వచ్చినా సిద్ధంగా ఉండమని చెప్పు. ఒక టాక్సీ తీసుకొని, ఇక్కడకు రా. నా ఫ్రెండ్ పేరు నారాయణమూర్తి. జనరల్ వార్డ్‌లో పంధొమ్మిదో నెంబరు బెడ్. చనిపోగానే శవాన్ని అప్పగిస్తారు. 'క్వాలిటీ' లోనే ఉంటాను. పదిన్నరలోపు ఫోన్ చేయి. ఆ తర్వాత ఇంటికి ఫోన్ చేయి. వీలుంటే ఈ లోపల ఒక సారి నేనే ఫోన్ చేస్తాను." అన్నాడు సూర్యప్రకాశం. చేయవలసిన పనంతా పూసగుచ్చినట్టు చెప్పాడు. అంతా తను దగ్గరుండి, స్వయంగా అంత్యక్రియలు జరిపిస్తానని, మీరు నిశ్చింతగా ఉండమని సవినయంగా చెప్పుకొన్నాడు హెడ్ గుమాస్తా. అంత్యక్రియలు తతంగం ముగిసేవరకూ తను కనురెప్పవాల్చనని కూడా హామీ ఇచ్చాడు.

సూర్యప్రకాశానికి బరువూ, బాధ్యతా పూర్తిగా తీరినట్లయింది. కొండంత రిలీఫ్ వచ్చింది. వెంటనే కారులో 'క్వాలిటీ' కి వెళ్ళి డిన్నర్ పార్టీలో చేతులుకలిపాడు.

కొత్తఫ్రెండ్, స్కాచ్ విస్కీ, జింజర్ ప్రాన్స్, గోవాఫిష్, కాశ్మీర్ చికెన్, కాబరేడాన్స్, హాట్‌హాట్ జోక్స్, వ్యాపార వ్యవహారాల చర్చలు. ఓ గంటసేపు ప్రపంచాన్నే మర్చిపోయాడు సూర్యప్రకాశం. చనిపోతున్న నారాయణమూర్తి విషయం ఏంజ్ఞాపకముంటుంది?

తొమ్మిదీ ముప్పావుకు హెడ్ గుమాస్తానుంచి సూర్యప్రకాశానికి ఫోన్ వచ్చింది.

శ్మశానంలో ఏర్పాటులన్నీ చేశాను సార్! ఎంత అర్ధరాత్రి వచ్చినా వెట్టి వాడు ఆజీలుగా ఉంటానన్నాడు. గొయ్యి కూడా తీసి ఉంచాడు సార్! టాక్సీ రెడీగా ఉంచాను. కాని ఇంకా నారాయణ మూర్తిగారి ప్రాణమే సొంతం పోలేదు సార్! ఇక్కడ వెయిట్ చేస్తున్నాము. డాక్టర్లు అరగంటో, గంటో అంటున్నారు..." అన్నాడు హెడ్ గుమాస్తా.

సూర్యప్రకాశం అదుర్దా పడ్డాడు. స్నేహితుని అంత్యక్రియలకు తానూ వద్దామనుకున్నాడు. కాని ఇంకా చావ లేదు. తనకి టైం ఆట్టేలేదు. పెందల కాడే నిద్రపోవాలి. తెల్లవారుఝామున లేవాలి. ఎయిర్‌పోర్టుకు వెళ్ళాలి. ప్లేన్ తప్పిపోతే అపారనష్టం! కాన్ఫరెన్స్‌కు బిజినెస్ మాగ్నెట్లు ఎంతో మంది వస్తారు. వాళ్ళతో పరిచయం ముందు ముందు ఎంతో ఉపయోగపడుతుంది.

"సరే, ప్రాణం పోయే వరకూ వెయిట్‌చెయి" అంటూ ఫోన్ పెట్టేశాడు సూర్యప్రకాశం.

పదకొండు గంటలకు ఇంటికి వచ్చాడు సూర్యప్రకాశం.

ఘూర్ఖాగేటుతెరిచాడు. పోర్టికోలోకికారు వచ్చేసరికి భార్య ఎదురుగ్గా నిలబడింది. కొంచెంగా తూలుతూ కారుదిగాడు సూర్య ప్రకాశం. భార్య చేయిపట్టుకొంది. ఆమె కిది ఏమాత్రం కొత్తకాదు. కొన్నియేళ్ళ అనుభవం.

సూర్యప్రకాశం శరీరమంతా గాలిలో తేలిపోతూన్నది. మనిషంతా జానీవాకర్ స్వింగ్ విస్కీ-నిషాలో ఊగిపోతున్నాడు. మెల్లగా మేడ మెట్లెక్కాడు. తెల్లవారు ఝామున నాలుగుగంటలకు నిద్రలేపమని భార్యతో చెప్పాడు. ఎయిర్ కండిషన్డు గదిలో పడుకొన్నాడు. మూడు నిమషా ల్లోనే గాఢనిద్ర పోయాడు సూర్య ప్రకాశం.

అర్ధరాత్రి దాటింది.

హఠాత్తుగా గుండెలోపోటు! గావు కేకపెట్టాడు సూర్యప్రకాశం. అతనిభార్య ఉలిక్కిపడిలేచింది. భర్తకు గుండెనొప్పి వచ్చిందని గ్రహించింది. గాబరాపడిపో యింది. వెంటనే ఫ్యామిలీ డాక్టరుకు ఫోనుచేసింది.

సూర్యప్రకాశం కలవరిస్తున్నాడు. నారాయణమూర్తి వికటాట్టహాసం! ... మూర్తీ! చావలేదా నువ్వు? ... బ్రతికావా? ... మృత్యువును జయిం చావా? ... శ్మశానం లో నీకోసం తీసి ఉంచిన గొయ్యి... నాకోసం రెడీగా ఉందా? ... నా అంత్యక్రియలకు నేనే ముందుగా ఏర్పాట్లు చేసుకున్నానా? ... విధివిలాసమా! అంటూపిచ్చిగా మాట్లాడ సాగాడు సూర్యప్రకాశం.




ఆయనభార్య బెంబేలుపడిపోయింది.

అయిదునిమషాల్లో డాక్టరు వచ్చాడు. అంతకు రెండు నిమషాలక్రితమే సూర్యప్రకాశం మాట్లాడడం మానివేశాడు. ఓ నిమషంసేపు గురక పెట్టాడు. ఆ తర్వాత అదికూడాలేదు.

డాక్టరువచ్చి పరీక్షచేసి, ప్రాణంపోయిందని పెదవివిరిచాడు...

సూర్యప్రకాశం భార్య కెవ్వున కేక వేసింది.

నారాయణమూర్తి పెద్దపెట్టున నవ్వాడు. ఆ నవ్వుకు గదిలో ఎయిర్ కండిషన్డు యూనిట్ హఠాత్తుగా ఆగిపోయినట్లయింది

సూర్యప్రకాశం మంచం మీదనుంచి ఉలిక్కిపడి లేచాడు పక్కన భార్య నిశ్చింతగా నిద్రపోతోంది.

"ఛీ. ఎంత చెడ్డకలవచ్చింది!" అనుకున్నాడు సూర్యప్రకాశం. వొళ్ళంతా చెమటపట్టింది టేబుల్ మీద గడియారం మూడుముప్పావు చూపెడుతూ ఉంది.

ఏమైనాడో నారాయణమూర్తి అనుకొన్నాడు సూర్యప్రకాశం. అంతలో టెలిఫోను మోగింది. రిసీవరు ఎత్తాడు.

'హల్లో !... ఎవరూ ! హెడ్ గుమస్తా !... ఆఁ !... ఏమిటి చెప్పు! నారాయణమూర్తి చనిపోయాడా ? రెండు న్నరగంటలకా? ... శ్మశానంలో పూడ్చి పెట్టారా ? ... అంతా సక్రమంగా జరిగిందన్నమాట ! ఆల్ రైట్ ! మనవిధి మనం నెరవేర్చాం!' ఫోనుకింద బెట్టాడు సూర్యప్రకాశం.

గుండెమీద చేయిపెట్టుకొని తడిమి చూసుకొంటూ ఆపీడకలతనకెందుకొచ్చిందబ్బా ? అనుకొన్నాడు సూర్యప్రకాశం.



(గత సంచిక తరువాయి)

ఒక్క క్షణమైనా ఆమె మనసు ఇంట్లో ఉంచ బుద్ధికాలేదు. ముందు ఆ ఎబ్బెటిరా, రెండుజడల అమ్మాయి ఎవరో తెలుసుకోవాలి. ఆ తరువాత రవీంద్రతో మాట్లాడి పూర్తిగా ఈ వ్యవహారానికి అంతేదో తేల్చుకోవాలి అనుకుంది.

వెంటనే బట్టలైనా మార్చుకోకుండా కారు తీసుకొని అబిడ్స్‌వైపుకు డ్రైవ్ చేసుకుంటూ వెళ్ళింది మెహర్. ఆమె మెదడు ఆలోచనలతో వేడెక్కిపోతోంది. ఆమె కళ్ళనుంచి రక్తం కారుతోంది. ఆమె నిశ్వాసాలు నాగుపాము బుసల్లా బయటకు వస్తున్నాయి.

ఆమె చేతులు క్రూరంగా కంపిస్తున్నాయి.

...గ్రె వణికిపోతోంది మెహర్.

సరాసరి అన్నషాపు దగ్గరకువెళ్ళి కారాపింది.

కారును చూస్తూనే షాపులోవుండే పని కుర్రవాడు గణేష్ బయటకు పరుగెత్తుకు వచ్చేడు.

ఆమెకు వంగి నమస్కరించి, వినయంగా తలవంచుకుని నిల్చున్నాడు.

“చూడు గణేష్! ఇందాక డాక్టర్ రవీంద్ర ఇటుగా వచ్చేరా?” అనడిగింది. ఎంతగా ప్రయత్నించినా ఆమె తన మనసులోని కలవరాన్ని, ఈర్ష్యను ముఖంలో కనపడకుండా దాచలేకపోయింది.